## Bibliographic Record Target

గోపినాథము వేంకటకవి, 1820-1892.

శిశుపాలవధము / గోపినాథము వేంకటకవిచే రచియింపఁబడినది.- చెన్నపట్టణము : ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాల, 1887.

246, (1) p. ;21 cm.

Record no. 321

Gōpināthamu Vēṅkaṭakavi, 1820-1892.

Śiśupālavadhamu / Gōpināthamu Vēṅkaṭakavicē raciyimpam̐baḍinadi.- Cennapaṭṭaṇamu : Ādisarasvatīnilayamudrākṣaraśāla, 1887.

246, (1) p. ;21 cm.

Record no. 321

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

# శిశుపాలవధము

అనునీయాంధ్రకావ్యము.

శ్రీవేంకటగిరి పట్టణాధీశ్వరులగు

శ్రీమద్వెలుగోటి వంశోద్భవులలో

అష్టావింశతితమప్రభువులయిన

మహారాజరాజశ్రీ

## రాజాశ్రీరాజగోపాలకృష్ణయాచేంద్రరాజాబహదర్

వారియనుజ్ఞవలన

తదీయాస్థానకవీశ్వరులయిన

గోపినాథవేంకటకవీంద్రులచే

రచియింపఁబడి



వావిళ్ల॥రామస్వామిశాస్త్రులవారి

ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె

చెన్నపట్టణము.

౧౮౮౭ సం॥

1887

శ్రీరస్తు.

# శిశుపాలవధమహాకావ్యము.

## ప్రథమాశ్వాసము.

(శా) శ్రీవైదర్భియు సత్యభామయు ముఖ,శ్రీ మీఱ నిర్వంక
ల । స్సేవింప న్నిస్సత్త్వ మొప్ప వారి నడుమం, జెల్వొందు శ్రీకృష్ణుఁ
డు । స్సీ వెల్గోటికులాబ్ధిపూర్ణవిధుని, స్సీరాజగోపాలకృ । ష్ణా
విర్భావుని యాచభూవిభుని ని,త్యశ్రీయుతుం జేయుతన్ ॥ ౧ ॥
(సీ) శ్రీమత్కళిందక,న్యామనోహరతీర పావనరమ్యబృం,దావనమున ।
లలితసుగంధిత్రై,లాలతాగృహమధ్యమందు మందారపు,ష్పాంచితోరు ।
రత్నతల్పంబుపై, రాధికాసతిఁ గూడి చతురత సురతంబు, సలుపువే
ళఁ । గలితవక్షోగత,కౌస్తుభమణియందుఁ బ్రతిఫలితాత్మవి,గ్రహముఁ
జూచి॥ (గీ) వేఱొకతెఁ దాల్చి నాఁడని, వెలఁది యల్గ । నక్కనఁ
గదించి కెమ్మోవి, నొక్కు శౌరి । పరఁగ వెల్గోటి రాజగో,పాల
కృష్ణ । యాచవిభునిఁ గృపాదృష్టిఁ, బ్రోచుఁగాత ॥ ౨ ॥ (చ)
గురుఁడగు వార్ధి కౌస్తుభము, కోరిక యాతక మిచ్చి చంద్రునిం ।
బరువడి వెంట నిచ్చి పసు,పం జని భర్త యురోగృహంబు సో । ద
రసహితంబుగాఁ గడు ము,దంబునఁ జేరి వసించినట్టి యిం । దిర కృ
తిభర్తకుం గరుణ, నిశ్చలసంపద నిచ్చుఁ గావుతన్॥ ॥ ౩ ॥ (ఉ)

మామకసోదరి న్సకల, మంగళగేహినిఁగా నొసంగితి । న్మా మఱఁది
న్శిరఃకుసుమ, మంజరిఁ జేసితి నింకనైన నీ । పాముల వేసము న్విడువు,
భావుక యంచిటు మేల మాడు మా । స్వామి మృదూక్తికి న్నగుచు,
భాసిలు శూలి కృతీంద్రుఁ బ్రోవుతన్ ॥ ౪ ॥ (మ) నను మున్నా
ల్లి నఁటుంచుఁ బల్కి పిదప, న్మాతండ్రిని న్దల్లి నొ । య్యనఁ బ్రార్థిం
చి వివాహమై కరుణ న, ర్ధాంగంబు నాకిచ్చితో । యనఘా యీ
ఘనమోహ మెందరిగె నాఁ, డం చిట్లు మేలంబు లా । డు నగేంద్రా
త్మజ మత్కృతీశు నృపచం, ద్రుం బ్రోచు నెల్లప్పుడున్ ॥ ౫ ॥ (సీ)
పచ్చవిల్తుని తండ్రి, బలుబొడ్డుతమ్మిపై లీల నాడెడు ముద్దు, బాలకుండు ।
విసువక నేప్రొద్దు, వింతబొమ్మలఁ జేసి చతురత నాడించు, జంత్రగాఁ
డు । వాగ్దేవి నెప్పుడు, వదలక తనజిహ్వ మీఁదధరించిన, మేటిమగఁ
డు । సనకాదియోగులు, చారుశ్రుత్యుక్తుల వినుతింపఁ దలయూఁచు,
వేడ్కకాఁడు ॥ (గీ) ధాత భువనైకకుశలసం, ధాత లోక । తాత
సర్వక్రియాచార, తతివిధాత । యెలమి గోపాలకృష్ణయా, చేంద్ర వి
భునిఁ । జెలఁగి దీర్ఘాయు వొసఁగి ర, క్షించుఁ గాత ॥ ౬ ॥ (చ)
తనపతిజిహ్వాకాగ్రమునఁ, దప్పక నిల్చి విపంచి మీటుచు । స్ఘనముగ
వర్ణరూపమును, గైకొని ప్రీతి సమస్తవేదము । ల్పనివడి సర్వశాస్త్ర
ములు, భర్తృముఖంబునఁ బల్కరించు శో । భన సుచరిత్ర భారతి
కృ, పాకలనం గృతినాథుఁ బ్రోవుతన్ ॥ ౭ ॥ (చ) అరయ నభేదరూ
పధరు, లౌ తలిదండ్రుల మ్రోల బాల్యమం । దురమున నొక్కవంకఁ
గుచ, మొక్కయెడ న్ఫణినాథహారము । న్బరువడిఁ జూచి మౌగ్ధ్య
మున, భవ్యకపిత్థ మృణాళ శంకచేఁ । గరమటు సాఁచు విఘ్నపతి,
గావుత సత్కృతినాథు నిత్యమున్ ॥ ౮ ॥ (సీ) రామాయణాఖ్యమ,
హామృదుకావ్యసుధారసాంభోధి యే, ధన్యరసన । యఖిల పురాణే
తి, హాసకథామూల్యమణిగణపేటి యే, మౌనికుక్షి । లలితకావ్య నాట



కా, లంకారసుమనస్స్తబకకల్పశాఖి యె, వ్వాని విద్య । యఖిల భా
షోక్త శ, బ్దానుశాసనబిరుదాంకిత మెవ్వాని, యలఘుకీర్తి ॥ (గీ) యట్టి
వల్మీకసంభవ, వ్యాసకాళి । దాసనన్నపార్యులను బ్రా, ర్థన యొ
నర్చి । మఱియుసంస్కృతసత్కవి, వరుల నాంధ్ర । సత్కవీంద్రు
ల మదిలోన, సంస్మరింతు ॥ ౯ ॥ (వ) ఇట్లు సకలదేవతాప్రార్థ
నంబును సత్కవిజనాభినందనంబును గావించి యుదంచితమందార కు
సుమనిష్యందమకరందబిందుపేశలసుందరశబ్ద ప్రపంచసంచితంబును స
కలవిద్వజ్జనశ్రావ్యంబును సర్వాలంకారరసవర్ణనాపూర్ణంబు న
గు నొక్కయాంధ్రకావ్యంబు రచియింపం బూని యున్న సమయం

## (*) వేంకటగిరిపురీవర్ణనము. (*)

బున ॥ (చ) నటితహరిజ్జయేందిరకు, నాటకరంగ మనంతవైభవో ।
త్కటమున కాలవాలము త, తస్ఫుటవిద్యల కాటపట్టు ను । ద్భటభ
టసింహకోటులకు, భర్మమహీధరగహ్వరంబు వేం । కటగిరి పట్ట
ణం బలరుఁ, గాంతిజితామరరాజధానియై ॥ ౧౦ ॥ (సీ) అచటి మ
హీసురు, లతికళాధారులై ద్విజరాజు లనఁ జాల, వినుతి గాంతు । ర
చటి రాజవరేణ్యు, లరిబలహంతలై జిష్ణు లనంగఁ బ్ర, సిద్ధి గాంతు ।
రచటి యూరుజులు పు, ణ్యజనైకపాలురై క్షితి శ్రీదు లనఁగ వి, శ్రుతి
వహింతు । రచటిశూద్రులు కుజ, నావనదక్షులై కుజనారి యగు బ
లుఁ, గుత్స సేతు ॥ (గీ) రచటి వెలయాండ్రు సక్థినా, సాక్షిగాత్ర ।
హసితరంభాతిలోత్తమా, హరిణిహేమ । లగుచు విశ్రుతి గాంతుర,
న్నగరికి సరి । గాఁ దగునె యక్షరాడల, కాపురంబు ॥ ౧౧ ॥ (సీ)
కరములు సాఁచి నా, కధునీవరాంబువు, ల్తమి దీరఁ ద్రావు దం, తావళ
ములు । రయరూపవర్ణవి, త్రాసితఘనసుధాసింధుజంబులు మహా, సైం
ధవములు । కేతనపటజాత, వాతరుద్ధదినేశపథములు కమనీయ, బహు
రథములు । బలు సింగములఁ బట్టి, పై నెక్కి విచ్చలవిడి సఞ్చరించు

బ,ల్వీరభటులు॥ (గీ) గలిగి సౌధాగ్రసంచర,త్కామినీశి । రోజ
ములు సూచి నీలాభ్రి,రాజి యనుచు । నచటి పోషితశిఖులు నా,
ట్యంబు సేయ । వఱలు నతిచిత్రభఙ్గి న,ప్పురవరంబు॥ ౧౨ ॥ (గీ)
గాఢపుణ్యంబులకుఁ గాశి,కాపురంబు । కలిత సౌభాగ్యముల కల,
కాపురంబు । కాన్తిసమ్పదలకు ద్వార,కాపురంబు । కాపురము సే
యువారల, కాపురంబు ॥ ౧౩ ॥ (గీ) విప్రులును యోధవరులు
బు,ద్విజులు నచట । ననిశమును శాస్త్రజీవులై, యలరుచుంద్రు ।
వారి ముంగిళ్లు సన్తాన,భూరుహములు । నాకపద మప్పురంబు నె;

## (*) కృతినాయకగుణగణాభివర్ణనము. (*)

న్నంగఁ దరమె॥ ౧౪ ॥ (క) ఆరాజధాని కధిపతి । యై రాజిలు
శారదాబ్జ,హరహారార । క్షీరపటీరసురద్విప । హీరాఞ్చితయశఁ
డు కృష్ణ,యేచేంద్రుఁ డిలన్॥ ౧౫ ॥ (ఉ) ఏకముఖంబుచేతఁ దద,
హీనగుణప్రకరంబు నెన్నఁగా । లేక విరించి నాల్గును గి,రిప్రభుఁ డై
దుగుహుండు నాఱు ద । ర్వీకరలోకవల్లభుఁడు, వేయు ముఖంబులు
దాల్చి రెంతయు । న్వాకొనిన న్నుతింప నర,పాలకు లెంతటి వారు
ధారుణిన్॥ ౧౬ ॥ (శా) ఆరాజేంద్రుని రూపసమ్పదకు సా,మ్యం
బొందఁగాఁ జాల కా । మారుం డంగవిహీనుఁ డయ్యె శశి య,క్ష్మ
వ్యాధితుం డయ్యె న । య్యారే యక్షతనూభవుం డొక కుజం,బ
య్యె న్జయంతుండు పో । ల్పార న్వాయస మయ్యె నయ్యడవి పా,
లయ్యె న్వసన్తుం డిలన్ ॥ ౧౭ ॥ (చ) హిమరజతాద్రులుం గుచ
ము, లిందుఁడు మోము శరద్ఘనంబు చే । లము మినువాఁక హారము
వి,లాససఖీమణి వాణి పాలసం । ద్రము ఘనకేళికాసరసి,రమ్యతరో
డుతతు ల్నభంబులై । క్రమమున నొప్పు నయ్యవని,కాన్త సముజ్జ్వ
లకీర్తికాంతకున్॥ ౧౮ ॥ (గీ) నవ్యతరవైభవంబున, నాకరాజు ।
జనమనోహారి యగుట న,క్షత్రరాజు । రమ్యసౌభాగ్యగరిమచే, రా



జరాజు । రాజమాత్రుండె యమ్మహీ,రమణుఁ డరయ ॥ ౧౯ ॥
(సీ) శ్వానము ల్భక్షించు,చర్మ మర్కజుఁ డిచ్చెఁ జర్చింప నది జరీ,
శాల్వ యగునె । జంబుకంబులు దిను, శల్య మిచ్చె దధీచి యర్థి
కది సువర్ణ,హార మగునె । గ్రద్దలుభక్షించు, కండ లిచ్చెను శిబి
కండ లర్థికి మాని,కంబు లగునె । అఱచుచుఁ గసరుచు, నప్పు లి
చ్చెను మేఘుఁ డప్పు లర్థులకు శా,ల్యన్న మగునె॥ (గీ) వీరలా దాత
లనఁగ నె,వ్వేళలందు । నర్థులకు మణిభూషామ్బ,రాన్న మొసఁగి।
యేలుగోపాలకృష్ణయా,చేంద్రవిభుఁడె । దాత యనుచునుతింతు రా,
ధరణిపతిని॥ ౨౦ ॥ (ఉ) అక్కట కామధేనువు సు,రాగము వేలు
పుమానికంబు పెం । పెక్కఁగ సర్వకామములు, నిచ్చు నఁటం డ్రి
ది యేటి మాట యం । దొక్కటి చాల గడ్డి దిను, నొక్కటి దా
రువొకండు ఱాయి పో । నిక్కము సాటి సేయఁ దగు,నే యవి యా
నరపాలమౌళికిన్॥ ౨౧ ॥ (చ) పొలుపుగ భృత్యసన్తతుల, భూ
సురకోటుల సత్కరించుచోఁ । గలయఁగఁ బట్టు శాల్వలాక, కంబ
ళి మాత్రముగా వరాలు గ । వ్వలుగ సువర్ణహారములు, వావిరి
నెప్పుడు గడ్డిపోఁచగాఁ । దలఁచి యొసంగు నవ్విభుని,త్యాగసమృద్ధి
నుతింప శక్యమే॥ ౨౨॥ (వ) అమ్మహీమణ్డలాఖణ్డలుం డొక్కనాఁడు
మృదుచిత్రరాఙ్కవపటాస్తీర్ణకనకవేదికాశతజుష్టంబై వజ్రకీలితద్వా
రబంధబన్ధురంబై విశాలప్రవాళకవాటశోభితంబై స్ఫటికశిలాసాలభ
ఞ్జికాపుఞ్జశోభితానేకసువర్ణస్తమ్భసమ్భృతంబై యనల్పశిల్పికల్పనా
లఙ్కృతవివిధచిత్రచిత్రప్రకాశితకుడ్యంబై క్రిందం బఱచిన మేదినీచి
హ్నచిహ్నితచిత్రకమ్బళంబును మీఁదం గట్టిన స్వర్గలోకలక్షణా
ఙ్కితంబైన వితానంబునుం గలిగి ద్యావాపృథివీమధ్యగతగ్రహనక్షత్ర
శోభితాన్తరిక్షంబు ననుకరింపుచు ననంత లక్ష్మీవిలాసంబై వైకుణ్ఠంబు
భఙ్గి వీరభద్రకుమారగణనాథసేవితంబై కైలాసంబురీతిఁ జతురానన

వాణీవిలసితంబై సత్యలోకంబు మాడ్కి బుధకవిగురుసేవితంబై యి
న్ద్రలోకంబుచందంబున నందం బగుచున్న సభాసదనంబు ప్రవేశించి
భరతలక్ష్మణశత్రుఘ్నసహితుండైన రామభద్రుని వైఖరి ముద్దుకృష్ణ
యాచేన్ద్ర వేంకటకృష్ణయాచేన్ద్ర వేణుగోపాలకృష్ణయాచేన్ద్రనా
మంబులఁ బ్రసిద్ధులైన యనుజన్ముల ముప్వురతోడం గూడి యనర్ఘ
రత్నఖచితసువర్ణపీఠంబు మీఁద సుఖాసీనుండై తత్రత్యమహేన్ద్ర
మణిమయస్తమ్భాగ్రనిర్మితరత్నపాఞ్చాలికలు కరతలఘటితసువర్ణ
పాత్రాన్తరాళస్థితపద్మరాగమణిదీపికల నివాళింప నుభయపార్శ్వ
స్తమ్భనిబద్ధసాలభఞ్జికలు మణిదణ్డమణ్డితతుషారకిరణకరపుఞ్జసఙ్కాశ
చారుచామరంబులు వీవ ఘ్రాణతృప్తికరంబులైన సాంబ్రాణియగరుల
ధూపవాసనలు సభాసదనంబు నిండ గుబాళింపఁ బురోభాగంబున న
పారశబ్దశాస్త్రపారావారపారంగతులైన వైయాకరణులును బర
స్పరజిగీషాయత్తచిత్తులై హేతువాదంబులు సేయు తార్కికులును
వేదవ్యాసకృత బ్రహ్మసూత్రవాక్యార్థోపన్యాసంబునఁ దర్కకర్క
శోక్తులకు మార్దవంబుఁ బుట్టించు శారీరకమీమాంసకులును గావ్యనా
టకాలంకారశాస్త్రజ్ఞులైన యాలంకారికులును జతుర్విధకవితానిర్వా
హకమహాప్రబంధనిర్మాణచతురులగు మహాకవులు మొదలగు సకల
విద్వజ్జనులు తమతమ విద్యావైదుష్యంబుఁ జూపుచు నుచితాసనంబుల
నుండి పరివేష్టింప మన్త్రిసామన్తపురోహితబాన్ధవసంఘంబులును బ
లే అర్థ్మిలును సర్వస్థానంబుల నుండి సేవింపఁగంచుకోష్ణీషధరులై చా
రుచామీకరవేత్రంబులు కరంబులం బూనినకీబులు చోపుదార్లు బరాబ
రులు సేయ గానవిద్యాధరీకృతవిశ్వావసుప్రముఖదేవగంధర్వులైన వై
ణికులు మనోహరంబుగాఁ గాలానుకూలరాగసమ్పద లేర్పడ గ్రామ
మూర్ఛనాకమ్పనాదులు దెలుపుచు గాన్ధర్వంబు గావింప ముఖనా
సాలోచనగాత్రోరుతిరస్కృతచన్ద్రరేఖాతిలోత్తమాహారిణీ హేమా



రమ్భలైన వారవిలాసినులు కన్దర్పసమానసున్దరుండైన యీధరణీతరు
ణీపురన్దరున కెదమైన సున్దరపురుషుం డెవ్వండును లేఁడని చూపు నై
వడి హస్తంబుల నభినయింపుచు ముఖలోచనభ్రూవిన్యాసంబుల భావా
ర్థంబు దెలుపుచు లాస్యంబు సలుప వన్దిమాగధపాఠకు లందంద కై
వారంబులు సేయఁ బణవకాహాళమద్దళవేణుప్రముఖచతుర్విధవాద్యంబు
లు బోరుకొనఁగ ననన్తవైభవాభిరంజితుండై పేరోలగంబున నుండి॥
(మ) నను శ్రీరామపదారవిన్దభజనా,నన్దప్రపూర్ణాత్ముఁ ద । ధ్ఘన
నామస్మరణాతిపూతరసనుం, దదూర్భూరికారుణ్యల । బ్ధనితాన్తోజ్వలస
త్కవిత్వమహితు, న్ధాత్రీసురగ్రామణిం । బ్రణుతప్రజ్ఞుని వేంకటాఖ్య
సుకవి, న్రావించి పల్కెం గృపన్॥ ౨౩ ॥ (సీ) గరిమ రామాయ
ణ,కావ్యరాజము నాన్ధ్రకావ్యంబుఁ జేసిన, ఘనుఁడ వీవు । బ్రహ్మ
కైవర్తపు,రాణంబులోఁ గృష్ణజన్మఖణ్డంబును, జారుఫణితి । నాన్ధ్ర
భాష రచించి,నట్టి పుణ్యుండవు మహితసర్వజ్ఞకు,మారయాచ । వి
భునిమాతండ్రిని,వేమాఖ్య బహుసంస్కృతాన్ధ్రసత్కృతులచే,నఞ్చిత
ముగఁ॥ (గీ) బూని మెప్పించి యమ్మహీ,జానికరుణ । నభినవామ్బ
రహారాగ్ర,హారహేమ । వలయముఖ్యసత్కారంబు, వడసి వినుతి ।
కెక్కినాఁడ వాస్థానక,వీంద్రుఁ డనఁగ॥ ౨౪ ॥ (వ) కావున మా
ఘకవికృతశిశుపాలవధాఖ్యమహాకావ్యంబు సమస్తకావ్యరాజంబై స
ర్వాలంకారశోభితంబై నానావిధవర్ణనాపూర్ణంబై శ్రీకృష్ణనాయకం
బగుటం జేసి భవ్యంబై సర్వజనసేవ్యంబై పండితజనశ్రావ్యంబై యు
న్నది గావున నక్కావ్యంబు మదఙ్కితంబుఁ జేసి యన్ధ్రకావ్యంబు
గా రచింపు మని యానతిచ్చి జాంబూనదాంబరహారాగ్రహారాదిప్ర

## (*) కృతిపతివంశావతారవర్ణనము. (*)

దానంబుల సంతుష్టునిం జేసిన నేను సంతుష్టాంతరంగుండనై యమ్మ
హాకావ్యరచనాభిముఖ్యంబు వహించి కృతిపతివంశావతారం బభివ

ర్ణించెద॥ (సీ) వెలయఁ బిల్లలమఱ్ఱి, బేతాళనాయఁ డేఘనవంశము
న కాది,కర్త యయ్యె । రంగుగా సర్వజ్ఞ,సింగభూపాలకుం డేవం
శమునఁ బుట్టె, నింపుమీఱఁ । జెంజి దుర్గాధీశుఁ, జించిచెండాడిన
బంగరేచేంద్రుఁ డే,వంశభవుఁడు । కోరి డెబ్బది యొక్క,గోత్రం
బులకు శిరః కోటీర మేపుణ్య,గోత్ర మట్టి॥ (గీ) మేటిరేచెర్లగోత్ర
వె,ల్గోటివంశ । మందు విద్వత్కు,మారయా,చాభిధాన । నృపవరే
ణ్యుఁడు జన్మించె, నిరుపమాన । దుగ్ధవారాశియందుఁ జం,ద్రుండు
బోలె॥ ౨౫ ॥ (గీ) ధరణి నమ్మేటి కీర్తిప్ర,తాపరుచులు । దిశ
లఁ బర్విన రేపవ, ల్దెలియ లేక । సురుచిరంబుగఁ జక్రము, ల్జోడు
గూడ । వీడ సంశయ మొందు నె,వ్వేళలందు॥ ౨౬ ॥ (గీ) భూ
రివిద్యల కారాజు, భోజరాజు । వీర్యవితరణముల కల, విక్రమా
ర్కుఁ । డుత్తరోత్తరయుక్తిప్ర,యుక్తులందు । జీవసన్నిభుఁ డతఁ
డని, చెప్ప వచ్చు॥ ౨౭ ॥ (గీ) ఆమహీనాథతిలకున, కగ్రసుతుఁడు।
గలిగె బంగారుయాచభూ,కాన్తుఁ డనఁగ । ముదముతోఁ గశ్యపబ్ర
హ్మ, కదితియందు । శక్రుఁ డుదయించినట్లు ప్ర,సన్నయశుఁడు ॥
౨౮ ॥ (సీ) అనఘుఁ డా బంగారు,యాచభూమీశుండు కాశికా
సేతుమా,ర్గంబునందుఁ । బేరైన నాయని,పేటఁ గట్టించి యచ్చ
టవిశాలంబుగా, సత్ర మొకటి । నిర్మించి దానికి, నిండార సగుటూ
రి సీమా న్తరస్థమై, చెలఁగు విన్న । మాలయు జువ్వల,పాలెంబు నా
లెండు గ్రామంబు లిచ్చి ధ,ర్మం బొనర్చె॥(గీ)నింపు మీఱ నాసత్ర మం
దిప్పటికిని । వచ్చు జనులకు నెపుడు న,వ్వారిగాఁగ।నిచ్చుచుందురు భూ
పాలుఁ, డేర్పరించి।నట్లు భోజనసామగ్రి, యనుదినంబు॥౨౯॥(గీ) మఱి
యుఁబోలూరి సీమలో,మానితముగ।నొప్పునే కొల్లు పొలములో, నొ
క్క సత్ర । మొక్క కోనేరు నిర్మించె, నుర్విదాని । సన్నుతింతురు



దొరవారి, సత్ర మనుచు ॥ ౩౦ ॥ (సీ) వెలయంగ శ్రీకాశి, విశ్వ
నాథస్వామి యాజ్ఞచే నొక భూసు,రాన్వయుండు । కాశికాపురి
నుండి, కర మర్థి నొక దివ్యలిఙ్గంబు గొని వచ్చి, బంగరేచ । విభు
నకు నర్పించి, వెస నీవు లిఙ్గప్రతిష్ఠ సేయు మటంచుఁ, దెలుప నతఁ
డు । కడు వేడ్కతో మహా,కైవల్యనది పొంత నతివిశాలంబుగా,
నాలయంబు॥ (గీ) రమణఁ గట్టించి యన్నపూ,ర్ణాయుతముగ । వి
శ్వనాథుఁ బ్రతిష్ఠించి, శాశ్వతముగఁ । గాంచనధ్వజ మెత్తించి, క
ట్టిఁ జేసె । మహితగోపురప్రాకార,మణ్టపములు॥ ౩౧ ॥ (క) చి
త్రంబులు శ్రితసురతరు । సత్రంబులు సకలసుకవి, జనసంస్తుతికిం ।
బాత్రంబులు శాత్రవగణ । జైత్రంబులు నమ్మహీశు,చారిత్రంబుల్ ॥
౩౨ ॥ (గీ) అతని పత్నులు పాపమాం,బక్కమాంబ । నాథుతోఁ
గూడ సహగమ,నంబుఁ జేసి । వీరమాతలై వెలసి ర,వ్వీటిలోన ।
వెలయు తద్వంశ్యులకు నిలు,వేల్పు లగుచు॥ ౩౩ ॥ (క) ఆరాజశే
ఖరునకుఁ గు । మారుఁడు ఘనశక్తిచేఁ గు,మారుండు తనూ । మా
రుఁడు సుకుమారుండు కు । మారుండు కుమారయాచ, మహిపతి
యలరెన్॥ ౩౪ ॥ (సీ) పరఁగ వేంకటగిరి,పుర మంతిపురమును ర
చియింపఁ జేసెఁ జి,త్రంబుగాఁగ । రాజవీధుల నెల్ల ర,మ్యంబుగాఁ
జేసి మూలల మణ్టపం,బుల రచించె । విశ్వేశ్వరాన్నపూ,ర్ణేశ్వరీగు
హులకు ముదముతోఁ గట్టించె, మూఁడు తేర్లు । వాణరాజులచే
త, నొప్పుగాఁ దనరాజ్యమునకు ని,స్తిమిరారి,సనదుఁ బొందె॥ (గీ)
రమణఁ గట్టించె నన్నస,త్రములు పెక్కు । విప్రులకు దాన మిచ్చె
ను,విత్త మెల్ల । నమరపతిఁ బోలె భోగంబు,లనుభవించె । నతఁడు
సామాన్యుఁడె కుమార,యాచవిభుఁడు॥ ౩౫ ॥ (గీ) పొసఁగ నా
రాజమహళిప్ర,భుత్వకాల । మందు వేంకటగిరిపుర,మందు సర్వ। విభు

వములు సర్వసంపదల్ వృద్ధి నొందెఁ । బూర్ణశశిరాక కుదధి యుప్పొంగి నట్లు॥ ౩౬ ॥ (గీ) అమ్మహారాజపుత్త్రుఁడై యలరు చుండె । తత్ప్రతాపుండు కీర్తివిస్తారుఁ డాది । రాజసంకాశుఁ డఖిలోర్వి రాజచిత్త । హారచరిత్రుండు బంగారు యాచవిభుఁడు ॥ ౩౭ ॥ (సీ) కళ లనారతమును క్షయము నొందక యున్న శీతాంశుఁ డీతని చెప్ప వచ్చుఁ । బ్రమథాధిపతివిరోధము గల్గకుండెనా యంగజు సాటి సేయంగ వచ్చుఁ । దమి నగమ్యాగమనము సేయకుండెనా ధనదపుత్త్రుఁడు తుల్యుఁ డనఁగ వచ్చు । మధుపల్లవసమాగమము లేకయుండెనా యల వసన్తుఁడు సాటి యనఁగ వచ్చు ॥ (గీ) జగతి నిమ్మేటి కని జనుల్ పొగడ నెగడె । నక్షయకళుండు హరభక్తుఁ డనవరతము । ధర్మపత్నీప్రియుండు విద్వత్సమేతుఁ । డగుచుఁ జెలువొందు బంగారు యాచవిభుఁడు॥ ౩౮ ॥ (ఉ) అంచితభంగి నానృపతి న్యాయము దప్పక యుండ విత్తమా । ర్జించి తదార్జితస్వమున శిష్టమహీసురభృత్యకోటిఁ బో । షించి సమస్త ధర్మములు చేసి యశంబున ధాత్రిఁ బూర్తిగా । వించి నిరన్తరం బనుభవించెఁ బురందరతుల్యభోగముల్॥ ౩౯ ॥ (క) ఆ రాజశేఖరునకుఁ గు । మారుఁడు జనియించె రాజమాన్యుఁడు మహిభృ । ద్వీరుఁడు వెలుగోటికుల । క్షీరపయోరాశిపూర్ణసితకరుఁ డగుచున్॥ ౪౦ ॥ (క) శర్వాంశసంభవుండు న । ఖర్వమహాశక్తిధరుఁడు గాన నతని నీ । యుర్వీశు లెల్లఁ బొగడిరి । సర్వజ్ఞకుమారయాచజనపతి యనుచున్॥ ౪౧ ॥ (క) కాముఁడు సుందరులకు రణ । భీముఁడు శత్రువుల కెల్లఁ బెంపలరంగా । సోముఁడు పౌరజనములకు । రాముఁడు భూప్రజల కాధరాధిపుఁ డరయన్॥ ౪౨ ॥ (సీ) తన కీర్తిభామినీధమ్మిల్లమున కిందుకళ చా



రుకేతకీదళము గాఁగఁ । దన ప్రతాపగ్రీష్మతపనరశ్ములకు రోహితతురంగుఁడు దాఁపుడిల్లు గాఁగఁ । దననిరంతరదానధారాలహరికల పాథోధినాథుండు భర్త గాఁగఁ । దనశౌర్యహార్యతుమునకు దుర్మదవైరిసంఘంబు ఘనసామజములు గాఁగ॥ (గీ) వెలసె నమ్మేటి లోకైకవిశ్రుతోరు । సుగుణసంపన్నుఁ డనిశంబు శూలపాణి । కధికభక్తుండు సకలవిద్యావిదుండు । వరకుమారయాచేన్ద్రుండు వసుధలోన॥ ౪౩ ॥ (సీ) విక్రమార్కుఁడు వీర్యవితరణసాహసములకు విద్యల కెల్ల భోజరాజు । ఉత్తరోత్తరమహాయుక్త్యుపన్యాసంబునందుఁ జర్చింపంగ నమరగురుఁడు । చటులమీమాంసాదిశాస్త్రపరిజ్ఞానమందుఁ బరాశరనందనుండు । శబ్దార్థశాస్త్రప్రచారంబులందుఁ బాణిని గౌతము లనంగ వినుతి కెక్కెఁ॥ (గీ) బద్మనాయకకులవార్ధిపారిజాత । మఖిలసుజనైకనుతచరిత్రాన్వితుండు । సున్దరీకాంక్షణీయాతిసుందరుండు । భోగదేవేంద్రుఁ డారాజపుంగవుండు ॥ ౪౪ ॥ (సీ) కాశిగయాప్రయాగములను మధురబృందారణ్యరామేశ్వరాదిపుణ్య । దేశముల్ సేవించి త్రిపథగాముఖపుణ్యనదులలో నవగాహనంబుఁ జేసి । గోభూహిరణ్యాదిగురుదానములఁ జేసి యందన్నసత్రముల్ పొందుపఱిచె । లలి రాధికాకృష్ణులకుఁ బ్రీతిగా నగ్రహారంబు విప్రులకర్థి నొసఁగెఁ॥ (గీ) జెలఁగి బొంబాయి కలకత్త చెన్ననగర । హూణరాజులతో సఖ్య మొనరఁ జేసి । వారిచేఁ జాల మన్ననల్ వడసి పెక్కు । బిరుదు లంది వెలింగె నానరవరుండు॥ ౪౫ ॥ (సీ) వెలయ వేంకటకవివిరచితరామాయణాంధ్రకావ్యము విని హర్ష మొంది । సత్కృపతో జరీశాల్వలు కాంచనమయహారములు బహుమతి యొనర్చి । మారేళ్ల సీమలోఁ బేరైన పెరుగుపల్యాఖ్యగ్రామం బగ్రహార మిచ్చె । బ్రహ్మకైవర్తపురాణంబులోఁ గృ

ష్ణజన్మఖండము కవి,జనులు మెచ్చ॥ (గీ) నమ్మహాకవిచేతనే, యం
చితముగఁ । దెనుఁగు సేయించి వేయాల్లు, ధనము హేమ । భూ
ష లిచ్చి రాధాకృష్ణ,పుర మనియెడు । నగ్రహారంబులో ద్వాద,
శాంశ మొసఁగె ॥ ౪౬ ॥ (ఉ) రాజితకీర్తి సర్వజన,రంజనుఁ డా
నరనాథుఁ డొక్కఁడే । రాజనఁ జెల్లుఁ గాకితర,రాజులు రాజులె
శక్రచంద్రము । లా జనుపేరు దాల్చుటక, రంబు నిరర్థక మెట్టు ల
న్న ఘూ । రాజి నొకండు పుణ్యజన,హన్త యొకండు నిశాటుఁ డా
రయన్॥ ౪౭ ॥ (గీ) ద్విజవరేణ్యులచే జగ,ద్విశ్రుతముగఁ । చె
క్కు మఖములు సేయించి, పెంపు వడసెఁ । బుడమి వేల్పులకును
వేలు,పులకుఁ బెక్కు । గ్రామము లొసంగె నమ్మహా,రాజవరుఁడు॥
౪౮ ॥ (గీ) అమ్మహారాజశేఖరుం, డమితయశుఁడు । లీలతో సర్వ
సామ్రాజ్య,మేలుచుండి । వరుసగా సప్తసన్తాన,వంతుఁ డగుచుఁ ।
దనరె భువిలోన రెండవ,ధాతకరణి॥ ౪౯ ॥ (క) అం దగ్రసుతుఁ
డు రాజపు । రంధరుఁ డనఁ బొగడు గనెఁ బు,రందరకరిరా । టుకం
దేందుయశుఁడు సుగుణా । నందుఁడు గోపాలకృష్ణ, నరపతి యల
రెన్॥ ౫౦ ॥ (క) మును కశ్యపుచే నింద్రుఁడు । ననిమిషపదమం
దుఁ బోలె, నటు జనకునిచే । ఘనవేంకటగిరిసింహా । సనమం ద
భిషిక్తుఁ డయ్యె, సంభ్రమ మెసఁగన్॥ ౫౧ ॥ (గీ) శ్రవణరహితుం
డు కోలవి, సంబు గల్గి । వాఁడు పాండుర దేహంబు, వాఁడఁ
టంచు । నురగపతి రోసి మేదినీ,తరుణి ప్రీతి । నమ్మహారాజు భుజ
దండ, మాశ్రయించె॥ ౫౨ ॥ (గీ) ఇంద్రుఁ డమరావతీపురం, బేలి
నట్లు । శ్రీదుఁ డలకాపురంబు ర,క్షించి నట్లు । గరిమ నారాజు
వేంకట,గిరిపురంబు । పాలనము సేయుచుండు న,పారయశుఁడు ॥
౫౩ ॥ (గీ) శాలివాహనశకమందు, శశివసుగగ । నాష్టసంఖ్యలు



గల పార్థి,వాబ్దమందుఁ । బ్రకటితంబుగ వేంకట,సుకవిచేత । నీ
కృతి రచింపఁ జేసె నా,లోకవిభుఁడు॥ ౫౪ ॥ (చ) వితతరసంబు
లుగ్గ లిడి, పెంచి ధ్వను ల్మఱి వృత్తిరీతులు । న్గతురత పాకము ల్రు
చిర,శయ్యలు చక్కఁగఁ జెల్పి నాల్గలం । కృతుల నలంకరించి తగ,
నీ కృతికన్యను గృష్ణయాచభూ । పతికి నొసంగె వేంకటవి,పశ్చిదప
శ్చిముఁ డంచితంబుగన్॥ ౫౫ ॥ ❋

## (❋) షష్ఠ్యంతములు. (❋)

(క) ఏవంవిధగుణగణసం । భావితునకు భావజాభ,భవ్యాకృతికి।
న్సేవితగారీవరల । క్ష్మీవరునకు దీనలోక,చిన్తామణికిన్॥ ౫౬ ॥ శ్రీ
వెల్గోటికులాంబుధి । జైవాతృకునకు నృపాల,జనమాన్యునకు । న్దే
వాధిపసచ్ఛాశమ । హావిభవసమన్వితునకు,నమితయశునకున్॥౫౭॥
అక్షీణవీర్యునకు జన । రక్షణచతురునకు రాజ, రాజసమధనా । ధ్య
క్షునకు శౌర్యజిత హ । ర్యక్షునకు నితాన్తఘనద,యా దక్షునకున్॥
౫౮ ॥ ఆర్యనుతచర్యునకు। గ్రీష్మార్యమసమతేజునకు సు,ధాంబుధిసమ
గాం । భీర్యునకు శక్రసన్నిభ । శౌర్యునకు మహాసుమేరు,సమధైర్యు
నకున్ ॥ ౫౯ ॥ అతులప్రభావునకు యా । వతలీలామదనునకుఁ
బ్రవర్ధితభాగ్యా । న్వితునకు జననుతునకు బుధ । హితునకు గో
పాలకృష్ణ, యేచేంద్రునకున్ ॥ ౬౦ ॥ ❋

(వ) అభ్యుదయ పరంపరాభివృద్ధి యగు నట్లుగా నాయొనర్పం
బూనిన శ్రీ శిశుపాలవధ మహాకావ్యంబునకుఁ గథాప్రారంభం బెట్టి
దనిన ॥ ❋

## (❋) కథాప్రారంభము. (❋)

(శా) శ్రీనాథుండు జగన్నివాసుఁ డగు శ్రీ,కృష్ణుండు లోకావ
న । ధ్యానాసక్తత శ్రీసమృద్ధవసుదే, వాగారమందు న్సుఖా । సీ

నుండై దివి నుండి వచ్చు జటిల, శ్రేష్ఠు న్విలోకించె భా । షానేత్రంగ
జుఁ గాయకాంతివిజితాం, చచ్ఛారదున్నారదున్॥ ౬౧ ॥ (మ) చె
లువొప్పన్ దిననాథయానము తిర, శ్చీనంబు వైశ్వానరో । జ్వలయా
నం బది యూర్ధ్వగం బహహ స, ర్వవ్యాపియై యీసము । జ్వ
లతేజం బిటు క్రిందుగాఁ బడియెడి, న్జర్చింప నేమంచు నా । కు
లతన్ జూచుచు నుండి రప్పు డచటం, గొల్వున్న వారందఱున్॥ ౬౨॥
(చ) తొలుత రుచిప్రతానమని, తోడ విభావితరూప మాటచే । వ
లనుగ దేహ మంచుఁ బిద, ప న్నవిభక్తతరాంగ మాటచేఁ । దలఁపఁ
గఁ బూరుషుం డనియుఁ, దద్దయు నిశ్చితమైన యవ్వెలుం । గల
వడ నారదుం డని ము, రారి యెఱింగెఁ గ్రమక్రమంబునన్॥ ౬౩॥
(వ) మఱియును॥ (ఉ) భూరివినీల నీరదము, ముంగలఁ బూడఁగ
నవ్యో సాంద్రసీ । హార పటీర హార నిచ, యాకృతి నమ్ముని శేఖ
రుండు సొం । పారఁగఁ దాండవోత్సవము, నం దిభచర్మము మే
నఁ దాల్చి నిం । డారఁగ భూతిలిప్తతనుఁ, డై కనుపట్టు పురారి నై
వడిన్॥ ౬౪ ॥ (మ) శరదిందూస్రచయాభుఁడై మిగుల రం, జత్కాం
జకింజల్కవుం । జరుచిస్ఫీతజటాచ్ఛటాకలితభా, స్వన్మౌళియై మౌని
శే । ఖరుఁ డొప్పె న్దుహినస్థలీరుహవిహా, కస్వర్ణశోభామనో । హ
రవల్లీప్రతతీయుతోన్నతతుషా, రాద్రి న్విడంబించుచున్॥ ౬౫ ॥ (చ)
అతులనవామ్బుదచ్ఛవిమృగా, జినబద్ధవలగ్నుఁడై సము । ద్యతకపిశో
రుమౌంజియుతుఁ, డై శశితోఁ దుల దూఁగు మేనితో । వితతసువర్ణ
సూత్రపరి, వీతవినీలవిశాలచేలుఁడై । చతురత నొప్పు సీరి క్రియ,
సంయమి గన్గొన నయ్యె నయ్యెడన్॥ ౬౬ ॥ (చ) అనుపమమైన తే
యరుచి, రాంగరుహాయత హైమమేదినీ । జనితవిపాకవల్లిచయ, సం
భవతన్తుకృతోపవీతుఁడై । ఘనహిమజాలశుభ్రుఁడగు, కంజభవప్రి



యపుత్రుఁ డొప్పె సం । జనితతటిల్లతాకలిత, శారదనీరధరంబు చా
డ్పునన్ ॥ ౬౭ ॥ (చ) కలితమృణాళఖండసిత, గాత్రవిలగ్ననిసర్గ
కృష్ణసా । రలలితసూక్ష్మలోమచయ, రమ్యసమగ్రచమూరుకృత్తిచే ।
వెలసె విరించినందనుఁడు, పృష్ఠగతాస్తరణంబుచేత న । బ్బలరిపు
వాహనంబయిన, వారణరాజము వోలె నత్తఱిన్॥ ౬౮ ॥ (మ) న
లువొప్ప న్ముని సంతతక్షుభితవీ, ణాబద్ధతంతుక్షతో । జ్జ్వలదంగుష్ఠ
నఖాంశుభిన్న మగుటం, జారూల్లసద్విద్రుమం । బులచే ముంగల
నర్ధభాగము దగం, బూరించి నట్లున్న యు । జ్జ్వలదచ్ఛస్ఫటికాక్ష
మాలికను గే, లం బూనియొప్పె న్మహిన్॥ ౬౯ ॥ (సీ) అనిలసమా
ఘాత, మున నసంకీర్ణంబుగా ననురణనాత్మ, క స్వరంబు । నిగుడఁ
జేయుచుఁ బ్రతి, నియతసంఖ్యా వ్యవస్థితఘన శ్రుతిచయా, న్వితము
లైన । షడ్జాదికములగు, సప్తస్వరంబులఁ బ్రస్ఫుటీకృతములై, పరఁ
గు నట్టి । షడ్జాదికాపర, స్వరసంఘభేదత్రయారోహణావరో, హ
ణపరిక్ర॥ (గీ) మప్రభేదంబు గల మహా, మహతి యనెడు । వీణ న
టు సారెసారెకు, వేడ్కమీఱఁ । గనుఁగొనుచు భూరితేజః ప్ర,
కాశితాఖి । లాశుఁడై మౌని హరి డాయ, నరుగుదెంచె॥ ౭౦॥
(మ) ఘనత న్వెంబడి వచ్చు వేల్పుల నతుల్, గైకోలు గావించి
పె । ల్చన వారిం దగ నిల్వఁ బంచి తఱితో, సర్వార్థసంద్రిష్టయా।
మునివర్యుండు నిశాటదర్పదళనా, మోదుండు శ్రీకృష్ణుఁడు । న్ననగా
రాతినికేతనాభమగు స్థా, నం బర్థిఁ జేరె న్రిహిన్ ॥ ౭౧ ॥ (గీ) ఇన
సమ ప్రభుఁడైన య, మ్మునిపదంబు । లవని సోఁకక మున్నె జ, నా
ర్దనుండు । గట్టుపై నుండి లేచు మేఘంబు కరణిఁ । బీఠముననుండి
లేచె సం, ప్రీతి మెఱయ॥ ౭౨॥ (క) అమితప్రయత్నమున ను । న్నమి
తానమదురుఘనాహి, నాథునిచే సంశ్ర । యమునఁ గ్రింద ధృతంబగు।

క్షమపై హరి మోళ్లఁ దపసి, చరణము లిడియెన్॥ ౨౩॥ (మత్తకోకిల)
ఆదిపూరుషుఁ డచ్యుతుం డఖిలాంతరాత్ముఁడు కృష్ణుఁ డ । ర్ఘ్యాది
పూజలఁ బూజ్యుఁడైన మహాత్ము నారదమౌని న । త్యాదరంబునఁ
బూజఁ జేసె మహీమతు ల్సతపోధను । ల్మోద మొప్పఁగ రాఁదలంప
ర్పుణ్యవంతుల యిండ్లకున్॥ ౨౪॥ (చ) అనఘచరిత్రుఁడైన మునినంబు
జనేత్రు సభాజను ల్హిమాం । జనకుధరంబుల న్బలెఁ బ్రసన్నతఁ గ
న్గొను నంతలోఁ జిరం । తనముని కృష్ణుఁ డాత్మశయదత్తవరాసన
మందు మౌనివ । ర్యుని దన కాభిముఖ్యముగ, నుండఁగఁ జేసెఁబ్రస
న్నవక్త్రుఁడై॥ ౨౫ ॥ (గీ) ఘనమహానీలరుచిమైన, కంసరిపుని । క్రో
ల విష్టరమున నున్న, మునివరేణ్యుఁ । డపరసంధ్యకు నెదుటఁ బూ
ర్వాద్రినున్న । ధవళకిరణుని శోభను, దస్కరించె॥ ౨౬ ॥ (గీ) అపు
డు యజ్వప్రియుండైన, హరి ప్రసన్నుఁ । డైన మునిపతిఁ బూజించి,
హర్షమొందె । సాధులనుబరివస్యచే, సంగ్రహింపఁ । గోరుదురు
గాదె సతతంబు, సూరిజనులు ॥ ౨౭ ॥ (గీ) తాపసేంద్రుఁ డశేష
తీర్థోపహృతము । లఘువినాశసమర్థంబులైన కుండి । సలిలము
లు పాణిచేఁ బట్టి,శౌరి మీఁదఁ । జల్లె హరియు నతాస్యుఁడై, సంగ్ర
హించె॥ ౨౮ ॥ (క)ముని యనుమతి గొని నవఘన। తనుఁడగు కృష్ణుఁ
డువసించెఁ, దపసియవరా । సనమున నది యపు డొప్పెను । ఘననీల
ఫలద్రుకలిత,కనకాద్రిక్రియన్॥ ౨౯ ॥ (చ) చెలువుగఁ గాఁక నార్చిన
పసిండి జిగిం దులకించు వల్వయుం । గలయఁగ నిండు చందురుని, కం
దువఁ బోలిన మేని చాయయుం । గలిగి మనోజ్ఞవేషుఁడగు, కంజదళా
క్షుఁడు చూడ నమ్యో సం । కలితవిశాలబాడబళిఖాయుతచారుప
యోధి చాడ్పునన్॥ ౩౦ ॥ (చ) బలరిపునీలతుల్యరుచి,భాసితశౌరితనుప్ర
భాళి సం । వళితములైన నారదునిఃవక్షరుచు ల్విలసిల్లె రాత్రియం ।



దలరు చలన్మహీరుహద, శాంతరగోచరశీతధామరో । చుల క్రియ న
ప్డు చూపఱుల, చూడ్కులకుం గడు విం దొనర్చుచున్॥ ౩౧ ॥ (చ)
ఘటియుఁ బ్రఫుల్లనూతనత,మాలను మోపమకాంతిరాజిచేఁ । బరువ
డి సప్తపర్ణసుమ,పాండుమరీచులచేఁ బరస్పర । చ్చురితవినిర్మలద్యుతు
ల, సొంపు వహించిరి యేకవర్ణులై । హరియుమునీంద్రుఁ డర్క
తన,యాన్విత గాంగజలంబు కైవడిన్॥ ౩౨ ॥ (మ) లయకాలప్రతి
సంహృతాత్ముఁడగు నే,లక్ష్మీశు సత్కుక్షిలో । రయ మార న్నవి
కాసత న్భువనమ్ము ల్రాజిల్లు నకుక్షిలో । నియతిం దాపసరాట్స
మాగమభవో,న్నిద్రోరుసంతోషసం । చయము ల్మికిలి దుర్వహం
బు లగుచున్, సాగె న్మహాభారమై॥ ౩౩ ॥ (చ) దినకరునిం బలె
న్విశద,దీధితిమైన తపస్విపర్యునిం । గనుఁగొనిసమ్మదంబున వికాస
ము నొందుటఁ జేసి ప్రాప్త నూ । తనరుచి గల్గు నేత్రములు, దా
ల్చిన కృష్ణుఁడు పుండరీకలో । చనుఁ డను ప్రస్ఫుటాహ్వయము, స
త్యముగా నొనరించె న త్తఱిన్॥ ౩౪ ॥ (వ) అప్పుడు॥ (ఉ) ఆవ
సుదేవపుత్రుఁడు మహాగుణశాలి విసారిశుభ్రదం । తావళిదంభశీత
కిర,ణాంశులచ్ఛేత స్వభావశుభ్రిసు । శ్రీవృతగాత్రము న్సితిమ,చే ఘ
నసౌధము నట్ల చాల సం । భావన సేయుచు న్స్మితస,మంచితవా
క్యముచేత నిట్లనున్॥ ౩౫॥ (చ) అనఘశరీరధారులకు, నద్భుతవైఖరి నీదు
దర్శనం।బనిశము మూఁడు కాలముల,యందును బాత్రత నొంది యుం
డునె । ట్లనిన నఘుం బడంచు నిపు, డాయతియందును భద్రహేతు
వౌ । ననుపమపూర్వపుణ్య విభ,వాధికతన్ గృత మయ్యెఁ గావు
నన్॥ ౩౬ ॥ (మ) అపరిచ్ఛిన్నసహస్రరశ్మియగు న,య్యంభోజమి
త్రుండు వి । ష్టపమం దేతమ్ము న్హరించుటకుఁ దా,శక్తుండు గాఁ
డయ్యె న । వ్విపులాజ్ఞానతమంబు మీ యగణితా,విర్భూతతేజంబు
ల । న్నిపుణత్వం[illegible]ఁ బోవు దూరగతమై, నిమూలమై తాపసా॥

౭౬ ॥ (సీ) అనఘాత్మ ప్రజలకు, నతిశుభకారి సుపాత్ర నిక్షిప్తని, ర్వ్యసనచిత్తుఁ । డగు సృష్టికర్తచే, ననిశంబు ధనసంపదలకును బోలె వేదంబులకును । గర మథి దానవభోగములచే వ్యయ మందుఁ బరఁగ నామ్నాయంబు వలన మఱియు । నానంత్యమునఁ జేసి, యక్షయుండగు నీవు నిక్షేపముగ ధాత్రి నిర్ణయింపఁ॥ (గీ) బడితి వజ్రపుత్ర నీదృష్టిపాతమునను । యతికృతార్థుండ నైతి నే, నైన నీదు । గురుతరోక్తులు నాలింపఁ, గోరినాఁడ । శ్రేయమందు నెవ్వాఁడు సంతృప్తి నొందు॥ ౭౭ ॥ (వ) అని యిట్లు ప్రియవచనంబులు పలికి యాగమనప్రయోజనం బడుగువాఁడై వినయంబున నమ్మునీంద్రునిం జూచి మహాత్మా నిస్పృహుండవైన నిన్నాగమనప్రయోజనం బెయ్యది యని యడుగుటది మిక్కిలిధార్ష్ట్యం బగు నైనను సముదితాత్మగౌరవంబును శ్లాఘ్యంబు నగు భవదీయాగమనంబె మాకు ధార్ష్ట్యంబు నిచ్చుచున్న దని పలికిన నమ్మురారి వచనంబు విని నారదుండు పురుషోత్తమా నిస్పృహుండ వని నీవు వచింప నర్హంబు గాదు పరమయోగుల కైన నీవు సాక్షాత్కరణీయుండ వట్టి నిన్ను సందర్శించు టదియె మాదృశులకుఁ బ్రయోజనం బింతకంటె నన్యం బెయ్యది గలదు॥ (సీ) సముదీర్ణవిషయవాంఛాప్రతిరోధకం బత్యుణ్ణ మగుట జనాళిచేత । నత్యంతదుర్గమం బైన మోక్షపథంబు నొందిన సుమనస్విబృందమునకు । ననపాయసంశ్రయం బైన ప్రాప్యస్థాన మగు దీవు పూర్వజ్ఞు లైన మునులు । నిగృహీతచిత్తులై, నెగడు యోగులచేత నధ్యాత్మదృష్టిచే, నధికయత్న॥ (గీ) మున గృహీతునిఁగా సర్వభూతమయునిఁ । గాఁ బ్రకృతికంటెఁ బరునిఁగా, ఘనపురాణ । పురుషునిఁగ సర్వసాక్షిఁగా, భూతములకు । నీశ్వరునిఁగా నెఱుంగుదు, రీశ నిన్ను॥ ౭౮ ॥ (వ) అని యిట్లు భగవంతుని నిర్గుణస్వరూపంబు వినుతించి ప్రస్తుతోపయోగిత్వంబున సగుణంబు నాశ్రి



యించి వెండియు నిట్లనియె॥ (గీ) పరఁగ లోకత్రయైకస్థపతివి నీవు । గాన లీలాసముద్ధృతక్ష్మాతలంబు । చారుభుజగౌకమునకు నాచ్ఛాదనముగఁ । జేర్చితి వహీశ్వరస్తంభశిరములందు ॥ ౮౦ ॥ (తరల) అరయ నీవు నరావతారుఁడ, వయ్యు సంసృతినాశకృ । ద్వరగుణంబుల నెల్ల వారి నధఃకరించితి వట్టి నీ । గురుతరాద్యపురాణమూర్తిని, గూఢసన్మహిమంబు లె । వ్వరు నుతింప సమర్థులై యిద్ధరఁ, బద్మపత్రనిభేక్షణా॥ ౮౧ ॥ (గీ) గహ్వరీభార మడఁప నాకమున నుండి । యవతరించితి వీవు మహానుభావ । కుక్షినిక్షిప్తనిఖిలలోకుండ వగుట । నంతకంటెను భూభార మధిక మయ్యె ॥ ౮౨ ॥ (మ) క్రమ మొప్ప న్శిశుపాలకంసముఖులోకద్రోహులన్ భూరితే । జమునం జంపుట కీవు భూతలమునన్, జన్మింప వేని న్మహా । త్మ మహాయోగులు యోగదృష్టి నెపుడు, న్దర్శింపఁగా లేనిని । న్విమలు న్మాదృశచర్మచక్షువులకు, న్వీక్షింప నెట్లయ్యెడిన్ ॥ ౮౩ ॥ (గీ) విశ్వవల్లభ దుర్మద, పీడితమగు । నీజగముఁ బ్రోవ దక్షుండ, వీవె కావె । పటుతమసాంద్రమలిననభంబు గడుఁ బ్రకాశముగఁ జేయ రవి దక్కఁ, గలఁడె యొరుఁడు॥ ౮౪ ॥ (గీ) హరి మృగప్రియులైన కంసాదినృపులఁ । జంపుటది యొక్క ఘన మని, జనులు నిన్నుఁ । బొగడుదురు కాని నాతుప్రముఖనిశాట । కరినిహంతకు నీకది, గర్హణంబు॥ ౮౫ ॥ (వ) ఇట్లు స్తుతివాక్యంబులచేత హరి నభిముఖుం గావించుకొని యాగమనప్రయోజనం బెఱింగించుటకు నుపోద్ఘాతంబుగా వెండియు నిట్లనియె॥ (సీ) జగదేకవల్లభ, విగతశ్రముండవై క్రమమున నీవు దుర్జనుల నెల్ల । నరసి చంపుటకు నీయంతన నీవె ప్రవృత్తుండ వైతివి, వివిధగతుల । నైన నేకాంతంబు, నందు నీతోడ భాషింపఁగఁ గోరు నాచిత్త మిపుడు । చతురత నన్ను వాచాలునిఁగాఁ జేయుచున్నది గావున, నోయుపే

న్ద్రి॥ (గీ) యిన్ద్రిసన్దేశమున జన్మహితమునైన । వచన మచిరంబుగా విన్నపం బొనర్తు।నింద్రకార్యధుర్యత నొంది, యొసఁగు నీవు।ప్రీతితో దాని నంతయు, వినఁగవలయు॥ ౯౬॥ (చ) విమతులచే నొకింతయును, భీతి నెఱుంగని వాఁడు సూర్యతే । జమున వెలుంగు వాఁడు దితి, జాతుఁ డొకండు గలండు వాఁడొగిన్ । గొమరుగ నింద్రశబ్దమున, కుంగల యర్థ మడంచి సంతతం । బు మహితుఁడై హిరణ్యకశిపుం డను పేరఁ జరించు నిత్యమున్॥ ౯౭ ॥ (చ) పరఁగ సమత్సరుం డగుట, వాఁ డసురుం డను దారుణాఖ్యకున్ । ధరఁ బ్రథమాభిధేయతేను, దాల్చె మహాబలుఁడైన వానిచేఁ । జిరగతి దేవతాతతుల, చిత్తములందు మహాభయంబు సు । స్థిరముగ నించఁగాఁ బడియెఁ, జెప్పెడిదేమి తదుగ్రకృత్యముల్॥ ౯౮ ॥ (చ) హరియమపాశియక్షులు దిశాధిపులైనను వారి వీటిలో । నరయక రాగసంహృతములై తమ యంతనె సర్వసంపదల్ । స్థిరముగ రాక్షసేంద్రుని భజించెఁ దదాదిగ సంప దల్పసుం । ధర నతిచంచలంబు లని, తద్దయు నాడిక గాంచె నెంతయున్॥ ౯౯ ॥ (ఉ) నాకులు దైత్య ధాటికి మనంబున భీతిలుచు న్స్వరూపశో । భైకఫలంబులైన నగరాదులకుం బటు శస్త్రకోటికి । న్వీఁక బలాలి కాయసవినిర్మితకంచుకచాపపాళి క । స్తోకత సంవిధానములు, శూరులు చేసిరి పుష్కలంబుగన్॥ ౧౦౦ ॥ (తరల) భువనసంచరణైకశీలుఁడు, భూరిసంపద కాశ్రయుం । డవు నిశాచరనాథుఁ డేదిశ, కర్థి నేగుఁ దదాశకు । న్దివిజవర్యులు మౌళి బద్ధమణీగళత్కరయుగ్ములై । యవిరలస్పృహ మూఁడు సంధ్యల యందు మ్రొక్కుదు రెప్పుడున్ ॥ ౧౦౧ ॥ (చ) వితతసటాచ్ఛటానిలవిభిన్నఘనంబగు భూరినారసిం। హతనువు దాల్చి ముగ్ధలల, నాంచదురోభవసంగభంగురా । యతనఖరంబుల న్ఘనరసావని నద్దను జేందరివక్షము । ద్ధతి వివళించి త్రుంచితివి, తామరసేక్షణ నీవు వేల్మిడిన్॥ ౧౦౨ ॥ (మ) ఘనుఁ డాదైత్యుఁడు భూరిదర్పభవదోఃకండూతి సైరింప లే । క నితాంతస్పృహ వెంబడి నిర్జరులతోఁ, గయ్యంబు గావింప దే । వనివాసక్షతరక్షణం బగుచుఁ గ్రవ్యద్ఘోరరూపంబుతో । దనుజుండై జనియించె రావణుఁడనా, దైత్యాన్వయస్వామియై॥ ౧౦౩ ॥ (వ) మఱియు నా రావణుండు త్రైలోక్యాధిపత్యంబుగోరి యత్యంతోత్సాహంబువలనఁ దన దశమశిరంబు ఛేదింపం దలంచి యిష్టసాహసుండు గావునఁ దన యిచ్చకుం దగిన యీశ్వరవరంబును విఘ్నంబునుం బోలె నుత్ప్రేక్షించె నదియునుం గాక॥ (గీ) లీలఁ గైలాసగిరిని జలింపఁ జేసి । చలనసంభ్రమత్రస్తతుషారశైల । కన్యకాస్వయంగ్రాహసుఖంబు చేత । శివుని వరదానమునకు నిష్కృతి యొనర్చె॥ ౧౦౪ ॥ (చ) ఘనబలశాలియైన దశకంఠుఁడు శక్రుని మీఁద నల్గి త । ద్వనమును బెల్లగించె మఱిఁ, దత్పుటభేదన మడ్డగించె న । య్యనువున రత్నముల్గొనియె, నచ్చరల న్జెఱఁ బెట్టె నీగతిన్ । బనివడి రేపవల్దివికు, పద్రవమర్థిని నొనర్చె బల్విడిన్॥ ౧౦౫ ॥ (చ) తలఁప దశాస్యుచేత నను, ధావితుఁడై యనిలో బలాంతకుం । డలికి పలాయితుం డగుచు, నభ్రమునాథసలీలయానము । ల్దలఁపఁడు వార్ధిఁ బుట్టిన చలద్ధయచిత్రపదక్రమంబునుం । దలఁపఁడు కేవలం బనుదినంబుఁ బ్రశంస యొనర్చు శీఘ్రతన్॥ ౧౦౬ ॥ (గీ) కరమధీరలోచనుఁడగు, కౌశికుండు । తపనసముఁడైన దైత్యునిదర్శనంబు । సేయఁ జాలక కాంచనశిఖరిగుహల । నొదిగి దినములు గడుపుచు, నుండు ననఘ॥ ౧౦౭ ॥ (చ) కలితబృహచ్ఛిలాకఠిన, కంఠవిఘట్టన జాతపావకో । జ్జ్వలకణజాలమౌటనవి,షహ్యతరం బగు విష్ణుచక్ర మా । ఖిలదనుజాన్వయప్రభుని, కంఠమునం దతిమోఘ మయ్యెఁ గే। వలభువనైకభర్తయయు, భాసిలె వాఁ డధికప్రతాపుఁడై॥ ౧౦౮ ॥ (సీ.)

మఱియు నద్దైత్యుండు, మదమునఁ గరిఁ బోలెఁ జతురత నిర్భిన్న,
శంఖుఁ డగుచుఁ । గలుషితంబు నిరస్త,గాంభీర్యము నపాస్తగురువు
ష్పకంబగు, గుహ్యకేంద్రు । మానసంబును జాల, మథితంబుగాఁ జే
సె నదియును గాక జ,న్యంబులందు । వరుణదేవుని చేతఁ,బ్రహితం
బులైన దుర్దమనాగరాజపా,శములు దనుజ॥ (గీ) వల్లభసరోష
హుంకార,భయదరవము । చేత వ్యావర్తితంబులై, చిత్తమందు।సా
ధ్వసము గూరఁ గ్రమ్మఱ, జవమునఁ జని । ముట్టి పాశిగళంబునఁ,
జుట్టుకొనియె॥ ౧౦౯ ॥ (చ) చెలువుగఁ జాపదండము ర,చింపఁగఁ
గోరి దశాననుండు ని । చ్చలు యమవాహనంబయిన, సైరిభరాజవి
శాలశృంగమం । డల మటు వెల్లగింప నది, తత్పృథుభారము లేక
యుండియుం । జెలువఱి వ్రీడ నొంది వగ,చేఁ దలయెత్తక యుండు
నెప్పుడున్॥ ౧౧౦ ॥ (గీ) అనఘశుచికాలమందైన, నధికభీతి। న
ర్కుఁ డసమగ్రకరముల, నంటి కొనుచు । విమలశీతలఘుమా(ర్జ)ంబు,
బిందుమాల్తి । కంబుల నలంకరించుఁ ద,త్కమలముఖుల ॥ ౧౧౧ ॥
(చ)అలఘుకళాసముద్రుఁడు శ,శాంకుఁడు దైత్యుని యింట రేపవ।ల్గా
లుచుచు మానినీప్రణయ,కోపము దీర్చుచు రాగసంపద।ల్దలకొనఁ జేయు
చు న్రతివి,లాసము నేర్పుచు సంచరించు న।వ్విలసనశీలుఁ డౌ దనుజ,వీరు
నకు న్నశి నర్మమిత్రుఁడై॥౧౧౨॥ (తరువోజ)అతిదురహంకారుఁ,డగుద
శాస్యుండు వితతవిలాసినీ,విభ్రమార్థంబు।తతమతిఁ జెవులకు, దంతపత్రి
కలు హితముగా రచియింప, నిచ్చఁ దలంచి।ప్రతి లేని బలమున, భాసి
ల్లు విఘ్నపతి దంతమొక్కటి,బలిమిమైఁ బెఱికె । నతఁ డేకదంతుఁడై,
యందున నలరె జతనుగా నది వెండి, జనియింప దయ్యె॥౧౧౩॥ (మ)
అవరోధప్రమదాంబరోచ్చలనసు, వ్యక్తాగుఁడై యుండి త। ద్ధవళాక్షీ
స్ఫురదూరులోలఘననే,త్రశ్రేణియా వాని కా । ప్తవరుండైన సమీరు
డేననపరా,ధస్పర్ధబద్ధామరుల్ । స్తవము ల్చేసి విముక్తులై చనిరి స్వ,



స్వస్థానము ల్చేరఁగన్॥౧౧౪॥(గీ) జనతిరస్కారియగు వాని, సత్ప్రి
తాప । మహిమచే ధిక్కృతుం డయ్యె, దహనుఁ డాధి । చేఁ గృ
శింపుచు బాష్పము, ల్చిలుకరించి । ద్విగుణముగ ధూమపటలంబు, వి
స్తరించె॥ ౧౧౫ ॥ (వ) మఱియు నత్యుగ్రతేజుండగు రావణుని సే
వించుటకు సర్పంబులు స్వకీయంబైన పరమర్మభేదకద్విజిహ్వతాదోషం
బుపరిత్యజించి యజిహ్మగమనంబులైన సకర్ణవర్గంబులచేత నిజభుజం
గత్వంబు భజింపఁ బడ దయ్యె నదియునుం గాక॥ (చ) విపులతదీ
యవారణవి,భిన్నవిశాలకటంబు లౌటచే । నుపరతదానధారలయి,
యొడి దిశేభము లున్కి పట్లకున్ । జపలతఁ బాసి యచ్చటనె, సం
తతము న్వసియించి నందునన్ । విపులదిశాగజంబులను, పేరది సా
ర్థక మయ్యె వానికిన్॥ ౧౧౬ ॥ (మ) కుసుమాస్త్రజ్వరతాపతప్త
మగు ర, క్షోభర్త నెమ్మేనికిన్ । వ్యసనాత్యుష్ణములైన దైత్యకుల
ర్యాం,డ్బందీకృతేంద్రాంగనా । శ్వసితోరు శ్వసనప్రచారములచే, సౌ
ఖ్యంబు వాటిల్లిన । ట్లసమానందము గల్గ దెప్పుడు పటీ,రాంచద్ధవి
త్రంబులన్॥ ౧౧౭ ॥ (మ) అనిశంబున్ ఋతువుల్సమగ్రఫలవు,ష్పా
ఢ్యంబులై బల్తసం । బును హేమంతము సన్మనోజ్ఞశిశిరం,బుం దద్వ
సంతేన్దిరన్ । ఘనవర్షర్తుశరత్తులుం గలసివే, డ్కన్ దన్మహాపట్టణం ।
బున వాస్తవ్యకుటుంబిత న్వెలయు నామో,దంబు సంధిల్లఁగన్॥౧౧౮॥
(తరువోజ) అనఘాత్మ యజుఁడ వ,వ్యయుఁడ వనాది వనుపమానబ
లుండ,వైనట్టి నీవు । తను వధించుటకునై, తత్పరత్వమున మనుజలో
కంబున, మనుకులమందు । ఘనరాముఁ డను పేరఁ, గలుగుట యె
ఱిఁగి వినయంబుతో సీత, విడువఁడు వాఁడు । పనివడి మానులై,
పరఁగిన వారు ప్రణుతాభిమానైక, దరిద్రులు గారె॥ ౧౧౯॥ (ఉ)
అప్పుడు రామరూపమున, నమ్మిఁలి నీవు మహాపయోనిధిం । ద[illegible]క
సేతుమార్గము వ్వ, దాఁటి యని న్వనితాపహారకున్ । గప్పిన శి

నక్కుచే నిశిత,కాండముల న్వధియించి పుచ్చవే । యిప్పుడు తచ్చరి
త్రము న,హీనమతిం దలపోయు మచ్యుతా ॥ ౧౨౦ ॥ (వ) మహా
త్మా పరప్రతారణపరుండైన యారావణుం డిప్పుడు శైలూషుండు
రూపాంతరంబునుం బోలె భవాంతరంబు నొంది శిశుపాలుం డను
సంజ్ఞచేతఁ దిరోహితాత్ముండై యన్యులచేత నతం డెవ్వం డని యె
ఱుంగంబడక వర్తింపుచున్నవాఁ డాశిశుపాలుండు బాల్యంబున భు
జచతుష్టయవంతుండై ముఖంబుచేతఁ బూర్ణచంద్రప్రతిముండై లో
చనత్రయోపేతుండై యుండు నిప్పు డవి యన్నియు నంతర్హితంబు
లగుటం జేసి తరుణుండై కరాక్రాంతమహీభృద్వరుండై యత్యున్న
తతేజంబున సాక్షాత్సూర్యుండై వెలుంగుచున్నవాఁ డదియునుం గాక॥
(చ) కడిమి యదృచ్ఛచే నమర,కర్బురకోటి ననుగ్రహింపఁగాఁ । గడు
వడి నిగ్రహించుటకుఁ, గర్తను నేనె యఁటంచు గర్వియై । తడయ
క ధాతృముఖ్యసుర,దత్తవరంబున వీర్యసంపద । ల్వడసిన రావణా
దులను, వాఁడు హసింపుచు నుండు నిచ్చలున్॥౧౨౧॥(చ) పరఁగ జి
గీషుఁడైన శిశు,పాలునిచేత బలావలేపతన్ । దురుసుగ నిప్పుడు న్జ
గము, తొంటి విధంబున గాసి నొందెడున్ । వరసతియైన కాంత
వలె, వారక సుస్థిర మాస్వభావమున్ । ధరఁ బ్రతిజన్మ మందవిత,
థంబుగఁ బూరుష నొందు నేకదా॥ ౧౨౨॥ (గీ) అట్లనిక్రాంత దై
వాజ్ఞుఁ,డైన వాని । యమనికేతనాతిథిని గా,ననుపు మీవు । పృథివి క
టు పీడ సేయు శు,భేతరప్ర । చారుల వధించు టది సాధు, సమ్మతం
బు॥ ౧౨౩॥ (గీ) అరివధముచేత ధృతదార్ఢ్య,మైన శక్రు । చిత్త మ
తిసాంద్రపులకశ,చీకుచాగ్ర । ధృత పరీరంభ పీడనో,న్నత సహాత్వ ।
మొందుఁగా కిటు మరల న,స్పంద మగుచు ॥ ౧౨౪ ॥ (వ) అనియిట్లు
విన్నవించి సురమునియగు నారదుం డాకాశంబున కుద్గమించి చంద్రుని
కాంతి వహింపుచుండ నప్పుడు చేదిదేశాధీశ్వరుండైన శిశుపాలుని



యం దతిక్రుద్ధుండైన చక్రపాణి వదనంబునందు గగనంబునందుం బోలె
సంతతంబు శత్రువినాశసూచకంబగు నుత్పాతవిశేషంబు భ్రూభంగ
వ్యాజంబున నాస్పదంబు గావించె నయ్యుపేంద్రుం డింద్రసందేశశ్రవ
ణానంతరంబున॥ (గీ) హవముఁ జూడఁ బార్థుఁడు పిల్వ, నంపెఁ
జైద్యుఁ । జంపు మని చెప్పి పుత్తెంచె, జంభవైరి । యెద్ది సేయుదు
నేఁడాని, నిపుడు విడుతు । ననుచుఁ గార్యద్వయాకులుం,డై మురారి॥
౧౨౫॥ (గీ) గగనమున గురుకావ్యాను,గతహిమాంశు । కాంతిని వ
హించి యుద్ధవ, కామపాల । సహితుఁడై రమ్యమగు సభా,స్థల
ముఁ జేరె । వేడ్క మీఱ మంత్రంబు గా,వించుకొఱకు॥ ౧౨౬॥ (క)
నయముగ జగదవనార్థము । ప్రియ మొప్పఁగఁ దత్సభాస్థ,లీవేదిక
పై । నయమున నన్నరవహ్ని । త్రయము ప్రకాశించె భూరి,తర
తేజమునన్॥ ౧౨౭॥ (క) వితతమణిస్తంభంబులఁ । బ్రతిబింబితు
లగుచుఁ జుట్టు,పౌరుషసంఘా । వృతులైన కరణి నొప్పిరి । చతు
రత నమ్ముర్వురతివి,శాలవిభూతిన్॥ ౧౨౮ ॥ (సీ) ప్రీతి నుద్ధవ రా
మ,కృష్ణులే యుత్తుంగహైమపీఠములపై,నధివసించి । రాపీఠముల చే
త, నంచితకేసరిక్రాంతత్రికూటశృం,గములు చాల । నుపమింపఁగా
నయ్యె, నపుడు విచక్షణుండగు హరి యుద్ధవ, హలధరులకుఁ । గా
ర్యద్వయమునకుఁ, గల్గిన విప్రతిషేధంబు దెలిపె వి,శేషయుక్తి॥ (గీ)
మాఘ్యముకుళాగ్రరదనుఁడా,మధువిరోధి । వాణి విద్యోతి తాంత
స్స,భంబులైన । సుస్మితంబులచేఁ బరి,శుద్ధమైన । కరణిఁ బ్రస్ఫుట
వర్ణమై,వఱలె నపుడు॥ ౧౨౯॥ (గీ) వరుస మద్వాక్యములు భవ,
ద్వాక్యములకు । నవసరం బిచ్చుటకు నయ్యె, ననఘులార । నలువు
గాఁ బూర్వరంగంబు,నాటకీయ । రమ్యవస్తుప్రసంజనా,ర్థంబు గా
దె॥ ౧౩౦ ॥ (వ) దిగ్జయశీలురైన భీమార్జునాదిభ్రాతలచేతఁ గర

దీకృతసకలమహీపాలుండగు యుధిష్ఠిరుండు మనసాహాయ్యంబు లేక యేయాగంబు నిర్వర్తించుటకు సమర్థుండై యున్న వాఁడు ప్రవర్ధమానుండగు శత్రుండు పథ్యంబు గోరు పురుషునిచేత నౌదాసీన్యంబునఁ జూడం దగిన వాఁడు కాఁడు వృద్ధి నొందుచున్న రోగంబును శత్రుండును దుల్యవృత్తి గల వారని చెప్పంబడుదురు గావున ॥ (సీ) ఒనరఁ జైత్రృష్వసేయుండగు శిశుపాలుఁ డెలమి బంధుం డయ్యు, ఖలుఁడు వాఁడు । సతతంబు నా కపకృతిసేయు చుండు నట్లయినను దానినే, నరయకుందుఁ । బరఁగ లోకంబును బాధింపుచున్నవాఁ డది నాకు మిక్కిలి, యార్తి నొసఁగెఁ । దవిలి భవన్మత, శ్రవణపర్యంతంబు నామతం బిది మీరు, నయ మెలర్ప ॥ (గీ) నార్యవర్యు లాలోచించి, కార్యసరణి । దెలుపుఁ డిప్పుడు భువి నెంత, ధీరుఁడైన । నొకఁడు గావించు మంత్రంబు, ప్రకటితముగ । నర్థనిశ్చయసందిగ్ధ, మగుచునుండు॥ ౧౩౧ ॥ (వ) అని యిట్లు కృష్ణుం డభిధేయసమ్మితాక్షరంబైన వాక్యంబుఁ బలికి యూరకుండె నుత్తమపురుషులు ప్రకృతిచేతనే మితభాషులై యుందురు గదా యప్పుడు ॥ (గీ) శాత్రవకృతాపరాధసం,స్మరణజాత । వితతసాంద్రపశ్చాత్తాప,విస్ఫురితము । సుదతిబింబోష్ఠచుంబన,చుంచువు నగు ।, నోష్ఠమున లక్షితుండయి, యొప్పువాఁడు॥ ౧౩౨॥ (గీ) మద్యసేవారుణిత ఘూర్ణ,మానములును । రేవతీవదనోచ్ఛిష్ట, పావనపుట । యుతములగు లోచనంబుల, నొప్పువాఁడు । నురుకుధోన్నమితాంగుఁడై, వలులు వాఁడు॥ ౧౩౩ ॥ (గీ) గాఢపరిరంభలోలుప,కామినీస్త । నాతికార్కశ్యసాక్షిణి,యగు సుగంధి । దివ్యవనమాల నభిమాన,దీప్తవదన । వాతముల వాడఁ బాఱించు, వాఁడు మఱియు ॥ ౧౩౪ ॥ (గీ) నిబిడకుండలకలిత మా,ణిక్యశకల । ప్రభలచేత నీలాంబరా,భంగసంగ । రుచిని నవచూత పల్లవ, రుచిని గాఁగ । నంచితంబుగఁ గావించు,నట్టి వాఁడు॥ ౧౩౫॥ (గీ) వితతసంధ్యారుణవ్యోమ,విస్ఫురత్స । మగ్రతారాగణంబుల,ననుకరించు । శత్రువిద్వేషరక్తాంగ,సంగిసాంద్ర । ఘర్మజల బిందువులు దాల్చి, క్రాలు వాఁడు ॥ ౧౩౬ ॥ (మ) తత సౌరభ్యకకుద్మిపుత్రివదనాం,తర్వాసలబ్ధాధివా । సితమా మద్యరసంబుచేతఁ గృతసం,శ్లేషాననామోదముల్ । సతతంబు న్వమి యించు వాఁడు నయశా,స్త్రప్రోక్తసద్యుక్తులన్ । జతురత్వంబునఁ దెల్పువాఁడు ఘనుఁ డా,సంకర్షణుం డత్తఱిన్॥ ౧౩౭ ॥ (గీ)తాను మొదలఁ జెప్పఁ, దలఁచి తత్క్షణమె ని । జోక్తి వినఁ దలంచి,యూరకున్న । యుద్ధవుని మనోజ్ఞ, సిద్ధాంతవాక్కుల । కవసరంబు నిచ్చు, నట్టివాఁడు॥ ౧౩౮ ॥ (గీ) వదనకపటపద్మ,పర్యంతసంచర । చ్చంచరీకముల కుఁ, జలదుదగ్ర । దంతరుచులచేతఁ, ధావళ్య మొసఁగుచు । నింపు సొంపు మెఱయ, నిట్టు లనియె॥ ౧౩౯ ॥ (గీ) హరి మొదల యానపక్షంబు, నాశ్రయించి । దోషరహితం బదీనమై, దొరయు నట్టి । వాక్య మెయ్యది వలికె న,వ్వచనమునకు । నొనర నటు సేయు టదియె సు,మ్ముత్తరంబు॥ ౧౪౦ ॥ (సీ) ఇంధనరాశిద,హించు పావకుఁడు దీధితిచేత సూర్యు న,తిక్రమింపఁ । జాలని క్రియఁ గడు, సంక్షిప్తమైన యీవచనంబు బహుతర,వాక్కుచేత । నతిశయింపఁగఁ జాల, దటు కాన మితపదం బర్థగౌరవమునై, యతిశయిల్లు । హరివాక్యమునకు మ,ద్గురుతరధార్ష్ట్యవాక్యము భాష్యభూతమై, యలరుఁ గాక॥ (గీ) మహితమతులు సెప్పు, మాటలు ప్రతివాది । వక్త్రమైన మూఁగ, వానిఁ జేయు । నవని సంతతంబు,ననుకూలవాదియౌ । వాఁడు మందుఁడైన, వాగ్మిఁ జేయు॥ ౧౪౧॥ (వ) మందబుద్ధులయ్యును గొందఱు దుర్మేధులగు వా రాశనసాదిగ్రంథంబులు

పఠించి సంధివిగ్రహయానాసనద్వైధీభావసమాశ్రయంబు లనియెడు షడ్గుణంబులును ప్రభుమంత్రోత్సాహంబు లనియెడు త్రిశక్తులును శక్తిత్రయసాధ్యంబులైన పురుషార్థలాభాత్మకప్రభావసిద్ధిమంత్రసిద్ధ్యుత్సాహసిద్ధు లనియెడు సిద్ధిత్రయంబును క్షయవృద్ధిస్థానసంజ్ఞికంబైన యుదయత్రయంబును వ్యాఖ్యానంబు సేయుటకు సమర్థులై యుండు రనాలోచితకార్యుండైన వావదూకుని వాగాడంబరంబు లక్ష్యంబువలన స్ఖలితబాణంబైనధనుష్మంతుని వల్గితంబునుంబోలె నిష్ఫలంబగు సర్వకార్యశరీరంబులందు సౌగతులకు రూపవేదనావిజ్ఞానసంజ్ఞాసంస్కారంబు లనియెడు స్కంధపంచకాతిరిక్తంబైన యాత్మ యెట్లు లే దట్లు రాజులకుఁ గర్మారంభోపాయపురుషద్రవ్యసంపద్దేశకాలవిభాగవినిపాతప్రతీకారకార్యసిద్ధు లనియెడు పంచాంగంబుల కంటె వ్యతిరిక్తంబైన మంత్రంబు లేదు॥ (గీ) మఱియు సర్వాంగసంవృత,మంత్ర మదియ। ధీరుఁడైన యోధుఁడు పోలెఁ, దేజ మలరఁ। బరవిదారణశంకచేఁ, బరఁగఁ బెద్ద। కాల మటు నిల్కడ వహింపఁ, జాలద య్యె॥ ౧౪౨॥ (క) మానుగఁ దన కుదయ మరివి। హీనతయును రెంటి నెఱుఁగు, టిది నీతి పరి। జ్ఞానులు దీనిం గైకొని। పూనిక వాగ్మితను బ్రచుర,ముగఁ జేయఁ దగున్॥ ౧౪౩॥ (క) తన కెంత కలిమి గల్గిన। జననాథుఁడు తృప్తి నొందఁ, జన దందులకు। న్వనరాశిపూర్ణుఁ డయ్యును। ననిశము శశి రాక గోరు,టది గుఱి గాదే॥ ౧౪౪॥ (క) ధర నల్పసంపదకు నె। వ్వరు తృప్తి వహింతు రట్టి, వారిఁ దదల్పా। స్థిరసంపద నల దైవము। చిరకాలము వృద్ధి నొందఁ,జేయదు ధాత్రిన్॥ ౧౪౫॥ (క) కర మభిమానము గల భూ। వరు లరులను మొదలు ముట్ట, వధియింపక యి। ద్ధర నుదయ మొంద రిందుకు। గురుతమము నడంచు రవియె, గుఱి యగు ధాత్రిన్॥



౧౪౬॥ (క) వాలాయము పగతుర ను। న్మూలింపక సుప్రతిష్ఠ, నొంద నగునె పై। వ్రాలిన ధూళిని గ్రిందికిఁ। దూలింపక జలము దేఱి, తోఁచునె యెందున్॥ ౧౪౭॥ (వ) మఱియు నుపకారాపకారంబులలోన నెద్ది యేనియు నొక క్రియచేత నిర్వృత్తులైన కృత్రిమమిత్రుండును కృత్రిమశత్రుండును యావజ్జీవపర్యంతంబు నేకస్వభావంబున నుందురు గావున వారు బలవంతులై యుందురు వార లుపకారాపకారకార్యవశంబువలన నిర్వృత్తులై యుందురు సహజప్రాకృతు లట్టి వారు గా రెట్లనిన నేకశరీరావయవవంతులైన మాతృష్వసేయపితృష్వసేయాదులు సహజ మిత్రులు పితృవ్యతత్పుత్రాదులు సహజశత్రువులు ప్రాకృతుండు పూర్వోక్తకృత్రిమసహజలక్షణరహితుండును విషయానంతరుండైన రాజు ప్రాకృతశత్రుండు తదనంతరుండైన రాజు ప్రాకృతమిత్రుం డగు నాసహజ ప్రాకృత శత్రుమిత్రులు తాదాత్మ్యకార్యవశంబువలన నియమంబు లేక యుభయరూపత్వంబు నొందుదు రుపకారులై రేని సహజప్రాకృత శత్రువులతోడనైన సంధి సేయం దగు నపకారులై రేని సహజప్రాకృతమిత్రులతోడనైన సంధి సేయం దగ దుపకారాపకారంబులు శత్రుమిత్రులక్షణం బని తెలియం దగిన యద సాక్షాచ్ఛత్రునితో సంధియు మిత్రునితో విరోధం బెట్లు గావింప వచ్చు నంటి రేని యదికార్యవైపరీత్యంబు వలన దోషంబు గాదు కావున సహజమిత్రత్వంబు నందును శిశుపాలుండు కార్యంబుచేత శత్రుండు గావున వాఁ డవశ్యంబు హంతవ్యుండు॥ (క) అరి యొకఁడైనను వాఁడి। ద్ధరలో మనియుండు నంత,దాఁ కమనల వేఁ। జెఱ వెట్టుఁ జంద్రసూర్యులఁ। దఱఁగని బాధించుఁ గాదె,తముఁ డొకఁ డైనన్॥ ౧౪౮॥ (క) మును రుక్మిణిఁ దెచ్చిన నాఁ। డనఘా యపకృతి యొనర్చెఁ, దా చైద్యునకు। న్విను మర్వి వైరవృ

క్షుం । బున కెంతయు యువతిజనులు, మూలము గాదే॥౧౪౯॥ (క) న
రకుని వధించుటకు నీ । వరిగిన తఱి వాఁడు వచ్చి, యరికట్టెను మ ।
త్పురిని గురుతమము గతభా । స్కరమగు చామీకరాద్రి,సానువును బ
లెన్॥ ౧౫౦ ॥ (క) అరయక బభ్రుని భార్యను । హరించె నాతఁడు
స్మరింప, నహర్హం డగునే । దురితాత్ముల కథ నొడివిన । దురితవిదూ
రులకునైన, దోసము వచ్చున్॥ ౧౫౧ ॥ (గీ) అతని కీవు చేసి, తపకా.
రమును మన । కతఁడు చేసెఁ దగ మ,హాపకార । మటు పరస్పరంబు,
నహితక్రియలచేత । శత్రుఁ డగుట కేమి, సందియంబు॥ ౧౫౨ ॥ (క)
అరి కపకృతిచేసి మది । న్మఱచి యుపేక్షించు నట్టి,మనుజుఁడు పొదఁ
జి । చ్చుఱక నిడి గాలి కెదురుగ । వెఱవక నిద్రించు వాని, విధమగుఁ
గాదే॥ ౧౫౩॥ (క) ఇంచుక తప్పులొనర్చిన । వంచింపక మది స
హింప, వచ్చును బెక్కు । ల్మించి యొనర్చినఁ బగతుని । నంచితము
గ నెవ్వఁ డోర్చు, నంబుజనాభా॥ ౧౫౪ ॥ (సీ) అలివేణులకు రతి,
వ్యతిరిక్తకాలంబునందు లజ్జయుఁ బోలె, నవనిపులకు । నపరిభవము
నందు, నధికశమంబు భూషణమయి చెల్లు యో,షలకు సురత । సమ
యంబులందు ధా,ర్ష్ట్యము పోలెఁ బరిభవమందు రాజులకు శౌ,ర్యం
బుసొమ్ము । పరునిచేత నవజ్ఞఁ, బడి కడు దుఃఖసంతప్తుఁడై యెవ్వఁ
డు,దాల్మి కలిగి॥ (గీ) వసుధ జీవించు నతఁడు జీ,వన్మృతుండు । పృ
థివిలో వాఁడు జనియించుఁ బెల్లఁ దల్లి । గర్భభారంబునకును ని,
ష్కారణముగ యోని । హింసకును గారణం బగు, నిది ఫలంబు॥ ౧౫౫ ॥
(క) చరణాహతమై యేరజ । మరుదుగఁ బైకెగసి శిరము,నారోహిం
చెన్ । గర మారజ మధికము పర । పరిభవము సహించి బ్రతుకు, ప
గతుని కన్నన్॥ ౧౫౬ ॥ (వ) మఱియు జాతిక్రియాగుణంబులచేతఁ
బ్రయోజనంబు సంపాదింపని పురుషుని జన్మం బిచ్ఛాకల్పితజాత్యాది



ప్రవృత్తినిమిత్తశూన్యంబైన డిత్థాది శబ్దంబు కర్ణణిఁ గేవలసంజ్ఞార్థంబు
బై యుండు మఱియును॥ (చ) ఘనగిరి కున్నతత్వ మది, గల్గునగాధ
త లేదు వార్ధికిం । గనుఁగొనఁగా నగాధతయుఁ, గల్గు సమున్నతి
లేదు ధాత్రిలో । ఘనత మనస్వివర్యునకుఁ, గల్గును రెండును గాన ధీ
రుఁడున్ । గొనకొని వాని కన్న నధి,కుండయి యొప్పుఁ దలంచి చూ
డఁగన్ ॥ ౧౫౭ ॥ (గీ) రాహు వెప్పుడు తుల్యాప,రాధుడైన । భా
నుమంతునిఁ దడవుగాఁ,బట్టి మ్రింగు । సారెసారెకుఁ గబళించు, శ
శికధరుని । మఱిదిమ గల్గుట కుర్విలో, నిదిఫలంబు॥ ౧౫౮ ॥ (గీ) అ
ల్పరిపుమారుతము వ్యా,ప్తమగుచునుండఁ । బరఁగ నిష్పౌరుషుండైన,
నరుఁడు తృణము । మాడ్కిఁ దన యంతఁ దానె న,మ్రత వహించు ।
నవని దుర్బలురకును దృ,ష్టాంత మిదియ॥ ౧౫౯ ॥ (గీ) మఱియుఁ
దేజస్వి తేజస్వి,మధ్యమందు । గరిమతో దూరగతుఁ డయ్యు,గణుతి
కెక్కు । మానితంబుగఁ బంచాగ్ని,మధ్యమందుఁ । దపము గావిం
చుతపసికిఁ, దపనుఁ డరయఁ । బంచమవిభావసుం డయి, పరఁగునన
ట్లు॥ ౧౬౦ ॥ (క) విమతుల శిరములపైఁ బా । దము మెట్టక పు
డమిఁ గీర్తి,ధనుని సమాఖ్యా । రమణి నిరాలంబంబుగఁ । బ్రమదం
బున నెట్లు త్రిదివ,పథమున కెక్కున్॥ ౧౬౧॥ (క) మృగమునుదొడ
పై నిడుకొని । మృగాంకుఁ డనఁ బరఁగె విధుఁడు, మృగముల నె
ల్లన్ । డెగఁ గొనుటఁ జేసి కేసరి । మృగరా జని బిరుదు గాంచె,
మేదినియందున్॥ ౧౬౨ ॥ (సీ) దండసాధ్యుండైన, దండిశాత్రవునం
దుఁ గరము సామం బప,కార మగును । బరఁగ స్వేదోచితా, పక్వజ్వ
రము వారిసేచనంబున వృద్ధిఁ, జెందుఁ గాదె । యగ్నిచే సంతప్త, మై
న ఘృతంబుపైఁ గాండము ల్చల్లిన, మండి నట్లు । సక్రోధుఁడైనయా,
చైద్యున కటు సాంత్వవచనంబు లధికదీ,పన మొసంగు॥ (గీ) జగతి నె

వ్వారు సంధ్యాది, షడ్గుణముల । క్రమము వివరింప లేక కా,ర్యములు
చెఱుతు । రట్టి శత్రుసంజ్ఞితుల స్వ,మగ్రమంత్రి । వేషధరులను జనపతి,
విడువ వలయు॥ ౧౬౩ ॥ (వ) మఱియుఁ గొందఱు పెద్దలు తనకుపచ
యంబు గలుగునప్పుడు యానంబు యుక్తం బని పలికిరి కొందఱు శత్రు
నకు వ్యసనంబు గలుగు నప్పుడు యానంబు యుక్తం బనిరి రెండును
నుదాసీనుండవైన నిన్నిప్పుడు ప్రేరేపించుచున్నయవి లోకాతిక్రమణ
శీలంబులునునలంఘ్యంబులును నత్యంత గురువులు నగు యాదవవా
హినీ సముద్రంబులను నీతాల్మి వేల పగిది నరికట్టి యున్న దట్లు
గాదేని యింతకు మున్నెన్నఁడేని శిశుపాలుని వధింప కూరకుం
డునే సాంఖ్యులచేతఁ బలుకం బడిన యాత్మయందు మూల ప్రకృ
తి సుఖదుఃఖానుభవంబునుం బోలె యాదవవాహినీవిజయంబు సాక్షి
మాత్రుండవై ఫలభోక్తవైననీయందు వ్యవహరింపంబడు నని పలికి బ
లభద్రుండు వెండియు నిట్లనియె॥ (గీ) అధిప చైద్యుఁడు ప్రియసఖుం,
డగుజరాత । నూజుఁ డనిలాత్మజునిచేత, నాజి నిహతుఁ । డయ్యె
నది యాదిగా మహా,వ్యసని యగుచు । నుండుఁ గావున సుదముఁ
డై, యున్నవాఁడు॥ ౧౬౪ ॥ (చ) బల మఱి యున్నచో రిపునిఁ,
బట్టి వధించుట నీతి యన్న న । ప్పలు కభిమానవంతుఁడగు, వానికి
మిక్కిలి సిగ్గొనర్చు ను । జ్జ్వలపరిపూర్ణ తేజుఁడయి, భాసిలు నప్పుడు
గాక చంద్రునిన్ । జలమునఁ బట్ట వచ్చునె ని,సర్గరిపుండగు రాహు
వుద్ధతిన్॥ ౧౬౫ ॥ (శా) సామర్థ్యంబున మాఱు లేని బల మ,న్యం
బవ్విధి న్నీతివి । ద్యామర్యాద నెఱింగి పోవు బల మ,న్యం బిట్లు నీ
రెంటికి । స్నేమం బేపఱడ భూరితేజమునకు, న్జీఁకట్లకుం బోలె బ ।
ల్వామానాధి కరణ్య మెట్లు గలుగున్, జర్చింప లోకంబునన్ ॥
౧౬౬ ॥ (గీ) చేదిదేశంబులు మదీయ,సింధుఘటల । చేతవాహనీ

భూత భూ,జాతము లగు । నంత దాఁక నింద్రప్రస్థ,యాన మీవు ।
సేయ వలవదు నామాట, చెవిని బెట్టి॥ ౧౬౭॥ (క) అసమున ని
రుద్ధవివిధ । ప్రసారసారంబు లగుచు, బహు యదుబలము । ల్వైస
గోవులు వ్రజముం బలెఁ । గసి యొసఁగఁగ నడ్డగింపఁ, గల వరిపు
రమున్॥ ౧౬౮ ॥ (గీ) కౌరవుఁడు జన్న మొనరించుఁ, గాక రవి
త । పించుఁ గాకేలుఁ గాక యా,వృషుఁడు దివము । పొసఁగనీవా
జి రిపునిఁ జం,పుదువు గాక । స్వార్థలిప్సులు గారొకో, సర్వజను
లు॥ ౧౬౯॥ (క) అరికంఠచ్ఛేదోచ్ఛల । దురురక్త నిషిక్తసాధ,నో
త్కరములు భా । స్కరకరసంపర్కతటి । ద్వరకాంతిని బొందుఁ
గాక, తతరణభూమిన్॥ ౧౭౦ ॥ (వ) ఇట్లు బలభద్రుండు సంరం
భవిజృంభితుండై పలికిన నప్పుడు చిత్రలిఖితదేవతలు సభాసదన కు
డ్యప్రతిధ్వనివ్యాజంబున భయంబువలన సంకర్షణోక్తవచనంబె లె
స్సగుచున్న దని యనువదించి నట్లుండె నంత॥ (క) బలభద్రుని వచ
నము విని । జలజాక్షుఁడు కృష్ణుఁ డపుడు, సమ్మతి తోడన్ । బలు
కుటకై యుద్ధవునకు । నలయక కనుసన్నచేత,నవసర మొసఁగెన్ ॥
౧౭౧॥ (క) హరి మోముఁ జూచి యుద్ధవుఁ । డరుదుగ సురగు
రుఁడు పోలె, నతిశయయుక్తిన్ । గురువినయంబునఁ బలికెను । బ
రమార్థం బర్థగౌర,వం బగు సూక్తిన్॥ ౧౭౨ ॥ (గీ) అనఘ
సకలార్థ మీప్రలం,బారిచేత । నుక్త మయ్యెఁ గ్రమ్మఱఁ జెప్ప,టు
చిత మగునె । పత్రమంచె సర్వార్థంబుఁ, బలుకుచుండ । వ్యర్థ
మగుఁ గాదె క్రమ్మఱ, వాచకంబు॥ ౧౭౩ ॥ (క) ఐనను గురువితఁ
డని నా । పై నెఱపిన నీదు గౌర,వం బది చెప్పం । బూనిన నను
వాచాలుం । గా నొనరించెడు విశేష,కార్యము దెలుపన్॥ ౧౭౪॥
(గీ) అక్షరంబులలో మాతృ,కాక్షరముల । చేత సప్తస్వరంబుల,
చేత మిగుల । గ్రథితమగు శబ్దవితతికి, గానమునకుఁ । బోలె నత్యం

తవైచిత్రి, గలిగి యుండు॥ ౧౭౫॥ (గీ) స్వేచ్ఛచేత ననంగతం,బెంతయును య । థేష్టముగఁ బెక్కు తెఱఁగుల, నీరితి మగు । బంధురానుజ్ఞి తార్థకసం,బంధమగు త । త్ప్రబంధంబు భువి దురు,ద్ధారంబు॥ ౧౭౬ ॥ (గీ) అనఘచారిత్ర కడు మృదు,వయ్యు నతిఘనం బనల్పకగుణకల్ప,నంబు చిత్ర । మైన వచనంబు నొగిఁ బట్టి,నట్లు కుశలు । రుర్విలో విస్తరింపఁ జే,యుదు రధీశ ॥ ౧౭౭ ॥ (గీ) అంబుజాక్ష సర్వజ్ఞుండ,వైన నీదు । మ్రోల నీతిశాస్త్రము చెప్పఁ,బూను పెల్ల । నరయ నభ్యస్తశాస్త్రదా,ర్థ్యంబు నందు । హేతువైన సమామ్నాయ, మిది నిజంబు॥ ౧౭౮ ॥ (సీ) ఉర్విలో మంత్రశ,క్త్యుత్సాహశక్తులు పెంపు గోరెడు నట్టి, విజయశీలి । ప్రభుశక్తి కరయ మూ,లం బగుఁ గావునఁ బ్రీతి నారెంటినా,ర్జించు టకును । నరపతి మిగుల య,త్నము సేయఁ దగు నయ మొప్ప నేధీరులు, సోపధాన । సుస్థిరతరబుద్ధి, సొరిది ఖట్వమునుగాఁ దెలియుదు రమ్మహా,ధీరవర్య॥ (గీ) లట్టి ధీఖట్వమం దొగి, ననవరతము । తప్పకనిషణ్ణు లగుచు నొ,కప్పుడైన । ఖేద మెఱుఁగక సుఖయింతు,రాదరమున । వారి కఖిలార్థములును జే,కూఱు ననఘ॥ ౧౭౯ ॥ (క) శితమతులు శరము క్రియ వి । శ్రుతముగ సూక్ష్మముగఁ దాఁకి,లోపల నేఁచున్ । క్షితి మందబుద్ధులుపలా । కృతిఁ గడు స్థూలముగ సోఁకి, మొసఁగు వెలుపలన్॥ ౧౮౦ ॥ (గీ) అజ్ఞు లల్పకార్య, మారంభ మొనరించి । వ్యగ్రు లగుచుఁ బార,మంద లేరు । ప్రాజ్ఞు లధికకార్య,పరులయిమిగుల న । వ్యగ్రు లగుచుఁ బార, మందఁ గలరు॥ ౧౮౧॥ (వ) మఱియు నిద్రాళుండగు మృగయుం డాత్మగుప్తి స్థానంబైన గర్తంబున నుండియు మృగంబుల వధింపం జాలని చందంబున నుపాయంబునఁ గార్యకరణోద్యుక్తుం డయ్యును బ్రమాదంబు నొందిన వాని యర్థంబు నశించు నర్యమాదిద్వాదశాదిత్యులయందు దినక



రుం డె ట్లుత్సాహంబు విడువఁ డట్లరియు మిత్రుండు నరిమిత్రుండును మిత్రామిత్రుండు నరిమిత్రమిత్రుండు నీయేవురు విజిగీషుని మ్రోల నుండు రాజులు పార్ష్ణిగ్రాహుండు నాక్రందుండును బార్ష్ణిగ్రాహాసారుండును నాక్రందాసారుండు నీనల్వురు పశ్చాద్భాగంబున నుండు రాజులు విజిగీషుండు దశముండు మధ్యముండును దాసీనుండు నీయిరువురు పార్శ్వవర్తిరాజు లిట్లు గూడిన ద్వాదశరాజాత్మకమండలంబునందు దశముండైన విజిగీషుం డొక్కండుత్సాహంబు ప్రభుశక్తిమూలం బగుటం జేసి దాని విడువండు ॥ (మ) అరుదార న్మన మంత్రగుప్తికవచుం, డత్యంతరాజ్యాంగఘా । స్వరగాత్రుండును బుద్ధిశస్త్రుఁడు లస,చ్చారేక్షణుండు న్సమ । గ్రరసోదంచిత దూతవక్త్రుఁ డగుచు, న్రాజిల్లు నేమేదినీ । వరుఁ డాతండె సుఖాత్మకుం డధికసం,పల్లాభయుక్తుం డిలన్॥ ౧౮౨॥ (సీ) పొసఁగ శృంగారాది,రసములు మఱియు ని ర్వేదాదిభావంబు,లాదరమున । నెఱిఁగిన సత్కవి, కెలమి సమాసబాహుళ్యాదికముచేత, నొప్పు నొక్క । ప్రౌఢప్రబంధం బె, బహుముఖ్య మనియును బటుసుకుమారప్ర,బంధ మొకటె । నెఱిఁ గేవలం బని, నియమంబు లేక తా వలసినట్లుగఁ జెప్పు, వచ్చినట్లు॥ (గీ) కాలవిదుఁడైన నృపతికి, క్షాత్ర మొండె । మఱియు క్షమ యొండె నాశ్రయిం,పంగ వలయు । ననెడు నియమంబు లేదు కా,లానుగుణ్య । ముగ నుపాదేయములు రెండు, పురుషవర్య॥ ౧౮౩ ॥ (గీ) అకృతాపరాధుఁ,డయ్యు నంతర్గ్రాధ । బహువికారుఁ డగుట, మహి నసాధ్యుఁ । డగుచు గదము మాడ్కి, నవసరం బాసన్న । మైనఁ గోపమూను,నంబుజాక్ష॥ ౧౮౪॥ (క) మృదువస్తువ్యవహితమగు । పృథు తేజం బర్థమనుభ,వించుట కగు దీ । పదహనుఁ డంతర్దశచే । విదితంబుగఁ దైల మనుభ,వించెనొ లేదో॥ ౧౮౫ ॥ (క) విను సత్కవి శబ్దార్థ

ము । లును బోలె నభిజ్ఞుఁడెవ్వుడు, లోపల దైవం । బును బౌరుష
మును రెంటిని । ననువందఁగ నాశ్రయించు, నమ్మై ర్యవేళన్ ॥౧౭౬॥
(వ) మహాత్మా శృంగారాదిరససిద్ధి కొఱకు రతిహాసశోకక్రోధో
త్సాహభయజుగుప్సావిస్మయశమ సంజ్ఞికంబులైన స్థాయిభావంబుల
లో నొక్క స్థాయిభావరూపప్రయోజనంబునం దనేకనిర్వేదాదిసం
చారిభావంబు లెట్లు ప్రవర్తించు నట్లు సుస్థిరుండును విజిగీషుండు నై
న యొక్క నాయకుని యర్థంబునం దనేకరాజులు ప్రవర్తింతు రది
యునుం గాక॥ (గీ) పృథివిలోనఁ దన్మాత్రవాప,విదుఁడు యోగ్య।
కలన వనిశంబు మండలా,క్రమణ మర్థిఁ । జేయు నట్టి నరేంద్రుని,చే
త రిపులు । ఫణుల క్రియ నిగ్రహింపంగఁ, బడుదు రనఘ॥ ౧౭౭॥
(గీ) మన్త్రిశక్తి బృహస్మాల,మహితభూరి । రాజితోత్సాహనగ
ము క,రప్రచేయ । పృథుతరప్రభుశక్తిని, బెంపు మీఱ । సతతము
ఫలింపఁ జేయును, జలజనేత్ర॥ ౧౭౮॥ (సీ) అధిప యనల్పత్వ, మ
గుటఁ బ్రధానత్వమున నంశమునకు స్థాం,పొనర నితర । షడ్జాదికస్వ
ర,సంఘంబు కైవడి విజిగీషుఁడగు నర,విభున కన్య । మధ్య మండల
వర్తి,మనుజేంద్రు లందఱు పొందుగా శేషత్వ, మొంది యుందు । ర
త్యనారభమాణుఁ, డైనను విభునకుఁబరులచే నట్లు సం,పాదితంబు॥
(గీ) లైన యర్థంబు లన్నియు,ననవరతము । పరఁగ నాకాశమునకు
శ,బ్దంబుఁ బోలె । మిక్కిలి గుణత్వమును బొంది, నిక్కవముగఁ । జా
ల వర్తించు యదుకుల,సార్వభౌమ॥ ౧౭౯॥ (గీ) ఒనర నేకార్థజాతం
తుసం,స్యూతమైన ' యట్టి యాతవ్యపార్ష్ణిగ్ర,హాదిముఖ్య । మాల
యం దధికద్యుతిఁ, [illegible]లు. నాయ । కుండు నాయకమణి లీల, నుండు
నధిప॥ ౧౮౦ ॥ (గీ) శక్త్యుపేతుఁ డగుచు, షాడ్గుణ్యసిద్ధర । సా
యనంబు నర్థి, ననుభవించు । నట్టి మనుజవిభుని, యంగంబు లెం
తయు । స్థైర్య మొందు బలయు,తంబు లగుచు॥ ౧౮౧॥ (వ) దే



వా శక్యవిషయంబునందు క్షమావంతులైన యంగవంతులకు శక్తిచేత
వ్యాయామంబునందు వృద్ధి యగు [illegible]క్త్యతిక్రమణంబున వ్యాయామం
బత్యంతహానికిం గారణం బగుం గావునఁ జైద్యాస్కందనం బశ్రేయ
స్కరంబై యుండు నేచైద్యుం డుదాత్తుండగుచు నుదాత్తస్వరంబు
స్వరితాదిస్వరంబులం బోలె శత్రువుల నేకపదంబునందు నీచులం గా
వించు నట్టి వాని నవమానింపఁ దగ దదియునుం గాక॥ (గీ) చెలఁగి
యేకాకియైన యా,చేదివిభుఁడు । కలన భేత్తవ్యుఁ డని మీరు, దలఁ
ప వలదు । రోగసముదాయమగు క్షయ,రోగ మట్లు । రాజసముదా
యమగు వాఁడు, రమ్యచరిత॥ ౧౮౨ ॥ (గీ) పరఁగ నార్జితఫలుఁడు
స,పక్షుఁ డఖిల । పరవిదారణుఁడైన యా, బాణుఁడు గుణ । కలి
తుఁ డగువానిచేఁ గార్ము,కంబుచేతఁ । బోలె సంధానితుం డయ్యెఁ,
బురుషవర్య॥ ౧౮౩ ॥ (క) విను చేదిపకృతభేదము । తనువైనను
నీపయి న్గృ,త ద్వేషుల దు । ర్జనబాణాదులశిఖియే । ఱిన సమిధ
లఁ బోలెఁ బ్రజ్వ,లింపఁగఁ జేయున్॥ ౧౮౪ ॥ (గీ) అరయఁగఁడు
క్షుద్రుఁడైన మ,హాసహాయుఁ । డగుచుఁ గార్యపారంగతుఁ,డై వె
లుంగు । శైలతటిని మహాపగా,సహిత యగుచు । నాపగానాథుఁ
బొంది న,ట్లనఘచరిత॥ ౧౮౫ ॥ (వ) మఱియుఁ గాలయవనసాల్వ
రుక్మిప్రభృతిరాజులు తమస్స్వభావు లగుటం జేసి తిమిరంబు రజనీము
ఖంబునుం బోలెఁ బ్రకృష్టదోషుండగు శిశుపాలు ననుసరించి వత్తురు॥
(గీ) భవదమిత్రు లెవ్వ, రవనిలోఁ దన్మిత్రు । లెవ్వ రట్టి నృపతు,
లెల్ల వాని । వేగఁ గూడికొంద్రు, విపరీతులగు వారు । నిన్నుఁ
గూడికొంద్రు, నిక్కవముగ॥ ౧౮౬ ॥ (ఉ) మీ రిపు డర్థిఁ జేదిప
తి, మీఁదికిఁ బోయితి రేని యాజికి । న్ద్వారక ధాత్రిలో నుభయ,ప
క్షనృపాలురు గూడి కొందు రే । పారఁగ నందున న్బెలుచ, నధ్వ
రవిఘ్నము గల్గుఁగాననీ । వారయ ధర్మపుత్రునకు,నగ్ర విపక్షుఁడ

వయ్యె దెంతయుఁ॥ ౧౯౭ ॥ (సీ) బాంధవుఁడైన యా,పాండవుం
డతిభరక్షమఘనస్కంధుని, సఖుని నిన్ను । బాసటగాఁగొని, బహు
యాగభారంబు నిర్వహించుటకుఁ దా, నేర్పరి యగు । నరయ గం
గాదిమ,హానదు ల్నవతులౌ సెలయేఱులను వార్ధిఁ, గలిపి నట్లు । ప
రఁగమహాత్ములు, భజమాను లరులైన ననుకంప వారిఁ జే,కొని భరిం
తు॥ (గీ) రధికబలునకు నైన ఘో,రారులందుఁ । దగ బలాత్కార
దండంబు, తడవువలయు । సిద్ధి కగు విమనీకృతా, శేషమిత్ర । స
మితి ఛందానువృత్తి దు,స్సాధ్య మెందు॥ ౧౯౮ ॥ (క) అరివధమూ
వేల్పు లకుఁ బ్రియ । క్రూర మని తలఁచెదరొ మీరు, క్రతుభోక్తలు ని ।
ర్జరు లటు గావున వారికి । నరివధమున కన్న నిష్ట, మగు మఖ మ
నఘా॥ ౧౯౯ ॥ (గీ) అమృత మనఁగ యాజకులు త్రే,తాగ్నులందు।
విధియుతంబుగ నెయ్యది, వేల్తు రదియె । మందరక్షుబ్ధమథితాబ్ధి,యం
దుఁ బొడమె । ననుటయది కీర్తిమాత్రంబె,యాదువరేణ్య ॥ ౨౦౦ ॥
(గీ) రమణ నీనందనుని యప,రాధశతము । నటు సహించెద నను
చు మీ,రధికపూజ్య । యగు పితృష్వసతోడ ము,న్నన్ననూట । త
లఁపు మది తప్పి నడిచినఁ, గలుష మొదవు॥ ౨౦౧ ॥ (సీ) సురవర
వినుత,స,త్పురుషుని బుద్ధియు వ్యాపారమును జి,త్త,మనవరతము । మి
క్కిలి నిశితమై, మిగులఁ దేజోవంతమై యభిమానోష్ణ,మై తనచుఁ ।
వైనను దీక్ష్ణశ,స్త్రాకృతిఁ బరమర్మభేదిని గాదు ప్ర,స్ఫీత పంచ । వ
దనంబు కైవడిఁ,బరహింస్రకము గాదు దహనునిమాడ్కి సం,తాపి
గాదు॥ (గీ) వాగ్మియగు సత్యసంధుని, వచన మేక । రూపమున
నుండుఁ గాని వై,రూప్య మొంద । దీవు పైతృష్వ సేయుపై, నెత్తి
పోవ । వలదు చనితేని దోసంబు, వచ్చు నీకు॥ ౨౦౨ ॥ (వ) దేవా
పట్టపుగలింటికి సూర్యుండునుం బోలె స్వయంకృత ప్రసాదుండగు చై
ద్యుని వధంబు కొఱకు నియతకాలావసానంబు నొందక నీవైనను స



మర్థుండవు గావు కృత్యవిదులైన గూఢచారులు తీర్థంబులయందం
తఃపదంబు గావించి మహాశత్రుజ[illegible]ంబు నెఱుంగుదురు గాక మఱి
యు ననుత్సూత్రపదన్యాసయు సువృత్తియు సన్నిబంధనయు నయ్యు
రాజవృత్తి యపస్పశమై శబ్దవిద్య కరణి శోభింపదు చార ప్రేషణం
బావశ్యకంబు తద్రహితుండైన మహీపతి యంధప్రాయుం డగు నది
యునుం గాక॥ (సీ) అజ్ఞాతనిజమర్ము, లహితమర్మజ్ఞు లుభయవే
తనులునభి,వ్యక్తభూరి । శాసనులగు నట్టి, చారులచే శత్రుసామవా
య్యకు లట్లు, సంతతంబు । పలుమఱుదూషింపఁ, బడి భేద్యు లగుదుర్గు
పాయకోవిదులైన, ప్రణిధు లరిగి । యేకార్థులైన మ,హీశుల నెల్ల
నింద్రప్రస్థమున కధ్వ,రంబుఁ జూడ॥ (గీ) వరుసఁ బయనంబు సేయించు,
వారుగాఁగ । నటు నియోగించి పంపుమ,ట్లయిన నంచె । బంధుమ
ఖదర్శనంబును, వైరివధము । పొసఁగ రెండును సిద్ధించుఁ, బుణ్యచ
రిత ॥ ౨౦౩ ॥ (చ) నెనరున ధర్మనందనుఁడు, నీపయి మిక్కిలి భ
క్తి సేయుఁ ద । క్కిన రిపురాజులందఱును, గేవలమత్సరు లౌటవానిఁ
గ । న్గొని మదినోర్వఁ జాలక య,కుంఠితవైర మొనర్తు రందునన్ ।
మునుకొని వారికిన్మనక,మోఘమహాకలహంబు గల్గెడిన్॥ ౨౦౪॥ (చ)
వదలక సంతతంబు శిశు,పాలునిఁ గూడివసించి యున్న భూ । మిదయి
తులం దభిజ్ఞులగు, మేటినరేంద్రులు గొంద ఱచ్చటన్ । జెదరి ప్రియంబు
తోమనలఁ, జేరఁగఁ జయ్యన నేగుదెంతు రిం । పొదవఁగఁ గాకమధ్య
మున, నుండి పికంబులు వోలె మాధవా ॥ ౨౦౫ ॥ (చ) జలరుహ
లోచనా సహజ, చాపలదోషసముద్ధతంబు ని । స్తులమదయుక్తముం
జలిత,దుర్లభపక్షపరిగ్రహంబునై । తలకొని నీదు శత్రుసము,దాయ
ము తావకభూరివిక్రమ। జ్వలనమునం దుదగ్రశల,భత్వము నొందెడుఁ
గాక కేశవా॥ ౨౦౬ ॥ (వ) అని యిట్లుద్ధవుండు పలికిన వివేచి
తార్థం[illegible]బును ననుగతనయమార్గంబును దుర్ణయాగర్ళంబును జనితస

మ్మోదంబును సమున్నతవక్షస్స్థలనియతనిషణ్ణలక్ష్మీప్రశ్రుతంబు నగు తదీయవాక్యం బాలకించి కృష్ణండు [illegible]ంబున నాసనంబు డిగ్గి॥ (మ) అతులశ్రీదదిగద్వము న్విడిచి య,య్యాగస్త్యదిగ్భాగముం । జతురత్వంబునం జేరం బూనిన సరో,జస్వామి చందంబునన్ । గతయుద్ధాభినివేశసౌమ్యుం డగుచున్, గంజాతపత్రాక్షుం డా । తతభంగిన్మది నిశ్చయించె వెస నిం,ద్రప్రస్థయానం బొగిన్॥ ౨౦౭ ॥ (ఉ) సర్వజగత్ప్రపూజ్యుఁడగు, సారసనేత్రుని మౌళిపై బృహ । త్పార్వణచంద్రతుల్యమయి,భాసిలు ఛత్రము పొల్చె నందున । న్సర్వ జగత్పవిత్రకర,సంభృత పాదముల న్స్పృశింపఁగా । సర్వజగత్ప్రకాశుఁడగు, సారసమిత్రుఁడు చాలఁ డెంతయున్ ॥ ౨౦౮ ॥ (చ) అరయ మృణాలసూత్రసదృ,శాచ్ఛచలత్పృథు చామరద్వయీం । తరగతుఁడై మహేంద్రమణి, ధాముఁడు చారు సమస్త సద్గుణో । త్తరుఁ డగు యాదవేంద్రుఁ డభి,తః పరిపాతుకసిద్ధసింధువా । శరధి యభూత పూర్వ విల,సత్పృథు కాంతి వహించె న త్తఱిన్ ॥ ౨౦౯ ॥ (మ) అతుల శ్రీయదువర్య మౌళిగత నా,నా నఘ భాస్వన్మణీ । వితతానూనవిచిత్రదీధితులచే,విఖ్యాతనానావిధాం । చితధాతుచ్ఛురితాశ్మరశ్మియగుచుం, జెల్వొందు రంజత్కరో । ద్ధృతగోవర్ధనపర్వతం బనుకృతం, బయ్యె న్సమగ్రంబుగన్ ॥ ౨౧౦ ॥ (మ) విలసత్కాంచన కుండలాగ్రఘటిత,స్ఫీతోరు గారుత్మతో । పలచంచత్కమనీయదీధితులచేఁ, బద్మావరుండాతతో । జ్జ్వలబాల్యోచితనీలకంధరదల,ద్బర్హావచూడాంచితా । కలన న్దాల్చిన భంగి నొప్పెసఁగ వే,డ్కన్ బౌరు లీక్షింపఁగన్॥ ౨౧౧ ॥ (మ) అలర న్మందర కూటకోటినికర,వ్యాఘట్టనోత్తేజనా । కలితస్ఫీత విశాల నిర్మలమణీ, కాండోరుకాంతిచ్ఛటో । జ్జ్వలరంజత్కనకాంగదంబులు జగ,ద్వంద్యు న్విభావల్లభున్ । జలజాతాక్షు నలంకరించె జనము,ల్సంతోషముం



జెందఁగన్॥ ౨౧౨ ॥ (మ) కమలాక్షుండు నిసర్గరక్తవలయా,గ్రస్యూతమాణిక్యర । త్నమరీచిచ్ఛురితంబు లౌట నను వొం,ద న్నేఁటికిన్ దైత్యవ । ర్యమహోరస్స్థలభేదనోత్థపటుర,క్తార్ద్రంబులై యున్న చం । దమున న్బొల్చు లసన్నఖాగ్రముల చే,తం జూడ నొప్పెన్రహిన్॥ ౨౧౩ ॥ (మ) అతులోదగ్రతమాలనీలము సమ,గ్రాముక్తముక్తావళీ । లతమై యొప్పు మురారివక్షము విశా,లస్ఫూర్తిచే మింట నం । చితగీర్వాణనదీప్రవాహయుగముం, జెల్వొంద వేఁ ద్వే● నా । యతలీలం బ్రవహించె నేని సరి సే,య న్వచ్చు నమ్మింటితోన్॥ ౧౨౪ ॥ (మ) అనిశం బేమణియందు బింబగతబా,హ్యస్థప్రపంచంబు త । ద్ఘనదేహంబున నిర్మలత్వమున సా,క్షాద్భాతకుక్షిస్థలో । కనికాయంబనఁ జూడ నయ్యెను దదు,గ్రక్షీరధిక్షీరసా । రనితాంతద్యుతిదీపితాశమణిసా,రం బొప్పె వక్షంబునన్ ॥ ౨౧౫ ॥ (మ) అకలంకాప్రపదీనచారుకటిసూ,త్రాలంబిదంతావళే । క్షుకశుక్త్యుద్భవమౌక్తికావళి తదం,గుష్ఠాగ్రనిష్ఠ్యూతభ । వ్యకరోర్ధ్వప్రసృతోన్నతాచ్ఛతరగీ,ర్వాణాపగాసంతతో । దకసంపాతము కైవడిం జెలఁగ న్సు,వ్యక్తకాంతి శోభిల్లఁగన్ ॥ ౨౧౬ ॥ (ఉ) చారుతరేంద్రనీలమణి,సన్నిభవర్ణతనుండు శౌరి క । ర్బూరపిశంగవాసుఁ డగు,చుం బరికింపఁగ నయ్యె వాయుసం । చారవిసృత్వరాంబురుహ,సాంద్రవిశాలరజోవిచిత్రదు । ర్వారకళిందజాసలిల,ధారము చాడ్పున నద్భుతంబుగన్॥ ౨౧౭ ॥ (చ) పరఁగఁ బ్రసాధితుండయిన, పద్మదళాక్షున కన్యలక్ష్మి భా । సురగతి నయ్యె నన్న యది, చూడఁగ యుక్త మనన్యకాంతమై । యరుదుగ నిత్యలక్ష్మి హృద,యంబున నిల్చెన శేషకాంతమై । సరసత మేన నంతటఁ బ్ర,సాధనలక్ష్మి వసించెఁ గావునన్॥ ౨౧౮ ॥ (గీ) ఘనకవాటవిశాలవ,క్షస్థలముఁడు

హరికి సమ్మోదితాశేష,నరయు సర్వ । గాత్రసంగిని యగుట వి,చి
త్రభంగి । నయ్యలంకారరమ చాల, నధిక యయ్యె॥ ౨౧౯ ॥ (గీ)
కమ్రతరభూషణత్వభృ,త్కనకకశిపు । పాణ్రిహారిలసన్నఖ, వ్రణప్రి
కాశ । కఠినతాగుణవత్కోజ,కలితలైన । వెలఁదు లయ్యాదవేంద్రు
సే,వించి రపుడు॥ ౨౨౦ ॥ (గీ) పరఁగ నత్యున్నతత్వంబు, వలన
మీఁది । కొనర నాకృష్టమైన య,ట్లున్న యువతి । మహితకుచభా
రమునఁ బీడ్య,మాన మగుచు । నతికృశంబైన నడుము న్న,మ్రితవహిం
చె॥ ౨౨౧ ॥ (శా) ఏయే కామిని వంకఁ గన్గొనియె శ్రీ,కృష్ణుండు
సంప్రీతితో । నాయాకామిని మోము వాంచె ఘనల,జ్జాలోల దృక్ప
ద్మయై । యేయే కాంతల వంకఁ జూడఁడపు డా,హేలావతు ల్సం
భృతా । సూయ స్వేఁ బ్రహరించి రయ్యదుపతి, న్సంభత్కటాక్షం
బులన్ ॥ ౨౨౨ ॥ (మ) అతసీసూన సమానకాంతియగు కం,సా
రాతి రమ్యైకహ । స్తతలం బొప్పెఁ బరిభ్రమత్కిరణసం,చారోరు
చక్రంబుచే । నతులప్రస్ఫురితభ్రమత్పృథుతరై, కావర్తమా యా
మునా । యతతోయాఘము మాడ్కి యాచకజనో,ద్యత్కల్ప భూ
జాతమై ॥ ౨౨౩ ॥ (చ) విమతనృపాలవిగ్రహవి,భేదనదక్ష మనం
తసత్వము । న్సముదితతేజము న్సతత, సన్నిహితంబు నమోఘమైన
యు । త్తమగద మూర్తమైన సము, దంచితశక్తియుఁ బోలె శౌరి
చి త్తమునకు సమ్మదం బెసఁగఁ, దప్పక వేఁ బొడసూపె నత్తఱిన్॥
౨౨౪ ॥ (సీ) తలఁప ననన్యసా,ధారణత్వంబును బొందిన దయ్యు
నే,నందకంబు । గజహయరథముల, గతి నసాధారణస్వత్వంబుచేత
నే,చక్రపాణి । సంబంధిగా దది,సతతంబు పగతుర కుద్వేగకారియై,
యుంటఁ జేసి । చంద్రుని కైవడిఁ,జర్చింప శౌరికే యన్వర్థ నామమై,
యలరె నపుడు॥ (గీ) హితవిబుద్ధమంద్రాంబుద,హృద్యనాద । మచ్యు



తార్ణవాభ్యర్ణచ,రైకహంస । మలసవాతప్రపూరణో,ద్యన్నినాద ।
ధారియగు పాంచజన్యాఖ్య,దరము దోఁచె॥ ౨౨౫ ॥ (గీ) అరయ
నన్యునిచేత నా,కర్షణీయ । మగుచు నెవ్వరు నెక్కఁ బొందక క్రియయందు, శ్రుతి
సమీప । కలితగుణమై విధేయమై, యలరునట్టి । శార్ఙ్గము స
మీపగత మయ్యె, సఖుని కరణి ॥ ౨౨౬ ॥ (వ) ఇట్లు సర్వా
లంకార శోభితుండును సర్వాయుధపరిష్కృతుండును నై ॥ (ఉ)
ఆదర మొప్పఁ గృష్ణుఁడు ర, యంబున సంతత మిష్టసిద్ధిసం । పా
దకము న్మనోజ్ఞము స, మస్తదిగప్రతిషిద్ధమార్గమై । భూధరలీలనా
ప్పెసఁగు, పుష్యరథం బవలీల నెక్కె నా । హ్లాద మెలర్పఁ బుష్య
రథుఁ,డైన శశాంకు క్రియ న్వెలుంగుచున్॥ ౨౨౭ ॥ (చ) హరిర
థకేతనాగ్రఘటి,తాంబరధాముఁడు పన్నగారి భా । స్వరతరరత్న
సంఘటిత,చారుమహీప్రతిబింబితాంగుఁడై । తిరముగ నాశుగాశన
త,తి న్వెలపింప రసాతలం బవా । ర్యరయమునం జొరం దలఁచి,
నట్లు గనుంగొనవయ్యె నయ్యెడన్ ॥ ౨౨౮ ॥ ( చ ) హరి యిటు
సంభ్రమంబునఁ బ్ర,యాణము సేయు తఱి న్మహామహీ । ధరవిలస
ద్గుహాదళన,దక్షబృహత్పటహస్వనంబు ల । బ్బరముగ వారిరాశిజ
ల,పూరము లన్యజలంబులం బలెం । బరువడి నన్యశబ్దముల, బాగు
గ మ్రింగి చెలంగె నెంతయున్॥ ౨౨౯ ॥ (వ) మఱియుఁ గుక్షిని
క్షిప్తాఖిలలోకుండైన వాసుదేవుఁ డేభాగంబునకుం జనియె నాభాగం
బున ధరణీధరుండైన శేషుండు మహాభారకుబ్జీభూతశిరస్సహస్రసహా
యకర్మత్వరమాణభుజంబులు గలుగు నట్లుగాఁ బ్రవర్తించెఁ బదంపడి
యత్యున్నతద్వార దారుసంగ భంగసాధ్యసావనమ్రీకృతకేతనంబులై
న యదుసైన్యంబులు నీతిమంతుండైన మహీపతిని సామాద్యుపాయ
ప్రయోగఫలంబులైన హిరణ్యభూమిత్రాదిలాభంబులుం బోలె సో

మాన్వయుం డైన కృష్ణుని వెనుకొని యరిగె నప్పుడు॥ (గీ) నీలలో
హితగజదాన,నీరమిళిత । బర్హిబర్హచూర్ణద్యుతి,భాస్వర్ణ ।
మహిపరాగంబు లానేమి,మగ్నరథవి । తానములచేతఁ బిండీకృ,తం
బు లయ్యె॥ ౨౩౦ ॥ (గీ) పాదహత మయ్యెఁ గనకభూ,పాంసు
తతి మ । హాజనశిరంబులను దాఁటి, దయ్యె మఱియు । నేవు మీఱ
నౌద్ధత్యంబుఁ, జూప దయ్యె । గరిమ కనురూప మగు నట్లు, గాఁజ
లించె॥ ౨౩౧ ॥ (సీ) హయములుభూరివ,ల్గాకర్షణంబుల నధిక
యత్నంబున, నపుడు సాది । లోకంబుచేత ని,రుధ్యమానము లయ్యె
సారెసారెకు నగ్ర,చరణములను । బరువడి నెత్తుచుఁ, జెరు వాఁగి
మెల్లనఁ జనుచున్న గురుమత్త,సామజముల । దాఁటి పోవఁగ,నిచ్చఁ
దలఁచిన కైవడి నతివేగమున నిల్వ,కరుగుచుండె॥ (గీ) నధికయత్నని
రుద్ధాశ్వ,మైన తురగి । గణముచేఁ జూడఁ బడుచు మా,ర్గంబునం
దుఁ । బాంసుసంక్రీడఁ గావించు, బాలకులను । గొనిచనిరి వేగ నింట్ల
కు,జనను లపుడు॥ ౨౩౨॥ (గీ) కృష్ణు నకలంకచిత్తు వీ,క్షించు వేడ్కఁ ।
బురజనులు వీధివీధికిఁ,బఱచి రపుడు । సారె కటు సంస్తవం బగు, జ
నము నైనఁ । గోరి సాంద్రతరప్రీతిఁ, గ్రొత్త సేయు॥ ౨౩౩॥ (చ) ప
రఁగ నభిజ్ఞుఁ డైన ముర,వైరి పురీవరదత్తనేత్రుఁ డై । వరుస నిరంతరో
గ్రయదు,వాహినిచేఁ గడు సంకటస్థితిన్ । బరఁగెడు రాజమార్గము
న, బాగుగ నేగెడు తచ్ఛతాంగసుం । దరతరమందమందగమ,నంబు
నెఱుంగక యుండె నత్తఱిన్ ॥ ౨౩౪ ॥ (చ) జలనిధిమధ్యదేశము
నఁ, జారుసువర్ణవిశాలసాలశో । భల సకలాశలం గపిశ,వర్ణయు
తంబులుగా నొనర్చుచు । న్చెలువుగ నప్పురం బలరెఁ, బుష్కరభేద
మొనర్చి మీఁది కు । జ్జ్వలగతి నిర్గమించిన ల,సద్బడబానలహేతి
కైవడిన్॥ ౨౩౫॥ (చ) అరుదుగ భూమిభృద్వరస,హస్రికృతాస్ప



దమై పయోధిపు । ష్కరపరివీతమూర్తియయి, కమ్రతరద్యుతిఁ బొ
ల్చె నమ్మహా । పురమును శౌరికి న్ముదము, పుట్టఁగఁ బద్మభవుండు
నేర్పుతో । నరయ ధరిత్రి కట్లు ప్రతి,యాతనగా రచియించె వేడు
కన్॥ ౨౩౬ ॥ (గీ) అరయఁ ద్వష్ట్ర నిరంతరా,భ్యాసలబ్ధ । శిల్ప
విద్యాసముత్కర్ష,సీమ మైన । యప్పురము దర్పణాచ్ఛతో,యధిజలం
బు । లందు స్వచ్ఛాయ గతిఁ జూడ, నయ్యె నపుడు॥ ౨౩౭ ॥ (గీ)
శరధిపిత భంగి వరుఁ డైన, శౌరి కొఱకు । నభినవప్రతిపాదిత,మైన
యంక । గతపురేందిర నలసదుప, కంఠమందుఁ । జారుతరరత్న
మాలిక, ల్సంఘటించె॥ ౨౩౮ ॥ (మ) చలదుత్తుంగపయోధిభంగ
చయచం,చత్పాండుశంఖచ్ఛటా । కులమై తత్పురి హేమరత్నవిల
స,త్కుడ్యాభ్రభిత్సాల ము । జ్జ్వలపర్యంతచరోడుచక్ర మగుచున్,
భాసిల్లు బర్హిర్ముఖా । చలవప్రంబు క్రియం జెలంగె నిజరు,క్సందీపి
తాశాంతమై॥ ౨౩౯ ॥ (మ) పొలుపొంద న్నగరీమహాపణములం,
బుంజీకృతానంతని । శ్చలశోభాయుతరత్నజాలములఁ జం,చత్ప్రీతితో
నిత్యము । న్గలయ న్వారి పథాగతాంబువుల నా,కర్షించి వారాశి
దా । నలు వొప్ప న్ఛవి నాఁటఁగోలెఁ బడసె, న్రత్నాకరఖ్యాతి
యున్॥ ౨౪౦ ॥ (గీ) సలిలవిస్రావిఫేనసం,ఛన్నకాంతి । నవ్య
రత్నంబులఁ బయోధి,నాథుఁ డాత । పమునఁ దడి యార్చుటకుఁ బో
లెఁ, బ్రత్యహంబు । తల్పములయందు భంగహ,స్తముల నెఱపె ॥
౨౪౧ ॥ (మ) అనిశంబు న్జలరాశి భంగినిచయం, బత్యున్నతత్వం
బుచేఁ । బనిగాఁ దత్పురిభూరిసాలము జయిం,పన్ దవ్వులం బుట్టి
బ । లిష్ఠునకన్ డాయఁగ వచ్చి తత్క్షణమె మో,ఘీభూతవాంఛార్థ
మై । ఘనలజ్జన్ దరి దాఁకి లీన మగు దీ,ర్ఘాసిద్ధులే గర్వితుల్॥౨౪౨॥
(మ) అనిశంబు న్నగరీప్రవేశజనిత,వ్యాసక్తిచేఁ బోలెఁ జ । య్యన

మేఘం బరుడెంచి తద్వారణకు,డ్యోద్ధత్యసంరుద్ధమై । ఘనగర్జార్తర
వంబు సల్పుచుఁ గడం,క న్బూరివర్షచ్ఛలం । బున శోకాశ్రులు నిం
చుచుఁ బఱచుఁ ద,త్పూర్వాహ్యదేశంబునన్ ॥ ౨౪౩ ॥ (చ) అల
యక తత్పురాంగనల, యాకృతులుం దమయాకృతు ల్సము । జ్జ్వల
గతి నొక్కటై యునికి, చాల సహింప కొకింత భేదముం । గలు
గఁగఁ జేయు మంచుఁ గడఁ,కన్ దను వేఁడిన ధాత సత్కృపన్ ।
గలుగఁగఁ జేసెఁ దన్నగరి, కాంతల కట్లు నిమేషచిహ్నముల్ ॥ ౨౪౪ ॥
(గీ) నిర్మలైందవకరజాల,నిహ్నుతాభ్రి । సంస్పృశత్స్ఫటికోప
ల,సౌధపఙ్క్తి । లెక్కి నిశలందు నవ్వీటి, యింతు లొప్పి । రభ్రి
గతనిర్జరస్త్రీల, యంద మొంది ॥ ౨౪౫ ॥ (ఉ) ఆతతచంద్రకాంత
మణి,హర్మ్యతలంబుల రాత్రివేళ వి । ఖ్యాతబృహత్పయఃపథని,కా
యము లెంతయు సంతతం బధః । పాతిలసన్మహాంబుధర,వర్గము
లయ్యును వారిపూరముల్ । స్ఫీతరుచి న్వహించు నల,వేసవి యందు
ను జిత్రవైఖరిన్ ॥ ౨౪౬ ॥ (చ) పురసతు లాత్మసద్మములఁ, బొల్పల
ర న్రతివేళ సిగ్గున । న్బరువడి దీపము ల్మలిపి, భవ్య గవాక్షపథాగ
తోజ్జ్వల । న్నిరుపమవాలవాయజమ,ణీమయభిత్తిగతౌతునేత్రభీ । కర
హరిణాంకదీధితులఁ, గన్గొని భీతి వహించి రెంతయున్ ॥ ౨౪౭ ॥
(చ) అలరు పురాధిరాజమును, నంచితభూరిమృదుత్వసంపద । ల్గలు
గుటఁ జేసి చిత్తరువు,వ్రాయ సమర్థులు గాక మోరిల రా । జిలు
బహునిర్మలత్వమునఁ, జిత్రకరు ల్ప్రతిబింబితాంగులై । కలయ సజీవ
చిత్రములు,గా నొనరించిరి రత్నభిత్తులన్ ॥ ౨౪౮ ॥ (మ) చతురత్వం
బునఁ దత్పురాంగనలు చం,చత్ప్రీతితో రాత్రులం । దతులప్రస్ఫురదో
షధీశకరజా,లాపహ్నుతస్ఫాటికో । న్నతసౌధాగ్రము లెక్కి మిక్కి
లి,వియ,న్మధ్యస్థలౌ దేవతా । సతులుం బోలె వెలుంగుచుందురు త



ను,చ్ఛాయ ల్విసాళింపఁగన్ ॥ ౨౪౯ ॥ (చ) అనుపమలీల నప్పురము, నం
దు నిశల్విలసన్నిశాకరా । శ్మనికరబద్ధభూములగు, సౌధములందుఁ బ్ర
ణాళిక ల్విసూ । తనరుచిఁ బొల్చి సంతత మ,ధఃకృతవారిద మండలం
బు ల । య్యును నవవారిధారల స,ముత్సుకత న్వహియించు నెప్పు
డున్ ॥ ౨౫౦ ॥ (మ) సతతంబు న్శశికాంతనిర్మిత గృహ,స్తంభంబు
లందు న్రిహిన్ । బ్రతిబింబించుటచే సవర్ణ లగుచు, న్భాసిల్లు తత్పట్ట
ణ । స్థితచంద్రాస్యల గండభాగములు చ,ర్చింపన్ స్మరా పాండు
రో । న్నతిసంలక్ష్యములై కనె న్మణిమయా, దర్శోప మానద్యుతిన్ ॥
౨౫౧ ॥ (చ) నలువుగ వైభవాధరిత,నాకపురంబగు నప్పురంబునన్ ।
లలితశుకాంగనీలమణి,రత్నవినిర్మితసద్మదేహళీ । విలసిత రత్నజాల
పరి,విద్ధలసత్ప్రఘణంబులం దొగిం । జెలువుగ ముగ్ధకామినులు, సే
యరు గోమయగోముఖంబులన్ ॥ ౨౫౨ ॥ (మ) అణిమాద్యష్ట మహా
విభూతిసహితం, బై యొప్పు నవ్వీటిలో । గణనాతీతమహాగృహం
బులు సమ,గ్రవ్యాప్తగోపానసీ । తుణకాలస్థితలంబమానశిఖిపిం,ఛశ్రే
ణిచేతన్మరి । న్మణిసచ్ఛాయతృణోరుస్రవములచే,తం బోలె నొప్పె న్రి
హిన్ ॥ ౨౫౩ ॥ (చ) లలితబృహత్తులంబు లతు,లంబులు చారువితాన
శోభితం । బులు నవితానముల్బహుస,మూహ్యవిచిత్రములున్నచిత్రము
ల్గలయ విశాలము ల్విమల,కాంతిసమంచిత భూరిశాలము । ల్జలనిధిరా
ట్సుతాభినవ,సద్మము లప్పురి రాజసద్మముల్ ॥ ౨౫౪ ॥ (ఉ) శ్రీలఁ జెలం
గు వీటిగృహ,సీమలయందుఁ గపోతపాళులన్ । జాలుగ నించి నట్టి వి
ల,సద్బహుకృత్రిమపత్రిపఙ్క్తులం । బోలఁగఁ జూచి తద్గ్రసన,బుద్ధిఁ
జలింపక పొంచి యున్న మా । ర్జాలములన్ జనంబులు ద,లంచిరి కృ
త్రిమమంచు నెమ్మదిన్ ॥ ౨౫౫ ॥ (గీ) అవనిగత లయ్యుఁ బురసతు,
లాననార । విందములచేత నేశశిఁ, గ్రిందుపఱచి । రహహ సమతీ

తఖపథంబు,లైన సౌధ । శృంగములను వ్యర్థంబుగ, నెక్క నేల ॥ ౨౪౬ ॥ (గీ) కాంతుతో రవ్యలని పతా, కలను బొంది ।. ప్రియ మునవివి క్తలని ర క్తి,వృద్ధిఁ జేసి । విలసితనమద్వళీక లై, యలరు వ లభు । లాశ్రయించిరి సవధూకులైన, యువులు ॥ ౨౪౭ ॥ (గీ) పరఁగ నప్రతియత్నపూ,ర్వకసుగంధి । తను భరించిన సతుల వ, క్త్ర ములు మధువు । ప్రియజనప్రీతి కొఱకుఁ బ్రా,ప్తించె వాస । నా ర్పణపరస్పరవ్యతి,హార మచట॥ ౨౪౮ ॥ (చ) అరుదుగ నప్పురీగృ హాము,లందు విశాలవిహార వేదికాం । తరగతమత్తవారణవి, టంకక లాయశుకాదిపక్షులుం । దఱుచుగఁ గామినీరతిక్వ,తస్వనము ల్దగ నాలకించి బం । ధురతరశిష్యవృత్తి వ,నోహరలీల వహించె నెం తయుఁ॥ ౨౪౯ ॥ (గీ) చాల విహితంబు లయ్యు స్ప,ష్టంబులైన। యువతి కుచమండలములందు, ధవళితాంబ । రములు నామంబు వ లన న,ర్థంబువలన । నవని నాకాశసామ్యంబు,నధిగమించె॥ ౨౫౦ ॥ (గీ) అరయ నత్యాయతము లజి,హ్మము లుపంక । ములు నసంత్య క్తభూరి సీ,మలు వినీత । సరణులు సురూప లయ్యుఁ బ్ర,స్ఖలనరహి త । జనముచే నీతములు గావు, సతత మచట॥ ౨౫౧ ॥ (సీ) అ ను వంద నప్పురం,బున నితరేతరస్పర్ధిపరార్థ్యరూ,పలగు సతులఁ । జెలువొప్ప సృజియించి, శ్రీనిర్మితప్రాప్తవజ్రకీటకృతైక, వర్ణవాచ్య । నిబిడమలంబును,నేర్పు మీఱఁగఁ బెద్ద గాలంబునకుధాత,గడిగికొనియెఁ। దలపోయ నెద్ది యం,తఃకరణంబుచే ననుదినం బభ్య స్త,ముయ్యె హానిఁ ॥ (గీ) గాంతు దీఱంగఁ గల్పవృ,క్షము లొసంగు । వరుస నవ్వీట వసి యించు, వారి వైభ । వంబు లవిమానసాగోచ,రంబు లనఁగ । ల లితగతి వాక్కులకుఁ జెప్ప,నలవి యగునె॥ ౨౫౨ ॥ (చ) సకలక ళాధురంధరుఁడు, సౌధవళక్షునిజప్రభాచ్ఛటా । వికసితదిఙ్ముఖుండు



నతి,విశ్రుతకీర్తియు రోహిణీకుమా । రకుఁడగు రాముఁ డాపురవ, రంబును బాయఁ దలంపఁ డాగతిన్ । బ్రకటముగాఁగఁ దాను విడు, వం దలపోయఁడు రోహిణీశుఁడున్॥ ౨౫౩ ॥ (గీ) బాణకర్ణనిర్జి తేశుఁడై, పరఁగు చక్ర । పాణికి సుతత్వ మొందుట,వలన దేహ । ధారియై చైత్రశరములు, దాల్చి భీతి । వదలి మన్మథుఁ డప్పురిఁ,బా య కుండు॥ ౨౫౪ ॥ (గీ) శివమరుత్సేవ్యుఁడగు హరి,చేని షేవ్య । మాణయై దీప్తమణిజాల, మహితమైన । జలధిలో నుండి సురశైల, సంస్థితామ । రావతి నసూయఁ బిల్చు నా,రాజధాని ॥ ౨౫౫ ॥ (గీ) కలితమృద్వంజనశ్యామ, కాంతియును సు । వృత్తుఁడు త్రిలోక తిలకమూ, విధుఁడు తిలక । మట్ల యహతవర్ణద్యుతి,యైన పురికిఁ। జె లువకును బోలె రుచి వి,శేషింపఁ జేసె॥ ౨౫౬॥ (వ) ఇట్లనంతవైభవా భిరామమైన యమ్మహారాజధాని నవలోకింపుచు నఖండ తేజోమండల మండితుండైన పుండరీకలోచనుండు వజ్రప్రభోద్భాసిసురాయుధలక్ష్మి యగు దేవసేనయుం బోలెఁ బరులచేత దుర్ధర్షమైనప్రతోళి నాశ్ర యించి పూర్వాభిముఖంబుగా మెల్లనం జనియె నప్పుడు ॥ (గీ) పరఁ గ హరిదేహమున నుండి, ప్రజలు వోలె। శివుని శిరమున నుండి యం,బు వులు వోలె । ధాతముఖమున నుండి వే,దములు వోలె । నప్పురం బున నుండి సై,న్యములు వెడలె॥ ౨౫౭ ॥ (సీ) అన్యోన్యచారుము, ఖాగ్రసంగస్ఖలద్ఘనఖలీనంబులు, గలుగు నట్లు । శిష్యద్విలోలాశ్వ, శే ఖరంబులచేత సంపీడితాన్యోన్య,జాను లగుచు । వరుసగాఁ బెక్కం డ్రు, వాజీంద్రవారకుల్ హరి వెనకఁ బ్రీతితో, నరిగి రపుడు । తమ ముచేఁ బోలెఁ ద,త్పథము జనంబుచే నత్యంత సంకటం, బగుటవలన॥ (గీ) మిగుల దూరంబు సంత్యక్త, మగుచు నుండఁ । జెలఁగి మత్తద్వి పంబుల,చేత భూరి । దీపములచేతఁ బోలె ను, ద్దీప్తభంగి । నంచి

తముగ నసంబాధ,మై వెలింగె॥ ౨౧౮ ॥ (మ) అతివేగంబున నేగు ఘోరిరథముల్, యత్నంబుతోఁ జోదకా । యతరశ్మి వ్రజభుగ్నసుంధరగళా, గ్రాసక్త యుగ్యాశ్రిమో । ద్యతవాహంబులచేత హస్తినఖసీ,మాగ్రంబుపై నుండి స । మ్మతి నానీతము లయ్యె మెల్లన నసం,బాధంబుగా ధాత్రికిన్॥ ౨౧౯ ॥ (గీ) అతిబలోర్ములచే వ ల,యములచేతఁ । బోలె నతిహీయమాన స,ముద్యతప్ర । తోళిభుజ యాటఁ బురికి వి,ధుండు పురము । వెడల ద్వారవతీత్వ మ,ప్రియత నొందె॥ ౨౨౦॥ (గీ) వనధిపరతీరమున హరి,ద్వర్ణపత్ర । రాసులుతక్క లికాసహ,స్రప్రతతుఁ । మావిలోత్కలనిరుపమ, శైవలాభ । విపినపఙ్క్తులఁ గాంచె న,వ్విశ్వవిభుఁడు॥ ౨౨౧॥ (చ) జలధితటాధివాసములు,శ్యామలకోమల కాంతియుక్తము । ల్లలితరమావిలాసములు, రమ్యలతావనితాయుతంబు లౌ । విలసితభూరుహంబులను,వేడుక మీఱఁగ వేలయందు సొం । పలరఁగఁ జూచె నవ్విభుఁడ, నంతనిజాకృతులం బలె నహీన్॥ ౨౨౨ ॥ (సీ) ఆశ్లిష్టభూతలుం, డాక్రందితుండును ఫేనాయమానుండు, పృథువిలోల । ఘనభుజాకార భీ, కరతరంగుండునై వీఱిఁడి క్రియ నున్న, వారిరాశి । నత్యంతతృష్ణచే, నబ్ధిపానముఁ జేసి యభివృద్ధి నొందిన, యాత్మదేహ । మం దతిరిచ్యమా, నాంచితక్షిప్తేందు రుచులను మౌక్తిక,ప్రచయములను ॥ (గీ) ఘనము లేయంబువులచేత, గర్జ లెసఁగ । మించి ధర యెల్ల నిండ వ,ర్షించె నట్టి । సలిలముల సాగరైకదే,శంబునందుఁ । ద్రావు మేఘంబులను జూచె, దనుజవైరి ॥ ౨౨౩ ॥ (వ) మఱియు నమ్ముకుందుండు మునీంద్రులచేత వేదంబువలన నర్థంబు సంగ్రహించి రచింపంబడి వేదంబునే యనుసరించిన మన్వాదిస్మృతులం బోలె మేఘంబులచేత సముద్రంబువలన జలంబు సంగ్రహించి రచింపంబడి సముద్రంబునే యనుసరించి ప్రవర్తింపుచున్న నదులను దిగంతరానీతనానాద్ర



వ్యంబుల విక్రయించి మూల్యంబునకంటె ద్విగుణాధికంబైన యుత్తమలాభంబు నొంది తత్రత్యసారవత్పణ్యద్రవ్యంబు నోడలయందు వహించిన సముద్రద్వీపవాసిసాంయాత్రికుల విలోకించె మఱియును॥ (గీ) జలధిలో నుండి పైకి రాఁ,దలఁచి ఫణులు । గరుడకేతుధ్వజంబుల,కరణి భూరి । నిశ్వసితవాతములచేత, నీరరాశి । సలిలముల మీఁదికెగయంగఁ, జల్లె నపుడు॥ ౨౨౪ ॥ (సీ) ఉత్సంగశయ్యాశ,యుండు యుగాంతబంధుఁడు సమాగతుఁడైన, తోయజాక్షు । వీక్షించి గురుతర,ప్రీతిప్రసారితాయతభంగహస్తుఁడై, యంబురాశి । తగనెదుర్కొనిన చం,దంబునఁ గన నయ్యె నత్తఱి నుత్సంగి,తాంబుకణుఁడు । బంధురైలావనా,స్ఫాలనసంలబ్ధగంధుండునై గంధి,గంధవహుఁడు॥ (గీ) వారినిధి వేలయందు దు,ర్వారభంగి । సకలసైన్యసమేతుఁడై, సంభ్రమమునఁ । బోవు మురవైరి నెమ్మెనఁ, బొడమి నట్టి । చెమట లార్చెను సైన్యంబు, ప్రమద మొంద॥ ౨౨౫ ॥ (మ) అతులప్రౌఢమురారి సైనికులు సొం,పార న్మహోత్తాలవా । సితతాళీవనసంప్రవృత్తవిచల,చ్ఛీతానిలప్రేరణా । ద్భృతసీమంతితకేతకీకకనదం,భోరాశిమధ్యావనీ । స్థలులం గాంచి చరించి రచ్చట వినో,దక్రీడలన్బల్విడిన్॥ ౨౨౬ ॥ (వ) మఱియు నాచమూచరులు లవంగకుసుమమాల్యకృతభూషణులును నారికేళఫలాంతర్జలపాయులును నాస్వాదితార్ద్రక్రముకులు నై సముద్రునివలనన భ్యాగతప్రతిపత్తి నొంది రదియునుం గాక॥ (సీ) అగణితబహువర్ణ, హయశతాకులమును బ్రతిమార్గమందును, బ్రమథితోరు । భూభృత్సహస్రంబు, పొసఁగ సంతతరమాసహితంబు నగు హరి,సైన్యమునకు । రంగుగా నేకత్తు, రంగజన్మంబును బరఁగ నేకోర్వీభృ,త్ప్రమథితంబు । తలపోయఁ జిరవిగ,తశ్రీకుఁడై యొప్పు ద్వీపవతీభర్త, కేపు మీఱ॥ (గీ) నరసి చూడ మహాంతరం,బయ్యె నప్పు । డిత్తెఱంగున నయ్యదు,సత్తముండు । వ

నధిపవైభవ మెల్లఁగ, న్గొనుచు నస్మి । తాననాబ్జుఁడై మెల్లన, నరిగి యరిగి॥ ౧౩౭ ॥ (సీ) పటుతరనీలాశ్మ,బద్ధనానావర్ణగైరికముఖ ధాతు,కలిత మగుట । వలన ఫణారత్న,భా సమన్వితముగా వసుమతి భేదించి, పైకి నిగుడ । మించిన ఫణిరాజ,మేచకనిశ్వాస ధూమంబు చందానఁ, దోఁచు దాని । భాసురభూరిత,టీసమీపోపరి దేశంబునందు వి,స్తీర్ణమైన॥ (గీ) సంతతోన్నమదభ్రసం,చయముచేత। నకలమార్గంబు గ్రమ్మఱ, నడ్డగింపఁ । బెరిఁగిన సహస్రశిరమైన, విన్ధ్యనామ । కులకుధరరాజమును బోలె, నలరు దాని ॥ ౧౩౮

(ఉ) కాంచనవప్రభాఙ్నిబిడ,కాంతిసమూహభృదుల్లసన్మణీ । ప్రాంచదమేయరుక్కలిత,మై బలసూదన రత్నమేచక । త్వాంచితమై ప్రసూనమధు,రాసవలుబ్ధమధువ్రతావృతా । భ్యంచితవల్లికా సహిత,మై కర మొప్పెడు దాని వెండియుఁ॥ ౧౩౯ ॥ (చ) వరుస సహస్రసంఖ్య గల, పాదశిరంబులచేత భూస్థలిన్ । బరఁగ నభస్థ్సలిం దొరసి, బాగుగ లోచనయోగ్యదేశసం । భరితదినేశశీతకర, మండలము ల్గల దాట నిక్కవం । బరయ హిరణ్యగర్భుని క్రి,యన్గన నయ్యెడు దాని నెంతయుఁ॥ ౧౪౦ ॥ (గీ) అంబునిగర్భమశుభ్రసం,బు,లగుట త్రాళి । తోత్తరీయసమద్యుతి, నొప్పుఘనము । లూక్కయొడఁ దాల్చి దుగాంగ,యుతవిభక్తి । భస్మఁ డగు శూలి కైవడి, వఱలు దాని ॥ ౧౪౧ ॥ (గీ) నిజసతీచటులాలస,నిబిడతరమ । దాతిచటులాలసములైన, హంసముఖప । తత్రిలకుఁ బింజరీభూత, దళవికాసి । తోయజచ్ఛత్రముల నీడ,సేయు దాని॥ ౧౪౨ ॥ (గీ) స్కంధసంశ్రితపృథునీల,కంఠములును । సర్పసంశ్లిష్టతనువులు, సంప్రణతిని । తామితలతాభుజాగ్రంబు,లైన భూరి । తరుల బహురుద్రులను బోలెఁ, దాల్చు దాని॥ ౧౪౩ ॥ (చ) కలితవిలంబిమేచకవి,కాసినవోత్పలకర్ణపూరముల్ । లలితనవోలపాళి సమ,లంకృత



భాసురసైకతాభము । ల్సలలిత సైకతంబులయి,లోధ్రిక గౌరసతీకపోలభి । త్తుల గతి నొప్పు శుభ్రతర,తోయములుం గల దాని వెండియుఁ ॥ ౧౪౪ ॥ (మందాక్రాంత) రాజీవాళీవశగతచల,ద్రమ్యభృంగవ్రజంబై । భూజశ్రేణీ హృతరవికరో,ద్భూత సాంద్రాతపంబై । భ్రాజద్దైతేయనికరకృతో, పప్లవం బొందకుండన్ । నోజంగాం తాలకసవనభు,గ్వ్యోషలం దాల్చు దానిన్ ॥ ౧౪౫ ॥ (క) వితతజలరాశివీచీ । వితతిసమానీతరమ్య, వివిధమణిసమా । వృతమైన దాని నలరై । వతకాద్రిని జూచె హరియ,వార్యప్రీతిన్॥ ౧౪౬ ॥ (వ) మఱియును॥ (సీ) హరికిఁ బ్రియంబుగా, నమరసమానీత బృందారకాచల,శృంగవర్గ । తంబైన యేమహీ, ధరపతి యుచ్ఛ్రాయసౌందర్యగుణములు, చాటువాక్య । చతురులౌ కవుల క,సత్యము ల్గా వయ్యె మఱియు శ్రేష్ఠము లతి,మానములగు । భూరితర ప్రస్థ,ములచేత నిభృతంబు లుద్రశ్మలైన ర,త్నౌఘములను ॥ (గీ) బరఁగనే మేదినీధ్రంబు, వలన జనులు । ప్రకటముగ నాఢ్యుఁ డౌ ప్రాప,ణికుని వలనఁ । బోలె సంతత మార్జించి, పొలుపు గాంతు । రెద్ది రోహణ శిఖరికి, నుద్ది యయ్యె ॥ ౧౪౭ ॥ (వ) మఱియు నౌన్నత్యంబువలన నత్యాసన్నుం డగుట వలన మిక్కిలిఁ బరితపింపఁ జేయు సూర్యుని ధరించిన దయ్యును నవారవిందధానం బగుటం జేసి యతి రమణీయంబైన యేమహీధరతటంబునందు నిపీతమకరంద యగుటం జేసి మత్తమై నమత్తామరసమై యొప్పు కుసుమాంతర చంచలచంచరీకసంచయపఙ్క్తి ఖేదంబు నొంద దయ్యె నదియునుం గాక॥ (చ) పొలుపుగ నేనగంబు పయిఁ, బొల్పగు రాజితగండశైల ము । జ్జ్వలదధిరూఢచారువిక,సత్కుసుమాత్తిసహస్రయుక్తపే । శలఘనశాఖిచే నముచి,శాసనభూషిత పృష్ఠభాగమై । యలరు సుపర్వదన్తి క్రియ, నద్భుతభంగిఁ జెలంగె నెంతయుఁ ॥ ౧౪౮ ॥ (చ) అరుణ

విభావిభిన్నరుచు,లైన దినేశతురంగమంబులే । ధరణీధరంబు మీఁద స
మ్ము,దంచితవంశకరీరనీలసుం । దరతరజాతిరత్నకలి,తస్ఫురదుచ్ఛ్రితరా
శ్మిదీధితి । చ్ఛురితములై స్వవర్ణమును, సొంపుగఁ గ్రమ్మఱఁ దా
ల్చెఁ బల్విడిన్॥ ౨౮౯॥ (గీ) ఉరుసముత్పతదభ్రస,ముజ్ఝితాంబు । సి
క్తమగు నవిపన్నగా,శేషవృక్ష । వనమును విషానలోద్భూత,ఘనవిప
త్తి। సంతతము నెందు బాధింపఁ, జాల దయ్యె॥ ౨౯౦॥ (ఉ) పంతము
తోడ నే శిఖరి,భాస్కరభూరికరాప్తిహవ్యభు । క్కాంతులుగ్రక్కు
సూర్యమణి,కాంతులపాత్రగుణాశ్రయంబుచే। సంతతముప్రసిద్ధగుణ
సంక్రమణంబును బొల్పు మీఱ సం । క్రాంతగుణాతిరేకమును,గానొన
రించె మహాద్భుతంబుగన్॥ ౨౯౧ ॥ (ఉ) ఆవసుధాధరంబు ముద,
మారఁగ మున్నటు పెక్కు మాఱులి । చ్ఛావిధి దృష్టమైనను బ్ర,స
న్నత శౌరి కపూర్వవిస్మయం । బావహిలంగఁ జేసెఁ బ్రతి,యామము
నందునవత్వ మొందు టే । వావిరి రామణీయగుణ,వైభవయుక్తి
కి లక్షణం బిలన్॥ ౨౯౨ ॥ (గీ) అంత యుక్తికుశలుఁ,డైన దారు
కుఁడు న । దత్పతత్త్రినికర,తటులు దాల్చినట్టి నగవిలోక,నాశచే ను
ద్గ్రీవుఁ । డైన శౌరి కిట్టు,లనుచుఁ బలికె॥ ౨౯౩ ॥ (గీ) ఘనపిన
ద్ధదిగంబరా,క్రాంతభూరి । శృంగగోతలమూర్ధస్థ, శిశిరకిరణ । న
వ్యకోటి గిరీశసం,దర్శనమున । నెవ్వని మనంబు భువి విస్మ,యింప
కుండు॥ ౨౯౪ ॥ (గీ) సుభగవితతోర్ధ్వరశ్మిపా,శులగు శశిధ ।
రోష్ణకరులుదయాస్తంబు, లొందుచుండ । నీయగంబు విలంబిఘం,
టాయుగపరి । వృతమదావళలీల వ,హించె నధిప॥ ౨౯౫ ॥ (గీ)
అధిపలసమానచారున,వాంశుకమగు । ధరము సహరితకాంచన,స్థ
లులు దాల్చి । ప్రకటహరితాళనూతనాం,శుకుఁడవైన । నీపగిది నొ
ప్పు చున్నది, నేఁడు కంటె॥ ౨౯౬ ॥ (మ) అనిశంబీనగరాజసాను
తులయుం, దాసక్తితో నన్నియూ । జనము ల్కాంతమలాతిసాంద్రకర



సం,చారంబు సంపూర్ణాల । బ్ధనృపశ్రీముఖతుల్యమై యలరు నం,
తస్థాంకుఁడౌ పూర్ణచం । ద్రుని పశ్చాద్భవభాగముం గనిరి సం,తో
షంబుసంధిల్లఁగన్॥ ౨౯౭ ॥ (మ) నలు వొప్ప న్గిరినిమ్నగాఝరులు
వా,నప్రస్థులుం బోలె సొం । పలరన్పేటుల మీఁద నుండి బృహ
ద,శ్మాగ్రం బులన్ వ్రాలి ఖ । స్థలికిం గ్రమ్మఱ నుద్గమించిస్మరసం, తా
పార్తులైనట్టి స్వ । ర్లలనాసుందరగాత్రవల్లులకు ని,ర్వాణంబుఁ జే
సె న్రహిన్॥ ౨౯౮ ॥ (సీ) అమలచరిత్ర యీ,యద్రిపై నొకచో
టఁ బ్రశమితచాతకా,ర్తస్వరములు । తటిదాభకాంతకా,ర్తస్వరం
బులు నైన ఘనము లీజగతులఁ, గప్పుకొనియె । నొకచోట నుల్లసి,
తోజ్జ్వలచామీకరములైనయీసాంద్ర,రవికరములు । కపిశవర్ణంబులు,
గల వానిఁగాఁ జేయు చున్నవి గంటిరె, యుత్సుకమున॥ (గీ) నుచ్ఛ్రి
తేందుకరావలం,బోడుయుతశి । రోధృతాభ్రంబు శ్రిద్ధేయ, రూఢ
గిరిన । దీప్రివాహూదకవ్యప,దేశ మగుచుఁ । బడుచు నున్నదియం
త్తటు, బంధురముగ॥ ౨౯౯ ॥ (గీ) ఒకట స్ఫటికతటాంశుభి, న్నో
దకంబు । లొకట నీలాశ్మరుచివిధు,రోదకంబు । లగుచు గిరినిమ్న
గలు యము,నాంబుమిశ్రి । తామరాపగా వైదగ్ధి, నాశ్రయించె ॥
౩౦౦॥ (మ) సురశైలేంద్ర సమానవప్ర మగుచున్, శోభిల్లు నీశైలమం।
దరుదార న్మణిసానురాగములు దీ, పాచిః స్సమానంబులై । వరు
సం గ్రాలెడు నిర్ఝరీసదృశలో, వామేక్షణల్రక్తితో । సరసాలాప
ముల న్మనోహరుల వాం,ఛ దీర్చుచున్నా రొగిన్॥ ౩౦౧ ॥ (ఉ)
భూరిసుధా సవర్ణము స,ముజ్జ్వలకాంచన వాజిరాజితం । బై రహి
నొప్పు నీసదము, లాంచితరాజత భిత్తి కంటిరే । చారు విభూతి పాం
డురిత, శంకర సాంద్ర సమున్నతా నల । స్ఫార సుదృగ్గలామఘన,
ఫాలవిలాసము నాశ్రయించెడిన్॥ ౩౦౨ ॥ (వ) మఱియు నీశైల
రాజంబతి జరఠంబులు సుప్రకామ గురుభారవిడంబి పయోధరోపరు

ద్ధంబులును శరీరధారులకు సంతత మగమ్య రూపంబులును బరిణ
త దిక్కరికంబులు నగు తటుల భరించుచున్న దదియునుం గాక ॥
(గీ) ఈనగంబున వహ్నిస,మానవర్ణ । చారుసౌవర్ణతటసుమ,జాల
లీన । భృంగతతిభృద్విమేచకీ, కృతతరువులు । పొగయుఁ బోలెఁ
జూపట్టెడు, బ్రోలఁగంటె॥ ౩౦౩ ॥ (మ)వికసత్పుష్పచణోరుచం
పకలస,త్పింగద్యుతివ్యోమదే । శకసటాకాంచనభిత్తియుక్త మగుట,
న్నామేరవీసన్నితం । బకకాంతిం బ్రకటించు నీశిఖరిచే, భాసిల్లు నీ
భారతం । బకలంకచ్ఛవి నయ్యిలావృతము ఛా,యన్ గ్రాలెడుం గర
టిరో॥ ౩౦౪ ॥ (గీ) ఉజ్జ్వలవిచిత్రలోమసం,యుక్తవిచలి । తాతత
ప్రియకంబుల,చేత నీధ । రంబుజంగమతాగత,రత్నమయని । జాం
గములచేతఁ బోలెఁ జెలంగెఁ గంటె॥ ౩౦౫ ॥ (గీ) గాఢసలిలాశ
యోషిత,కలభములు స । మృద్ధనీరేజములతో ర,మించుచున్న । వ
రయఁ గల భావికస్వరా,మరచయంబు । కామినుల బ్రోలఁ జేసె
డు, గానరవము॥ ౩౦౬ ॥ (చ) తెలుచుగ నిమ్మహాతాపధులు, దై
నియోగమునన్ బృహత్తమః । పరివృతుఁడై వెసం బునర,పక్రమణం
బునఁ గాలకాంక్షి యా । సరసిజపత్రమిత్రునకుఁ, జారుపదానభి
భూతమైన వి । స్ఫురితలసత్కళత్రపద,ము న్వహియించె నుదంచి
తోన్నతిన్॥ ౩౦౭ ॥ (సీ) చారువనస్పతి,స్కంధనిషణ్ణనూత్న ప్ర
వాళోరుహ, స్తంబులైన । లతలు మధువ్రత,వ్రాతావృతములౌట గా
ఢలంబితరోచ,కంబులైన । యురుసుమేక్షణముల, నుపలక్షితంబులై
ప్రముదల క్రియఁ జూడఁ, బడియె నిచట । నతులకదంబవా, సితమైవ
యిమ్మహానగము మీఁదఁ బ్రతిక్ష,ణంబు ఘనవి॥ (గీ) హంగముల నే,
కలయ మగు, నట్లు మధుర । నాదములు సేయు చున్నవి, నవ్యఘణి
తి.। ఘనరయోద్ధూతనవనీప,వనుఁడు పవనుఁ । డభ్రిము చలింప వి



సరె స,ముంచితముగ ॥ ౩౦౮ ॥ (వ) మఱియు నిమ్మహాశైలంబు
ధారణా ధురీణండైన బ్రాహ్మణుని కరణి నాగమప్రధానులును ని
ధిమంత్రసాధనవిశేషవిశారదులు నగు వారిచేత బహుప్రయత్నంబు
నఁ బ్రకాశింపం బడిన దాని ననిశ్చితబుద్ధులైన యశాస్త్రజ్ఞులచేత
వినియును దుస్సాధనం బగు దాని నఘంబు నడంచుటకు సమర్థం
బైన నిధి మంత్రగణంబును భరించుచున్న దదియునుం గాక ॥ (చ)
అనిశము చారుబింబసదృ,శాధరమా ప్రియురాలి మోము చుం । బ
న మొనరించు కిన్నరుని, వాజిముఖుండు నుతించెడిన్ బృహ । త్స
నభరభంగభీరువిల,సత్తనుమధ్యను జేరియసి న్విహా । స్పనివడి కౌఁ
గిలించు హయ,వక్త్రినిఁ గిన్నరుఁడు న్నుతించెడిన్॥ ౩౦౯ ॥ (మ)
ప్రతతానంతతమాలతాల మగుచు,నాళిజిల్లునే యీపురో । గతభా
స్వద్వన మొప్పె నట్టి స్థగితా,ర్కపోల్లసద్రశ్మిసం । తతియు న్విం
జదనంతతానమగు నీ,దావంబునం దేల తా । ప్రతతుల్యారుఫలప్ర
సూనయుతము, ల్గాకుండు నెవ్వేళలన్॥ ౩౧౦ ॥ (మ) ఘనదంతో
జ్జ్వలరత్నచిత్రకటకా,కాంతంబలై యొప్పు ర । మ్యనగాధిత్యకలం
దు నిర్మలశిలో,ద్యన్మేఖల ల్భారిచా । రునితంబ లకమనీయకోమ
లనభో,రుగ్గండశైల ల్నితం । బిను లిచ్చా సదృశాధివాసమును నె,
మ్మిం బొంది రీక్షింపుఁడీ॥ ౩౧౧ ॥ (గీ) చటులవిరళవికీర్ణవ,ప్రజక
ణమైన । ధౌతరజతోర్వ్రిజలదస,ద్యఃప్రముక్త । బహుచిరస్థాయిబుద్బు
దాం,భస్సమగ్ర । సామ్యమును బొందుచున్నదీ, శైలమందు॥ ౩౧౨ ॥ (వ)
మఱియు నిమ్మహీధరం బేకాంతంబున సంగమం బగుచుండ విస్రంభవి
హారంబు కాంక్షించుచున్నవారగుటంజేసిజనసంగంబు వర్జించి మన్మథుని
చేతసంప్రాప్తజ్వరాంగులై కుంఠితనేత్రాంతలై యున్న యనేకయో

షలచేత సేవింపం బడుచున్న దదియునుం గాక॥ (సీ) సంపూర్ణ భూరి
శీ,చకవనస్థలిత్రైకఘనవాలవిచ్ఛేద,కాతరమతు లగు చమరీనామ,మృగ
ములీగిరియందు మృదువాతగర్భిత,దీయరంధ్రీ నిర్యత్స్వనశ్రుతి,నిబిడ
సౌఖ్యము వాయఁ జాలని కైవడి,సంచలింప । వయ్యో నంతస్థమ,హానీ
లదళములో ఘనవాపులందు మే,ఘప్రముక్త॥ (గీ) మచ్ఛమౌక్తికమ
ణియుక్త, మగుట విమల । దుగ్ధసంకాశమై యొప్పు, తోయ మచ
టఁ । బరఁగ శస్త్రీ విసీలరు,గ్వ్యక్త మగుచు । నమరసీలీర సచ్ఛా
య, నధిగమించె॥ ౩౧౩ ॥ (వ) మఱియు నిమ్నగంబున నన్యయు
వతుల కంటె సారతరాగమునవైన యేయువతి స్వప్రాప్తికొఱకుఁ
బ్రార్థయమానయయ్యును బ్రియునిం గూడ దయ్యో నట్టి ప్రతికూల
యువతియు నేకాంతంబునం దాప్రియునితోఁ గూడ ననాయతమ్మానం
బగు నట్లు సురతాభిలాషంబు నొందుచున్న దదియునుం గాక॥ (చ)
నలువుగ నిందుఁ జంద్రకిర,ణంబు లనేకవిధోల్లసన్మణీ । విలసితభూ
రిభానుతతి,భిన్నము లౌట సహస్రసంఖ్యనిం । పలరఁగ నొందుచుం
డ నిశ,లందును భాస్కరుఁ డంచు భ్రాంతిచేఁ । గోలఁకులు సంత
తస్ఫుటిత,కోకనదత్వము నొందెఁ గంటివే॥ ౩౧౪ ॥ (గీ) అలకప
రివర్తనోచిత,లైన యాత్మ । జాపగలు భర్తనొందుట, కగ్రభాగ ।
మందుఁ జనుచుండఁ బ్రేమచే, నద్రిఖగరు । తమున దుఃఖించి నట్లు
న్న, దమలచరిత॥ ౩౧౫ ॥ (గీ) భృంగవిటచుంబనోల్లస,ద్విటపిన
మిత । నగవితతి దాల్చి నట్టి యీ,నగనితంబ । మతులపరిపాకపిం
గళ,ప్రతతిపతిత । పాంసుపింగళ మగుచుఁ బూ,వట్టె నిచట॥ ౩౧౬॥
(సీ) ఊర్ధ్వదేశంబున, నుండి ప్రాగ్దిశను శైలాసన్నభూముల, యం
దుఁ బడెడు । శృంగారితాయత, సింధుర హస్తాభ మఖిలమణీమ



యూ,ఖాను విద్ధ । మురుధారమగు జల, మూర్ధ్వ ప్రసారితహ
రిధనుస్సుందరం, బగుచు నొప్పెఁ । జెలునొప్ప నీశైల,శిఖర శిఖావ
ళు ల్పవిలసచ్చిత్రక,ల్పకుమాజ॥ (గీ) పుష్పపరిగుంభితములైన, పో
ల్కి నలరు । మహితపరిలంబిపింఛదా,మంబులైన । చారు శిఖిశేఖ
రంబులు, క్షణము దాల్చు । చున్నయవి చూడు మంతట, నుత్సవము
న॥ ౩౧౭ ॥ (క) వినుఁ డిట సవధూకులు సుఖు । లనవరత మ
మందరాగ,తామరసదృశుల్ । ఘనరసవన్న వరతిగ్ర । ద్దన సలిపి
రమందరాగ,తామరసదృశుల్॥ ౩౧౮ ॥ (చ) పొలుపుగఁ గట్టు పు
ష్పపట,ముం దగఁ గప్పి తదంతరభ్రమ । తక్రలితకపోల కంఠతులి,
తస్ఫురితాగరుధూమకాంతిభృ । ల్లలితవినూత్నమేఘపట,లంబుల చే
త నిజాంగకావళిం । గలయఁగ ధూప వాసితము,గా నొరినంచె
డు భంగి దోఁచెడిన్॥ ౩౧౯ ॥ (శా) అత్రస్యన్నవరత్నసంభవస
మ,గ్రాన్యోన్యమిశ్రోజ్జ్వల । చ్చిత్రాకారమయూఖకల్పితనభ,స్సీమా
గ్రనిభిత్తిప్రహ । చ్చిత్రప్రాపణచిత్ర కర్మమెపుడు, న్సిద్ధామర శ్రే
ణికి । న్జిత్రంబుం గలిగించె నీయవనిభృ, చ్ఛ్రేష్ఠంబు నీక్షించితే ॥
౩౨౦ ॥ (గీ) వాయుశిశిరమై శిఖరని,వాసులైన । యలఘుసుఖుల
కుఁ బుణ్యవం,తులకు ముదము । గలుగఁ జేయుచు నీగట్టు,జలవియో
గ । ధవళఘనపఙ్క్తి యవనిక,ద్దాల్చెఁ గంటె॥ ౩౨౧॥ (వ) మఱి
యు నిమ్మహాశైలంబునందు సమాధినిష్ఠులగు యోగులు మైత్రియుఁ గ
రుణయు ననుమోదనంబును నుపేక్షయు నను సంజ్ఞలుం గల చతు
ర్విధచిత్తవృత్తు లెఱింగిన వార లగుటం జేసి క్షీణాంతః కరణమాలి
న్యులై యవిద్యయు నహంకారంబును రాగంబును ద్వేషంబు నభిని
వేశం బనం బడు పంచవిధక్లేశంబుల నుపసంహరించి సంలబ్ధసాలంబన

ధ్యాను లగుచుఁ బ్రకృతిపురుషుల నిరువుర భిన్నులఁగా నెఱింగి సద సద్వివేకా భావంబునం గలుగు సంసారంబు నిరోధించుటకుఁ గాం క్షించుచున్నవా రగుటం జేసి యిప్పర్వతంబు కేవలభోగదేశమాత్రం బె కాదు ముక్తిక్షేత్రంబై యున్న దదియునుం గాక॥ (గీ) ఇచట మరకతమణిమయ, పృథివియందుఁ । దగువిటపిమధ్యపాతివి, స్ఫురిత సూక్ష్మ । పాంసుజాలార్క కరములు, పటువినమ్ర । బర్హిగళల క్ష్మనివహించెఁ, బరమపురుష॥ ౩౨౨ ॥ (సీ) అనఘాత్మ యిచ్చట, ఘనమేచకంబయి యపగతావస్థాన, మగుచు మధుర । చటులవీణా గుణ,స్వనమానము॥వహించె నయ్యుపచలితష,డంఘ్రిపఙ్క్తి । చేత స్వానమనైన, యేతన్వి ప్రియునకు వశగత గాకుండు, వసుధలోన। నిచ్చట సానువు, లెప్పుడు నిశలందుఁ జంద్రకరాహత,చారుచంద్ర ॥ (గీ) కాంతనిష్యందనిర్మల,కమలవిరచి । తాభిషేకంబులై పవ,లర్క రత్న । తతిసముద్దీపితాగ్నిత, ప్తంబు లగుచు । గాఢతపముగావిం చెడు, కరణి నలరె॥ ౩౨౩ ॥ (గీ) శ్వసనభూజవమున,సంక్షోభ మొందిన । సరసు లిచట హంస,జాతలక్ష్మి । నామకొని యరహిత,రామలక్ష్మణనాకు । నందనోక్తిసామ్య,మొందె నహహా॥ ౩౨౪॥ (క) అతిముదితకలభములచేఁ । బ్రతిదిశ సారెకు నమంద,భైరవర వముక్ । గృత మయ్యెఁ గనకభూరుచు । లతులితచమరులు చెలంగ, ననువనమందుక్॥ ౩౨౫ ॥ (గీ) కీచకబిలప్రపూర్ణాత్త, గీతరవ ము । మృదితపక్ష్మలరల్లకా,మేయతనువు । కమ్రకస్తూరిగంధియా, గాడ్పుకామి । చందమున భూరివిషయసం,సక్తుఁ డయ్యె॥ ౩౨౬ ॥ (గీ) యువజనప్రీతికొఱ కిందు,వ్యవహితార్క । మనసిజరతిశ్రమాపనో,దనచణంబు । లగు ఘనంబులు దినమును, మిగుల రాత్రి । గాఁగఁ జేసెడు గాఢాంధ,కారకలన॥ ౩౨౭ ॥ (చ) అరుదుగ నిందు నీగజవ,రాశ్రమపుష్పభరావనమ్రసుం । దరకుజముక్ సదానజల,దంతిహతం బగుచుండఁ దన్నగో । పరిగతదందశూక మతి, బంధురకోపితమై నితాంతభీ । కరవిషవహ్నికీల లదె, గ్రక్కుచు నున్నది చూడు మచ్యుతా॥ ౩౨౮ ॥ (చ) స్మరహరుఁడైన సాంద్రగజ,చర్మకృతాంబరకృత్యుఁడై తుషా । రరచితమైన శీతనగ,రాజముపై వసియించె నాఢ్యకే । తరుఁడయినక్ సమస్తభుతు,ధర్మసుఖప్రదమైన యీమహీ । ధరము పయి న్వసించి మదిఁ, దాల్పఁ డొకించుక ద్వంద్వదుఃఖముక్॥ ౩౨౯ ॥ (సీ) వితతనూతనశైల,విపినరేఖాశ్యామమధ్యస్ఫటికమణి,మయనితంబ । భూములచేత నీ,భూధర రాజంబు భస్మాంగరాగాత్త,పాండిముండు । సర్పరాట్పరికర, సహితుండు నగు త్రిపురాంతకు తనుశోభ, ననుకరించె । మఱియు నీగిరియందు,మాధవు ల్వికచాంబుజోభయతటభృత్స,ముత్థితోరు ॥ (గీ) నదవినోదితభూరిది,నక్లములును । గనకభూషణజనితోరు,కాంతులగుచు। రసవదైక్షవమధు వాని, రతికిఁ బ్రియల । యొడలి వలువలు హరియింపు,చున్నవారు॥ ౩౩౦ ॥ (సీ) భానుండు దర్పణ, స్వచ్ఛకాంచనకందరాగ్రవర్తి,హృదయ,హారిరౌప్య । భిత్తిసంక్రాంత ప్రవృద్ధత మోహారి ఘనతేజ మాహేమ, కందరములఁ । బలుమరు తరుచుగాఁ, బ్రతిఫలింపుచు నుండఁ బతులచే నపహృత,వసనలైన । యతివల కందరా,నభిముఖుం డయ్యును జెలఁగి వ్రీడితలఁగాఁ, జేయుచున్న ॥ (గీ) వాఁడు నీరాకఁ గని యద్రి, వాత చలిత । బలపటశ్యామలోత్పత,ద్బహుల శిఖర । కాండ సంభ్రమకారి మే,ఘముల చేత । నధికభక్తిఁ బ్రత్యుత్థాన, మాచరించె ॥ ౩౩౧ ॥ (మ)

నళినాక్షుం డిటు లవ్యళీకములు గాం, తా సమ్మితంబు ల్నిజం । బులునై రాజిలు సూతపుత్త్రు వచనం, బు ప్రీతి నాలించి యు । త్కలికం దద్వచనాంతమందు వనరే, ఖాచేల సంఛాదితో । జ్జ్వలమా రైవతకాద్రియందు విహరిం, పం గోరెఁ జిత్తంబునన్ ॥ ౩౩౨ ॥ (మ) ఘనదుత్తుంగనభస్స్పృశత్కదళికా, కాంతారరేఖాక్త మ । బ్ధినిభం బౌ యదుసైన్యసంఘము దగ, న్విస్తారసంఛాదితా । వని యాటం బ్రబలత్ శైలలక్ష్మి ననువా, ప్పన్ దాల్చి దంతావళేం । ద్రనికాశాతులతుంగశృంగగిరికిం, దం బొప్ప నేగె న్హరిన్ ॥ ౩౩౩ ॥ (చ) అమితచమూసముత్థరుచి, రాభ్రవికాసిమహోష్ట్రికంఠపిం । గమగు మహోపరాగ మిన, కమ్రకరాప్తివికాసితాంబరాం । తము లగుటన్ మహాజనని, దర్శనసంభవలజ్జ నొంది న । ట్లమరి చెలంగు నట్టి హరి, దంగనల న్వడిఁ గప్పె సాంద్రమై ॥ ౩౩౪ ॥ (చ) సురుచిరచారుదేహమణి, శోభితముల్ భృతరంధ్రభాగముల్ । భరితమహోర్మిజాలములు, భవ్యఫలప్రదశుక్తియుక్తముల్ । గురుతరరోచమానము ల, కుంఠితసద్భ్రమపూరితంబులై । వఱలు హయంబు లంబుధుల, వైఖరి మేదినిఁ గప్పెఁ గక్కనన్ ॥ ౩౩౫ ॥ (గీ) మార్గమందు శితారక్ష, మగ్నసృణిని సరకుగొన కార్తి నఱచుచు, సుఱికె నిభము । లొట్టియ నిరస్తభారమై, మిట్టిపడియె । నొండొరుల చేతఁ జూచి యా, రెండు వెఱచె ॥ ౩౩౬ ॥ (చ) అతిచటులాగ్రపాద మగు, నట్లు వడిం జను చారుచామరాం । చితహయరాజము న్మదవి, శేషసలీలనిమీలితాక్షమై । చతురత మెల్లనం జను గ, జంబును గాంచె జనంబు సాభిలా । షత ననురూపచేష్టమయి, సర్వముఁ బ్రీతికరంబె కావొకో॥ ౩౩౭ ॥ (చ) కరి నటు గాంచి భీతి నొక, గర్దభ మానన మెత్తి కూ



యుచుం । గర మరుదంది యందఱు ప, కాపక నవ్వఁగఁ బేర మెత్తినన్ । స్ఫురితచలాసనప్రసృత, భూరినితంబగళద్దుకూలయై । పరువడి రాజకాంత ధర, పైఁ బడె నత్తఱిఁ దత్తరంబునన్ ॥ ౩౩౮ ॥ (ఉ) రైవతకాచలాంతికచ, రద్రథనేమి విఘట్టనోజ్ఝిత । గ్రావసమూహచూర్ణకణ, గర్భమహీరజ ముల్లితాంతచ । క్రీవదుదంచితాంగరుహ, కేవలధూమలవర్ణకంబులై । వావిరి నభ్రమార్గమున, బన్నెఁ బయోధరమండలాకృతిన్ ॥ ౩౩౯ ॥ (చ) చటులఖురాభిఘాతభవ, సాంద్రకృశానుకణోపయుక్తవి । స్ఫుటతరభాసమాయతస, ముత్థశిలాఫలకాచితంబులౌ । పటుతర శైలరాణ్ణికట, వర్త్మములం బృథుదర్పరాస్యము । ల్దటుకున వేయుచున్న గతిఁ, దద్దయు నశ్వము లేగె నత్తఱిన్ ॥ ౩౪౦ ॥ (మ) హయతేజఃప్రతిరోధకాంచితసమ, గ్రావలంబనుండుం గశా । త్రయసంచార విశారదుండు గతిసా, రజ్ఞుండు నౌ సాదిచే । నియతి న్శిక్షితమైన జాతిహయము, న్నేపొన్పఁగా మండలా । ధ్యయనంబుం బచరించె నిష్ఠురచల, త్పాతాతిచిత్రంబుగన్ ॥ ౩౪౧ ॥ (మ) బలసంక్షుణ్ణ నగోత్థపాంసు చయముం, బ్రాలేయజాలాకృతి । న్మలినంబై గగనాతితాఁసు వగుచు, న్బాహాసుదృక్పక్ష్మప । జ్త్కుల నెంతేఁ బునరుక్త సాంద్రములు గాఁ, దోడ్తోడఁ గావింపుచు । న్గలయ న్సర్వహరిన్ముఖంబుల సమ, గ్రస్ఫూర్తిఁ గప్పె న్రహిన్ ॥ ౩౪౨ ॥ (చ) పొలుపుగ మాధవానుచర, భూపతులాక్రూట వైరులం బలె । న్బలువిడి సింహపోతములఁ, బట్టి వధించి యుదీర్ణ తేజులై । కలితవనేభమస్తకని, ఘాతనఖాగ్రవిముక్తమౌక్తికోల్ల । లితగుహాగృహంబుల న, లంకృతులై వసియించి రెంతయున్ ॥ ౩౪౩ ॥ (మ) వికసచ్ఛ్యావకపంకపింగఫణిభు, క్పింఛావచూడాగ్రము । న్వికసత్త్రో

టిపుటాగ్రదష్టభుజగ, ప్రేంఖితపతాకాకృతమ్మా । సకలోద్యత్ఖగకేతుదం
డమె యభిజ్ఞానంబుగా నేగి భూ । పకులుఁ గొందఱు కృష్ణమందిర
ముఁ గేవలఁ జేసి రావాసముల్॥ ౩౪౪ ॥ (చ) జనమతివర్తమానత
రు,శాఖల నీడఁ బరిత్యజించి చ । య్యన నటుఁ జేరె భావిసమ,యం
బున రాఁగల యట్టి నీడలన్ । మునుకొని వృద్ధినొందఁ గల,భూరిత
రాశ్రయ మాశ్రయింప కెం । దును గడు క్షీయమాణ మగు, తు
చ్ఛతరాశ్రయ మాశ్రయింతురే॥ ౩౪౫ ॥ (ఉ) మున్నుగ నేగి యొ
క్కఁడొక, భూరి నివాసము నాఁగి యన్యులం । గ్రన్ననఁ జేరకుం
డఁ జులు,కన్ నిరసింపుచు దవ్వుల న్వడిన్ । బన్నుగ నొందుచోటికి
టు, బాగుగ నేగెడు నాత్మయోధులన్ । జెన్నుగఁ జేయి వీచి పిలి,
చెం బలుమాఱుఁ బ్లుతస్వరంబునన్॥ ౩౪౬ (చ) అపుడు సుధార
సోక్షితము,లైన తెఱంగున సారెసారెకా । తపపరితప్తసర్వజన,
తాపము దీఱ్చు వనాగముల్మరు । చ్చపలచలత్పటాభరణ,శాస్త్రములై
గిరిజాతకల్పపా । దపములఁ గూడి చిత్రఫల,దంబులునై విలసిల్లె నెం
తయున్॥ ౩౪౭ ॥ (చ) తరమిడి సొవిదల్లు లటు, దవ్వులకుం బెఱవా
రిఁ దోలఁగా । నురుతరభద్రయానముల, నుండి తగ న్బరిచారికాజ
నుల్ । పరువడి డించుచోఁ గళిత,భవ్యతరాంకుశలైన రాజసుం । ద
రుల ముఖాగ్ర్యసంపద జ,నంబు క్షణంబు గనెన్ భయేచ్ఛలన్॥౩౪౮॥
(చ) రథతురగేంద్రదంతిగత,రాజపురంధ్రుల డించుచు న్నరం । బధి
కృతు లాత్మకంధరస, మరి తతన్మృదు బాహువల్లులై । ప్రథితము
గాఁగ గాఢపరి,రంభణసౌఖ్యమె గాని పొందరై । రధరకపోలచుంబ
నసు, ఖాప్తిని భూరిశుచిత్వసంపదన్॥ ౩౪౯ ॥ (శా) వ్యాకీర్ణస్ఫుట
మాల్యశారము జితో,ద్యద్బర్హభారంబునై । వీఁకం బొల్చు నెలంత



కేశభరము, స్వీక్షించెనో నాఁగ బల్ । కేకు ల్క్రమ్మఁకుల మీఁదనుండి
యుఱికెన్, గ్రీడించి సంఘర్షలీ । లోకంబందు రహీన్గుణాధికులనా,
లోకింపఁగా నేర్తురే ॥ ౩౫౦ ॥ (చ) పటుతరరోచమానరుచి,భర్మచ
యాంశుపిశంగితాశముల్ । చటులనిరంతరాయతవి, సారితముల్ఘన
వంశకేతనో । ద్భటపరిచుంబితాంబుధర,పఙ్క్తులునైన రథంబులత్తఱిన్
। ఘటితనగేంద్రపాదముల, క్రైవడిఁ జూడఁగ నయ్యె నెంతయున్॥
౩౫౧ ॥ (సీ) ఛాయాకరంబు లు,చ్ఛాయవంతంబులు నుజ్జ్వితభూ
తిశో,భోత్కరములు । సలలితబహుళపా, టలధాతురాగము ల్విమ
లతారావళి,విరచనములు । నగు గజంబులచేత, నటుదూష్యములచే
తఁ బోలె రాజనివాస, భూము లలరె । నృపకాంత లుత్క్షిప్త,విపుల
కాండపటావకాశలీనాలస,గంధవాహ॥ (గీ) చలనశమితాధ్వఖేదసం,
జనితఘర్మ । తోయలై చారుపల్లవ, స్తోమరచిత । మంజులాస్తరణో
పేత, మహితవసన।సదనములయందు సుఖనిద్ర,సలపి రపుడు॥ ౩౫౨॥
(చ) అతులితసాంద్రఘర్మసలి, లార్ద్రసువర్ణసవర్ణగాత్రసం । గతన
వచోళముల్ క్షతన,ఖక్షతమా నటు విచ్చివైచు యా । వతము ప్రకా
శమానపృథు, భారపయోధర బాహుమూలమై । చతురత విం దొ
నర్చెఁ బెలు,చన్ క్షణ మయ్యువనేత్రపఙ్క్తికిన్ ॥ ౩౫౩ ॥ (వ)
మఱియు వణిగ్జనంబు సేనానివేశంబుకంటెమున్నుగా నవ్యగ్రు లగుచు
నేకకాలంబున నుభయపార్శ్వంబులందుఁజాలుగాఁ బటమంటపంబులు
విస్తరింపం జేసి పర్యాపతత్క్రయికలోకంబు గల్గునట్లుగా నసంఖ్యే
యక్రయ్యాపణ్యద్రవ్యపూర్ణపణ్యప్రసారణస్థానంబులగు పణ్యవీధులుప్ర
కాశింపఁ జేసిరి కొందఱు పురుషులు ఫలనిమిత్తకృతమహాప్రయత్నులు
ను సముద్యతమృత్పిండదండకాష్ఠులునైయొక్కశశంబును వధించుటకుఁ
జుట్టు ముట్టి యవరోధించిన నదియనోకహజాలమధ్యంబున నుండియు

తిసాధ్వసంబునంబఱచునెడ వేఱొక్కపురుషుండువారినందరినివారించి
చాని రక్షించి మహోత్కర్షంబు నధిగమించె నప్పుడు॥ (మ) జనసం
దర్శనభీతిచే వసనవే, శ్మస్థానమధ్యంబునన్। ఘనశక్తిం బరువెత్తు లేడి
శరభృ, త్కాండంబుచేఁ జిక్కనోం। దని దయ్యెన్ సదనాంతరస్థలల
నో,ద్యత్కర్షవిశ్రాంతశో । భనన్రేతేషువాతాక్షిలక్ష్మియయి ని,ల్వం
జూడ దెప్పట్టునన్ ॥ ౩౫౪ ॥ (సీ) వితతలావణ్యాని,ర్జితదేవవేశ్యలు
నరమానసాకర్ష,ణస్వభావ । లుచితనర్మవచోభి, రచనాచమత్కృ
తుల్వే శ్యలు సైన్యంబు, విడియు నంత । రమ్యావసథములు, రచి
యింపఁగాఁ బంచి లలితప్రసూనత, ల్పము లమర్చి । మార్గఖేదంబు
ను, మదిఁ దలపోయక సింగార మొనరించి, చెలువు దాల్చి॥ (గీ)
యలసి చనుదెంచు పురుషుల, వలచి తెచ్చి । రమణతోడ శైత్యోప
చా, రము లొనర్చి । పరఁగఁ జిరసన్నివిష్టల, కరణి వారి । చిత్త
ములఁ బ్రీతి రంజిల్లఁ, జేసి రపుడు॥ ౩౫౫ ॥ (గీ) జలము ద్రావి
క్రుంకులు వెట్టి, జలజములు ధ । రించి తూండ్లు భుజించి వా, రిం
చి రఖిల । జనులు శైలసరిత్సంప, దనుప భోగ । నిష్ఫలత్వదోషో
ద్భూత,నింద నపుడు॥ ౩౫౬ ॥ (చ) అతివల నిమ్ననాభిసలి, లాశ
యభిన్నరయంబులుం దదం । చితవిలసద్భ్రుహజ్జఘన, సేతునివారిత
ము ల్నదత్సుసం । భృతజలమందుకాఖ్యపట, విశ్రుతవాద్య మనోజ్ఞ
సంచల । త్తతకుచవిచ్యుతంబులగు, తజ్జలము ల్ప్రవహించె మంద
తన్॥ ౩౫౭ ॥ (చ) మసలకహస్తికంబులు స,మగ్రవిలోలకరాగ్ర
రంధ్రకో । ల్లసితజలప్రవృష్టి నవి,లంఘితభూరి పథశ్రమాయత ।
శ్వసితమరున్నిరస్తసువి,శాల శిరోభవ శుభ్రరుగ్మణా । విసరముచే
తఁ బోలెఁ గడు,వేడుకఁ జల్లుకొనె న్శరీరమున్॥ ౩౫౮ ॥ (ఉ) ఎ
య్యవి పక్షము ల్గలిగి, యేపున వారిధిలో మునింగె ము । న్నెయ్యవి శక్ర వజ్రహత,జృంభితపక్షములై చలింప లే । వయ్యె ధరిత్రినట్టి
గిరు,లన్ని కొలంకులలోనఁ గ్రుంకఁగాఁ । జయ్యన నేగి వీతకుథ,సం
భృతకేతు గజచ్ఛలంబునన్ ॥ ౩౫౯ ॥ (గీ) దంతి జలభంగమునఁ
దోఁచు, తనదునీడ । గాంచి ప్రతినాగ మెదురుగాఁ, గదియ వచ్చు
చున్న దని కినకచే వేగ, నుఱికి నీటఁ । బడియె ముగ్ధత నదిస్వభా,
వంబు గాదె ॥ ౩౬౦ ॥ (చ) పరగజరాజముక్తమద,వారిసువాసి
తమైనతోయము । న్నిరగతి సంగ్రహింపఁగఁ ద్య,జింపఁగ లేక నిరం
కుశస్థితి । న్సరిదవతార మాఁగి పెలు,చ న్గరియింపక యున్న రో
షభృ । త్కరిని జనంబు గన్గొనియె, దవ్వుల రిక్తఘటాగ్ర హస్తమై॥
౩౬౧ ॥ (మ) తరుణీ చూడుము మోఁల నాగము భవ, ద్వక్షోజ
యుగ్మంబు స । త్వరతం గాంచి ప్రతీభకుంభ యుగళ, భ్రాంతిన్
మదోద్వృత్తి దు । ర్భరతిర్యగ్రదసంప్రహార మొనరిం,ప న్వచ్చెడు
న్వీడు మీ । తెరువంచు న్ప్రియురాలితోడ విటుఁ డెం,తే భీతిఁ బ
ల్కె న్వడిన్ ॥ ౩౬౨ ॥ (చ) తతకరటప్రరూఢమద,తాపగద ప్రశ
మార్థముద్యతా । యతకరశాఖలం గటము,లందు వికీర్ణము లాశ్రుతి
ద్రుతో । త్పతనములున్వికాసి సము,దంచితకాశసుమప్రభంబులౌ । వి
తతజలంబులొందెఘన,విశ్రుతపాండురచామరాకృతిన్॥ ౩౬౩ ॥ (చ)
పరిగతదానతోయపర,వారణమారుతమాట నీసున । న్నరముఖపూర
ణంబునెగఁ,జల్లుగజంబులసత్సరస్తట । స్థిరప్రథిమానరుద్ధరద,దీర్ఘ చల
న్మసలప్రదేశమై । పరువడి నీటిలోఁబడియె, వైరిగుణంబు సహింప రె
వ్వరున్॥ ౩౬౪॥ (గీ) కమలములఁ గ్రుంకఁ జను దంతి,కటతటంబు। వ
దలి వేఱొండు కడకేగె, భ్రమరగణము। దానదాయిజలావృతుం,డైన
న విద్య । మానగతికుండు నిలుచునే, పూని యచట॥ ౩౬౫ ॥ (మ)
వనమధ్యంబునఁ గ్రుంకు దంతి కటము,న్వర్జించి సింగిన్ గృత । స్వన

మై విస్తృతవక్షమూల మగుచున్, షట్పాదసంఘంబు గ్రా స్సనభా
సిల్లె గుణంబు ద్రవ్యగతమై, నన్ స్వాశ్రయం బర్థిఁ జా । సిన త
ద్వారణనీలవర్ణము క్రియన్, జీమూతతుల్యద్యుతిన్॥ ౩౬౬ ॥ (చ)
ఘనగజ గాత్రలగ్నబహు, గైరికధాతు పరాగరాగమున్ । ధునిప
యిఁ బర్వఁ దద్వికచ,తోయజగుచ్ఛహరిత్పరాగమున్ । ఘనకరిమీఁ
దఁ బర్వఁ జిర,కాల్మము క్రీడ యొనర్చి వస్త్రమును । ల్మునుకొని మా
ర్చికొన్న క్రియఁ, బొల్చెను దత్తటినీమహేభముల్॥ ౩౬౭ ॥ (చ)
ద్విరదములుం జలోపరిని, విష్టమదోదకచంద్రకంబులన్ । వరుస మ
హాసరిత్తులకు, వారక నేసృథు నేత్రసంపద । న్గర నొనఁ గూర్చె
దానినె వ, నంబులఁ బాసి తటంబుఁ జేరుచున్ । మరల గ్రహించె
గాత్రగత,మంజునవోత్పలపత్రకంబులన్॥ ౩౬౮ ॥ ( చ ) వితతశి
తాంకుశప్రబల, భిన్నవిశాలకపోలనిస్సరత్ । క్షతరుహమయ్యు రో
షమునఁ, జయ్యన నన్యగజంబు మీఁదికిన్ । జతురత నేగుదంతిని ని,
షాది మరల్పఁగఁ జాలఁ డయ్యె ను । ద్ధతి బలవంతుఁ డన్యులకుఁ
ధారుణి లోఁబడునే తలంపఁగన్ ॥ ౩౬౯ ॥ (ఉ) సానునయంబు
గా నొక ని, షాదిగజంబును బంధనార్థమై । పూనిక సేవ్యమైనత
రు,మూలము సేర్చిన నన్యదంతిరా । డ్దానకృతాధివాసమగు, దాని
భజింపక త్రుంచి వైచె బ । ల్మానులు వైరిగంధలవ,మాత్రమునైన
సహింతురే భువిన్॥ ౩౭౦ ॥ (ఉ) సంతతశైలకుంజచర, సామజ
రాజకపోలకాషసం । క్రాంతమదోదకం బగుట, రమ్యచమూగజభ
గ్నమైన వృ । క్షాంతమునందుఁ గ్రాలెడు ల, తాంతము లన్నియు
వాడెఁ దుమ్మెదల్ । పంతము మాని నిస్పృహత, వచ్చిన త్రోవనె
పోయెఁ గ్రమ్మరన్॥ ౩౭౧ ॥ (ఉ) ఎప్పుడు దంతు లున్నతమ,హీ
రుహమూలముల న్వసింపఁ బో । వప్పుడు యంతృచోదితము, లై



మృదుశాఖల బంధనార్థమై । చెప్పెడి దేమి బల్మి విఱి, చెం దమ
యంతనె తాము తద్విధం । బొప్పగఁ గాదె యాత్మహిత, యుక్తి
నెఱుంగుదు రేనుదాంధకుల్॥ ౩౭౨ ॥ (మ) ఉరుకాయంబులుస్థూల
మస్తకముల,త్యుష్ణాంబుముగ్వక్త్రముల్ । స్ఫురదంతఃప్రబలోష్మముల్,
ప్రవిలస,ద్భూత్కారము ల్నీలవు । ష్కరజన్మోదరతుల్యకాంతులగు
నా,గశ్రేణులం గొన్నిటిన్ । వరుసంగట్టిరికొన్నిటిన్ దవులఁబో,వం
దోలి రాసైనికుల్ ॥ ౩౭౩ ॥ (మ) కటకంబూయది భేంద్రభూరిమ
దివా, ర్గంధిద్రుమస్కంధసం । ఘటితస్థూలమహేంద్రనీలమణిరే, ఖా
కోమలశ్యామలో । ద్భటభృంగీవలయంబుచే నవుడు గ్రీ, వాభూషణ
త్వంబుఁ బ్ర । స్ఫుటభంగిన్ రచియింపఁగాఁ బడియెనా, మోదంబు
సంధిల్లఁగన్॥ ౩౭౪ ॥ (చ) చెలఁగినిరస్తవీతమయి, చిక్కక పారె
డు బాలకంబు ను । జ్వలగజశాస్త్రపద్ధతి ని,షాదిసుసాంత్వనతర్జనా
దుల । న్మెలఁపున మెల్లమెల్ల వశ,మింపఁగఁ జేసెఁ గ్రమక్రమంబున।
న్వలనుగ నిశ్చితాత్ములగు,వారికి శాస్త్రము సిద్ధి నీయదే॥ ౩౭౫॥ (మ)
చతురత్వంబున సంతతోచితమహా, స్తంభంబు వర్జించె ను । న్నతి
మీఱ న్వరసాగ్రహస్త మగుచున్,దానంబు నపేక్షించె వి । శ్రుతబద్ధా
పరశృంఖలంబుల వడిన్,లూనంబు గావించె నీ । గతి దంతావళరా
జు పొందె నవిశం,కన్ జాల స్వాతంత్ర్యమున్ ॥ ౩౭౬॥ (సీ) వెల
యంగ గంభీర, వేదికరీంద్ర ముద్ధత యంతృ పరుష చోదనల చేత।
నైననుముకుళీకృ,తాక్షుమై కబళంబు గొనకున్నవీక్షించి, జనముల్లెల్లఁ।
గడుమందుఁడైనను,ఘనబలుండేనిచేసినవశంగతుఁడుగాఁ, డనియొతిం
గి । రొక వారణేంద్ర ముత్సుకతఁబుగోనిహితేక్షుకాండంబుగ్ర,హిం
పకంతి॥ (గీ) కస్థసామజకాంతపైఁ, గాంక్షయిడక । హస్తిపకుఁ డే
మి చెప్పిన, నాలకింప । కతఁడు లటుమూసి యిచ్ఛావి,హారయోగ్య ।

చారువనవాసమహామునే, సంస్మరించు॥ ౩౭౭॥(వ) మఱియు సముద్యతకరతల నిహితపిధానపిండఘృతాదినివ్యంజనాప్లుతభుజుండైన యాధోరణుండు సముత్తుంగాగ్రకాయంబగు దానిఁ గబళగ్రహణంబుకొఱకు సప్రమత్వంబువహింపని దాని మహేభరాజంబు నతికష్టంబుగా భుజింపం జేసెనప్పుడు శుక్లాంశుకోపరచితంబులును రశ్మివితతంబులును జంద్రాకారంబులునైన రాజదూష్యంబులు నిరంతరగజమండలంబులచేతఁ బరివేష్టితంబులై నీలజీమూతపఙ్క్తి పరివేషంబునొందిన వాని తెఱంగునం జూపట్టె నదియునుం గాక॥ (చ) అతిగమనోనమార్గగతి, యయ్యును జాలగతోరుమార్గమై । వితతబలోదయోల్లసిత, ఫేనవికారజలానుసారసం । ప్రతిపరిలక్ష్యపల్యయన, వర్ధిపదంబయి పొల్చువాజిసం । తతి నటు వేల్ల నార్థము ప, దంపడి త్రిప్పిరి సాదులొయ్యనన్॥ ౩౭౮ ॥ (చ) పరువడి బాహ్లికాశ్వము స్వ, భావమునం బ్రణతోత్తమాంగమై । కర మరుదార మూరొ్కనిన, ఘ్రాణవిరోకమరుత్సమృద్ధసూ । క్ష్మరజము తన్మనోజ్ఞతను, సంగసుఖానుభవోత్సుకోర్విసుం। దరపులకాంకురత్వమును, దాల్చిన భంగిఁ జెలంగె నత్తఱిన్॥ ౩౭౯ ॥ (శా) రాజత్కాంచనభూమిభాగములఁ బ, ల్మాఱుం బ్రచారించి వి। భ్రాజత్కంపితగాత్రమాట వితతో, ర్ధ్వవ్యాప్తరోమాళియై । వాజీంద్రంబు శిఖాకణారుణరుచి, వ్యాకీర్ణ పాంసూల్లస । త్తేజశ్శేషముచేతఁ బోలె మిగులన్, దీపించెఁ జిత్రంబుగన్ ॥ ౩౮౦ ॥ (మ) పురుషస్థానసముద్యతాగ్రతనువై, పూర్వాచలేంద్రంబుపైఁ । గర మర్ధోదితమైన భానుని తురం, గశ్రేష్ఠముం బోలుసుం । దరశ్రీవృతుకివక్త్రరజ్జుధరణ, స్థైర్యోరుపాణిద్వయాం। తరుఁడౌ వల్లభపాలు మీఱుట కశ, క్తంబయ్యె నొక్కింతయున్॥ ౩౮౧ ॥ (చ) చెలువుగ నొక్కవీతి యభి, షేచనసాంద్రతరార్ద్రగాత్రమై । నలువుగ శ్రీసమక్షమున, నాకనివా



సిజనంబుచే బలె । న్బలుమఱు తెప్పవేయని జ, నంబులచేత నిరీక్ష్యమాణమై । జలనిధిఁ బుట్టి వచ్చు ఘన, శక్రహయాకృతి నొప్పె నెంతయున్ ॥ ౩౮౨ ॥ (చ) హరితతృణంబు మేయు నపు, డంచితభంగి గళాగ్రలోలసుం । దరనవకింకిణీకకల, నాదవిమిశ్రహయేంద్రదంతబుర్బురనినదంబు సంభ్రమస, ముత్థితమై పరివీతనిద్రమా । నరవర పాళిచే నటు వి, నంబడియెన్ గడు హృద్యవైఖరిన్॥ ౩౮౩ ॥ (చ) తరమిడి యొక్క తేజి కడు, దర్పమునం జలియించి త్రొళ్లతో । నురువడిఁ గీలముం బెఱికి, యుద్ధతిఁ బాఱినఁ జూచి బల్విడి । న్మఱియొక తేజి యత్నపర, మానవ దుర్గ్రహమై తురంగియం । చఱి ముఱి వెంటఁ బారి వెస, నాకుల మందఁగఁ జేసె మందురన్॥ ౩౮౪ ॥ (వ) మఱియును శ్లిష్టాశిథిలోత్తరవతీమందావైహాయస్యాది చతుర్దశవల్గాప్రభేదవిశారదుండును షడ్విధప్రేరణాభిజ్ఞుండునైన యొక్క వాహకుం డవ్యాకులంబును సజ్జీకృతంబును హయచతుష్కాఖ్యగతివిశేషంబునందు ముఖసంస్థానవిశేషాదివిశేషణవిశిష్టంబునైన జాత్యశ్వంబును యుద్ధాభ్యుత్తరకాలవిధేయక్రియారూపంబులును నసంకీర్ణరూపంబులు నగు నాస్కందితధౌరితకరేచితవల్గితప్లుతసంజ్ఞలుం గల పంచధారలును లక్ష్మీమధ్యాదీర్ఘాభిధాన త్రివిధమార్గంబులును బరిచయంబు సేయించుటకు సమోన్నతవిషమాంబుకీర్ణశుద్ధానతాగ్రతృణవీరుదాఢ్యస్థానుప్రకీర్ణోపలసంప్రకీర్ణపార్శ్వోన్నతసంజ్ఞలుం గల నవవీధులయందు సంచరింపం జేసె నప్పుడు॥ (చ) మునుకొని భక్షణార్థము వి, ముక్తములై కటకంబుఁ జుట్టిపె । ల్చనఁ దృణము న్భుజింపుచు వి, శాలపటక్షయరజ్జుపాళి దుంిం । చినఁ బరిచారకుల్గినుక, చే నదలింపఁగఁ బారె నశ్వము । ల్ఘనపదపాశభేదన చ, లచ్చరణంబులు గల్గునట్లుగన్॥ ౩౮౫ ॥ (సీ) పరఁగ సముత్తీర్ణబాహ్యా

ధూళిఁగప్పు వయ్యు భూరిబల్బజతృణ, ప్రాతిఁజవలన । నతిదుస్సహం
బైన యాతుకం బగముల క్రింద లోమంధక, షండ సంచ । లద్గురు
సాస్నమై, లక్షింప ముకుళీకృతాలసాక్షులు గల్గు, నట్లు ప్రీతి । నివ
సించె మఱియుఁ గొ,న్నివృషంబు లఱుచుచుఁ గలితమృత్పిండ శే,ఖరి
తకోటు॥ (గీ) లగుటఁ గోట్యంతరగతాంకుఁ,డైన యర్థ । కమల
వైరిని గేరు శృం,గములచేత । సంతతోచ్ఛృంగితాన్యవృ,షంబు లగు
చుఁ । దటిని తీరంబు గ్రోరాడె, దర్ప మెసఁగ ॥ ౩౮౬ ॥ (మ) త
గ నూర్జస్వలమైన యొక్క వృష ము,ద్యచ్ఛక్తిచే మాంసలో । పగ
తాభీకపరోక్షసంచయములం, బల్మాఱు నిర్జించి జ । న్యగతానూ
నజయోద్ధురాయతవిషా, ణోగ్రంబులుం గల్గు న । ట్లుగ తారివ్రజ
మై తమిం జనియెగో,లోకంబు వెంట న్రిహిణ్ ॥ ౩౮౭ ॥ (మ) స
ముదగ్రీనన షాయతావ్యథమహోష్ట్రా,చ్ఛగ్రీవమై చూడనౌ । ష్ట్ర
మహోష్ట్రవ్రజమభ్రచుంబ్యభినవ,ప్రౌఢ్యద్ఘ్నాస్వాదవం । తముతో
మంజులపల్లవపరిచయము,ద్దత్పర్వతాధిత్యకా । ద్రుమజాలంబుల మీఁ
దనుండి తిగిచేన్, లోలోష్ఠము ల్గల్గఁగన్ ॥ ౩౮౮ ॥ (గీ) మఱియు
నొక యుష్ట్రి ముచితనిం,బచ్ఛదప్రి । విష్టమృదులామ్రపత్రంబు, వెడ
లఁగ్రక్కె । మున్ను గరుడుండు మ్లేచ్ఛస,మూహమిశ్రి । గళగతమ
హీసుపర్ణునిఁ, గ్రక్కి నట్లు ॥ ౩౮౯ ॥ (గీ) బయలనున్న భృత్య,
పాళితో రాజుల । వార్త లెఱుఁగఁ బల్క, పాఠకులును । విపులఫ
ణితిఁ బ్రకటి,తపదార్థమా నట్లు । పాడి రవసరప్రి,బంధతతుల ॥
౩౯౦ ॥ (ఉ) ఉన్నతధాతురాగ విపు,లోచ్ఛ్రిత వస్త్రి కుటీర యుక్త
మై । పన్నగ నంజ వాభగజ, భాసితమై ఘనసాంధ్య రాగసం । భిన్న
పయోదకర్బురిత,విశ్రుతచారునభంబు కైవడి । న్సన్నుత లీల నొప్పె
హరి,సద్మము భూరిమనోహరాకృతిన్ ॥ ౩౯౧ ॥ (మ) విలసత్త్రై



న్యపినద్ధమై కుధర మొ,ప్పెన్ దంతిభగ్నద్రుమా । వళిశబ్దంబులఁ గృ
ష్ణ నీవునలువా,ప్ప న్సర్వతోద్ధర్జవం । చిలఁ బ్రఖ్యాతి వహించి
నాఁడ విపు డి,ట్లేలా ననుం గిన్క నా । కులపాటొందఁగఁ జేసె
దంచు వెస నా,క్రోశించు చందంబునన్ ॥ ౩౯౨ ॥ (ఉ) సౌరమ
హీధ్రధీర సుర,సన్నుత శౌర్యవిహార వార్ధిగం । భీర మదోద్ధతారి
గణ,భేదనదక్షభుజప్రచార గో । త్రారికుమారమారభుతు,రాజమ
నోజ్ఞశరీర సద్యశః । పూరితలోకవార గుణ,పుంజవిభూషణ మంజు
భాషణా ॥ ౩౯౩ ॥ (క) నారాయణాంశభవ సుగు । ణారామ
వసంత వితర,ణామరభూజా । సూరిజనస్తుతమదనా । కారా గో
పాలకృష్ణ,కరుణోదారా॥ ౩౯౪ ॥ (మాలినీ) పరహితసుచరిత్రా,
పండితస్తోత్రపాత్రా । తరణిసదృశతేజా,దండితద్విట్సమాజా । ప
రిచితబహువిద్యా, భవ్యసౌందర్యహృద్యా । నిరుపమగుణజాలా, ని
త్యకళ్యాణశీలా ॥ ౩౯౫ ॥

( గద్య )

ఇది శ్రీరామచంద్రకరుణాకటాక్షలబ్ధ విద్యాసాంద్ర గోపి నాథ వేంకటకవీంద్రప్రణీతంబైన శిశుపాలవధమహాకావ్యంబు నందు నారదాగమనంబును శ్రీకృష్ణసందర్శనంబును హిరణ్యకశిపుదశగ్రీవప్రభావవర్ణనంబును శిశుపాలవధపూర్వకంబైన శక్రసందేశంబు నారదుం డెఱింగించుటయు నుద్ధవబలరామసమేతుండై కృష్ణుండు మంత్రంబు గావించుటయు నింద్రప్రస్థయానంబును రైవతకపర్వతవర్ణనంబును రైవతకాద్రిప్రవేశంబును గజరథహయాదివర్ణనంబు నను కథలం గల ప్రథమాశ్వాసము సంపూర్ణము. శ్రీకృష్ణ.

## శ్రీరస్తు.

# శిశుపాలవధమహాకావ్యము.

## ద్వితీయాశ్వాసము.

(క) శ్రీరాధారమణీశా । పారక్యపాలబ్ధ రాజ్య, వైభవ జగతీ । హారాయమాణకీర్తి వి । హారా గోపాలకృష్ణ, యాచనరేంద్రా ॥ ౧ ॥ (వ) అవధరింపు మవ్వలి కథ యెట్లనిన నిట్లు సేనానివేశనంబు గావించిన యనంతరంబ॥ (గీ) ధరముపయిఁ గ్రీడ సలుపంగఁ, దలఁచు సాధు । హితకరునిఁ గృష్ణు సేవింప, ఋతుసమూహ । మేకకాలంబునందె స్వీ,కృతయథాస్వ । వృత్తఫలపుష్పమగుచు నా,విర్భవించె॥౨॥ (గీ) నవపలాశపలాశవ,నంబు మఱియుఁ । బటుపరాగపరాగత,పంకజంబు । మృదులతాంతలతాంతమై, మెఱయు కుసుమ । సురభిసురభిని గృష్ణుండు, చూచె నపుడు ॥ ౩ ॥ (గీ) విలుళితాలకనికరమై, జలజముఖుల । యొడలి చెమ్మట లార్పుచు,నుత్పలములు । తరళత వహింప సరసుల, తనుతరంగ । విసరము చలింప వాయువు, విసరె నపుడు॥ ౪ ॥ (గీ) లలితకురువకస్తబక సం,కలిత మగుట । గుణవదాశ్రయసంలబ్ధ, గుణము నైన । భృంగి యందలి మలినిమ, కృష్ణయువతి । జననయన తారకాస్ఫూర్తి, ననుకరించె ॥ ౫ ॥ (చ) సలలితహేమవర్ణ నవ, చంపక మధ్యగతారుణప్ర



భా । విలసదశోకపుష్పము వి,భిన్నవియోగవతీ విశాలహృ । త్కలిత మనోజబాణశిఖ,గాఢశిఖాకపిశీకృతస్ఫుటో । జ్జ్వలపిశితంబు చందమున, వావిరిఁ జూడఁగ నయ్యె నెంతయున్ ॥ ౬॥ (క) సురసాల రజఃకణములు । స్మరవహ్నితుషాగ్నిచూర్ణ సమ,తఁగనిన వై । ఖరి వెసఁ బాంథజనులపైఁ । బరిపతితములై యొనర్చెఁ బరితాపంబున్॥ ౭ ॥ (క) పతులపయిఁ గుపితలైన యు । వతుల యలుక దీర్పమరుఁడు,పంపె నన మధు । వ్రతపాళి వెడలె వకుళ । క్షితిజసుమ మరంద పాన,కృతనిస్వనమై ॥ ౮ ॥ (చ) గురుతరమత్సర చ్ఛిదుర, కోమలవాక్పర పుష్టకాంతచే । గిఱికొని చెంగటన్ బ్రియస,ఖిసదృశం బగు నట్లు పథ్యమున్ । గరము పదిష్టలై సురత, కాంక్షమెయిన్ బ్రియులైన వారికిన్ । వరుస నయాచితం బయిన, వర్త మొసంగిరి కామినీమణుల్॥ ౯ ॥ (గీ) పరఁగ నళులచే నపవాద, కరులచేతఁ । బోలెఁ బధికులు మృగముల, లీల మధుర । వల్లకీస్వరజిద్గీత,వైభవమున । నలరి స్మృతిభావశంగత,లైరి యపుడు॥ ౧౦ ॥ (చ) చెలువుగ నొక్క యిందుముఖి, చేఁ గుసుమాపచయార్థ మింపు సొం । పలర రసాతిరేకమున, నట్లవలంబిత మయ్యె సంభ్రమం । బొలయ వనాగమున్ వశత, నొందని దౌట వృధోన్నతాకృతిన్ । జెలఁగి యసత్య పుంస్త్వమునఁ, జెన్ను వహింపక యుండె నత్తఱిన్॥ ౧౧ ॥ (వ) మఱియు నొక్కపురుషుండు స్వయంగ్రహాశ్లేషసుఖంబు కోలుకుఁ బ్రియురాలి నళిపాతవ్యాజంబున భర్త్సింపుచు నిట్లనియె॥ (సీ) స్తనయుగ్మభరవిజి,తస్తబకానమ,త్ప్రత్యగ్రవల్లిని, రాగియైన । యీ మధువ్రతకులం, బెలమిఁ బరాగవంతములైన నవపంక,జములు విడిచి। మునుకొని నీకబ్జ,ముఖము గాఁ జరియించుచున్నది సమ్మోద,యుక్త మగుచు । భవదీయసురభిని,శ్వసితమందును సుధారసవేణి మధురాధ,

రంబునందుఁ॥ (గీ) దృష్టి నొందిన యాచంచ, రీకనిచయ । మునకు నాకును బోలె సౌ,మనసగంధ । రసము లాత్మకు సంతోష, మొసఁ గఁ జాల । వయ్యె నేమని చెప్పుదు, నంబుజాక్షి ॥ ౧౨ ॥ (గీ) అనుచు నిబ్భంగిఁ జతురోక్తు, లాడు ప్రియుని । గురుభుజోన్నమనో రువ,క్షోజ యగుచు । వళియుతోదరరుచులుపైఁ, బొలయ నళికిఁ । గాంత వెలిచిన కైవడిఁ, గౌఁగిలించె॥ ౧౩ ॥ (గీ) వదనసౌరభ లోభవి,భ్రమదళీంద్ర । సంభ్రమార్జితశోభమై, చలిత యగుచు । నన్యసతి చేసె నలకలో,లాక్షు లలరఁ । గరమతరమేఖలాకల, కలకలంబు॥ ౧౪ ॥ (మ) వినతు ల్చేసి ప్రియు ల్మనోర్తు లగుచు, న్స్వామిఁ బ్రార్థింపఁ గై । కొన కెవ్వా రభిమానితన్ బెరసి మి,గ్గ ల్చేసి రాయా దవాం । గన లెల్ల న్మధుమాస మాట మిగులం, గా మాస్త్ర సంతప్తలై । తనియం గౌఁగిటఁ జేర్చి రట్లు దమయం,తం దామె ప్రాణేశులన్॥ ౧౫ ॥ (గీ) సూనకార్ముకకార్ముక, చ్యుతశితాస్త్ర । పాటితశరీరలై గత, భర్తృకలగు । సతులు కొందఱు గడసిరి, సారెసారె । కలసి మూర్ఛితలై రని, పలుక నేల॥ ౧౬ ॥ (వ) ఆసమయంబునఁ బ్రోషితభర్తృకయగు దాని నొక్కతన్వి నాశ్వాసింపుచు బాంధవు లిట్లనిరి॥ (గీ) అశ్రుమోక్షంబు భవదాన, నాబ్జలక్ష్మి । కరయ సమ్యగలంకృతి,కొఱకు నిక్క । మైనను వసంత మహము సం,ప్రాప్త మయ్యెఁ । గాన నిప్పుడు దుఃఖింపఁ,గాదు తన్వి॥ ౧౭ ॥ (చ) తలుచుగ నీవెలంది మరు,తాపముచే ననువు ల్త్యజించుదు । భర్తరమతకష్ట మంచు వెస, బాంధవు లిష్టత నాడు నట్టి సుస్థిరతరవాక్యము ల్నిజము,సేయకు మమ్మని జేశుఁ డాత్మలో । మలువఁడు మాధవోత్సవము,మానక యిప్పుడెవచ్చుఁగోమలీ॥ ౧౮ ॥ (క) అని యిటు బంధువితతి చె । ప్పిన ఋతవచనములచేత,వెలఁదుక బయలన్ । దనపతి కంఠస్వరమున్ । విని యమృతము చేతఁ బోలె, నిర్వృతినొందెన్॥ ౧౯ ॥ (క) మధుబోధితవాసంతీ । మధుమేధితమేధమైన, మధుకరరవభృ । న్మధురమధు వ్రతభామిని । మధురంబుగ గాన మపుడు, మానుగఁ జేసెన్॥ ౨౦ ॥ (క) అరుణితసకలాద్రివనో । త్కరమై పథికజనతాప,కరమై వికచ । స్ఫురదురుకింశుకసంహతి । యరుదార వహించె దవహు,తాశనశోభన్ ॥ ౨౧ ॥ (గీ) పరఁగ నెప్పుడు శైరీష, పాంసురుచులు । హరితురంగమలోమతు, ల్యత వహించె । నట్టి శుచికాల ముపగతం, బయ్యె మల్లి । కలకుఁ జిరగంధ మొసఁగుచు, లలితఫణితి॥ ౨౨ ॥ (గీ) స్వరమణీశ్వసితోపమ,సాంద్రదళిత । కోమలనితాంతపాటల, కుట్మలంబు । నున్మదోచ్చలి తాళిమై, యొప్పు గాఁడ్పు । బొలయ మదలౌల్య మొందెఁ గా,ముకజనంబు॥ ౨౩ ॥ (గీ) చంచలాక్షులు శత్రుణ,స్నపనజలతు । షార భృత్కుచములు ప్రియా, జనుల వక్షమందుఁ జేర్చిరి నెమ్మేన, నంచితముగ । సరసచందనరేణువు, ల్చల్లి రపుడు॥ ౨౪ ॥ (గీ) ప్రస్ఫురదధీరతటిదక్షి, భాసమాన । మగళితోరుపయోధర,మైన జలద । రాళి యనపేక్షితాత్మీయ, వేళ యగుచు । నద్రివిభువల్లభునిఁ బోలె, నధిగమించె॥ ౨౫ ॥ (క) జగతి నభోమాసంబున । గగనముపై దంతియూథ, కాలాభ్రములిం । పుగఁ గని యంగన యేప్రియుఁ । దగ నేకరసుం భజింపఁ, దలఁపదు బుద్ధిన్॥ ౨౬ ॥ (క) ధృతశక్రచాపవలయాం । చితఘనరుచి వివిధమణిర,చితకుండలభా । తతివళితాంశుకమగు శ్రీ । పతి గాత్రము ననుకరించె, భాసుర లీలన్॥ ౨౭ ॥ (గీ) ఘనసమీరణచలితమేఘములచేత । క్షణికలక్షితవ్యవహిత, చపలచపల । విటపములచేఁ దమాలపు,ష్పజసదృశ । గగన పాదపమంజరి, కరణి నలరె ॥

౨౮ ॥ (చ) స్ఫుటతరవాతసంచలిత, ఘూర్ణితఘనంబులచేత నింగి నం। తట తటిల్లక్షితవ్యవహిత, స్ఫుటచంచల యొప్పె నత్తఱిన్ । జటుల సమీరణోచ్చలిత, శాఖలచేతఁ దమాల సన్నిభో । త్కటగగనావనీరుహావి, కాసితమంజరిఁ బోలె హృద్యమై ॥ ౨౯ ॥ (గీ) పథిక యువతి యొకతె, ప్రాణసంశయ మొంద । ననయనోదకాళి, సంభ్రమమున । విధురబంధు వగుచు వీక్షించె నంబుద । పాళి నపుడు కరమ, బంధురముగ ॥ ౩౦ ॥ (గీ) విదళకందళ కంపనా, విష్కృతుండు । కామినీమానహరణుండు, ఘనపవనుఁడు । క్షితిని వనముల్ కంపింపఁ, జేసె ననఁగఁ । జెలఁగి విరహులఁ గంపింపఁ, జేయుటరుదె ॥ ౩౧ ॥ (గీ) పటుతరార్త్యయనినదసం, పదలచేతఁ । గృతసమాజ్ఞానమదఘళ, తతిని నాద । జయముగు ఘనాళి వీక్షించి, సమ్మదమునఁ । గలవిలాపకలాపిసం, ఘము నటించె ॥ ౩౨ ॥ (చ) అతులకదంబపుష్పకర, జారుణితాంబరముల్దు పారసం । గతములు కందళీకుసుమ, గంధ యుతంబులునైన వాయువుల్ । చతురత నూత్నసూత్నను గఁ, జంచలనేత్రల మీఁదసారెకం । చితగతి రాగముల్ గలుగఁ, జేసెను గాముకమానసంబులన్ ॥ ౩౩ ॥ (గీ) వారిధరములు ప్రవిరళ, ప్రథమబిందు । శమితతాపం బయోధర, జంబు గంధవంతమగు రైవతాచల, ప్రాంగణమును । మానినీగతి యోగ్యంబు, గానొనర్చె ॥ ౩౪ ॥ (క) కరిరథధవళస్ఫురదళి । వరమృగరుచికైతకంబు, వారిదకషణోత్కర పతితకృశశైందవసురుచిరఖండంబు పగిదిఁ, జూడఁగనయ్యెన్ ॥ ౩౫ ॥ (గీ) దళితమౌక్తికచూర్ణకాంతి, ధవళములును । గిరిసరిద్వారిబిందుసుం, దరములైన । చారుకుటజప్రసూనర, జఃకణములు । బహుళదధిరేణుకణముల, భంగి నొప్పె ॥ ౩౬ ॥ (చ) అసదృశనిమ్నగామృదు పయఃకణకోమలఘూర్ణిమాలతీ । ప్రసవవితానసంతతని, బద్ధము లౌ



టఁ బ్రసన్నతారకా । విసరనిభంబులైన ఘన, భృంగసమూహము లున్నమంతతః । ప్రసరరజోభగోత్థపరి, పాండిమఁ దాల్చి చెలంగె నత్తఱిన్ ॥ ౩౭ ॥ (గీ) ప్రియవిముక్తవధూజన, హృదయహంత్రి । యైన నవనీపవనరాజి, యభ్రవసన । సంవృతములైన దిశలపై, సాంద్రనిజర । జంబు పటవాసమును బోలెఁ, జల్లె నపుడు ॥ ౩౮ ॥ (క) పాల యలుకఁ బూని పతులం । గలయక యున్న చెలు లపుడు, ఘనఘననాదా । కులితలయి కౌఁగిలింపఁగ । వళిరేచితమధ్యలగుచు, వర్తించి రొగిన్ ॥ ౩౯ ॥ (చ) మునుకొని వృష్టిగంధవహ, ముల్ వడి వీవ విరక్తుఁడైన నె । వ్వని హృదయంబు ధైర్య మెడఁ, బాసి చలింపక యుండు నంచు ని । ట్లనిశము సత్యవాక్యము మ, దాళిగణంబు వచింప రక్తినొం । దిననవపల్లవావళి న, టించిన భంగిఁజెలంచెఁ గొమ్మలన్ ॥ ౪౦ ॥ (గీ) అచిరరోచికి వెఱచిన, యట్లు, ప్రియుల । మందిరముఁ బాసి పోవంగ, మనసు రాక । యతను మంథరభాషలై, యండె యుండె । చెలులు నృపతుల రంజిల్లఁ, జేసి రపుడు ॥ ౪౧ ॥ (వ) అంత దురితనాశన కీర్తనుండును రథావయవాయుధుండు నగు కృష్ణుండు తిరోహితతిగ్మమయూఖంబును బతత్రిసంఘంబు కొఱకుఁ గులాయనిలాయిత్వసంపాదకంబును బ్రాచ్యాదిదిగ్వివేకశూన్యంబు నగు ప్రావృట్కాలం బతీతం బగుచుండ వికచోత్పలనేత్రయు విస్రస్తధవళాంబరసాదృశ్యయోగ్యమేఘయు నైరైవతకపర్వతోత్సంగగతయైన ప్రియురాలి చందంబున నందం బగుచున్న శరత్తు నవలోకించె నక్కాలంబునందు ॥ (చ) ఖరకరుఁ డాత్మభానువుల, గహ్వరి నైశతమంబు మింటదు । ష్కరమగుమేఘబృందమయ, గాఢతమంబును వెంట బల్విడి । న్సరసులయందుఁ గాల్కొనిన, నైద్రతమంబును బోవఁ జేసెను । ర్వర మహనీయకీర్తులగు, వారికిఁ గల్గదు శత్రులెక్క

డన్॥ ౪౨ ॥ (గీ) కాలమె బలాబలంబులు, గలుగఁ జేయుఁ। బ్రాణులకు నంచుఁ బలికెడు, భంగి హంస। రవము రమణీయతాస్ఫూర్తిన్, రసిం పసింపఁ । గఠిననాదమయూరంబు, గలుగు నట్లు॥ ౪౩॥ (గీ) విశదపక్షకవిధ్వని,విజితనాద । శిఖితనూరుహచయ మీక్షింపన్, చేతఁ బోలె। విరిసి ధరవాఁకిలె మానిన్మై, వెలయు వాని। కరిభవపరాభవము దుస్సహంబు గాదె॥ ౪౪ ॥ (చ) ప్రతివనమందు సాంద్రతర, రాగజపాకుసుమాధరోల్లస। ద్వితతవనావళీమదవతీ వదనంబున భాసురేక్షణా। ప్రతితరవిభ్రమంబులగు, బాణదళావళు లప్పుడెంతయుం। జితలలితోత్పలద్యుతిని, శేషములై యలరె న్నగంబునన్॥ ౪౫ ॥ (సీ) కనకభంగపిశంగ, ఘనపలాశములు పరాగశోణితకేస, రంబులైన। యసనవృక్షములు ప్రి,యావమానిత మానినీమణి పటుకోపనిరసనంబు। లగుటచే ధాత్రి న,న్వర్థనామము లయ్యె బాలాతపారుణ, పంకజంబు। మదపాటలాంగనా, వదనాబ్జరుచి నను కరణంబుఁ జేసిన, కారణమున ॥ (గీ) నెవ్వని మనంబు హరియింప, దిషమునందుఁ। గలమగోప్తి స్త్రీత దీరిత,గానము విని। మీలితాక్షుమైసస్యంబు, మెసవ మఱచి। యున్న మృగతతి నదలింప, దురుముదమున॥ ౪౬ ॥ (చ) గురుతరసప్తపర్ణలతను,గుచ్ఛ సుగంధి మధువ్రతవ్రజో। చ్చరిత సుగీతనాదములు, సంతతగంబులునైన వాయువుల్। విరళమదంబు వ్యాకులిత,విష్టపమై తగునూర్జదంతి చె। చ్చెరఁ జనుదెంచు చున్న దని, చెప్పెడు నైవడి వీచె నంతటన్ ॥ ౪౭ ॥ (వ) మఱియు యాదవులొక్కయెడ విగతమేఘావరణంబు లగుటవలనఁ గోశోద్ధృతాసిలతా సితంబులై యొక్కయెడ శుభ్రమేఘచ్ఛన్నంబు లగుటంజేసి పురుహూతగజాజినకూపాసకంబులైన వాని చందంబున నందంబులై యొప్పు దిక్కుల నవలోకించిరి మఱియును ॥ (క) శరదంగనమరుదుత్థిత।



సరసిజ కేసరరజంబు, శౌరి సతులపైఁ । బరిహాసార్థము చల్లెదు । తెఱఁగున నెల్లెడలఁ బటుగతి న్వెదచల్లెన్॥ ౪౮ ॥ (గీ) అరుణముఖమైన శుకపఙ్క్తి, హరికిఁ బ్రీతి । గాఁగ నమరులు మింటిపైఁ, గట్టి నట్టి । హరితపత్రమయంబు త,దగ్రబద్ధ । కిసలమగు తోరణము భంగి, నెసఁగె నపుడు॥ ౪౯ ॥ (క) శరదంతురదిఙ్ముఖయును । దరదబ్జాక్షియును హంస, ధవళిమహాసదం । బరయు నగు నల శరత్తును । హరిముదికను బోలెఁ జూచె, నతిరమ్యముగన్॥ ౫౦ ॥ (వ) ఇట్లు శరత్కాలంబు ప్రవర్తించిన యనంతరంబ మహాగజప్రమాణంబులైన తరంగిణుల హిమోపేతంబులుగాఁ జేయుచు హేమంతకాలసంజాతమారుతంబు ప్రోషితభర్తృకలగు యువతుల నేత్రంబులకు నతనుసంతాప కారిణియగు సలిలసంతతి నొసంగ హేమంత కాలంబు సంప్రాప్తం బయ్యె నక్కాలంబునందు॥ (సీ) అనిలుండు గ్రీష్మాది,యందు వియోగికిఁ జెలుల మీఁది తలంపు, గలుగఁ జేయు । టది మిక్కిలి నయుక్త,మహహ హేమంతమం దుపగతతుహినుఁడై, యుంటఁ జేసి । స్మృతసయావనసోష్మ,వితతవక్షోరుహలం డగు వియోగిని జంప, నలవి యగును । మఱియు నేయంగన, మగనితోఁ గూడకపొలయల్క నైకొని,తొల్ఁగి యుండె॥ (గీ) నట్టి యంగన హేమంత,మందుఁ బూర్వ। మగణితుండైన ప్రియునె స్మి,తాస్య యగుచుఁ। గవియ నేతెంచి కౌఁగిట, గారవించి। యలిగి చనకుండ నమోఘత్తు, లాడుచుండు॥ ౫౧ ॥ (గీ) ఆవరణశూన్యమౌట హి,మానిలమున । దూషితంబైన యధరవి,ద్రుమవ్రణంబు । సీత్కృతంబులచే దంత,సితవిభాప । టావృతంబైన పగిది సౌ,ఖ్యంబు నొందె ॥ ౫౨ ॥ (గీ) పేశలంబౌట హిమవాత,పీడితవ్ర । ణాంగనాధర లేఖ య,వ్యక్తమధుర । రమ్యసీత్కృతస్ఫురితోరు,రదమరీచి । మయపటాచ్ఛాది

తంబైన, మాడ్కి నలరె ॥ ౫౩ ॥ (క) ధృతహిమకణమారుతతరు । లతికాంగుళితర్జనోజ్జ్వ, లవిలాసము లి । ష్టతముల పరిరంభణ సుఖ । సతతాన్వితమైన చెలి క, సహ్యము లయ్యెన్ ॥ ౫౪ ॥ (సీ) స్మర సంప్రచోదిత, సహజానురాగంబు ప్రకటింపఁ జేయుట, వలన మిగు లఁ । గార్యఘూత స్వేద, కలన నత్యంతోపకారియౌ హేమంత, కాల మైనఁ । బ్రస్విన్నగాత్రలై, పడఁతులు ప్రియులను జెలువుమీఱరమింపఁ, జేసి రపుడు । మదవికాసిషడంఘ్రి, మధురనాదాహిత హుంకారుఁడై శిశి, రోరుపవనుఁ ॥ (గీ) డనువనంబులయందుఁ బ్రి, యంగులత లఁ । జాలఁ బుష్పింపఁ జేయుచు, సంతతంబు । పతుల నెడఁబాసి యున్నయు, వతుల సతుల । విడిచి యున్న వియోగుల, బెగడు పఱచె ॥ ౫౫ ॥ (గీ) మాఘమాసమందు, మంద గభస్తియై । హేళి హిమము నడఁపఁ, జాలఁ డయ్యెఁ । బరులు వృద్ధినొంద, బలవంతుఁడైనను । గాలవశతఁ జేసి, గ్లానిఁ జెందు ॥ ౫౬ ॥ (గీ) క్షుభితసైన్యపరాగవి, శుభ్రవర్ణమగుట లోధ్రరజము చైత్ర, యాత్రకొఱకు । నభిషేణయిషుండైన, యాతను నెఱుఁగఁ । జెప్పఁ గైవడి దిక్కులఁ, గప్పుకొనియె ॥ ౫౭ ॥ (చ) కరముపభోగ్యమౌ శిశిర, కాలము పోయిన వెన్క శీతసం । హారమగు మక్కచోష్ణమున, కవ్వల నేమి ఫలం బటంచు సుం । దరులు నిరస్తకోపలయి, తప్పక వేఁదమయంతఁ దామె దు । ర్భరమదనజ్వరాతురలగు, భర్తలఁ గౌఁగిటఁ జేర్చిర త్తఱిన్ ॥ ౫౮ ॥ (చ) ఫలితసుగంధబంధుర ల, వంగము లందుఁ బ్రసూనపత్రతా । ళులగు మధువ్రతంబులు వి, లోలరజోమలినీకృతంబులై । మలయుచు నుండ మ్రోలఁ గని, మంజులకుంద లతల్ దరత్స్మితం । బులఁ బరిహాసమున్ సలుపు, పోలికఁ జూడఁగ నయ్యె నయ్యెడిన్ ॥ ౫౯ ॥ (చ) మఱియు నత్యంతసురభి సంతానకంబు ప్రసూనసంపద తనుతరత్వంబున భంజింపంబ



డినయట్లుండె వసంతానకంబైన తరుణ పరభృతంబు కాముకుల రాగవివర్ధనంబు కొఱకు మధురంబుగాఁ బంచమస్వరంబు గావించె మిక్కిలి నిష్టమధువాసరస యగుటం జేసి బంభరశ్రేణి యంగనామాననిరాసకుశలంబును మధువాసరసారంబు నగు చూతంబును బరిత్యజింప నోపకుండె ॥ (సీ) అతులప్రభావని, యగు వసంతేందిర సకలజగజ్జయ, చతురమదన । వీరసైన్యము నందుఁ వితతజిత్వరకేతు వైజయంతులు గూర్పు, వలయు ననుచు । విసువక కదళులు, విస్తరింపఁగఁ జేసె నసతియౌ స్మరనిమి, త్తానురాగ । రూపసాంద్రతమిస్ర, లోకబాంధవ మండలంబు వరించెన, వాతసరణి ॥ (గీ) తారరవమైన కోయిల, చారుఫణితిఁ । బంచమశ్రుతినంతటఁ, బలుకుచుండఁ । బవటియందును యువతుల, వశ్యలైన । ప్రియుల వశ్యులఁగాఁ జేసి, పెనఁగిరపుడు ॥ ౬౦ ॥ (చ) కమలవిహారశీతలము, గావుననుజ్జ్వలమైన గాత్రము । న్సముచితభంగిఁ దాల్చియతి, సాంద్రరుచిన్ జెలువొందు చంచలా । క్రమమునఁ బాడనొప్పియను, రాగరసంబది వెల్లిఁ గొల్పఁగా । రమణుని యంకపీఠమున, రమ్యగతిన్విలసిల్లెన త్తఱిన్ ॥ ౬౧ ॥ (చ) ఘనభవవారిలాభమది, గల్గుచునుండ మయూరము ల్ముదం । బుననటియించె నేఱులు స, ముద్ధతిఁ బాఱె షడంఘ్రిదంపతుల్ । పనిఁబడి సాంధ్యదీపరుచి, పాటలభూరిసుగంధబంధుర । ప్రణుతశిలీంధ్రపుష్పముల, రక్తిమెయిం జరియించె న త్తఱిన్ ॥ ౬౨ ॥ (ఉ) రైవతకాద్రి చెంగటిధ, రాతలమందు లసన్మరాళిసం । ఘావృతపుష్పితాగ్రకుట, జావనిజంబుల వారిపూరసం । భావితనీలమేఘచయ, భాసితమైన నభంబుఁ జూచి బ । ర్హావళిగీతనాదసదృ, శార్భటిమై నటియించె నెంతయున్ ॥ ౬౩ ॥ (సీ) మఱియుఁ గాముకులగు, మగువ లత్యున్నతకాశమై తగు శర, త్కాలమందు । వితతమన్మథసుఖా, విర్భావముల

యందు భృతతర్షులైన స, త్ప్రియుల దీర్ఘ । సమయంబునకుఁ బొంది, సంకోచ మెడఁబాసి కడు వేడ్క సురతసౌ, ఖ్యంబుగనిరి । రసమాన చారుసౌ, రససమయంబున నభినద్ధమైనవ, రాంగనోరు॥ (గీ) కుచకలశసంభవోదక, ప్రచయ మపుడు । మహితమౌక్తికహారాయ, మాణమగుచు । రాగరసమున ఘనపరి, రంభరుచిని । నింపు సొంపార నెపుడు శో, భింపదయ్యె॥ ౮౪ ॥ (సీ) వినుతింప నేతన్వి, విపినమధ్యంబునఁబృథుసారసాంగనా, మధురకాకు । నినదంబు విని కామ, నిభుఁడైన దయితుపై రమణతోసంజాతరాగయయ్యె । నట్టిలీలావతి, యైన నవరారోహ ప్రేమతోఁదనమనః, ప్రియునిఁగలసి । యేకాంతసీమయం, దేక్రీడసలుపదుకమనీయమగుశరత్కాలమందుఁ ॥ (గీ) గొలఁకులన్నియునందంద, కలఁకదేఱె । నూర్మికాదోలికలహంస, లూఁగసాగెఁ। బండువెన్నెలజగతిపై, మెండుకొనియె । నలినవనములఁ దేంట్లుగా, నంబుఁ జేసె॥ ౮౫ ॥ (చ) రతిపససాహసవోల్లసిత, రంజితమూర్జరసహసవంత ము । ద్యతయువమానసోషితము, నైనవరోరుచయంబుచేత సం । తతముగృహీతకేశసుర, తక్రియయందటు తృప్తినొందియే । చతురులునిద్రవోవుదురు, సంతతహైమనరాత్రులందిలన్ ॥౮౬॥ (గీ) అసకలామలమంజులకిసలలీల । చేతవిస్మయమొందిన, రీతినలరు । నళులలవలీలయావలి, కలరవంబు । మిక్కుటంబుగఁ గావించెఁ, బెక్కుమాళ్లు॥ ౮౭ ॥ (వ) మఱియుఁ బ్రసూనవిసర కృతభారంబున వృక్షంబులకు నమ్రత్వంబును బంభరపరిషజ్ఝంకారనాదంబుల కవిరామంబులునుసంపాదించునట్టి ఋతుగణంబు సానువులయందు భరియించియున్నయారైవతకాచలంబుమీఁద విహరించుటకుఁ గృష్ణుండు మత్తనుయూరకేకారవంబులచేతఁ బ్రేరితుండైన వానియట్ల గిరివిహారకౌతూహలియయ్యె॥ (చ) సరసిజలోచనుండపుడు, శైలమునందు ఋతుప్రతానసం । భరితవనాంతలక్ష్మినిగ్ర, మంబుగఁ గన్గొననిర్గమించె సు । స్థిరముగ సేవఁజేయఁజను, దెంచినవారి ప్రయాసమెల్లస । త్పురుషులయందు నిష్ఫలతఁ, బొందునెయెన్నఁటికైన నుర్వరన్॥ ౮౮ ॥ (ప్రభాతవృత్తము) వివిధసుమావళి, భృద్వనాళిలోయా । దవులు సతీసహి, తంబుగాఁ జరింపం । గవిసిరి యవ్విధి, గానిచోసుమాస్త్రా। గ్రవిశిఖవిద్ధులుగారెయొంటిఁజన్నన్॥ ౮౯ ॥ (తరల) గరిమతోసముచితంబుగఁ, గాంతిమోముల హెచ్చఁగాఁ గరితలప్డుస్వభావసుందర, గాత్రలై కడుహృద్యలై । ధరణిపైఁ జరణంబులుంచిరి, తప్పకప్డుడె వారిపైఁ । దరతరంబుపదంబుఁ బెట్టెని, తాంతవిభ్రమసంపదల్॥ ౯౦ ॥ (గీ) లలితగతులందు నఖరుచి, రచితశక్ర । చాపరేఖ గలుగు నట్లు, సంభ్రమమునఁ । గలితకలకంకణధ్వను, ల్సెలఁగ వీచు । బాహులతజాతెఁ దన్నితం, బముల మీఁద ॥ ౯౧ ॥ (మాలినీవృత్తము) అతిశయపరిణాహం, బై విచిత్రప్రకాశాం । కితఘనమణి భాస్వ, త్కింకిణీకాంచితంబై । చతురతఁ గలకాంచీ, సత్కలాపంబు రమ్యో । న్నతజఘనమునందు, న్నాదము న్విస్తరించెన్ ॥ ౯౨ ॥ (క) నిరుపమనితంబబింబా । త్యురుభారనిపీడ్యమాన, యోషిత్పదము । ల్సురుచిరలాక్షాచ్ఛలమునఁ । జరణన్యాసములయందు, స్వరసము నించెన్ ॥ ౯౩ ॥ (వ) మఱియు నొక్కసఖి కుపితయైన యొక్క నాయికను బ్రియవచనంబుల ననునయింపుచు నిట్లనియె॥ (చ) రయమున నేను పోయి సుక, రంబుగ నిప్పుడె మాటలాడి నీ । ప్రియు నిటు దెత్తుఁ జూడు మని, వేగఁ బ్రతిజ్ఞ యొనర్చి వచ్చితిన్ । దయయుఁ బ్రియంబు దక్షిణత, ధైర్యము గల్గిన గౌరి వీవు మ । త్ప్రియసఖి నాదు వాక్యమును, రిత్తయొనర్పకు మమ్మ కోమలీ ॥ ౯౪ ॥ (చ) సరసిజనేత్ర నీమత మ, సాధ్యము పిన్నటనాఁట నుండి నే । నెఱుఁగని దానఁ గాను పరు, లెవ్వరు దీ

ల్పఁగ లేరు నాపయిన్ । దఱసిన ప్రేమచేత జవ,దాఁటవు నావచనం బటంచు నే । గరువముఁ బూని యుందుఁ, జెలికత్తెల మధ్యమునందు మానినీ॥ ౨౫ ॥ (మత్తకోకిల) ఏను చెప్పిన మాట నీవిపు, డెంతలేదని చేయఁగాఁ । బూనవేనియు నీకు నాకిఁకఁ, బొంద దెప్పుడు భాషణం । బైన నేమిగొఱంత నాకని, యాత్మ నెంచితివేని య । ట్లైన శత్రుల వాంఛితంబు ర,యంబునన్ ఫలియింపదే॥ ౨౬ ॥ (వసంతతిలకావృత్తము) మానంబు కల్మి నిటు,మాటలు పల్క వేనిన్। మేనన్వసింపవుసు,మీ యిఁక జీవితంబుల్ । కానిమ్ము కోపమునఁ, గాంతునిఁ గూడకున్నన్ । బ్రాణావనార్థమయి,నం బ్రియుఁ గూడరాదే॥ ౨౭ ॥ (చ) అనియిటు పల్కి యాసఖి త,దంఘ్రులపైఁ బడిలేవకుండినన్ । వనిత ప్రియాపరాధభవ బంధురకోపకషాయితాక్షియై । ననువినమత్సఖీకృతప్ర,ణామనిరోధము చేతఁ బోలెఁ జ । య్యనఁ బొలయల్క మాని యతియత్నమునన్ గరుణించె వల్లభున్॥ ౨౮॥ (వ) మఱియు నొక్కసఖి పురోభాగంబున శీఘ్రగమనంబునం బోవు నొక్క పురుషునిం గని యిట్లనియె॥ (గీ) రమణి వెన్కఁ జిక్కి, రాఁజాలకీవు ముం । గలఁ జనంగఁ దగునె, కడు రయమునఁ । గటికుచోరుభార, గరిమచే నెలనాగ । లలసగమన లగుట, దెలియవొక్కొ॥ ౨౯ ॥ (క) అనియిటు సఖిపలికిన విని । వనితామణి తన్నుఁ గలయ, వచ్చిన దాఁకన్ । దన యడుగు లెన్నికొను చా । డ్పున మెల్లన నడుగులిడుచుఁ, బోవుచునుండెన్॥ ౩౦ ॥ (వ) మఱియు నొక్క యువతి ముంగలం బోవు ప్రియతమునిం గూడుటకు శీఘ్రానుధావనంబు ప్రార్థింపుచున్న సఖికిట్లనియె॥ (తరువోజ) కలికి నా కిటు స్వయం,గమనలాఘవము గలుగుట నీకది, ఘనమయ్యె నేని। పలుక కిప్పుడె యయ్య,వస్థను బొందఁ గల దాన నని పల్కి,కడు వేగమునను । బలు చెలితోడఁ గో,పవ్యాజమునన యొలమితో నొక్కనా,



యిక శీఘ్రపాద । తలపాతమగు నట్లు,తప్పక పఱచి చెలువుని తోడఁ జె,చ్చెరఁ గూడుకొనియె ॥ ౩౧ ॥ (చ) తన విభుపార్శ్వభాగమునఁ, దద్దయు వేడుక వచ్చు భామినీ । ఘనపులకాంకితైకతర,కాంచనకుంభసమస్తనంబు చ । య్యనఁ బతివక్షమందు ఘటితాఘటితం బగుచున్ మనోజ్ఞకాం । చనమయకందుకంబు క్రియఁ,జారుతరద్యుతి నొప్పె సారెకున్॥ ౩౨॥ (సీ) పడఁతి యొక్కతె దృఢ,పరిరబ్ధభూరి బహిస్తనమై పరి,హృష్టలోమ । పత్త్రియై తగు భర్తృ,వామబాహువు చేత సాంద్రంబుగాఁ బరి,ష్వక్తయగుచుఁ । దనదు దక్షిణకరం, బను వొందఁ బతియంసభాగంబుపై నిడి, బాగుమీఱ । మొలనూలి ఘంటలు మ్రోయ నితంబమండలమునఁ బ్రియకటి,తాడనంబు॥ (గీ) సేయుచును హారవల్లులు, చిక్కుపడఁగ । రెండవ కుచంబు ఱొమ్మున, వెండినూపు । రములు ఘల్లన సవ్యపా,దము చలింపఁ । గంతు మంథరయై ప్రియుఁ,గదిసి నడిచె॥ ౩౩ ॥ (వ) మఱియుఁ గొందఱయంగనల గతివిశేషంబు లెట్టి వనిన॥ (చ) వెలఁది యొకర్తు భర్తృభుజ,పీఠమునన్ దన పాణిపల్లవం । బులుగ దియింపుచున్ గఠిన, భూరిపయోధర చూచుకంబులన్ । దొలఁగక పృష్ఠభాగము ప్ర,తోదమొనర్చుచు మందసుందరో । జ్జ్వలగమనంబునన్ జనియెఁ,జారుసలీలవిలాససంపదన్॥ ౩౪॥ (గీ) అలఘు పీవరసక్థియు, నతివిశాల । గిరిసమనితంబభారప్ర,ఖిన్నయైన । భూరిజఘనమునతికష్ట,మున వహించెఁ । బ్రియగళార్పితబాహయై, వెలఁదియొకతె ॥ ౩౫ ॥ (పుష్పిణీవృత్తము) పురుషుఁడొకఁ డుద్వృత్తిన్,మ్రోలఁగక్షుద్వయాం । తరనిహితహస్తుండై, తత్కుచగ్రాహుఁడై । సురుచిరనిజోష్ఠాంచ,చ్చుంబితోద్గండుఁడై । చరణములు ద్రొక్కాడన్, జాన వెన్కన్ జనెన్ ॥ ౩౬ ॥ (స్రగ్ధరావృత్తము) కాంతారత్నంబు వేడ్కన్, గతిపయసఖులం, గాంతుతోఁ గూడి

యొంటిక్ । గాంతారోర్విం జరింపం, గడువడిఁ జనినక్, గాంచిత
ధృతిక్ వెంటక్ । గంతుక్రీడాక్షణోరః, కలితరుచిరలా, క్షార సా
దాత్రఘుశ్రీరేఖా । కాంతంబై యొప్పు దానిక్, ఘనసతిపదముక్,
గాంచి యాజాడ నేగక్॥ ౮౭ ॥ (సీ) స్ఫురదనంగరసౌఘ,పూర్ణ
నాభిహ్రదపరివాహాకృతరోమ,పజ్క్తులైన । లలన లెవ్వరుసవి, లా
సయానరవితహంసకభూషలై, యరిగి రట్టి । సతులాపగాతీర గతల
యి జనమనోలక్ష్య వేదనచటు,లప్రసూన । శరధనుజ్యానాద, శంక
ను బుట్టించు శ్రుతిహితసారస,రుతము వినిరి॥ (గీ) యుత్సుకాళులు
మాధవ,యువతిజనులఁ । బిలిచి నటువలె గానంబు, సలిపెఁ గాన।
నాళి పల్లవాంగుళులచే,నభినయించి । యాడి నటులుండె గానంబు,
ననుసరించి॥ ౮౮ ॥ (చ) కుసుమసుగంధియై విపిన,కుంజమహీజనిరు
ద్ధవేగుఁడై । యసమజలాశయప్రచలి,తాచ్ఛతరంగజలార్ద్రుఁడై వ
న । శ్వసనుఁడు సంచలద్భ్రమర,పక్షవిఘట్టనసంభవోల్లస । త్ప్రసవ
రజంబు భామినుల,పైఁ వెదఁజల్లుచు వీచెన త్తఱిక్॥ ౮౯ ॥ (క) వన
మారుతానుగమనం । బునఁ దుమ్మెద లనుభవించె, ముదితల ముఖ
వా । సనలు మహాత్ముల వెంటక్ । జనినఁ బురస్థములు గావె, సం
పద లెందుక్॥ ౯౦ ॥ (గీ) శౌరియువతికరాబ్జసం,సర్గసంప । దా
త్తసౌమనస్యంబులై, యలరు విరులు । సార్థముగ నాఁట నుండియు,
నవనితలము । నందు సుమనోభిధానంబు, నధిగమించె॥ ౯౧॥ (చ) ఉ
రువడి నాభిముఖ్యమున, నుద్ధతిఁ జెంది విరు ల్దెమల్పఁగాఁ । దిరముగఁ
జూఁచి పైకిఁ జను,డెంచు వరోరుకరాగ్రరాజిచే । వరుస గుణప్రక
ర్షమునఁ, బల్లవపాళిబలాత్కృతంబుగాఁ । బరఁగ నఖంబులం జిది
మి, భంగము నొందె సమత్సరంబుగక్ ॥ ౯౨ ॥ (చ) తతమకరం
దపాన ముది,త భ్రమరాంచిత భూరిశాఖలక్ । జతురతఁ గంకణ



ధ్వనులు, సాంద్రముగాఁ జెలగక్ గరద్వయో । ద్ధతిఁ గదలించు రూ
పజిత, దైవతసుందరియైన కాంతపై । హితమతిఁబుష్పవృష్టిఁ గురి,
యించె మహీజము సంతసంబునక్॥ ౯౩ ॥ (గీ) సతతరసరాగవం
తమై, చారుకరరు । హక్షతిప్రాప్తసంస్తవం, బై యదయతఁ । ద
రుణిచే ఖండితంబైన, తరుణపల్ల । వంబుమిక్కిలి మలమల, వాడుఁ
జూపె॥ ౯౪ ॥ (వ) ఒక్కతనుమధ్య ప్రియుని కభిముఖంబుగా విక
సితకుసుమవిసరసంగ్రహార్థంబు సముద్యతబాహులతయై వినూతననఖ
క్షతమండన సుందరంబైన కక్షభాగంబుసందర్శింపం జేయుచుసారెసా
రెకు సవ్యకరంబునఁబిహితంబైన సూక్ష్మోత్తరీయంబుచేతఁబీనపయో
ధరావరణంబు తిరోహితంబుగావించె మఱియు నొక్కసుందరియగ్ర
పుష్పగ్రహణార్థంబు శరీరోన్నమన విశ్లిష్టవళులచేతఁ జూడందగిన వ
ళిత్రయాంతరాళపాండుర రేఖాకృతవర్ణోత్కర్ష నీలరోమరాజియు వి
పులతరోర్ధ్వముఖలోచనయు స్వభావకృశంబైన మధ్యంబును సారెసా
రెకతికృశత్వంబునొందించునట్టిదియు సమగ్రకుచోన్నతానతనిర్భరవక్ష
స్స్థలబలాత్కారవిశ్లిష్ట సూక్ష్మోత్తరీయబంధయు నంతర్లీయమానశా
తోదరోచ్ఛ్వసద్దుకూలస్ఫుటతరపరిదృశ్యమాన గంభీరనాభిమధ్యాంత
రాళయునై యలరు వనాభ్యంతర ప్రదేశంబునందుఁ దిరోహితుండై
యభిముఖావస్థితుండై యున్నవల్లభు నెఱింగియు నెఱుంగనిదాని యట్లు
సలీలంబగునట్లు వృక్షాగ్రంబునం గలసుమంబులుగోయు నెపంబున ని
జాంగప్రదర్శనార్థంబు కాలవిడంబనంబు గావించి విడంబనాంతరంబ
ప్రియుండు సఖీజనంబులునీవల్లభుం డిచ్చటనున్నవాఁడని యెఱింగించి
ననదరిపడి యెంతయవివేకి నైతినని వంచనోక్తులు పలుకుచుఁ బుష్పగ్ర
హణనివర్తితకుసుమవ్యావృతాగ్రపాణియుఁ బ్రతిపదంబునందు సంయ
మితసూక్ష్మవస్త్రాచ్ఛాదిత శరీరయు భర్తృదర్శనసంభూతసాధ్వసస

మ్మోదసంకరయు మీనకేతనాచార్య తత్క్షణోపదిష్టానిర్వాచ్యకేలికించి
తంబును రాగంబునభజియింపుచున్నది గావునససంభ్రమసస్మితవక్త్ర
కాంతియునై లజ్జావనతవదనయై యధీరత్వంబున నొక్కింత వ్యవధా
నంబు గోరుచున్నదానియట్ల బ్రియునికొఱకు నిజాభిప్రాయంబుప్రకా
శింపంజేయుచుఁ ద్రపాగుణంబువలన దయితునిమనంబు హరించెఁగాం
తలపత్త్రపావిభూషణలగుట లోకప్రసిద్ధంబై యుండు॥ (గీ) పరఁగ
నఖపదలిపులు వి,భావితార్థ । ములును బులకితాంగని,ధేయములు న
వాచ్య । ములనగు ననంగలేఖ లిం,పలరఁ బ్రియులు । వరుసఁ బల్ల
వముల మీఁద, వ్రాసి రపుడు ॥ ౯౫ ॥ (చ) అరుదుగ నొక్కనా
యిక ర,యంబునఁ గృత్రిమరోషయై సఖీ । గుఱుతుగఁ బూలదండ
సిగఁ, గూర్పఁగ నేరుపు లేదు చాలు నిం । కరుగు మటంచుఁ బల్కి
పతి, కప్పుడు తానె కృతోరు వాంఛయై । మురువుగఁ జుట్టె మాల
భుజ,మూలరుచుల్ సెలఁగ న్శిరంబునన్॥ ౯౬ ॥ (చ) ఘనకచ చూ
డు నీకెదురు,గా మధుపావళి వచ్చుచున్న దా । ననమును వాంచి
వాఙ్నియమ,నం బొనరింపుచు నూర కున్న వ। ద్యనిబిడగంధబంధుర
ము,ఖాబ్జముపై వెస వ్రాల కవ్వలం । జను నటు వ్రాలె నేని పెలు,
చం గడు బాధ యొనర్చు భామినీ ॥ ౯౭ ॥ ( పంచపాదిగీతము )
నెలఁతసరజసమకరంద,నిర్ఝరప్ర । భూతభూరుహ ప్రసవవి, భూ
తులందు । వాంఛ మాని యమృతపాఖ్య,వాంఛచేత । మధుపరా
జంబునీదగు, నధరమునుభ । జింపవచ్చుచునున్నది,యింపుమీఱ॥౯౮॥
(క) అనియిటు సఖిపలికిన నది । వినికన్నులు మూసివనిత, ద్విగుణి
తఘనలో । చనపక్ష్మమాలయై పె । ల్చనఁ బతి యంకంబుఁజేరె,
షట్పదభీతిన్॥౯౯॥ (చ)ఒనరఁగ బల్మిమై పురుషుఁ,డొక్క నవోఢ ము
ఖంబు నెత్తి చుం । బన మొనరింప దానిఁ బరి,పాటిఁగ నగ్గాని తత్క్ష



ణంబ నూ । తనమృదుపల్లవగ్రహణ,తత్పరయాచతురాళిచేత గ్రద్ద
నఁ బెఱవారిచే నవిది,తంబగు నట్లొనరింపఁ గాఁబడెన్॥ ౧౦౦॥ (సీ)
సవతి యొక్కతె లతా,జాలంబు చాటునఁ బొంచి యుండఁగ వల్ల,
భుండు దయిత । యాస్యపాన మొనర్చె, నటుదాని నధర ఖండన
భవవ్యథచేతఁ, దగఁ జలించు । కరకంకణస్వనో, త్కరముచే వివృ
తంబు గావించె మఱియొక్క,కాంతమ్రోల । వృక్షరాజముఁ బ్రాఁ
కి, విలసిల్లు ఘనలతా చేష్టితంబును జూచి, చెలఁగి దాని॥ (గీ) నభిన
యింపుచు బుజుగతి, నాశ్రయించి । వరుని చాపల దోషంబు, పరి
గణింప । కంఘ్రిమంజీరములు మ్రోయ, హస్తయుగము । సాఁచి
కౌఁగిటఁ గదియించె, సంభ్రమమున॥ ౧౦౧ ॥ (గీ) వనిత యొకతె
యున్నతగుచ్ఛ,వాంఛచేత । సలలితంబుగ సహచ రాం,సంబుమీఁద।
సవ్యకరమిడి కరికుంభ,సదృశకుచయు । గంబుచేఁ బ్రియు వక్షంబు,
గప్పె నపుడు ॥ ౧౦౨ ॥ (గీ) కుజములందున్న పువ్వులు, గోయఁ
బోయి । లలితపాదాగ్రదుస్థ్సితి,వలన నొకతె । నిబిడకుచకుంభ
భరమున, నిలువ లేక । పార్శ్వమున నున్న ప్రియునిపై, వ్రాలె న
పుడు॥ ౧౦౩ ॥ (చ) విరులవె కోసి యిమ్మనుచు, వేడుకఁ బ్రార్థ
న సేయు దాని ము । స్తరకరికుంభసన్నిభకు,చంబులు గల్గిన దాని
ముగ్ధసుం । దరిని బరిష్వజించు తమిఁ, దత్పతి మోదముతోడ నంగ
నా । గుఱుతుగ నీవె గోయుమని, కోమలినెత్తె భుజద్వయంబునన్॥
౧౦౪ ॥ (గీ) అరయు మిది గ్రాహ్య మిదగ్రాహ్య, మనుచుఁ దావి ।
విరులొసఁగి సారెసారెకు, మరులుకొలిపి । ప్రియుఁడు సఖిఁ దోడు
కొని యేగె, విజనమునకు । మరుఁడు త్వరసేయు జనులను, సురత
మునకు॥ ౧౦౫ ॥ (వ) మఱియు నొక్క ప్రగల్భనాయిక యేకాం
త దేశంబునకు నిజవల్లభుని బలాత్కారంబుగా నాకర్షించి తత్స

మీపదేశంబున సపత్నీజనంబు నవలోకించి లాఘవభయంబున నపసర్పణకామ యయ్యె నప్పుడు దాని వల్లభుండు విడువకున్న నది స్వయంగ్రహలాఘవ తిరోధానంబువలనను వల్లభవాల్లభ్య ప్రకాశనంబువలనను నతిగౌరవంబు నొంది యొప్పె మఱియు నొక్క ఖండితనాయిక రాత్రి సమయంబున సపత్నీగృహంబునకుం జనియె నని యెడు రోషంబున వల్లభు నొక్కపదంబైనఁ జలింపకుండఁ బుష్పమాలికచేత బంధించిన నతండు భయంబువలనఁ జలించుటకు సమర్థుండు గాక బద్ధుండై యుండె నబలాకృతమాలికాబంధంబైనను బ్రియతమ్ములైన యావనపురుషుల శక్తిహరించు టది యుక్తంబె కదా యని పలికి వెండియు వేఱొక్క ఖండిత నాయిక యపరాధకారియైన నిజకాంతుండు పల్లవదానంబునఁ బ్రసాదంబు వడయ వచ్చిన నతని భర్జింపుచు నిట్లనియె॥ (చ) వలవదు నీవు మాకిపుడు, పల్లవదాన మొనర్పమేము యోగ్యలమె ప్రియార్హమైన మఱి, యొక్కతె యున్నది దానియింటికట్లలవునఁ బోయి దానికిడు, మాస్యముముద్దిడు రక్షసేయఁ బో। పొలుపుగఁ బల్లవద్వయికిఁ, బొందొడఁ గూడుట యుక్తమే కదా॥ ౧౦౬ ॥ (గీ) వినుము మత్కర్ణములు జన, విదితతావ। కాప్రియోక్తులఁ బూర్ణంబు,లయ్యె నింకఁ। గితవ భూరుహ పల్లవో, త్కీర్ణకర్ణ। పూరములు వీనులకు వృథా,భూషణములు॥ ౧౦౭ ॥ (గీ) సవతి యింటనుండి, సారెకు నళినాద। హసితమైన దాని, యట్లనున్న। కళికఁ దెచ్చి మాకు, గరిమనిచ్చెద వేటి। కిది యె కలహమునకు, మొదలు గాదె॥ ౧౦౮ ॥ (క) అని రోషకషాయితలోచనయై విభు మోముఁ జూచి, శ్రవణరహితనూతనరమ్యపత్త్రకేసర। కనదుత్పలసుమము చేఁ ద,గఁ బ్రహరించెన్॥ ౧౦౯॥ (క) ప్రియుఁడు ముఖమారుతంబునఁ। బ్రియమైకదృగ్గతరజంబు, వెసఁ బోగొ

దన్। రయమున సపత్ని నయన। ద్వయ మప్పుడు నిండె రోష, పాంసుచ్ఛటలన్॥ ౧౧౦ ॥ (గీ) ప్రియుఁడు మఱపున సవతిని, పేరుకొనుచుఁ। బుష్పమున వ్రేయ నది దాఁకి, మూర్ఛపోయెఁ। గావున సపత్నినామంబు, కామినులకు। ధరణిలో నభిచారమం,త్రంబు గాదె॥ ౧౧౧ ॥ (చ) వరుఁడనురక్తిఁ గర్ణముల, వారకనించిన పుష్పగుచ్ఛముల్। కరము లఘుత్వ మొందియును, గ్రక్కునఁ జాల భరంబులయ్యె బల్। తెఱచుగఁ దానె యంగమునఁ, దాల్చిన కాంచనభూషణంబులున్। బరువయి తోఁచకుండెను స,పత్నికమూల్యములైన నేమగున్॥ ౧౧౨ ॥ తలఁప విలాసినీశ్రుతిగ,త స్ఫుటితోత్పలమేను నీల స। చ్చలితవిశాలనేత్రరుచి,సంపద చే జిత మైతిఁ బూడుమం। చాలసిన లజ్జచేత శిర,మొక్కట వంచి తదీయకర్ణమం। దళికృతభూరిఝుంకృతుల, నాసఖితో మొఱపెట్టె నత్తఱిన్॥ ౧౧౩ ॥ (గీ) అపగతసుమంబులగు తీఁగె,లవల విడిచి। యళులు నవమాల్యభూషిత,లైన యువతు। లందుఁ జేరెను ఘువిమలి, నాత్మకులకుఁ। బరిచయం బప్రధానమై, పరఁగుఁ గాదె॥ ౧౧౪ ॥ (వ) శిథిలశిరోరుహకలాపభారసమున్నతాంసభాగంబులు నతిదీర్ఘపక్ష్మభారనయనముఖారవిందంబులును బరిచితనాయకపరిచుంబనాభియోగ విగతకుంకుమరేణువు లగుటం జేసి యత్యంతనైర్మల్యంబువలనఁ బ్రతిఫలితతుషారమరీచిరశ్మిజాలంబులచేత నతిలోహితమృదుకపోలభాగంబులును శ్రమసమాప్తసుకుమారచేష్టలు గలుగుటంజేసి మృదుతరతనుతర బాహువులును సరససాంద్రకిసలయాను రంజితంబు లగుటంజేసి పునరుక్తరక్తకాంతివిభ్రాజితహస్తకమలంబులును మదనసానురాగంబుగలుగు నట్లు దయితవక్షస్స్థలంబుచేత వ్యతిహార సంక్రమితానులేప రంజనాతిశయభేదసంపదితేతరనిషణ్ణవక్షోజయుగళంబులును బృథుతరవ

క్షోరుహభారనమ్రంబు లయ్యును వెండియు వనవిహార పరిశ్రమజనితానతంబులైన శరీరంబులు ననభ్యస్తపాదసంచారకార్శ్యమ నిస్సహత్వధారణకలభహస్తోరుసక్థిప్రదేశంబులును జిరమహీగమనాపగతనూతనలాక్షారాగంబులు గల వయ్యును సౌకుమార్యంబు వలనఁ దద్గమనంబుచేతనె వెండియు వితీర్ణరాగంబులై పరస్పరభృశనివేశవశంబువలన నతిప్రయత్నసంచలచ్చరణోత్పలంబులును గలిగి సమ్యగుక్తధర్మవిశేషోపలక్షితలైన యువతులచేత సారెసారెకు నిట్లు విభ్రమానుషంగంబువలన నితాంతతాంతత్వంబునధిగమింపఁబడియె యువతులుస్వభావంబుచేతనె కోమలాంగు లగుటంజేసి యలసలై యుందురు చిరకాలంబు వనవిహారప్రయాసంబు ననుభవించుటం జేసి మిక్కిలి నలసలై యుండు టదియేమి చిత్రంబు మఱియును ॥ (సీ) అతివల ఘర్మతోయంబులు మొదల నుజ్జ్వలరమ్యగండమండలములందు । గొప్ప ముత్తియముల, చొప్పున విలసిల్లి కఠినవక్షోరుహాగ్రముల మీఁదఁ । బదపడి వ్రాలిత, ప్పక శతశకలంబు లయ్యె యౌవన సముదగ్రలైన। వెలఁదుల చన్గవ, విపులకమయ్యును నవిరళ ఘనపులకాంకురములు॥ (గీ) గలిగి విలసిల్లె నవిరత, ఘనసుమాప । చాయ ఖేదంబుచేఁ బ్రియ, చారుకంఠ । దత్తభుజలతమైపయో, ధరయుగమునఁ । బ్రియుని వక్షంబు గప్పుచుఁ, బ్రేలె నొకతె॥ ౧౧౫॥ (సుగంధివృత్తము) ఇంతియోర్తు భర్తమ్రోల, నింపు మీఱ నిల్చి బ । ల్వింతగాఁ గుచంబు లెత్తి, వేల్లితోరుబాహమై। పంత మొప్పఁగా శరీర, భంగ మాచరించి త । చ్ఛ్రాంతి వాయఁగౌఁగిలించె, సంతసంబుమీఱఁగాన్॥ ౧౧౬ ॥ (క) తరుణుఁడు నవోఢముగ్ధను । బరిచితి లేకునికి నెంత, వలదన్నను నే। మఱియుండఁ బట్టిబలిమిన్ । బరిరంభణ మాచరించెఁ, బటుమోహమునన్॥ ౧౧౭॥ (గీ) వితతహిమసమఘర్మాంబు, బిందువులను । దుడువఁ బోవు నెపంబున, ధూర్తుఁడొకఁడు । చెలఁగి నూత్నోఢసతి నివ, సించి కుచక । లశకిశోరకములనంటె, లఘుతరముగ॥ ౧౧౮ ॥ (సీ) నారీసరిద్ఘర్మపూరంబు జఘనప్రదేశంబులందు నుద్రేక మొంది । సక్థివక్షముల ఘనజాకచ్ఛరుహాల నాక్రమణంబు గావించి, ఘనగభీర । నాభిహ్రదంబులు, నయముగాఁ బూరించి తతపయోధరబృహత్తటులు దాఁటి । పటురోమరంధ్రికా, పంబులు నిండించి కటతటీభూమిభాగముల నాఁడెఁ॥ (గీ) బ్రియకర స్పర్శనంబున, స్వేదతోయ । మధిక మయ్యెనస్లానశో, భాఢ్యలైన । సతులు విపినాంతవిహరణ, శ్రమమువాయఁ । దనువులు జలార్ద్రముగఁజేయఁ, దలఁచిరపుడు॥ ౧౧౯॥ (చ) అలఘుతరస్తనంబులు వ, రాభరణధ్వనితంబులున్ రజ । శ్చలననిమీలితాక్షివన, జంబులునైన నితాంతతాంతకాం । తలగణముల్ ధరిత్రిఁ జరణంబులు మెట్టఁగనెత్తలేకగా । సిలుచునతిప్రయత్నమునఁ, జేరె మనోజ్ఞసరోవరం బొగిన్॥ ౧౨౦ ॥ (చ) సమముగఁ గాంతలందఱును, జాల్గొనిపోవుచునుండ వారియం । సములు వినమ్రతన్ గడువి, శాలముగల్గి యుఁ దద్బృహన్నితం । బముల పరస్పరాధికవి, మర్దముచే విపులాధ్వభాగమ । శ్రమగమనంబు సేయుటకు, సంకటమయ్యె నతిప్రయత్నతన్॥ ౧౨౧ ॥ (చ) అవిరళవృక్షజాలశిశి, రావనియందటు పోవుచుండ న । య్యువతులఁ గాంచి చేతఁ బలె, నుష్ణమయూఖుఁడు సారెసారెకున్ । బవనరయాహతోరువిట, పంబుల సందున సాధ్వసంబునన్ । దవిలి నిజోరుభానువులఁ, దత్పరతన్ స్పృశియించె నెంతయున్॥ ౧౨౨ ॥ (చ) నిరుపమవక్త్రపద్మమున, నిర్జితుఁడై హిమధాముఁ డత్తఱి । న్సరువడి సేవఁజేయుటకు, వచ్చి ఖరాంశుకరాళితాంగమై । వెఱవఱి యేగు భామినికి, వేగసితాతపవారణత్వము । న్వరుస భరించుచు న్ప్రియ మొనర్చెఁ దదీయకటాక్ష కాంక్షి

మై॥ ౧౨౩ ॥ (చ) ఒక ప్రియురాలి మ్రొళిపయి, నుత్సుకతం దన
యుత్తరీయము । న్బ్రికటముగాఁగహస్తములఁ, బట్టి వెస న్బయికె
త్తి పట్టు నా । యకమణిచే నిరస్తనిబి, డాతపమైన వెలందిసాతప। త్ర
కలగు వారి కన్న విత, తంబుగ సౌఖ్యము నొందెన త్తఱిన్॥౧౨౪॥ (సీ)
తనమనోహరునిహ, స్తముఁబట్టుకొని యేగు వెలఁది సర్వాంగము, ల్వ్రి
యకరాభి । మర్శనజనితాస, మానసుఖంబున నుపచయ గరిమచే,
నొప్పుచుండ । నతిసుఖపారవ, శ్యమున నీవిగ్రంధి వదలి వేమొల ను
న్న, వలువజాఱె । మఱియు హంసాంగన, ల్మందంబుగాఁ బోవు నతివ
లఁ గని విస్మ, యంబు నొంది ॥ (గీ) లజ్జచేత నిజోరులీ, లాగతులను ।
జూపకూరక యుండె నీ, శ్రోణి యందుఁ । బరజితగుణం బెఱింగి
యె, వ్వాఁడు సిగ్గు । లేక స్వగుణంబు నావిష్క, రింపఁ జేయు ॥
౧౨౫॥ (మ) సముదంచత్పృథులాతిరమ్యకటిప, శ్చా ద్భాగము ల్బారు
శో । భములౌ యాదవభామినీ కటిపురో, భాగంబులన్ ధూతగ । ర్వ
మహోబాహ్యత్పులినంబులై నదులు వై, లక్ష్యంబునన్ భూరి వి । భ్రి
మదశ్మస్థలనాతిలోలగతులన్, బాఱెన్ సమగ్రంబుగన్॥ ౧౨౬॥ (గీ)
సలిలరయనున్నశు క్తికో, శప్రముక్త । చారుమౌక్తికకృతిరుచి, సైకత
ముల । విరళవిగళితహారసుం, దరములైన । లలిత నిజతల్పములయ
ట్లుఁ, దలఁచిరపుడు॥ ౧౨౭ ॥ (చ) శ్రమజనితం బనింద్యమును, సాం
ద్రమనోజ్ఞ సుగంధబంధువౌ । ప్రమదల వక్త్రమారుతము, గ్రక్కున
మూర్కొని చంచరీకము । ల్గ్రిమమునఁ గానన ప్రసవ, రాజిపయిం
దమి గూర్పవయ్యెవి । భ్రమత విశేషకామియగు, ప్రాణిగణించునె
పూర్వసంస్థితిన్ ॥ ౧౨౮ ॥ (చ) సమయ మెఱింగి వేశ్య నొక,
జార శిఖండిని గూడి యుండఁ ద । త్ప్రమద వనోర్వి నుండి వెస, వ
చ్చినఁ గన్గొనిసాధ్వసంబునం । గ్రమమున నాత్మ పింఛములఁ, గప్పు



మయూరముగాంచి భామిను । ల్రమణులయందు లేదని త, లంచిరియా
ర్జవ మంచు నెమ్మదిన్ ॥ ౧౨౯ ॥ (మ) అతిసంతోషవిధాయికంసరి
పుకాం, తాలాపసంపత్తిర । స్కృతమాధుర్యనినాదమైన సితప, త్రి
శ్రేణి నీరేజసం । తతులందు న్వసడాఁగి యుండెనదియు, క్తంబే క
దా వైరిని । ర్జితుఁడెవ్వాఁడు తదగ్రభాగమున వ, ర్తింపం దలంచున్మ
దిన్॥ ౧౩౦ ॥ (సీ) చక్రవాకాంగన, శంక లేక ప్రియుండు చుంబ
నంబొనరింపఁ, జూచిముగ్ధ । యగుటచేమీఁది కా, ర్యములైన సీత్కా
ర ముఖకామచేష్టితం, బులు నెఱుంగ । కున్నఁ గన్గొనియదు, యోష
లుతమయంతఁ బ్రియుల ముంగలనిల్చి, విధృతహస్త । లగుచును త్తర
కృత్య, మైనసీత్కారాదికంబు గావించిరి, కౌతుకమున ॥ (గీ) నవు
డుపద్మిని నవకంజమర్ఘ్య మిచ్చి । హంసరుతముల స్వాగతం, బడిగి
ఫేన । హాసమై భంగ కరముల, నాదరమునఁ । బాద్యమొసఁగిన
యట్లుండె, భామినులకు॥ ౧౩౧ ॥ (వ) మఱియు నమ్ముకుందసుంద
రులు పాణిపల్లవంబులచేత రాగంబువలనఁ దద్గతలక్ష్మిని నిత్యనివాసం
బైన యరవిందంబుల నుండనీకనిష్కాసంబు గావించి లక్ష్మినియతసా
పత్న్యంబు వ్యక్తంబుఁజేసిరంత నయ్యంగనలు సలిలప్రవేశంబు గావిం
చుటకు భయభ్రాంతచిత్తలై ప్రియకరావలంబనంబుఁజేసి యతిప్రయ
త్నంబునఁ బ్రవేశించునంతలోనఁ దత్కాసారజలంబు సంక్రాంతప్రతి
బింబ లగుటంజేసి యౌత్సుక్యంబుననతిశీఘ్రంబుగా నయ్యువతుల నం
తఃప్రవేశంబు గావించుకొన్నదాని యట్ల ప్రకాశించెమఱియుఁ గామి
నులు కాముకుని మనంబునుంబోలె లోతెఱుంగక మొదలజలంబుప్రవేశిం
చుటకు భయంబునొంది పదంపడి గమనంబుచేతనగాధత్వంబెఱింగి ప
దంపడి రాగంబుచేత నభ్యంతరంబుప్రవేశించి సరాగంబైనయంగంబు
చేత రంజిల్లఁ జేసిరంత॥ (గీ) కుంభికుంభసదృశ, కుచ తాడనంబునఁ।

గలుషమొందియున్న, జలమునందు । నుండలేక చక్ర,యుగమేగె ను
ద్వృత్తుఁ । డరులకెవ్వఁడగు సు,ఖావహుండు ॥ ౧౩౨ ॥ (గీ) శీ
తభీతినొక్క, చెలినీరుసొరక త । త్తూ్కలమందు నొంటి, గూరుచు
న్న । దానిభర్త నీటి, లోనుండిదోయిట । జలముఁ బట్టిమీఁదఁ, జ
ల్లినపుడు॥ ౧౩౩ ॥ (గీ) ధవునితోఁగూడసిగ్గున, భువనమందు ।
మునుఁగుటకునిచ్చగింపని, ముగుదఁబట్టి । సఖులు బలవంతముగ లా
గఁ, జలితనేత్ర । యగుచుభర్తనుగౌఁగిట, నదుముకొనియె॥ ౧౩౪ ॥
(గీ) కంఠదఘ్నజలస్థిత, కాంతుఁజూచి । తనకునంతియ లోతని, త
లఁచియొక్క । యబలమార్ష్యంబుచేఁ బతి, కభిముఖముగఁ । జని
యెజలములో నత్యంత, సాహసమున॥ ౧౩౫॥ (సీ) తరలాక్షిచే స
రో,వరమది నాభిపర్యంతంబు నవగాఢ, మగుచు నుండ । సలిలచాప
ల్యంబు,వలనఁబుట్టిన యూర్మిశయముల బృహదురో,జద్వయంబు।నా
రూఢమై యొప్పె,నది యుక్తమేకదాచర్చింపలబ్ధసం, స్పర్శులకును ।
బుడమిమర్యాదయె,క్కడిది లోలోర్మితోయములందు రాజీవ, మంచి
తముగ॥ (గీ) మానినీముఖరుచులచే, నేనొకండ । నరయనజితంబ
నైతిఁద,దక్షిరుచుల । నిర్జితములయ్యె మేచక,నీరజంబు । లనుచున
ళినాదములగాన, మాచరించె। నిబిడతరభంగములమీఁదనృత్యమాడె॥
౧౩౬ ॥ (చ) చలశఫరీవిఘట్టితల, సన్మృదుపీవరసక్థియైన చం ।
చలశఫగాక్షిభీతిగొని, చారువిలాసభరంబు నొందెనీ । యిలసయిఁ
గామినుల్తగిన,హేతువు లేకనె విభ్రమంబులున్ । సలుపుదురేమి చె
ప్పనగఁ, జాలినబీజము గల్గియుండఁగన్॥ ౧౩౭ ॥ (వ) మఱియు
సమాకృష్టకాంచనగుచ్ఛచ్ఛవిశరీరకచ్ఛరుహాలచేతఁ బరివృతప్లవమాన
విలోలాయతబాహులతః సముల్లసద్వ్యోషిద్ఘనస్తనగండశైలసంక్షోభిత
సరోవరమహార్ణవసలిలంబైయొప్పె నగాధంబయ్యెను క్రీడార్థంబు కా



మినీజఘనవిఘట్టనచలన ప్రాపితవికసిత సరోజాననజలాశయంబు మ
ర్యాదాలంఘనంబు గావించినట్లుండెనొక యువతివితతచలితశిఖాంగు
ళీకంబును శోభావంతంబునైన కేశకలాపంబు సమీపంబునజలాంతర్ని
మగ్నుండైనవల్లభునిఁబరిగ్రహించుటకుం బలె వితతతరంగసమూహం
బులచేత నంతటఁ బ్రసార్యమాణం బగుచుఁ బ్రకాశించె క్షాళితాంగ
నాహరిద్రాలేపనకచకలితతోయంబై యమునాసరస్వతీజలమిశ్రితగం
గాజలంబు కైవడినొప్పుచుండె మఱియును॥ ౧౩౮ ॥ (చ) ప్రియు
కసుమాతిహృద్యమగు, ప్రేయసిగాత్రము నీటిలోమునిం । గియుఁగ
డు నిర్మలత్వమునఁ,గేవలకాంతి బహిష్కరించెఁద । ద్దయుఁదగనా
క్రమించియును, దజ్జల పూరము యుక్తులన్ దిర। స్క్రియ నొనరిం
పఁజాలదిది, సిద్ధముకేవలయుక్తమేకదా॥ ౧౩౯ ॥ (ఉ) దూరము
నందుఁ దోఁచునొక, తొయ్యలివక్త్రముఁజూచి పంకజం । బారసు
ణీసునోజ్జ్ఞముఖ,మాయిదియంచిటు సంశయించి దు । ర్వారబకావ
ళీసహచ,రత్వములేమి విలాసి పుంగవుం। డారసి నిశ్చయించె హృద,
యంబున నాననమంచు నేర్పునన్ ॥ ౧౪౦ ॥ (సీ) ధృతకనకోజ్వల,
క్రీడాంబుయంత్రము ల్ఘనపటీరాదిసు, గంధివస్తు । వులును బృథుస్త
న,కలశసంగికుసుంభదివ్యాంబరములు మా, ధ్వీకరసము । ప్రాణనా
థుల సమీ,పత్వంబుమొగలగు జలకేళికోచిత,సాధనంబు । లన్నియు
నొడఁగూడె, నంతమరుచ్చలితాంబరలగుచు న,య్యబ్జముఖులు ॥ (గీ)
గురునితంబభార,గరిమచే మెల్లన । నురుతటాంతభూమి, నుండిలేచి।
భయముఁ దెల్పునట్టి, బంధుప్రియులతోడఁ । గూడ నీటఁబడిరి, కో
ర్కెమీఱ॥ ౧౪౧ ॥ (వ) అప్పుడు కొందఱుముగ్ధాంగనలు ముఖసే
చనాదికపటాచరణంబులెఱుంగని వారగుటంజేసి ప్రియులతోఁ గూడఁ
బందెంబువైచి కరపుష్కరప్రేరితజలంబులు నొండొరులపైఁజల్లుకొను

చుంగొంతదడవు క్రీడించిరిమఱియును ॥ (గీ) హరదృగగ్నిదగ్ధుఁ, డ
గుమన్మథ బలాధి । రాజ్యలక్ష్మియైన, రమణి వదన । శశికిఁ బాణి
కలశ,జలములచే నభి । షేకమాచరించెఁ, జెలువుఁడొకఁడు॥౧౪౨॥
(గీ) అతనుసంతాపదుర్బల, యగుటఁజేసి । కర మతిప్రయత్నమున
నెత్తి,కాంతుమీఁద । జలముఁజల్లుచోవలయంబు,జాఱిపడియె। భూ
రిలావణ్యశేషంబుఁ, బోలెనపుడు॥ ౧౪౩ ॥ (సీ) మన్మథపరవశ
మానసయై యొక్కతరలాక్షితనచూపు,తరుణుమీఁదఁ । జేర్చితద్దృ
ష్టిని, శేషంబుచేతన సఖ్యంబుఁ జూపుచు, సంభ్రమమున । సఖిశిక్షా
వ్యాజ,చతురత మూర్తిమత్ప్రణయరసంబుచే, బలెజలంబు । చేతఁ
బూర్ణాంజలిఁ,జేసి యాయావన పురుషునిఁ బ్రార్థించెఁ, బోలుపు మీ
ఱ॥ (గీ) మోదమొందిన యొకశ్యామ,ముఖముప్రియుక । రాంబువు
లచేతసేచితం, బగుచునుండ । నది సహింపని సవతియా,స్యం బన
ల్ప । ఘర్మజలముల సిక్తమై, కాన నయ్యె ॥ ౧౪౪ ॥ (గీ) యువ
కరోత్క్షిప్త జలసిక్త,యువతికుచయు । గంబు గనుఁగొనిసవతిదుఃఖం
బువలనఁ । గనులఁ గాఱెడు బాష్పోద,కంబు చేతఁ । దన యురోజ
ద్వయంబును, దడిపికొనియె॥ ౧౪౫ ॥ (గీ) వదనరుచివిస్తరించు నే,
వారిచేతఁ । బ్రియను సేచనమొనరించెఁ, బ్రియుఁడు చంద్ర । ధవళ
మైన యవ్వారిచే,తనె సపత్ని । కధికకాలుష్య మొనరించె,నప్పు డ
చట ॥ ౧౪౬ ॥ (వ) మఱియు విపక్షానురాగాంధీకృత నయనుండైన
ప్రియునిచేత విపక్షనామగ్రహణపూర్వకంబుగా నభిముఖంబుగా సము
త్క్షిప్తంబై శరీరంబునం బడుచు స్వభావమందంబయ్యును హృదయవిదా
రణంబు గావించు సలిలాశనివిపక్షనామశ్రవణసంజాతరోషయైన నా
యికచేతఁ దీక్ష్ణయోగంబువలన సహింపంబడ దయ్యె మఱియును ॥
(చ) ప్రియుఁ డొక కాంత వక్షమునఁ, బ్రీతిమెయిన్సలిలంబుఁ జల్లిన ।



న్రియమునఁ దజ్జలంబు కఠి,న స్తనమండలి సోఁకి శీర్ణమై । దయ
చెలఁ గంగ బిందువులు, దాని మనోగత తాప మెల్లఁ ద । ద్దయుఁగొ
ని పోయి సంభ్రమత, దానిసపత్నికొసంగెన త్తఱిన్॥ ౧౪౭ ॥ (సీ)
కాంతుండుకౌఁగిటఁ,గదియించు తఱివాని యురముననుండి య,త్తరు
ణి వక్ష । మందులగ్నంబైన,యంగరాగంబు తోయముచేతనపహృ
తంబగుచునుండ। సంతసించియు దాని, సవతివక్షంబునఁ గ్రాలునఖక్ష
తుల్గాంచిమఱలఁ । దపియించెమఱియొక్క, దయితుచే సఖిసమక్ష
మునందుభ్రమగొని, సవతిపేరఁ॥ (గీ) బిలువఁ బడినదిగావున, విగళి
తాన । నాబ్జకాంతియై వ్రీడాన, తాస్యయగుచు । నున్నసవతినంత
ర్ధాన, మొందఁజేయు । టకుఁజలంబును లోచనోదకము వలన । వృద్ధి
నొందింపఁగలఁచెన,దెంతచలమొ॥ ౧౪౮ ॥ (చ) మఱియుఁబ్రియుం
డునొక్కక్షణ,మాత్రమునుందరఁ దత్సపత్నిపై । శరములఁజల్లిపిమ్మ
టఁబ్రి,సన్నమతిన్ దనమీఁదఁ జల్లినన్। గరమురుకోపకాళిమము,ఖంబు
నఁగ్రక్కుననావరించె ద్రు । క్పరిగళదంజనాంబువషవాదము నొందె
నదెంతచిత్రమో॥ ౧౪౯ ॥ (చ) కనకవిభూషణావళులు,గ్రక్కునఁ
దాల్పనశక్తమౌటచే। ననుచరకంకణీకృత న,వాంబురుహోచ్చమృణాళ
సూత్రమ । య్యనుబ్రతికామినీసముది,తోరుకటాక్షకృతోరుభారమై ।
వనరుహనేత్ర దోర్యుగమ,వార్యగురుత్వమునొందె న త్తఱిన్॥ ౧౫౦ ॥
(చ) అనవరతంబు పుష్కరవి,హార మొనర్చుటఁ జేసి కామినీ । జ
నమణికింకిణీకలిత,చారుసువర్ణ విశాలమేఖలల్ । ధ్వనియొనరింప వ
య్యె సజ,లస్ఫురితోరుగుణంబు గల్గినన్ । బనిఁ బడి యెందునైన ఘ
న,వాక్పటిమం బది గల్గనేర్చునే ॥ ౧౫౧ ॥ (చ) సరసవిలోల వీచి
కలఁ,జారుపటంబులు సంగ్రహించినన్ । దరుణులు తన్నితంబములు,
తప్పక చూచుచు నుండ సిగ్గునన్ । శిరములు వాంచి యున్న యల.

చెల్వలఁజూచి తరంగహస్తభా । స్వరదళవస్త్రదానమునఁ, బద్మిని మానము గాచె వేడ్కతోన్॥ ౧౫౨ ॥ (చ) గురుజఘనస్థలాభిహత, కోమలవక్త్రరుచిచ్ఛటాజిత । స్ఫురితసరోరుహంబు లగు, సుందరవక్త్రి లయంగరాగము । ల్బిరబిర లోలతన్ దగహా,రించినదౌటజలాశయంబు భా । స్వరతరగంధమై సకలు,షంబయి చూడఁగ నయ్యె నయ్యెడన్ ॥ ౧౫౩ ॥ (మ) వనజాతంబది నీటిలో మునుఁగుట, ల్వర్ణింప నేనింతకున్ । మును దూరంబున నుండియు న్బరిమళ, స్ఫూర్తిన్ వరస్త్రీల యా । ననసాదృశ్యము నొంది యుంటి నిపుడం,దఱ్ జూప్పఁగా డగ్గఱన్ । ఘనతన్ నిర్జిత నైతి నంచుఁ బలుకి,న్కన్ లజ్జచేతన్ జుమీ ॥ ౧౫౪ ॥ (వ) మఱియు జలావగాహక్రీడావిగళితంబులును వికసితయూధికాపిశంగంబులును హిరణ్మయంబులునగు యాదవాంగనాకల్పంబులచేత బాడబానలజ్వాలాఖండంబులచేతం బోలె నజ్జలాశయంబు శోభింపం బడియె మఱియును॥ (సీ) అరయ నేతన్మదీ,యచ్ఛాయయే చాలు నిత్యంబు భామినీ,నేత్రములకు । నెడలేనిసౌందర్య, మిచ్చుట కీయంజనంబుచే నేమి కా,ర్యంబు దలఁప । నని యెంచి నిజగుణ,వ్యాప్తితిరోధానసాభ్యసూయాచ్ఛతో,యములచేతఁ । గరము నిశ్శేషంబు,గా నంజనంబులు ధౌతంబు లయ్యె నం,దముగ మఱియు॥ (గీ) సలిలపూరంబుచే హరి,చందనంబు । ధౌతమైన నాపాండుర, స్తనయుగంబు । వలనఁ గృతపరభాగయౌ,లలితహార । యష్టి సౌహృదమున లూన, మయ్యె నపుడు ॥ ౧౫౫ ॥ (వ) మఱియు సమగ్రామృతగుణధారిణియు వికచోజ్జ్వలారవిందావతంసయు సదయితరమణీనిషేవ్యమాణయునైన పుష్కరిణి యువతిజననేత్రంబులకు సురయుంబోలె నారుణ్యంబొసంగె మఱియు మజ్జనంబు గావించు వరారోహల విశాలస్వచ్ఛసలిలబిందుచిత్రంబులైన కుచకుంభంబులు భిన్న



సూత్రముక్తాహార ఘుటికలచేత గుణపహాశ్రయాపేతుచేత నంతటను పాశ్రితంబులైన చందంబునం బ్రకాశించె మఱియు సరసిజలంబులు వధూజనశ్రవణపతితంబులైన నీలోత్పలంబులు తమయందుఁ బొడమిన వైనను నిజతరంగంబులచేఁ దటతలంబునకు నిష్కాసంబు గావించె స్వసంభవుండైనను గొంతకాలం బున్నత స్థానగతుండై యుండి పదంపడి పతితుండైన వాఁడు నిర్లేపులకుఁ బరిత్యాజ్యుండగుటది యుక్తంబే కదా మఱియుఁ దోయపూరంబుచే నంగనల ధౌతలాక్షారసంబైన దంతాధరంబు దంతక్షతులచేతఁ బ్రక్షాళితాంగరాగంబైన శరీరంబు ప్రత్యగ్రనఖక్షతంబులచేత నలంకరింపఁ బడియె నదియుచితంబు గాదె సజ్జనులగు వారిని సదాశ్రితులగు వారలు విభవాపాయకాలంబునందు శోభావైభవంబులచేతఁ బ్రకాశింపం జేయుదురు గదా మఱియును॥ (ఉ) క్షాళితపత్రపఙ్క్తియగు, కాంతలమోములఁ దోయపూరసం । చాలనలంబమానవిల, సన్మృదుకేసరమిశ్రపింజలో । ద్వేలితమధ్యభాగలగు, విశ్రుతమేచక హృద్యసుందరా । గ్రాలకమంజరుల్ సహృద,లౌ టరచించెను బత్రరేఖలన్॥ ౧౫౬ ॥ (సీ) అంభోధిజలముచే, యదువులయంగరాగము వక్షముల నుండి, కడఁగఁ బడియె । ఘనకేశములయందుఁ, గల్గు శేఖరములు హరియింపఁ బడియె నేత్రాంచలంబు । లందున్న మదరుచి, హరియింపఁ బడదయ్యె నదియుక్తమే కదా,యవనినాత్మ । వంతుల చక్షుర్భ,వప్రియం బన్యులచేత నలంఘ్యమై, చెలఁగుఁ గాదె॥ (గీ) మఱియు నయ్యాదవులమేన, వఱలునంగ । రాగము హరించె హృద్గత,రాగమందె। కదలకుండె ధీరాంతరం,గత్వమొందు । నట్టి వారికిఁ బరులచే, హాని గలదె॥ ౧౫౭ ॥ (గీ) చారుడిండీర మఱుతకు, హారమయ్యెఁ । జారుపట మయ్యెఁ గటికట్లు, శైవలంబు । చెక్కులకుఁ బత్రరచనమై, చెలఁగె నదియె । జలము లిట్లు

కాంతలకుఁభూషణములొసఁగె॥ ౧౫౮ ॥ (చ) బలువుగ నంగనాగ
ముల,నుండి రయంబున సిగ్గుచేబలెన్ । నిరుపమహేమహారములు, నీట
మునుంగుటభుక్తమాల్యము । ల్పరువడి సిగ్గులేమి సలి,లంబులపైఁ బడి
తేలి యాడుటల్ । పరఁగ లఘుత్వ మొందియును, బాయరు ధా
ష్ట్ర్యము తుచ్ఛులర్వరన్ ॥ ౧౫౯ ॥ (చ) శరములచేతఁ బత్ర రు
చి,సంతతి క్షాళిత మయ్యె మాల్యము । ల్పరువడిఁ జేలరాగము ని,ర
స్తము లయ్యె వరాంగరాగముల్ । బరిహృత మయ్యె నన్ని యిటు,
వ్యర్థము లయ్యె నటంచుఁ దాపిమై । సరసిజ బాణుఁ డంగనలఁ,
జారులఁగానొనరించె నత్తఱిన్ ॥ ౧౬౦ ॥ (గీ) ఉదకముల చేత శీ
తార్తి, నొంది నట్లు । వలె సుశీతలవాతచం,చల వసనము । యౌ
వనోష్ణత్వ మొందిన, యబ్జముఖుల । స్తనతటంబుల యందు సం, స
క్తమయ్యె ॥ ౧౬౧ ॥ (వ) ఇట్లు జలక్రీడ గావించి యనంతరంబ
గాత్రసంపర్కంబువలన సంసక్తసమధికరక్తంబై మూర్తిమంతంబై
న లావణ్యసారంబునుం బోలె నొప్పు సరోజలంబు స్రవింపుచుండఁ
జంచలాభంగతరంగరంగస్థానలీలానర్తనకుశలవసనాంచలంబులచే
త నుపలక్షితంబులగు నారీసమూహంబు లమ్మహాహ్రదంబు వెలువ
డి రప్పుడు సౌందర్యాతిశయంబున సురాంగనలకైన నద్భుతంబుఁబు
ట్టింపుచు నవారవిందహస్తయై మౌళి జలంబు నిర్గమించివచ్చునొ
క్క యువతిని మథ్యమానమహార్ణవంబువలన నప్పుడు ప్రాదుర్భ
వించి వచ్చు నిందిరాదేవిం బోలె నిరీక్షించి కృష్ణుండు సముద్రమ
థనంబును సంస్మరించె మఱియు నూరుప్రదేశాంతర్వర్తినార్ద్రంబ
తిస్నిగ్ధంబైన మేదుకూలంబాచ్ఛాదితం బయ్యె జలసేకంబువలనసం
సక్తంబైన యద్దుకూలంబును విమలతరాంగనాపీవరసక్థులుబహిర్గ
తస్వకీయకాంతిచేత నాచ్ఛాదించె నవ్వరారోహలు కటితటంబులం



దేవస్త్రంబులుధరించి రాశరత్కాలమేఘచ్ఛాయ గలవసనంబులుకా
మినీనివసనానందంబున దరహాసంబు గావించి నట్లుండె విడిచి వైచిన
యంబరంబులు గళజ్జలంబులగుటంజేసి స్థూలాశ్రుపాతనంబునరోదనం
బుగావించినట్లుండె మఱియుసరసత్వంబువలన నధికసంసక్తినొందినవ
గుటంజేసి మిక్కిలిబహుప్రకారంబుల నిష్కాసితంబులయ్యును నూత
నరక్తకంబులచేత యువతుల సుందరాంగంబులనుండి యతిప్రయత్నం
బున విశ్లేషితంబులయ్యె మఱియును॥ (సీ) లలన యొక్కతె యంస,
విలుళితకేశయై తోయార్ద్రితనువును, దుడిచికొనియె । నటులైనఁద
నమ్రోల, నంతికంబునఁబ్రియుఁగని వెండిస్వేదోద, కంబుచేత । నా
ర్ద్రిమాఱెఱుఁగక, యత్తన్విదానెన్ని మాఱులుదుడిచిన, నారదయ్యె।
మఱియొక్క వనితసీ,మంతంబు కరముల దిద్దుచుండుటఁ జేసి, సుద్దిగలి
గి॥ (గీ) చాల నాలత్యకుచబాహు, మూల యగుచుఁ । బరఁగనభి
లాషవంతుఁడౌ, భర్తచేత । వేడుకలు మీఱసారెకుఁ,జూడఁబడియె।
విషయములయందుఁ గామికి,విరతి గలదె॥ ౧౬౨ ॥ (మ) ధవళాం
భఃపరిధౌతగాత్రము లస,త్తాంబూలరాగోష్ఠముల్ । నవసూత్నో
చ్ఛవివిక్తచేలము రహి,న్నారీమణిశ్రేణి క । ట్లవియేచాలు నలంకరిం
చుటకు, బం,చాస్త్రోరులీలావిలో । లవిభావోజ్వలుఁడైన వల్లభుఁడు
గ,ల్గన్సొమ్ము లింకేటికిన్॥ ౧౬౩ ॥ (వ) ఇట్లు సరసి మజ్జనవి
ధౌతమానినీమానులును నతిశయశోభావంతులును నతివిమలాంగకాం
తులునైన యాదవులనవలోకించి యుష్ణాంశుండు వారియట్ల నపరవా
రాశిపూరంబునందుఁ బ్రవేశించుటకు నిశ్చయించెనంత॥ (గీ) తపనుఁ
డాత్మీయతేజోభి,తాపజనిత । వైభవంబు సహింపని,వాఁడు పోలె।
నబ్ధిసలిలంబులోఁగ్రుంక, నాత్మఁ దలఁచి । యస్తశైల మారోహిం
ప, నరిగెనపుడు॥ ౧౬౪ ॥ (మ) స్మరలీలోత్సుకమైన యొక్కసతి

చం, చత్ప్రీతితో నాత్మమం । దిరమందుండి గవాక్షమధ్యగతదృష్టి న్వే
గ నస్తాద్రిభా । స్వరమధ్యంబిఁక హస్తమాత్ర మవకా, శంబున్నదం
చుక్ దదం । తరమానంబు గణింపుచుండెఁ దపనా, స్తప్రాప్తిఁగాం
క్షింపుచున్ ॥ ౧౬౫ ॥ (చ) పరిణతి నొందినందున వి, భాపరిహీన
ప్రకాశయుక్తమై । స్ఫురితవిపాండురాభ్రశిర, ము న్వహియించియ
నుష్ణగాత్రమై । మఱియు ననాతపంబగుట, మందదివాకరబింబనేత్ర
మై । యరుదుగ నత్తఱి న్శిథిల, మై కననయ్యె దినంబు చూడఁగన్॥
౧౬౬ ॥ (చ) ఉరునవకుంకుమారుణప, యోధరయై స్వకరావసక్త
భా । స్వరరుచిరాంబరాఢ్యయయి, బంధురరాగసమేతమైన య ।
వ్వరుణదిశాంబుజాక్షిమణి, పైనతి సక్తినిబొంది భానుఁడున్ । గర
మనురక్తుఁడయ్యె నధి, కద్యుతి నెల్లనడంచిప్రీతితోన్॥ ౧౬౭ ॥ (చ)
అలరు దినాంతశీతలత, రానిలలోలిత నూత్నవల్లికాం । గుళియగు
టన్ నివాసమున, కుఁన్వేస నంగుళిసంజ్ఞ చేఁ దగం । బిలుచుచునున్న
దాని క్రియఁ, బెంపగు శాఖికిఁ బక్షిసంఘముల్ । మరలఁగ నుత్తరం
బిడిన, మాడ్కిఁ జెలంగెఁ దదారవంబులన్ ॥ ౧౬౮ ॥ (గీ) అరయ
సంధ్యాసమీపమం, దబ్జసఖుని । గరము లప్పుడె శైలశృం, గంబుఁ
జేరె । సజ్జనులు నాశకాలమా, సన్నమైన । నున్నతస్థానమున నుం
డు, టుచితమె గద॥ ౧౬౯ ॥ (గీ) జగతి దైవంబు ప్రతికూల, మగు
చు నుండ । సాధనములెన్నియుండిన, సఫల మగునె । కరసహస్ర
మున్నఁ బతన, కాలమందు । నూఁతగొననాఁగనే హేళి, కొక్కటైన॥ ౧౭౦ ॥ (క) అతులజపాసుమగుచ్ఛ । ద్యుతియగురవి యస్త
మాన, మొందుచు నుండన్ । దతదిగ్వలయము కురువిం । దతతిగ
తసుమధ్యమైన, నలువున నొప్పెన్ ॥ ౧౭౧ ॥ (గీ) తప్తకనకాభ మ
గు రవి, తనువు సలిల । ముందు నర్ధనిమగ్నమై, యలరె నప్పు । డ



జనఖవిభిన్నభూరిబ్ర, హ్మాండమైక । ఖండము విధంబున మనోజ్ఞ, కాం
తి యగుచు॥ ౧౭౨ ॥ (చ) నిరుపమరాగవంతుఁడును, నేత్రసుఖప్ర
దదేహధారియు । న్బరఁగ నతోపకారియును, భావితమిత్రుఁడునైన
సూర్యుని । న్వరవసుహీనుఁ డౌటవల, న న్వియదాలయసీమనుండిబల్।
వెరవునఁ బాశిదిగ్గణిక, వెల్వడఁ జేసె గతాభిలాషయై॥ ౧౭౩॥ (వ)
మఱియుఁ బద్మిని యినుండు గ్రుంకు నంతకు సంకుచద్దళంబులచేత న
ర్ధనిమీలితనేత్రయై యుండి యస్తమయానంతరంబున స్వాంతర్ని
గతమధుపస్థూలబాష్పజలంబులు నించుచుఁ గమలలోచనంబులు ము
కుళింపం జేసె నస్తమయానంతరంబున నంతరిక్షం బించుక సేపలత్యు
నక్షత్రంబై యదృష్టశశాంకమండలంబై యుండి పదంపడి యర్కా
స్తమయం బగుటవలనఁ బ్రశాంతసంతాపంబై యనుదితాంధకారం
బై ప్రకాశించె గుణహీనుండగు వానికి నిర్దోషత్వంబె గుణం బగు
మఱియును॥ (గీ) విపులరుచిధాముఁడగు భర్త, తపనుఁ డట్లు । న
పగతుం డగుచుండ న, వ్విపులరుచులు । చిచ్చులోఁ జేరెనటు ప్రవే,
శింపవేని । పరభవంబున నాతండు, భర్త యగునె॥ ౧౭౪॥ (మ)
జనసందోహ కృతప్రణామయును జం, చచ్చారు కౌసుంభర । మ్యని
తాంతారుణకాంతియుక్త యగు సా, యంసంధ్యముక్ ధాతచేఁ। బ
నిగా నుజ్ఝితమైన దేహ మగుట, న్వర్జింప డయ్యెన్ జగ । జ్జన
వంద్యత్వనిజాతి ధర్మమహిమన్, జర్చింపఁగా నేటికిన్॥ ౧౭౫॥
(సీ) అప్పుడు సాంద్రసాం, ధ్యాంశుచ్ఛటారుణితం బౌట విరహా
ర్తి, దళితహృదయ । సంజాతశోణిత, స్నపితమై నది వోలె గ్రక్కు
నఁ జక్రవా, కద్వయంబు । జోడ్వీడి వేఱ్వేఱ, సుఱ్కుచుఁ బఱచె
నెయ్యది జలంబులఁ బుట్టె, నట్టి పద్మ । మనిశంబు లక్ష్మికి, నాలయం
బై యుండు ననుట ప్రసిద్ధ మ, య్యబ్జమునకు॥ (గీ) హీనదశవచ్చి న

ప్పుడు, చాని విడిచె । నది కృతఘ్నత్వ మగుఁ గాదె, యవనిలోనఁ
గరము చపలుర కీకృతఘ్నత్వబుద్ధి । గలుగు టది యొక్క చోద్య
మే, తలచిచూడ॥ ౧౭౬ ॥ (గీ) అకట మిత్రునితోఁ గూడ, నరిగె ది
వస । మేను మిక్కిలి నబల నిం, కెటుల నుందు । నసుచు రవివిరహం
బున, నతనితోడఁ । జనియె నన్నట్లు వెంటనె, చనియె సంధ్య॥ ౧౭౭॥ (చ)
వనరుహమిత్ర కేసరిస్వ, వమ్మృగము తోయధి నీటఁ దోఁపఁగ । గ్లానిప్రతి
సింహమంచుఁ గడు, కోపముచే వెస దాని పైకినే । గినక్రియనీటిలోనము
నిఁగె న్వెనుకన్ బటుదంతిసంఘము । లృనిఁబడి నిర్గమించిన తె, ఱం
గున దిక్కులనిండెఁ జీఁకటుల్॥ ౧౭౮ ॥ (గీ) నిబిడపంకరుచుల, నెగ
డు చీఁకటి గుంపు । కొండగుహలలోన, నుండి వెలికి । నరుగుదెం
చె నొక్కొ, మఱియుబాహ్యంబున । నుండిచూచ్చెనొక్కొ, కొండ
గుహల॥ ౧౭౯ ॥ (గీ) ఉరుతమంబు క్రింద, నుండి మీఁదికి వృద్ధి ।
నొందెనొక్క మీఁద,నుండి క్రింది । కట్లుజాతె నొక్కొ, యటుగా
క యడ్డంబు । దిరిగివచ్చె నొక్కొ, తెలియరాదు॥ ౧౮౦ ॥ (గీ)
మిన్నుమన్నునిండ, మెఱసిచీఁకటి గ్రమ్మఁ । గన్ను పొడుచుకొన్నఁ,
గానరాక । యున్న వేళయోష, లాగిరసాంజనముచే । నెఱిఁగి ర
వుడు ప్రియుల, యింటితెరువు॥ ౧౮౧ ॥ (చ) అరుదుగ గాఢసం
తమస, మప్పుడు కాంతలకున్ బ్రియానుసం । సరణమున నదుఁ గల్గు
రతి, సౌఖ్యమవశ్య మఁటంచునాత్మలో । నరసిసదాభయం బొసఁగ,
దయ్యెఁగుచద్వయ మప్డు నీలయో । గరుచిర రోమరాజిపథ, కంప
మొనర్పక యుండెనెంతయున్॥ ౧౮౨ ॥ (గీ) పవలు రవిరుచిచేనె
ద్ది, ప్రబల దయ్యె । నట్టిగ్రహణ మతితమో, వ్యాప్తతమిని । బొంది
మిగులఁ బ్రకాశించె, బుడమిలోన । నల్పులధికులు గారె నీ, చాశ్ర
యమున॥ ౧౮౩ ॥ (వ) మఱియుఁ బటీరకుంకుమాద్యనులేపనంబు



లును గుసుమమాల్యంబులును భర్తలయందుఁ బొల యల్కఁ బూని
యున్న యువతులునుదీపజ్వాలలు నివియన్నియు నాప్రదోషకాలంబు
చేతఁ గృతప్రసుప్తమన్మథోద్దీపనంబుగలుగు నశ్లేక కాలంబునఁ బ్ర
బోధితంబులయ్యె మఱియును॥ (చ) ధరణితలాభినిస్రుతప్ప, దాను
కులేంద్రఫణాసహస్రసం । భరితమణీరుచిప్రతతి, భంగి సుధాకరదీ
ప్తిజాలముల్ । దిరముగఁ బాక శాసనుని, దిగ్వలయంబు నలంకరిం
చెను । ర్వరనటు పద్మము ల్విరమువంపఁగఁగల్వలు దెల్వి నొందఁ
గన్॥ ౧౮౪ ॥ (సీ) విమలప్రభాసమ, న్వితము పూర్వాచలవ్యవహి
తశశిబింబ, మైన వాస । వాశాముఖంబుప్ర, కాశదంతంబయి భాసు
రవిలాస, హాసమైన । దాని చందమున మం, దము గాఁ బ్రకాశించె న
గ్రభాగంబున, నమృతభాను । భానూపలక్షితం, బై నెఱిఁ బరిమం
దవిదళితతిమిరౌఘు, వితతచారు॥ (గీ) జటలు గలిగియు గగనంబు, స
ర్వమంగ । శాదిపతిమూర్తి యనిపల్కఁ, టదియుసత్య । మనుచుజ
నములచే నిశ్చి, తార్థమయ్యె । భూతపతి కంబరం బొక్క, మూర్తి
గాదె॥ ౧౮౫ ॥ (చ) నవఘనకౌముదీసుమహి, నద్ధతమఃకబరీభృదిం
ద్రది । గ్వ్యవతివిశాలఫాలతట, యోగ్యమనోహరచంద్రఖండమున్ ।
సవరణమీఱఁ బొందుమృదు, చందనపుష్కర సిక్తమైన య । ట్లవిర
శకాంతిమై వెలసె, నంచితవైఖరి నద్భుతంబుగన్ ॥ ౧౮౬ ॥ (క)
మొదలఁ గళామాత్రుండై । పదపడి యర్థమయి పిదపఁ, బరిపూర్ణుం
డై । విధుఁ డొప్పె నెంత శోభా । స్పదుఁడైననువృద్ధినొందు, జగ
తిఁ గ్రమమునన్॥ ౧౮౭ ॥ (గీ) వికచపాండు సరోజరు, గ్విమలవి
ధుఁడు । మొదల మేల్కన్న నదరాజ, పుత్రి ముఖను । భాంశుఁ
డును బోలెహరితల్ప, మైన యట్టి । యుదధిలో నుండిమీఁదికి, నుది
తుఁ డయ్యె॥ ౧౮౮ ॥ (గీ) వితతలక్ష్మణాను, గతరమ్యగాత్రుఁడై ।

బలసి చుట్టుబుట్టు,పటలిగొలువ । జలధి నుత్తరించి,శశిరామభద్రుం
డు । ప్రబలతిమిరదనుజ,రాజిఁ దునిమె॥ ౧౮౯ ॥ (గీ) శశివణిగ్వ
రుండు, సతతంబుముగ్ధత । నలమి గగనవిపణియందుఁ జేరి । యు
డు గణేంద్రు కళల, నుపచయమొందించు । కుతుకమును భజించెఁ,
జతురుఁ డగుచు॥ ౧౯౦ ॥ (గీ) రాత్రికువలయనాథు న,లంకరించె।
రాత్రిరినలంకరించెఁగ,లావిభుండు । ఘనులచరిత మన్యోన్యోప,కార
వంత । మగుచునవిలంబితక్రమ, మైతనర్చు॥ ౧౯౧ ॥ (గీ) అర్క
పాదాభినిహతనై, యళిరుతములఁ । బవలు రోదనమొనరించు, ప్ర
గిదినున్న । కుముదినీసతి శశికరా,గ్రములచేత । నపుడపుడు సం
స్పృశింపుచు, నాశ్వసించె॥ ౧౯౨ ॥ (గీ) విభునిప్రేమోలసతులు, వి
ధురశ్మిగళదంబు । కణహిమాంశుమణివి, కారప్రతిమ । నతనుఘ
ర్మసిక్త,యగు సపత్నియటంచు । భ్రాంతినొందికనిరి, భయముగదు
ర॥ ౧౯౩ ॥ (సీ) అరయ నోషధిపతి, యమృతరసద్రవకరములనం
గనా,గాత్రములను । బరిమార్జనముఁ జేసి, పరితాప మొనరించుఘ
నమానవిషమతత్క్షణమె దించె । నధికప్రకాశితా, శాంతశశాంక
రుజ్జ్వికరంబు విమలమా,ననికపోల। ములయందు వెసఁబ్రతి, ఫలనంబు
నొందిసమంచితభంగి వ్యా,పించె నపుడు॥ (గీ) సితరుచిబ్రహ్మార్మి
భుజసమా,శ్లిష్టభూరి । వేలమైనను గడలి క్షో,భింపఁ జేసె । న
నఁగ మన్మథగతసార,యదుగణమును। క్షోభమొందించె నను టెంత,
చోద్య మహాహా॥ ౧౯౪ ॥ (వ) అంత మదనుండేకాకి యగుటం జే
సియసామర్థ్యంబున గృహాంతరంబులయందు సుప్తుండై యుండి గవా
క్షవివరప్రవిష్టంబు లగుటం జేసి స్ఫటికదండసంకాశంబులైన చంద్రకిర
ణంబు లవలంబించి లేచి చంద్రోదయంబు కంటె మున్నె గాఢసంత
మసంబుచేత నలక్షితబాణలక్ష్యుండైయుండి శీతకరుం డుదితుండై ది



శలు ప్రకాశింపం జేయుచుండ నప్పుడు నిజకార్ముకం బాకర్షించె॥
(చ) ప్రసవధనుర్ధనుశ్చలిత,రమ్యశిలీముఖజాలము ల్నశాం । కసురు
చిమండలోదయవి,కాసము నొందుచు నుండఁగా సము । ల్లసితనవా
సితోత్పలక,లాపములందును బంకజాక్షిమా । నసములయందునొక్క
తఱి, నల్వుగఁ జేరె రొద లైసలంగఁగన్ ॥ ౧౯౫ ॥ (గీ) దిఙ్ముఖంబు
ల కత్యంత,తేజ మొసఁగి । సరసరతి కాకులత్వ మొ,సంగి యత్రి । వీ
క్షణోద్భవాపరవహ్ని, విధుఁడు కామ । దేవున కొసంగె నధికప్ర,దీ
పనంబు॥ ౧౯౬ ॥ (వ) ఇట్లు చంద్రుం డుదయించి సాంద్రచంద్రికా
జాలధవళీకృతదిశాముఖుండై వెలుంగుచుండ నక్కాలంబునందుఁ గృ
తంబైన సమస్తకార్యం బుపకారకంబు గావున నప్పు డంగనలుప్రియ
తమాగమనంబు నిశ్చయించి నైపథ్యంబు గావింపం దొడంగి రెట్లని
న ॥ (క) తరుణీకుచతటములు గురు । తరైకహారమును సమవి,
ధంబుగఁ దాల్చెన్ । ధర సంహతత్వజనిరం । తరాళత భజింప న
వ్వి,ధంబె ఘటించున్॥ ౧౯౭ ॥ (గీ) తరుణి కదళీప్రకాండోరు,తరు
వు మొదలఁ । జారుజఘనస్థలీపరి,సరమునందు । సాంద్రతర మేఖలో
రుపా,శంబుచేతఁ । గంతుదంతావళంబును, గట్టివైచె॥ ౧౯౮॥ (గీ)
సతులకెమ్మోవులందులా,క్షాద్రవంబు । తతకపోలములందు లో,ధ్ర
కరజంబు । కనులఁ గాటుక విశదశం,ఖమునిడిన । పాల కరణి న
భిన్నమై, చాల నొప్పె ॥ ౧౯౯ ॥ (సీ) చలదుజ్జ్వలాధర, దళయు
తంబులు వికసద్దశనాంశుకే,సరభరములు । ప్రకటితగండఫలకములై
న ముఖాంబుజములచే నొప్పిరి, రమణు లప్పు । డధికునిచే జితుం,
డైన వాఁడు విదేశగతుఁడయి చను నట్లు, గాక కుశలుఁ । డైయుం
డెనేని న,య్యధికునిఁ దగ నాశ్రయించి తత్కృపను జీ,వించు నట్లు ।
ప్రతిమాచ్ఛలమున ని,ర్మలకపోలము లైన యింతుల ముఖ మాశ్ర

యించె విధుఁడు ॥ (గీ) గరిమ నెయ్యది నిజభర, గ్లపితమధ్య ।
మగుట నితరాంగములు వోలె, నతికృశత్వ । మొంద దయ్యె,దత్కా
ఠినత,రోరుకుచము । లందుఁగానూత్న్రములు ప్రతి,హతములయ్యె॥
౨౦౦ ॥ (వ) మఱియు నకాామినులు విశేషవిశారద లయ్యును బ్రి
యతముండైన నాయకుండు తమ మందిరంబులకు వచ్చుచుండఁ బ్రి
యాగమనసంభ్రమాతిరేకంబున వారి మనంబు ముంగల నున్న మ
నోహరంబులైన సువసనాంగరాగసుమనోవిభూషణంబులలోనిదిమన
కు ధరింప నర్హం బని నిర్ణయింపం జాలక తడఁబడుచుండె మఱి
యొక్కయంగన యాలింగన సుఖవిచ్ఛేదభీరుత్వంబుననంగరాగమాత్ర
వ్యవధానంబైన సహింపంజాలక తనశరీరంబునందనులేపనంబు సేయ
కుండె నీయనవలేపంబు ప్రియసంగమంబునందు మిక్కిలి యుక్తంబై
యుండుమఱియును ॥ (గీ) కలిత నిజపాణి పల్లవ, స్ఖలితములయి ।
ఘ్రాణరంధ్రంబుల నేగఁ,బ్రాఁకునట్టి । శ్వసితములచేత వదనవా,సన
గ్రహించి । ప్రమదయొక్కతె యానంద,భరితయయ్యె॥ ౨౦౧ ॥(గీ)
విష్ణుపదముచే సఖిచేత,విధృతమైన । చారుపరిపూర్ణ మండల,చంద్రు
నందు । విమలదర్పణమందున,వ్వెలఁదు లాస్య । శోభనటు సారెసా
రెకుఁ, జూచిరపుడు॥ ౨౦౨ ॥ (వ) మఱియు నప్పుడొక్కవిరహో
త్కంఠితయైన విలాసవతి కపోలార్పణంబుకొఱకుఁ బ్రహ్వీభూతపా
ణిపల్లవార్పితకపోలతలంబైన నిజబాహువునుజానుభాగంబుననునిచికా
లక్షేపార్థంబు కంఠపరివర్తిషడ్జాదిస్వరవిహీనంబయిన గానంబవ్యక్త
మధురంబగు నట్లొనరింపుచునుద్గ్రీవయై ప్రియుని రాకకెదురుచూచు
చుండె నప్పు డత్యంతకామమోహితంబైన యువతిజనం బను రాగ
వ్యంజనచతురలును మధురవచశ్చమత్కారలును రమ్యస్వరూపలును
బ్రియచిత్తసమాకర్షణ సమర్థలునైన దూతికలను నేత్రంబులం



బోలెఁబ్రియులయొద్దకుం బనిచిరంతఁ బ్రియులకడకుం బోవ సమకట్టి
యున్నదూతికలతోనాయికలు వేత్త్వేరనిట్లనిరి॥ (సీ) దయితుఁడునా
మీఁద, దయదప్పకుండునట్లొగి లాఘవము నొంద,కుండు నట్లు । నే
ర్పుతోనాదు సం,దేశంబుదెల్పిచయ్యన నిందుఁదోడితె,మ్మనియె నొక
తె । యపరాధకారియై,నట్టి కాంతునిధిక్కరించి క్రమ్మర నేనె,మం
చి గోరి । యనుసరణము సేయు,టదికడు లాఘవంబైననుసాధ్వీక,
ట్లనఁగ రాదు॥ (గీ) విభునియలుకదీర్చి, వెండియునతనితోఁ । గూ
డియుండుటదియె, కువలయాక్షి । సతికి ధర్మమీవు, చయ్యనఁజనివే
గఁ । బతిని దెమ్మటంచుఁ, బలికెనొకతె॥ ౨౦౩ ॥ (గీ) మనసు
దాఁచనేల, మగువవల్లభునితోఁ । జర్చసేయునంత, సాహసంబు ।
లేదునాకువేగఁ, బ్రియునిఁ దోడ్కొనిరమ్ము । పొమ్మటంచునొక్క,
బోటిపలికె॥ ౨౦౪ ॥ (చ) చెలియరొ నీవు మత్ప్రియుని, చెంతకుఁ
బోయి తదీయదోషము । న్బలుమఱు లెక్కసెట్టక ఘ,నంబుగఁ దో
డ్కొని రమ్ము నేరము । ల్దొలఁగక యింతయు న్మనమె,ఱుంగని య
ట్టుల నుందమీవునే । ర్పలరఁగఁ బొమ్మటంచు నయ, మారఁగ నొ
క్కతెఁబంపెదూతికన్ ॥ ౨౦౫ ॥ (చ) మఱియొక బాలచాల నభి,
మానముచే నిజభర్తయొద్ద కీ । వరుగు మటంచుఁ జెప్పితను, నంపక
యున్నసఖీలలామగ్ర । చ్చుఱఁ బ్రియుపాలికేగఁ దన, యంతనె మి
త్రులు మిత్రకార్యముల్ । వెరవునఁ జెప్ప కున్ననెర, వేర్చికృతార్థు
లు గారెధారుణిన్॥ ౨౦౬ ॥ (ఉ) స్థిరముగ నొక్క వాచికముఁ,
జెప్పుమటంచల దూతివేఁడినన్ । బరువడి లజ్జ నుత్తరముఁ, బల్కక
నాయిక యూరకుండి దు । ర్భరతరపంచబాణశిత, బాణకృశీకృత
మైన గాత్రముల్ । గుఱుతుగఁ జూపెఁబైఁట చెఱఁ,గుల్ దొలఁగిం
చి నతాననాబ్జయై॥ ౨౦౭ ॥ (వ) ఇట్లు దూతికలు నాయికలచేతఁ

ప్రేషితలై ప్రియులకడకుం జనియకుటిలచిత్తులగువారి సుహృదర్థంబైన చేష్టితంబు స్వభావవిపరీతంబైనను బ్రకాశించుం గావునఁ బురుషులవలె నప్రగల్భంబులును బ్రతిభాగర్భంబులునగు వాక్యంబుల నిట్లనిరందొక్క-దూతికయొక్క- ప్రియునిం బ్రార్థింపుచు నిట్లనియె॥ ౨౦౮ ॥ (గీ) వసుధ మద్రూపకీర్తి నెవ్వఁడు హరించె । నట్టిపురుషున కనుకూల, యయ్యెననుచుఁ । బొసఁగ నీమీఁది మచ్చరం, బునమరుండు । నీదు ప్రియ నేచుచున్నాఁడు, నెనరు లేక ॥ ౨౦౯ ॥ (చ) యువతి భవద్గుణాళివిన,నుత్సుకయై యటు సారెసారెకున్ । శ్రవణము నంగుళీముఖము,నన్ బరిఘట్టన మాచరించున । య్యవిరళ ఘట్టనంబు భవ,దంచితసద్గుణపూగపూరిత । శ్రవణము తృప్తిలేమిమర,ల న్వినఁ గోరుటచేతనే కదా॥ ౨౧౦ ॥ (సీ) అలఘు తరోష్ణత, నధిగమించిన యూర్పుసెగలచే నెండిన,మగువమోవి । నాగవల్లీదళ,రాగరసంబది సరసత్వమొందింపఁ,జాలదయ్యెఁ । గమలాక్షి నీరంధ్ర,కఠినబృహత్కుచ మండలావరణ ము,ద్దండవృత్తి।విదళించెనటుగాన, మదనశరంబులునిశితత్వమొందుట, నిశ్చయంబు॥(గీ)కుసుమశరుఁడునిర్దయుఁడయి, కుసుమసాయ । కములననిశంబు తాపంబు, గలుగఁ జేసెఁ । గావునభవత్ప్రియాంగనాం,గంబు మిగులఁ । గుసుమములకంటె నత్యంత, కోమలంబు॥ ౨౧౧ ॥ (గీ) ఒనర నపకృతిచే నుప, యుక్తమైన । సర్వమమృతమైనను సువి,షత్వమొందు । నమృతము స్రవించు శశిరుచు,లహహ నీదు । విరహమున నేర్చెఁ దొడఁగెను, వెలఁదినిపుడు ॥ ౨౧౨ ॥ (క) అనియిట్టు దూతికపలికిన । వినియ వ్వాక్యములు నమ్మెఁ, బ్రియుఁడటు మునుపే । మన సెఱఁగి యున్నవానికి । నను మానములేక యతుకు,టను దేమాటల్॥ ౨౧౩॥(వ)అప్పుడు ప్రియులు చంద్రోదయంబుకంటె మున్న ప్రస్థానమార్గాభిజ్ఞత్వంబు నొంది యుం



డిపదంపడి నిశాకరుం డుదితుండగుచుండ లబ్ధపదచిహ్నులగుటం జేసిద యితలచేత సమాకృష్టంబైన మనంబునకునన్విష్టులైన యౌవనపురుషులు ప్రియురాండ్రయిండ్లకుం జనిరంత॥ (చ) వరుఁడరుదేర నప్పుడొక,భామిని గ్రక్కునలేచిసంభ్రమ । స్ఫురితవిశాలనేత్రయయి, సొంపుగఁ గన్గొనుచుండశ్రావణా । భరణనవోత్పలంబు శ్రుతి, భాగము వీడిధరిత్రిపైఁ బడెన్ । గరమళినాదము ల్సెలఁగఁ, గన్తుదఁ ద్రోపుడు వడ్డచాడ్పునన్॥ ౨౧౪ ॥ (చ) తరుణుఁ డొకండుశీఘ్రమునఁ, దప్పక వచ్చుచునుండఁ జెచ్చెరన్ । సరభసమొప్ప లేచివిల,సత్సముదగ్రకుచద్వయంబునం । బిఱుసున మింటి కల్లెగయ, మీటుటకున్ గమకించుదానిసుం । దరినపు డడ్డగించె విత,తంబుగఁ గౌఁగిటఁ బట్టిబల్మిచేన్॥ ౨౧౫ ॥ (గీ) వెనుకడాఁగియున్న, ప్రియవల్లభుని ప్రతి । బింబభారవహన, విధురమైన । యద్దమును వెలంది, యతికష్టముగఁ దాల్చె । వడఁకుచేతజాఱి, పడకయుండ ॥ ౨౧౬ ॥ (క) వదలక ప్రియుండు కౌఁగిటఁ । గదియించినవానిఱొమ్ము, కఠినకుచములన్ । విదళింపుచు మొలగజ్జెలు । పదముల నందియలు మొరయఁ, బరిరంభించెన్॥ ౨౧౭ ॥ (గీ) ప్రియుఁడు రాఁగ వేగఁ, బీఠివిడిచి లేచి । చానయొక తెచీర, జాఱిపోవ । హస్తరుద్ధనీవి, యై తుణదృష్టోరు । కదళిగలుగునట్లు, గప్పికొనియె॥ ౨౧౮ ॥ (గీ) ప్రియుఁడు చప్పుడు గాకుండ, వెనుకనొదిగి । యక్షులను మూయ నితఁడెవ్వఁ డనుచునడుగు । చెలులకునవోఢ సిగ్గుచేఁ, జెప్పలేక । మేనఁబొడమి నపులకలు, గానుపించె॥ ౨౧౯ ॥ (చ) ప్రియుని సమక్షమందును బ్ర,వేపితమై పృథులోరుసాదమై । రయమున లజ్జచే నతివి,లక్షణమై ప్రతిపత్తిమూఢమై । ప్రియమిగురింపఁ జేయునొక, ప్రేయసిదేహము వక్త్రరక్తిచే । నయనవిలోలతం దెలిపె, నవ్యతగాదర సంభ్రమంబునన్ ॥

౨౨౦ ॥ (ఉ) ఇంతులు కాంతులిట్లు తమయిండ్లకు వచ్చినఁ జూచియా
త్మలో । సంతసమందివారి యుప, చారవిధానము నందుభూరిదిగ్దం
తికరోపమోరుయుగ, గాఢభరాలసయాన లయ్యు న । త్యంతగతిప్ర
చారముల, నమిూలి నొందిరి ప్రేమ నెంతయున్॥ ౨౨౧ ॥ (వ) మఱి
యు మనోహరోచ్చలిత భ్రూయుగంబును నయనచేష్టావిశేషంబును
హస్తాభినయసహితచతురవచనంబును యువతికి స్వభావసిద్ధంబైనను
నిపుణాచార్యునిచేత నభ్యాసితం బగుటం జేసి ప్రథితంబైన నాట్యవి
లాసంబునుం బోని విలాసంబు గలదియై యొప్పె నప్పుడొకనాయిక
సపత్నీనామంబునఁ దన్నుఁ బిలుచు వల్లభునితో సోపాలంభంబుగా
నిట్లనియె॥ (సీ) నలువ నీకు సహస్రనయనముల్ గలిగింపఁ డది సృ
ష్టికర్తకు, ననుచితంబు । నరయ మద్విషయమం, దది ప్రస్ఫుటం బ
య్యె నిటు గోత్రభేదివై, యెసఁగు నట్టి । నీచేత నింద్రత, నిజము
గాఁ బ్రకటీకృతం బయ్యె నిఁక వేయి, తలఁప నేల । విను మఱి గత
నైన, ననుఁ జూడ కిపుడు హృద్గతమైన సతి నెట్లు, గాంచి తహహ॥
(గీ) యనుచుఁ బల్కి యలుక, నవ్వలఁ జనఁ జూచు । నట్టి సతిని
దృష్టి, ననునయించి । కాంచి ఘంట లపుడు, ఘల్లని మ్రోయంగఁ ।
గదియఁ దిగిచి ప్రియుఁడు, కౌఁగిలించె ॥ ౨౨౨ ॥ (చ) మఱియునొ
కండు కోపమున, మానిని పల్కిన మాటకల్గి చె । చ్చెరఁ జనఁ గృ
త్రిమత్రుతముఁ, జేసె వరోరువు మ్రోల నుండి బం । ధురకృపచేత
వల్లభుఁడు, తుమ్ముఁగఁ బోవఁగ రాదటంచుఁ దా । మరలెను బోవ
కిర్వురు స, మానులు గారె కృతానురాగతన్ ॥ ౨౨౩ ॥ (గీ) ప్రియు
నిఁ జూచి నంతఁ, బ్రేయసి నీవిబం । ధంబు వదలె హ్రీగు, ణంబుచే
త । వదనశశిని వంచె, వల్లభాలోకన । మాత్రమునఁ దొలంగె, మా
న మపుడు ॥ ౨౨౪ ॥ (ఉ) అచ్చుపడంగ మన్మథశ, రాగతతాపము



యౌవనోష్మము । నైచ్చగ వల్లభుండు దను, నెంచక చేసిన నేరమి
ట్టి మా । చ్చిచ్చునఁ జాలఁ దప్తమయి, చెల్వనకుం దగఁ దత్కుచో
రుభా । రోచ్ఛ్రయ మీషదుష్ణ మిడ, దొప్పుగఁ గౌఁగిటఁ జేర్చె వేళ
లన్ ॥ ౨౨౫ ॥ (చ) స్మరగురుయౌవనోష్మముల, సాంద్రతరోష్ణత
నొంది యున్న సుం । దరకుచకుంభయుగ్మమును, దాల్చి మనోజ్ఞ
ముఖంబుచేత నీ । స్థిర విహరించు వేడ్కఁ జను, దెంచిన యుర్వశి
పోలె నొప్పె నా । సరసిజపత్రలోచనకు, సాటియె మేనక రూప
సంపదన్॥ ౨౨౬ ॥ (వ) ఇత్తెఱంగున నప్పుడుపశమితకోపాంతరా
యంబులైన శశాంకకిరణంబులు కామినీకాముకులకు దూతికల కరణి న
న్యోన్యసంఘటనంబు గావించుటకు సమర్థంబు లయ్యె విలసన్మణితసీ
త్కారాదిమదనాతిరేకవికారంబులైన మద్యంబులు లజ్జాప్రత్యూహ
నివారణకుశలంబులై యన్నెలంతలకు సురతకార్యంబులం దాచార్య
త్వంబు వహించెఁ బానగోష్ఠిప్రస్తావానంతరంబున ధావనక్షాళనాది
సంస్కృతంబులును స్వభావసంస్కారసౌరభ్యయుక్తంబులును సముల్ల
సన్నయనవారిరుహంబులును నవయవసుయోజితంబులు నగు కామినీవద
నంబులు యౌవనపురుషులకు సురాపాన భాజనత్వంబు ప్రాపించె నప్పు
డు॥ (చ) సతతము సోపచారము ప, శాంత విచారము చిత్తకాంక్షణీ ।
యతమము సానుతర్ష మగు, నట్లనుతర్షపదంబునన్ సము । న్నతగతిను
న్నసత్తనువు, దాల్చిన ప్రేమను ప్రాణనాథుల । ప్రతిమ సుధారసంబు
బలెఁ, బాన మొనర్పఁగఁ జేసిరింతులన్ ॥ ౨౨౭॥ (సీ) అనుపమాక్రాంత
కాం, తాననప్రతిబింబమగుటచేఁ గన్నుల, కతి సుఖంబు । లలితరసాల
ప, ల్లవగంధియగుటచే, ననిశంబు నాసిక, కధికసుఖము । సౌరభాగ
తసము, జ్వలభృంగరవముచే శ్రవణంబులకును ని, ర్భర సుఖంబు । గు
రుతరమాధుర్య, గుణయుక్తమగుటచే రసనకుమిక్కిలి, రమ్యసుఖము॥

(గీ) పదపడి సుశీతలత్వంబు, వఱలుచునికిఁ । జర్మమున కెప్డు డంచిత, స్పర్శసుఖము । నిచ్చుచుఁ దదాసవంబు పం, చేంద్రియముల । నధికసంతుష్టినొందించె, నద్భుతముగ ॥ ౨౨౮ ॥ (గీ) మఱియు నున్మదభ్రమదళి, మద్యసురభి । ఫుల్లలోచనకామినీ, ముఖముమద్య । పూర్ణచషకంబు గనుఁగొని, మొదల నెచట । వ్రాలుదు నటంచు సంశయా, క్రాంతమయ్యె ॥ ౨౨౯ ॥ (గీ) భరితవారుణియగు పానపాత్రమందు । బింబితంబైన యువతిము, ఖంబుకమల । మనిభ్రమించి తుమ్మెద వేగ, నచట వ్రాలె । భ్రమణశీలికిఁ గలదెత, త్వప్రచింత ॥ ౨౩౦ ॥ (క) ప్రియురాలొసఁగినమద్యము । ప్రియుచే నతి మధుర మనుచుఁ, బీతంబయ్యెన్ । రయమున నచేతనములగు । ప్రియకాంచనమకుటరుచులు, పీతంబగుచోన్ ॥ ౨౩౧ ॥ (గీ) తరుణిమొదలఁ ద్రావఁ, దన్మధురోష్ఠరసంబు మద్యమందు, సంక్రమించె । నదియు భుక్తపూర్వ, మైనను బ్రియతముఁ । డన్యమద్యమనుచు, నారగించె ॥ ౨౩౨ ॥ (గీ) అధికమాధుర్యమొందిన, మధురసములు । కాముకుల రమ్యవికచవ, క్త్రముల చేతఁ । జెలువుమీఱు ఘ్రాణంబుల, చేతఁ గలువ । తావియేకకాలమునఁ బీ, తంబు లయ్యె ॥ ౨౩౩ ॥ (గీ) మఱియు నుపదంశకాంక్షియా, నరుఁడు మధుస । మానమధురాధరంబు న, ట్లానుచుండ । యావకం బపగతమయ్యె, నపుడు దంత । పీడచే వెండి రాగాభి, వృద్ధి నొందె ॥ ౨౩౪ ॥ (వ) మఱియు సమదనం బగు నట్లు మదకారిప్రేయసీ వదనపానపరుండైన కాముకునకు సకృదాస్వాదితమద్యంబె వైపరీత్యంబున నొక్కక్షణంబుపదంశస్థానంబునం దయ్యె మధుపానాసక్తచిత్తులైన వారల కధరాస్వాదం బుపదంశం బగు మఱియును ॥ ౨౩౫ ॥ (గీ) మద్యపానంబుచేఁ గడు, మధురము లగు । కామినీకాముకులసువ, క్త్రముల చేతఁ । జషకనిహితోత్పలం బళి, స్వానరుదిత । మైనక్రియలజ్జచేఁ గ్రింది,



కరిగె నపుడు ॥ ౨౩౬ ॥ (వ) మఱియుఁ ద్రివారమధుపానసముత్కటమదోద్బుద్ధసంస్కార ప్రతిభావితప్రగల్భమతులైన కామినుల ప్రతికూలవాక్యప్రయోగరమణీయంబై మొదల లజ్జచేత సూచితంబులై ప్రస్తుతమదాతిరేకంబునఁ బ్రకాశితంబులైన గ్రామ్యావయవచేష్టా ప్రలపితంబులు గల పరిహాసంబు ప్రవృత్తం బయ్యె నప్పుడు ॥ (గీ) చెలఁగి తరుణమదము, చేఁ గామిచేఁ బోలెఁ । బరఁగ ముగ్ధ యువతి, వాక్చతురిమ । హృద్యహాస మస్య, దృగ్వికారవిశేష । ములు కృతంబు లయ్యె, లలితఫణితి ॥ ౨౩౭ ॥ (సీ) అరయ నాగస్కారి, యగుపతివిషయామం దంగీకృతోరుధై, ర్యంబుకలుష । మతికోపదీప్తంబు, నగుకామినులహృదయము ఘనమద్యవా, రములచేత । ద్రావితంబయికడు, ధౌతమై శమితమైయలరారె మధుమదం, బంగనాంగ । మందునెప్డునుండు, నైననప్రస్తుతత్వమున హృద్యంబైన, తద్విలాస ॥ (గీ) మప్రకాశమయ్యె, నది పానవశమున । ధాతులీనమైన, తన్మహార్థ । మొనరఁ బ్రాదియైన, యుపసర్గచేఁ బోలె । నతిప్రకాశ మయ్యె, నద్భుతముగ ॥ ౨౩౮ ॥ (గీ) అరయ నస్పష్టపదవాక్య, ముంగవిగళి । తాంబరస్రగ్విభూషల, యందుపేక్ష । తూఁగుటయ కారణంబుగా, నేగుటయును । రమణుల మదోత్థబహువికా, రములు దెలిపె ॥ ౨౩౯ ॥ (గీ) మద్యపానంబుచేఁ బరి, మందలజ్జ । యగుట నర్ధనిమీలితా, యతసునేత్ర । యైనవాఁడయు శిరమించు, కంత వంచి । కాంతు నీక్షించెఁ దిర్యగీ, క్షణముచేత ॥ ౨౪౦ ॥ (చ) ప్రియమునమద్యపానమొన, రింపకమున్ను సఖీనియుక్తయై । రయమున భర్తముంగల వి, లాసముఁ జూపుచు నుండు నట్టి త । త్ప్రియసురఁ గ్రోలినందున వివేకముచేఁ గడు ముగ్ధ యయ్యెఁ ద । ద్దయు నిల నెల్లవారును మ, దంబున నొందరొకోస్వభావమున్ ॥ ౨౪౧ ॥ (శా) ప్రాగల్భ్యంబునఁ గాంతుపైం

ప్రియకుసాం ద్రిప్రక్రియం దొల్లియే। రాగంబుద్భవమై హృదంతరము
నం, బ్రచ్ఛన్నమైయుండెనా। రాగం బప్పుడు మద్యపానమదసం,రం
భోత్థితంబై రసహి। న్పాగొప్ప న్వెలికుద్గమించెరయ మొ,ప్పన్నేత్రమా
ర్గంబులన్॥ ౨౪౨॥ (వ) మొదలఁ దమయంతం దాముసమాగతులైయగణి
తప్రతియాతులైన వల్లభుల గ్రమ్మరఁ దమయంతం దామె యనుసరిం
ప నిశ్చయించిన మానినులమనంబు పశ్చాత్తాపంబు నొందుచుండ న
ప్పుడు సరకంబుచేత స్వయం గమనావసరంబు ప్రాపింపం బడియె మ
ఱియును॥ (ఆర్యాగీతి) మదమోహితాత్మయగు నొక। మదవతియ
పరాధియైన,మత్పతి నింకన్। గదియ నని మధువు విడిచెను।మదికిఁ
బ్రియం బగునె సుఖము, మానము కన్నన్॥ ౨౪౩॥ (చామరవృ
త్తము॥ సరోజలోచ నల్నతాంత, సప్రసాద మంచుని। భర్తరంబు న
న్సృజించి నట్టి,రమ్యమద్య మప్పుడే। కరంబు సత్ఫలంబొసంగెఁ, గా
ఢేహివిమోహముల్। హరించె భర్తృసంగ, సౌఖ్య మప్పు డిచ్చె
స్త్రీలకున్॥ ౨౪౪॥ (గీ) కాంతుఁ డొసఁగి నట్టి, గండూష సరకం
బు। గోలి యహహ యెంత, రుచ్య మనుచుఁ। బ్రమదమొందినం
దు, వలన భామినులకుఁ। బ్రమద లనెడు పేరు, ప్రబల మయ్యె॥
౨౪౫॥ (గీ) పొసఁగ నన్యోన్యమేళనం,బున నుపాత్త। గంధ గుణ
మాట ముదితపు,ష్పంధయమయి। సరకగంధంబుప్రమదాస్య, చషక
గంధ। మేకమై యన్యతను బొందె, నింపు మీఱ॥ ౨౪౬॥ (ఉ) కోప
మడంప శక్తము న,కుంఠితవైఖరిఁ బుష్పసాయకో। ద్దీపనమున్నితాం
తముగ, దృగ్ద్వయరాగరసప్రకాశము। న్స్థాపితసంగమ ప్రియము,
భావసురంజనమా మదంబుచేఁ। బ్రాపుగ భర్తచేత వలె, భామలు
రంజిత లైరి యత్తఱిన్॥ ౨౪౭॥ (సీ) సఖిసమక్షం బౌట, సరస
నిగూఢచుంబనదక్షమైన భా,మిని మనోహ। రాధరంబప్పుడు,శీఘ్ర



నవిధాతరమణీయయావక, రాగ మయ్యె। రమణుచేఁ దాంబూ
రాగరసంబున నింపు గామరల రం,జింపఁ బడియె। మఱియుసప
త్న్యామము నుచ్చరింపుచుఁ బ్రియుఁడర్థినిచ్చిన, పృథుమదంబు॥ (గీ)
ప్రియయును మదిరాక్షిమ,దంబు విడిచెఁ। ద్రావకుండియు వీక్షించి,
సవతి। మత్తమైయుండెనుర్విలోఁ, జిత్తసుఖమె। భూరిమద
తు వగుచునొ,ప్పారుఁ గాదె॥ ౨౪౮॥ (క) మునుకోపిత య
గుటఁ బ్రియుఁడు। వినయంబున నెంత దన్ను, వేఁడినవినదా। వ
నితవిరహమునఁ బ్రియునిం। దనయంతనె వేఁడె మధుమ,దంబున ల
ఘువై॥ ౨౪౯॥ (గీ) ముకుళితాక్షులు కుంఠిత,వికటవచన। లై
నయువతుల లజ్జాప,హరణమంగ। సాదమును జేయు మద్యమ,త్యాం
తిచేతఁ। బోలెఁ దాఁజేసెఁ దద్గుణ,స్ఫూర్తినపుడు॥ ౨౫౦॥ (చ)
చెలువలుమద్యసేవనము, సేయకముందే ప్రతిబింబచంద్రుఁడ। య్యాల
ఘుకపోలభిత్తికల,యందువిభిన్నత నొందకుండె న।వ్వాలమధుపానజోరు
మద,పాటలితద్యుతిగండభిత్తులం। దలరఁగ లోధ్రచూర్ణ తిల, కాకృ
తిఁ దాల్చె విచిత్రవైఖరిన్॥ ౨౫౧॥ (వ) మఱియు విలాసాతిశయ
పోషకంబులైన తచ్ఛరీరంబులు దృప్తకుచకుంభ తటపరస్పరపీడాకరం
బులైమదంబునఘూర్ణిల్లుచుండె నప్పుడు॥ (గీ) పరఁగ మత్తతనొందు
ట,వలన సారె। సారెకును రోషసంతోష,సహితలైన। యింతు
లందును గార్ముకం,బెక్కుఁబెట్టె। నెక్కుడించెను గ్రమముగాఁ, జ
క్కనయ్య॥ ౨౫౨॥ (గీ) అన్యసతిఁగూడె నిజభర్త, యనిభ్రమిం
చి। నెలఁత కరమల్గి వల్లభు,ని గ్రహించెఁ। బిదప నిజ మెఱింగి
యునల్క, విడువదయ్యె। వాఁడిగలదాని కిదిస్వభా,వంబు గాదె॥
౨౫౩॥ (చ) రమణులమ్రోలఁగామినుల, రమ్యతరాయతహాసభాషి
తా। స్యములు వికాసమొందెఁ, బులకాంకిత మయ్యె శరీర మంత

యుక్ । గ్రమమునమానసంబు సుక,రంబుగనార్ద్రిత నొందె నే
యు । గ్మమున సరోషరాగరుచిఁ, గ్రకుక్కనఁ బాసెను మద్య నే
చేక్॥ ౨౫౪ ॥ (గీ) తరుణుల శరీరములను సౌం,దర్యగరిమ ।
నినవయావనంబును, దానిమదన । సంపదయుదాని వల్లభ,సంగ
బు । దానిమధ్యంబు భూషించెఁ, దరతరముగ॥ ౨౫౫ ॥ (గీ)
గుస నప్రతియత్నస్వ,భావరమ్య । తనువుప్రేమ యకృత్రిమో,న్న
విలాస । మలఘుతరచాటువాక్య మ,య్యంగ నలకుఁ । బతి విషయ
కార్మ్యణత్వసం,పదను బొందె॥ ౨౫౬ ॥ (గీ) మఱియు లావణికం
బును, మానవంచ । నజ్ఞమగుప్రియురాలి యా, ననముచేత । నల
ఘుతరమైన ప్రియుహృద,యంబు లీల । నవలఁ దులనుంచి విక్రీత, మ
య్యెనపుడు॥ ౨౫౭ ॥ (గీ) అతిసుఖస్పర్శమై విశ,దాతికాంతి । క
లితమై సురతార్థంబు, కల్పితమయి । సన్నతిని గన్నయట్టి త,చ్ఛయ
నము పయిఁ । బతులపైనొక్క పరిప్రాలె, సతులదృష్టి॥ ౨౫౮ ॥
(గీ) రాగతరళంబు లయ్యును, రమణు మీఁదఁ । దివిరి తిర్యక్ప్రసా
రులు, దీర్ఘదర్శు । లైన యువతుల నేత్రంబు,లపుడు శ్రితిగు ।
ణాన్వితశ్రవణము దాఁట, వయ్యె నహహ ॥ ౨౫౯ ॥ (సీ) మఱి
యు నొకతుక సం.భాషణేచ్ఛావతి యయ్యును బలుక నో,రాడ ద
య్యెఁ । బ్రియుని వీక్షించు కో,రిక గలదయ్యు నట్లభిముఖి గాద
య్యె, నంగసంగ। కాంక్ష గల్గియు నాయ,కస్పర్శనంబునఁ గంపిత స్థ
తి యయ్యెఁ, గడు భయమున । నతివ యొకతుకకు,చాంశుకాకర్ష
ణంబున వ్రీడ నొందియుఁ,బొలుపు మీఱ॥ (గీ) నాత్మనాథుని దృజ్
మార్గ, మడ్డగించి । నటువలెఁ దదీయవక్షంబు, నాత్మవక్షు । మం
దుఁ గదియించి కుచయుగ్మ, మంచితముగఁ । గప్పి మనసారబిగియా
రఁ, గౌఁగిలించె ॥ ౨౬౦ ॥ (పంచపాదిగీతము) అంశుకంబు హ



రించిన, యధిపుచేతఁ । దను భుజస్వస్తికాఖ్యబం,ధంబుచేతఁ। బిహి
తముగ్ధకుచాగ్రమై, వెస నవోఢ । బలమి మెయి భిన్నవలయంబు,గ
లుగునట్లు । గాఢపరిరబ్ధయయ్యెను, గాంతుదీఱ ॥ ౨౬౧॥ (గీ)
ప్రణయకలహంబు మాని యా,వనపురుషులు । నొంటిఁ బరిరబ్ధ యు
వతులై, యుంటఁ జూచి । యతనుఁడు స్వయత్నము ఫలించె, నను
చు నగుచు । మిగులఁగాముక కారోపితా,శుగము డించె॥ ౨౬౨ ॥
(సుగంధివృత్తము) ఒప్పుగా సపత్ని చూచు,చుండ భర్త ప్రేయ
సిక్ । గొప్పగాఁగవుంగిలింపఁ, గోకజాతి పోయెనా।చొప్పెఱుంగ
దయ్యెనప్డు,చూచి మధ్యభాగమే । గప్పెఁ బోతనంతఁ దానె,ఘనమ
సిక్త మాటచేక్॥ ౨౬౩॥ (రగడ) సవతి చూచుచుండ నొక్క,యువ
తి కుచయుగంబుచేత । వాడి మెఱసి పతి యురంబు,పీడసేయుచుండ
గాంచి।దళితమైనసవతిహృదయ, మెలమిఁ దన్మయత్వ మొందెఁ। గలిత
దీపితస్మరుండు,గలుగునట్లుపతియురంబు।విడువకటుపరిష్వజింపఁ,బడు
చునుండనురువులైన ।తొయ్యలులకుచంబులొంద,వయ్యెనుపరిమండలత
ను । బాగుమీఱఁ దమ్ముఁ బ్రీతిఁ,గౌఁగిలించు పతుల హృదయ । మందుఁ
జొరఁదలంచిరపుడు,మందయాన లధికప్రేమ।నెంత వెఱ్ఱులైరి యహహ,
సంతతంబుగోరి పతుల। స్వాంతమునవసించియుండు,టెంతు లెఱుఁగరై
రి మదిని। బరఁగఁబ్రేమవలనఁ బ్రియుఁడు, క్రఱవు దీఱఁగౌఁగిలింపు।చు
న్న మోదమున ... ఱులు,సన్నతాంగ మవుడుచాల। స్నేహపూర్ణమగుచు
లోన, మోహ మతిశయించిద్రవత।నొందెనందువలన సతుల, యందమై
న మేనిచేత । వసనముద్రవింపఁ జేసి,పొసఁగనొక్క దృష్టినించె।రం
గుమీఱనిష్టభర్తృ,సంగమోత్థ విపులహర్ష । మంతరంగ మందు నిలు
వ,కెంతపైకి నిర్గమించి । వికసనంబు నొందిలోమ,నికర మెల్ల నిండి
చెలఁగెఁ । బతికరప్రసారణమున, నతిశయముగ నంగజాత । విపు

లపులకరాజిచేత, నపుడు సిక్త మయ్యెఁ దనువు । అవిరళపులకో ద
యమునఁ, దవిలి యుచ్ఛ్వసితములైన । సంధి నీవికములచేత, బంధ
మోక్ష మొందఁబడియె । నవయవములు వెసఁ గరములఁ, దవిడి తవి
డి కళలు రేఁపి । యువతిమదన మందిరముల, ద్రవము గలుగఁ జేయ
నతను । మత్తయగుచుఁ బాన్పుమీఁద, నత్తమిల్లి సిగ్గుచేత । లోచ
నములు సగము మూసి, చూచిచూడ నటులనుండె ॥ ౨౬౪ ॥ (గీ)
సరసపరిరంభమందు ల,జ్జాభరాన । తంబయి సమర్పితాధర,దళము
నైన । వదన కమలంబు పతి కొప్పఁ, బట్టి యెత్తి । యత్తు లటు
మూసిచుంబన,మాచరించె ॥ ౨౬౫ ॥ (గీ) పరఁగఁ బల్లవోపమితి
స,పత్నమైన । యధరబింబంబు వల్లభుఁ, డానుచుండఁ । దనర సవ్య
థమైనట్లు, తారలోల । వలయమునఁ జేయి కూజిత,ధ్వని యొనర్చె॥
౨౬౬ ॥ (గీ) అధికవిరహోష్మసంతప్త, మగుట వలన । రాగి
మధురంబు నుల్బణ,రాగమైన । యధరపల్లవమును వీఁడి, సార్ద్రమై
న । వనితయక్షియుగంబు చుం,బన మొనర్చె ॥ ౨౬౭ ॥ (వ) ప
రిజనరహితం బగుట వలన నతివివిక్తంబై కేవలాభిరతదంపతి ప్రవేశ
నార్హంబై విశాలంబై యున్న యొక్క క్రీడామందిరంబుఁ గేవలల
క్ష్మీమాత్రసహాయుండైన విష్ణునిచేత సేవితంబైన యుగాంత పయో
నిధికి సామ్యం బగు దానిఁ బ్రవేశించి రంత ॥ (గీ) ఊరుమూలంబు
పై హస్త,ముంచఁ బోవ । మానవతి గాన సిగ్గున, మగ[illegible]
లోకకరంబున మూసి వే,ఱొకకరమున । నజ్జముఖి పతి హస్తంబు,
నడ్డగించె॥ ౨౬౮ ॥ (క) గురుతరకుచద్వయంబున । నిరావృతము
లైన యట్టి,నెలఁతల యురము । ల్సరతాభిలాషవత్ప్రియ । కరము
లు గ్రహియింపఁ బడియె, ఘనరాగమునన్॥ ౨౬౯॥ (చ) చెలువు
గ ఘర్మవారికణ,సిక్తము లౌట మృదుత్వసంపద । ల్గలిగి వినమ్రభా



వమునఁ, గ్రాలు ప్రియోరుల సన్నఖాగ్రము । ల్పలునుఖ భామినీకఠిన,
భవ్యకుచాగ్రములందుఁ గాంతులిం । పలరఁగనించె నప్పు డస,మగ్రప
దంబులతి ప్రయత్నతన్ ॥ ౨౭౦ ॥ (చ) సముచితయౌవనోష్మకుచ,
శైలశిఖాగ్రసమాత్తఘర్మతో । యములగునూత్నయౌవనల,హస్తత
లంబులు వేగ నుచ్ఛ్వస । త్కమలమనోహరంబులగు, కాంతల నా
భిసరోవరంబులం । దమితరసంబునన్ బతిత, మయ్యె సమగ్ర విలా
ససంపదన్ ॥ ౨౭౧ ॥ (చ) అరయఁదరంగతుల్యవళు, లంచిత వై
ఖరి సంస్పృశించు సుం । దరతరముద్రికాంచితత,తస్ఫురదంగుళిహ
స్తపంకజో । త్కరములుగల్గునట్టి ప్రియ,కాంతులు కాంతల మధ్యదే
శము । ల్లరుదుగ ముష్టిమేయమని, యాత్మనెఱింగిరి స్వానుభూతిచేన్॥
౨౭౨ ॥ (క) ఘననాభిహ్రదమున మ । జ్జనమాడి పటంబు కొంగు
కు, సతిమొలచీరన్ । గొనసీవి విడువఁబోయినఁ । దనపతి కరమడ్డ
గించెఁ, దనకరములచేన్॥ ౨౭౩ ॥ (గీ) ప్రియకర నివారణవ్యగ్ర,
ప్రేయసికర । సక్తమును మేఖలా గుణ, యుక్తము తత । తంతు
వును గృతరతిమహా,భ్యంతరంబు । నైనవసనంబు స్వేచ్ఛావి,హారబం
ధ । కమునఁ గామికత్తొంతిని, గలుగఁజేసె॥ ౨౭౪ ॥ (చ) పడఁ
తి యధోంశుకంబు విడు,వం గమకించెడు భర్తపాణికి । న్విడువకు
మంచు నడ్డమిడు,ప్రేయసి బాహులకు న్నిరంతరం । బడఁగక కల్గు
ప్రోరుడుపు, నట్లుగ హస్తగకంకణంబులన్ । గడువడిఁ గాంచి
బద్ధమణి,ఘంటికలున్ రొదఁ జేసె నత్తఱిన్॥ ౨౭౫ ॥ (చ) పెనఁ
గి విభుండు కోక ముడి, విచ్చిన భామిని మానవిత్తగా । వునఁ బ్రి
యవల్లభు న్వెసఁగ,వుంగిటఁ జేరిచి భూర్యియుగంబుపై । ననుపమ
సూక్ష్మలోమనిచ,యంబులచేఁ బటుకోపము న్రిహిన్ । గనుపడఁ
జేసె సాంద్రపుల,కంబులచే ముద మొక్కసారిగన్॥ ౨౭౬ ॥ (సీ)

పతికరాగ్రము నీవి,బంధంబు రయమున లంఘించి యూరుమూ,లము
స్పృశింప । నతిసుఖపారవ,శ్యమున నర్ధనిమీలితాక్షి,యై యొక త
న్వి, యంచితముగ । రక్తవైణికహత, రంజితాధర తంత్రి మండల
క్వణితస, మానచారు । మణితంబు గావించె, మధురంబుగా 'రతి
గళనిస్వనంబులు, గలుగు నటుల ॥ (గీ) నాయతాంగుళిపతిక
రం, బధికకార్శ్య । శాలియగునాతి మధ్యదే, శంబునందుఁ । జూ
డనతిరిక్తమై పృథు,శ్రోణియందు । నఖిలపాణితలస్పర్శ,మై తనర్చె॥
౨౭౭ ॥ (గీ) సక్థి సంస్పర్శతృష్ణాతి,శయము చేతఁ । జలితనిజహ
స్తులైన కాం,తులనఖములు । కదళకాండోపమానోరు,పదములందు।
నిపుణ ముగఁ జారులేఖలు, నించె నపుడు ॥ ౨౭౮ ॥ ॥ (గీ) సక్థి
మూలవిలోలలో,చనునిఁ బ్రియుని । రమణి కర్ణావతంసపు, ష్పముల
వేసె. । వ్రేయనవిమేనఁ బడిరతి, విభునకపుడు । ప్రసవశరుఁ డను
పేరుసా,ర్థకముఁ జేసె ॥ ౨౭౯ ॥ (సీ) రాజాస్య లుద్వృత్త,రతి
రాగయుత లయ్యురమణులయందు ధైర్యంబుఁజేసి । రంగంబు ప్రి
యులకు,నర్పించియునుజాలవక్రత్వ మొనరించి, రాక్రమమునఁ । బ
టుతరసురతసం,బంధిధాష్ట్ర్యముగల వారయ్యువ్రీడభా,వంబుగనిరి।
గరిమరాగాదులా,గంతుకంబులును ధైర్యాదులు సహజంబు, లంగనల
కు॥ (గీ) వనితయనిరోధితప్రియ, వాంఛగలుగు । నట్లుపాణినివార
ణం, బాచరించెఁ । దవిలిపరిహాసగర్భభ,ర్త్సనముఁ జేసెఁ । గప
టరుదితంబుఁజేసె సు,ఖంబునందు॥ ౨౮౦ ॥ (గీ) సిగ్గుచేతనీర్ష,చేత
నిషేధోక్తిఁ । బలుక కూరకున్న, బాలికలకుఁ । బతులుసేయుక్రీడ,
ప్రతికూల మనుకూల । మయ్యెఁ గష్టసుఖద,మగుటవలన ॥ ౨౮౧ ॥
(గీ) సురతవేళసతుల, కరయభర్తలయందు। ధాష్ట్ర్యమబలలందు,ద
యితతముల । కదయతయును గల్గు, నివి రెండితర కాల । మందువైప



రిత్వ,మొందియుండు॥ ౨౮౨ ॥ (చ) నెలంతలదేహమందు శయ,నిం
ల,న యవ్విషమేషుఁడ త్తటిక్ । జలమున బాహుపీడనక,చగ్రహణం
త్తినుచేత సంతతో । జ్వలనఖదంతపీడలను, జయ్యన మేల్కనిజాడ్యహా
ద్రాక్షి । యెలమిరమింపఁజేసెఁ దగ,నిర్వ్రరనాత్మవిచేష్టితంబులన్ ॥
౨౮౩ ॥ (వ) మఱియు నొక్కకాముకుండు వస్త్రాపకర్షణక్షణంబునఁ
పామినిచేతసమాశ్లిష్టుండై వ్యగ్రకరుండగుచు దుకూలంబు నాకర్షింపం
గడంగి నిరంతర స్తనతిరోహితనేత్రుండగుటం జేసియంతకుమున్నె విగ
ళితంబైన వస్త్రంబు నెఱుంగం డయ్యెనప్పుడు ॥ (గీ) తరుణికుచముచే
తఁ,దాడిత నైతినిం । కిచట నాకు నుండ,నేటికనుచుఁ । దుటితహార
యష్టి,ప్రియునెదమౌక్తిక । వృష్టిఁగురిసెఁబుష్ప,వృష్టికరణి॥ ౨౮౪॥
(గీ) స్నిగ్ధవాక్యంబుదీనో,క్తి,సీత్కృతంబు । మణితము నిషేధ వచనం
బు, మఱియుభూష । గౌరవంబులు వాత్స్యా,యయ, నాదిరచిత । మై
నస్మరశాస్త్రపద్యార్థ,మధిగమించె ॥ ౨౮౫ ॥ (గీ) నిభృతమేకంబువి
చ్ఛేద,నిరతమైన।సతులమణితంబవిచ్ఛేద,చారుమధుర। బహుళతరకాం
చినూపుర, ధ్వనులచేత।నతుతముగాకవినన య్యె,నద్భుతముగ ॥ ౨౮౬॥
(వ) అప్పుడురతిసంభ్రమంబువలనధరణీతలంబునఁబాతితంబైన కాంచీ
దామం బీదృశంబైననిజఘనంబునకుపరిసురతంబులందు ముహుర్ముహు
రుత్పతన పాటవంబెట్లుగలిగెననివిస్మితంబైనజఘనమహత్వంబు దర్శిం
పం జేయుచున్నదానిఁబోలెనొప్పెమఱియును॥ (సీ)విగతచిత్రకచిత్ర,
విపులకపోలంబులం దార్ద్రనఖపద,వ్యాపనములె,చిత్రరూపములయ్యెఁ,
జెలఁగివిచ్యుతకుసుమాలకాగ్రము లందు,నంచితముగ । శ్రమవారికణ
ములె,సుమవితానములయ్యె మఱియుఁగామినులు ర,మణుల కొఱకుఁ।
గ్రమతనేమేచేష్టి,తముప్రియంబైయుండునింపుగా నదియుఁ గా,వించి
రప్పు॥ (గీ) దుచితముగవేషభాషల, నుత్సుకత్వ। మునను రాగంబున

లనను, మోహమునను । లలితగతులచే నానుకూల్యంబు వలనఁ । గేడె లుల హృదయంబురంజిల్లఁ, జేసిరపుడు॥ ౨౮౭ ॥ (చ) తెమలకకావిం సు_త్తనివి, దీఱసమోపరతిక్రియ ల్సమ । గ్రముగ నొనర్చి చొక్కితను, ల గ్నశ్రమాంబుకణార్ద్రిచేలలై । శ్రమమునఁ దత్కుచోరుయుగ, సాంద్రభరంబు సహింపలేకసం । భ్రమమునఁగొప్ప లంసముల, పైన టి యింపఁజరించిన త్తతిన్ ॥ ౨౮౮ ॥ ( గీ ) రతిసమయమందుమిగుల దూరగతమైన । వ్రీడసురతాంతమందుఁ ద, ద్విరహమొర్వ । లేని ప్రియసఖిచందాన, మానితముగఁ । గ్రమ్మఱఁ బ్రవేశ మొనరించెఁ, గాంతలందు॥ ౨౮౯ ॥ (గీ) పరఁగ లజ్జాస్ఖలితనేత్ర, పాతములను । సంభ్రమాశుగృహీతవి, శాలపటపి । నద్ధగాత్రంబులగు మైథు, నక్రియాంత । ములుక్షణముచూడఁ దగియుండెఁ, బాలుపుమీఱ॥ ౨౯౦ ॥ (గీ) యువతి మొలచీరగట్టుచో, నొక్కతొడను । గ్రమ్ముటకె కాని కటిచుట్టు, రాకయున్నఁ । బతి కరంబునఁజిక్కిన, పైఁటచెఱఁగు। లాగికొనినవ్వుచును గట్టె, బాగుమీఱ॥ ౨౯౧ ॥ (సీ) ప్రవిమృష్టచందన, రచనంబువిభ్రష్టమండనంబును ద్య_క్త, మాల్యమునగు । సుపభోగ మపరాధ, యుక్తమైనటువలెఁ దనయంతఁదానె య, వ్వనితలకును। స్వాపగాధనివృత్తి, కైమండనంబయ్యె రతిసంభ్రమంబునఁ, బతితహేమ । కాంచిమైనవరోరు, ఘననితంబమునందుఁ గడునఖక్షతరేఖ, కాంచియయ్యె॥ (గీ) వసతలయురోజపీఠిపైఁ, బతికరాఘ్రి । మర్శనచ్ఛేదగత ము_క్త, మౌ_క్తికంబు । లతిలఘువులయ్యె గుణశేష, హారయష్టి । తలఁపమిక్కిలిశ్లాఘ్యమై, యలరెనపుడు ॥ ౨౯౨ ॥ ( మ ) కలయం గాంతల పాటలోరుదశనాం, కంబచ్ఛగండస్థలం । బులవైజాత్యముచేత భేదమయి వై, ముఖ్యంబుఁ బ్రాపించెను । జ్వలదోష్ఠంబునఁ దుల్యవర్ణమగుటన్, సౌముఖ్యముంజెంది మి। క్కిలిరాగాతిశయత్వ మొంది యలరెన్, గేళీక్రియాంతంబునన్ ॥ ౨౯౩॥ (గీ) ప్రథమసురతాంతమునఁనిజ, పతులు విశ్ర । మార్థమేయుపగూహనం, బర్థినొసఁగి । రదియెయుదితమన్మథమయి, యంగనలకు । వెసఁబునారతి కవకాశ, మొసఁగెనపుడు॥ ౨౯౪ ॥ (చ) అనిశము క్రీడనాభిరత, మైనలతాంగికి సౌఖ్యదంబుల । య్యనుగతమోహులై క్షణద, యొక్కతె గాదటు మద్యమన్మథుల్ । మునుకొని పల్లవప్రసవ, భూషితతల్పతలంబులందుఁజ । య్యనఁబవళింప నొక్కక్షణ, మైన నొసంగరదెంతచిత్రమో॥ ౨౯౫ ॥ (వ) మఱియు మిక్కిలి నఖలూనంబయ్యును సముజ్జ్వలత్వంబుననూనం బగుటం జేసిశీఘ్రింబునఁ బ్రియులచి_త్తంబువికారంబునొందింపని వరారోహలగాత్రంబు యాదవులకురాగవృద్ధి గొంతపడకుండంజేసె నిట్లుమదనులచేత నభివ్యంజితరాగులు నవిచ్ఛిన్నసురతసంపదలచేత నతిలంపటులునగురాగవంతుల విలోకించియనంతరంబ పరివృ_త్తహ_స్తయు నవనతశశాంకయునైన యారజనిగ్రామ్యచేష్టాసందర్శనసంభూతలజ్జచేత నమ్రముఖియైనదాని పోలికఁ బ్రభాతప్రాయయై యొప్పెనప్పుడు॥ (ఉ) సాంద్రయశఃప్రతాపజిత, చంద్రదినేంద్రమహేంద్రవైభవా । పేంద్రవరాంశసంభవగ, జేంద్రవృషేంద్రమృగేంద్రయానయ । యోంద్రకుమారమారదివి, జేంద్రకుమారసమానరూపభో । గీంద్రసమానసారసుస, మృద్ధభుజాగ్రనిషణ్ణభూభరా ॥ ౨౯౬॥ (క) విద్వన్నుతచారిత్రక।సద్వంశప్రభవ వాగ్వి, శారదధాత్రీ। భృద్వరశేఖర సమద । ప్రద్వేషణహరణసుగుణ, రాజ్యాభరణా ॥ ౨౯౭ ॥ (స్వాగతవృ_త్తము) దీనపోషకసు, ధీజనమాన్యా । దానశౌండవసు, ధామరవంశో । ద్యానమాధవ సు, ధాసమభాసా। మానవి_త్తనృప, మాన్యచరిత్రా॥ ౨౯౮ ॥

※

( గద్య )

ఇది శ్రీరామచంద్రకరుణాకటాక్షలబ్ధవిద్యాసాంద్రగోపినాథ
వేంకటకవీంద్రప్రణీతంబైన శిశుపాలవధ మహాకావ్యం
బునందు షడృతువర్ణనంబును వనవిహార వర్ణ
నంబును జలక్రీడా వర్ణనంబును సూర్యా
స్తమయవర్ణనంబును రాత్రికాల వర్ణ
నంబునుమద్యపానవర్ణనంబును
బాహ్యాభ్యంతరసురతవర్ణనం
బును ననుకథలంగల ద్వితీ
యాశ్వాసము.

సంపూర్ణము.

శ్రీరస్తు

# శిశుపాలవధమహాకావ్యము.

## తృతీయాశ్వాసము.

(క) శ్రీపద్మనాయకాన్వయ । దీపకఫణిరాజతుల్య, దృఢతర భుజసం । స్థాపితధరణీభార ర । మాపతిచరణాంబురుహాస, మర్పితహృదయా ॥ ౧ ॥ (వ) అవధరింపు మవ్వలికథ యెట్లనిన॥ (సీ) చతురత నవికృత, శ్రావకసుస్నిగ్ధకంఠులై యొప్పు మాగధులు వచ్చి । సమధికశ్రుతులైన, షడ్జస్వరంబును బంచమస్వరము ప్ర, భాతకాల । మం దునిషిద్ధంబు, లౌటచే వర్జించి తతవేణువీణామృ, దంగతాళ । కలితం బుగఁ బ్రభాత, కాలముచ్చైస్స్వరఘనరాగ మునమాధ, వునకుఁ దెల్పి॥ (గీ) రతసురతితాంతనయనద్వ, యంబు మూసి । మాయకయ మున్నె గురుతర, మురజరవము । కల్యసమయంబు దెలుపుచు, గాంతభావి । విరహసూచకమగునట్లు, వేగ మ్రోసె॥ ౨ ॥ (మ) భవదీయోజ్జ్వలశైశవంబునఁ బద, ప్రక్షిప్తమైపోయివే । గ వియన్మార్గమునన్ భ్రమించు శకట, క్రవ్యాదుచందంబునన్ । దివిపైనల్పశరీరుఁడైన ఘృవుపై, దేవర్షిరాణ్మండలం । బు వికాసస్థితిఁ దక్కె నొప్పెడు నిశా, భోగాంతముం దెల్పుచున్ ॥ ౩ ॥ (చ) మెలఁపున యామపాలకుఁడు, మేల్కొనియుండిస్వపాల్యయామమున్ । బోలుపుగఁబుచ్చి

తానిదుర,పోవననంతరయామపాలకుం । బిలుచుచు లెమ్ము లెమ్మను
చుఁ, బేర్కొన వాఁడతినిద్రచే రహిన్ । బలుమఱు నర్థవాక్యములు,
పల్కుచు మేల్కొనకుండె నత్తఱిన్ ॥ ౪ ॥ (చ) లలనబృహన్నితంబ
విపులత్వనిరుద్ధమనోజ్ఞశయ్యపై । నలువుగఁబవ్వళించుటకు,నట్లవకాశ
ములేక యున్ననే । యలవున నిద్రఁబోనడఁతు, నంచటుసారెకు మ
న్మథక్రియా । కలన నతిప్రయాసముగఁ, గాంతుఁడు పుచ్చెను రాత్రి
శేషమున్ ॥ ౫ ॥ (చ) క్షణశయిత ప్రబుద్ధులు ర,సాపతులున్ గవి
శేఖరు ల్వర । క్షణదలయందు మేల్కొని వి,కాసితసంతతధీప్రచారు
లై । ప్రణుతికినెక్కు వార్ధిసమ,రాజ్యసుకావ్యములందునున్ బ్రతి ।
క్షణము ప్రయోగకల్పనలు, సాధుగతిన్ దలపోసి రెంతయున్ ॥ ౬ ॥
(ఉ) ఉర్వీతలంబునందు శయ,నోత్థితమాట మదాంబు పంకిలా । ఖ
ర్వశరీరమైన యొక,గంధగజంబును యంతనేర్పుతో । గర్వ మడంచు
చున్ వెనుక, కాళ్లఁదగిల్చినశృంఖలధ్వనుల్ । పర్వఁగ నొందుప్రక్క
నవ,లన్ శయనింపఁగఁజేసె నెంతయున్ ॥ ౭ ॥ (చ) అతిలఘుహ
స్తగోపులు స,మాహితమంథకదండమై సము । ద్ధతబహునాదయు
క్తమయి, తద్దయునొప్పు దధిప్రకాండమం । దతులజలంబునందుసు
ర,లబ్జునిఁ బోలెను వెన్నఁదీయఁగాఁ । జతురత వార్నిధింబలెఁ బ్ర,స
న్నతఁద్రచ్చిరి కుంభిరుద్ధతిన్ ॥ ౮ ॥ (గీ) మగని ప్రార్థనవినక తా,మొ
గము ద్రిప్పి । కూర్కినట్లుండి యటుకోడి,కూతను విని । లేచినిద్రచే
ముకుళిత,లోచనయయి । కనవియట్లుగ, బిగియఁగఁ,గౌఁగిలించె ॥౯॥
(చ) అనుగతవేణువల్లకిర,వైకత నొందిసమగ్రతాలమై । యనుపమ
బోధసాధనము,నైకలమై యవిగర్హితంబునై । ఘనముగ నొప్పుగీత
మును,గాయకులుందగఁ బాడుచుండఁగాఁ । బసిఁబడి యాల కింపుచు
న్న,పాలకులున్నిదురించి రింపుగన్ ॥ ౧౦ ॥ (మ) నలువొప్ప న్హాయ



రాజిమున్గళితకర్ణగ్రీవము ల్గల్గిన । శ్శైలమింగన్నులు మూసి జాను
యుగళం బింపొందఁబైకెత్తి సొం । పలరన్ గొంచెము కూర్కి లేచి
చపలో,ష్ఠాగ్రంబునై వేడ్కనుం । గలిఘాసంబు గ్రసించెఁ బ్రస్ఫుర
దుదగ్రప్రోథముం గల్గఁగన్ ॥ ౧౧ ॥ (మ) మునుమత్సంగతిచేఁ బ్రవృ
ద్ధరుచియై, పొల్పొంది చంద్రుండు పై । ల్చనఁ బ్రాప్తోదయుఁ డయ్యె
నేఁడపరతో,సంబంధముం జేసినం । దునఁబాతిత్యము నొందెనిట్లగుట
నెం,దుంజూడ నర్థంబుగా । దనుచున్ బ్రాచిహసించెనో యనఁగఁ
దూ,ర్పచ్ఛత్వ మొందెన్రహిన్ ॥ ౧౨ ॥ (మ) సరసన్ భర్తలు సుప్త
లైనవెనుకన్, సంసుప్తలైవారు గ । మ్మర మేల్కాంచక మున్నెమే
ల్కనియు భా,మారత్నముల్భీతిన । త్తఱి నస్పంద శరీరలై సురత
ఖే,దప్రాప్తనిద్రాసుఖో । త్కరులై కాంతులఁ గౌఁగిట న్నిడరు ని,
ద్రాభంగమంచు న్రహిన్ ॥ ౧౩ ॥ (వ) మఱియు నప్పుడు శశాం
కుండు సంధ్యాసమయ రాగంబుచేత లోహితావయవంబులైపరిపక్వ
రాజీవకందచ్ఛేదశుభ్రంబులైన నిజమయూఖంబులచేతఁ గుంకుమంబు
చేత నీషద్భగ్ననిజధావళ్యంబులైన సరసచందనరేణువులచేతఁ బోలెఁ
బశ్చిమాశనలంకరించె మఱియును॥ (సీ) రమణీయకుముదషం,డము
ముకుళీకృతపత్రమై క్షీణశో,భనువహించెఁ । గమల షండంబు వి,కా
సితదళమయి పరివర్ధమానశో,భను ధరించె । నవ్యక్తమధురమా, న
ళ్లుతుమ్మెదలచే నుపగీతమైన య,య్యుభయమవుడు । ననురూపదశ
నొందె,నజ్జారికిరణసందోహం బనూరుచేఁ, దుల్యరుచిని ॥ (గీ) బరఁ
గఁబ్రాపించి రయమునఁ,జిరపరిచిత । ప్రీడనటువుచ్చినట్లున్న, వృత్ర
వైరి । దిక్సతీవక్త్రమునకు ను,ద్దీపితావ । కుంఠనపటంబు క్రియఁగ
ప్పెఁ, గోర్కులలర॥ ౧౪ ॥ (చ) అనిశరతిప్రయ ఁని, తాతిపరిశ్ర
మనిస్సహాంగనా । తనువున శాంతి నొందిస త రపావకు నట్లు

వెండియు । ల్లనవమాలతీసుమప, రాగకరీషరజంబుచేఁ బ్రభం । జనుఁ
డాగెఁ గుళ్లగించి పెలు, చన్ జ్వలియింపఁగఁ జేసెన త్తఱిన్ ॥ ౧౫ ॥ (చ)
ప్రకటితపద్మబాంధవవి, భాపరిహీణనిజౌజమైన దీ । పకళికరాగవం
తులగు, వారిరతిక్రమ మెల్లనర్థిఁ ద । క్కఁకయటు సర్వరాత్రమును,
గన్నులు మూయక చూచినందునన్ । నికట సనిద్రమైన గృహ, నేత్ర
ములై వడి నుండెన త్తఱిన్ ॥ ౧౬ ॥ (సీ) మఱియు మోహానంగ, మా
ద్యత్సుయౌవనోన్నతకామినీమనో, నాథసురత । సంరంభసంభవ, శ్ర
మజాతఘర్మనివారణచణుఁడు ప్ర, భాతకాల । పవనుండు వికసిత, ప
ద్మగంధములచే భృంగపాళికల మో, హింపఁ జేసి । మంజులసురభిత,
మకరందములు వెదఁజల్లుచు వీచెను, సంభ్రమమునఁ ॥ (గీ) గౌరియా
రాత్రి శశికాంతుఁ, గూడియుండి । శ్వసనసురభియై యిప్పుడిం, పెసఁ
గఁ దత్క । రాంగరాగవిమిశ్రాంబ, రాంతమును వ । హించిరయ
మునఁ జనుచున్న, దేపుమీఱి ॥ ౧౭ ॥ (చ) విలుళిత నేత్రతారకలు, వి
శ్రుతసుప్తినితాంతమేచకో । త్పలనయనల్వికాసరహి, తస్ఫురదాస్య
సుధాంశుబింబలున్ । జలితశిరోజపాశలయి, చయ్యన వారవధూము
ఖల్నిశ । ల్వేలయఁగ రాజవేశ్మముల, వెల్వడిరప్పుడు సంభ్రమంబు
నన్ ॥ ౧౮ ॥ (చ) అతిరుచిరమైన చంద్రుఁడు న, వాసితకంజవనీరమా
సము । న్నతపరిహాసవైఖరులఁ, దప్పక రాతిరి మెల్లఁ బుచ్చి యం । చి
తముగ ప్రస్తహస్తుఁడయి, చెచ్చెర నిద్దుర వోదలంచి ర । వ్యతరసి
తాంగమస్తకుధ, రాంకమునం దగఁ జేర్చెన త్తఱిన్ ॥ ౧౯ ॥ (గీ) రా
త్రివేళ సత్వరపరి, రంభసంభ్ర । మంబున నపాస్తమైన రా, మాపటం
బు । తత్పృథునితంబలోలనే, త్రయుతుఁడైన । పతి మొసఁగఁడ వ్యోఁ
గ్రమ్మఱఁ, బళ్నికపుడు ॥ ౨౦ ॥ (గీ) అకట నిశవోయెఁ గుమిడిసి,
ముకుళితాక్షి । యయ్యెఁ దారక ల్నశియించె, ననుచుఁ బ్రియక ।



శత్రుఁడగు శశి దుఃఖించి, భ్రష్టశోభుఁ । డై కృశతనొందెనో యన, నపుడు
దోఁచె ॥ ౨౧ ॥ (గీ) ఎంతలో రవి గనుపట్టఁ, దంతలోన । నరుణుఁడు తమంబు
నంతయు, నపహరించె । మును కొనిప్రతాపవంతుల, మ్రోలనున్న । య
తఁడును రిపుప్రహర్తయై, యలరుఁ గాదె ॥ ౨౨ ॥ (గీ) విరహఖిన్న
మాకోకంబు, విగతతిమిర । మగు నభముఁ జూచి పక్షంబు, లటు విది
ర్చ్బ । నంతలోఁ దత్ప్రియాంగన, నైన కోక । రమణి చనుదెంచెఁ ద
టినితీ, రమునను౦డి ॥ ౨౩ ॥ (వ) మఱియు రాత్రికాలంబున యువతు
లును బుష్పమాల్యంబులును సంతుష్టయువమనస్కులై యుపభోగంబు
కొఱకు సంపాదితంబులైన వలయవసనాది భూషణంబులచేత భూషి
తంబులై యుభయంబు తుల్యకాంతిని వహించి యుండియుఁ బ్రభాత
కాలంబగుటయు యువతులు వల్లభాలింగనంబులచే విమృదితంబులైని
ష్ప్రభత్వంబు నొందిన మాల్యంబులం బరిత్యజించిరప్పుడు ॥ (సీ) ప్రి
ణివనమందుఁ జ, లితకమలౌఘుండు విక్షిప్తవల్లికా, విస్తరుండు । కం
పితాశేషవృ, క్షప్రసూనుండునై యెచ్చోటనిలువంగ, నింపులేక । శ్వ
సనుండు కామినీ, ప్రసవసంఘర్షణోద్గంధినిశాంతభా, గముల నిలిచె ।
నఖచిహ్నావళులందు, నాభిసంధులయందు దంతక్షతముల నా, క్రాంత
సేపు ॥ (గీ) విద్యమానమగుట, సద్యఃప్రదృశ్యమై । భోగినీవరాంగ,
రాగమప్పు । డతిరహఃకృతంబు, లైనను సుఖచిర । సురతవిలసితము
ల, నెఱుఁగఁ జెప్పె ॥ ౨౪ ॥ (చ) మఱియుఁ బ్రభాతకాలసరి, మం
దవిభాయుతుఁడౌట దృష్టివి । స్ఫురితకళంకుఁడైన యల, సోముఁడు
ప్రోషితపత్రిపజ్క్తులై । పరిగతభోగలక్ష్ములయి, పక్వశరోత్కణి
కార్జునంబులై । వఱలుసతీకపోలముల, భర్తృసుతుఁడైన క్రియం జెలం
గెడిన్ ॥ ౨౫ ॥ (వ) అంత ఖండితనాయిక యపరాధియై ప్రాతః
కాలసమాగతుండైన ప్రియుని నిందింపుచు నిట్లనియె ॥ (చ) అతనువి

లోలచిత్తయగు, నన్యసతీరతిసంభ్రమప్రమ । ర్దితరుచిరాంగరాగము శరీరము సర్వము వాసిపోవఁగాఁ । దతమతిసంతతాద్భుతని, దానము నైన భవన్ముఖంబు నం । చితగతి నంగరాగసు, విశేషము పాయదదెంత చిత్రమో ॥ ౨౬ ॥ (గీ) పరసతీభుక్తమైన యంబరము దాల్చి । యహహ మాయింటి కరుదెంచి, నందువలన । మాకుఁబ్రియవని నీవన్న, మాట నిజము । ప్రియుని పటము ప్రేయసులకుఁ, బ్రియము గాదె ॥ ౨౭ ॥ (గీ) ఘననఖక్షతతను వంశ, కంబుచేత । దంతదష్టాధరంబు హ, స్తంబుచేతఁ । గప్పితివి మేన నలఁదిన, గంధపరిమ । ళంబు నెబ్భంగిఁ దాఁచెదో, లక్షణాఢ్య ॥ ౨౮ ॥ (చ) పరువడి నీనఖక్షతిస, పత్నులు చూచెద రేమొయంచుఁ ద । త్వరమతికౌశలంబున భవత్ప్రియ చేనటు తద్వ్రణంబు త । చ్చరణసరోజ ఘాతమున, సంక్రమితంబగు లాక్షచేతఁ బ్రో । స్ఫురితసవర్ణ మాటవెస, సొంపుగ రక్షిత మయ్యె వల్లభా ॥ ౨౯ ॥ (చ) అనియిటు పల్కు కన్నుఁగవ, నశ్రుకణంబులు వ్రాలమ్రోలనుం । డిన ప్రియురాలిఁ గన్గొని క, డింది భయంబున వల్లభుండు గ్రొ । క్కుననటు దాని పాదముల, కుం బ్రణమిల్లెను రోదనంబు గ్రొ । న్ననటు మాని మానహర, ణక్షమసాధనమౌ నిజంబుగన్ ॥ ౩౦ ॥ (సీ) మఱియు సుమాంబక, మదవికాసస్పష్టధార్ష్ట్యలైనట్టి సుం, దరుల ప్రణయ । కలహమందు విశీర్ణ, ఘనభూషణములచే సంపూర్ణమైన వే, శ్మంబులందు । విఫల ప్రయత్నులై, వెస వయస్యలు కుసుమోపహార మొనర్ప, కుండిరవుడు । విలసనశీలుఁడై, వెలయు నొక్క ప్రియుండు తనమేని నఖరదం, తక్షతంబు ॥ (గీ) లన్యసతిచేఁ గృతము లయ్యె, నని తలంచి । కోపమున నున్న సతిఁ జూచి, కువలయాక్షి । యివియు నీచేఁ గృతములయ్యె, నెఱుఁగవేల । యనుచు లజ్జిత యగు దాని, ననునయించె ॥ ౩౧ ॥ (వ) మఱియు నొక్క ప్రియుండు కృతగురుతరహారచ్ఛేదం



బగునట్లు గాఢాలింగనంబు గావించి, శిథిలీకృతాంగుండై ప్రయాణంబున కామంత్రణంబు ప్రార్థించిన నప్పడయ్యువతి వక్షోజయుగ్మంబు పరిగళితప్రత్యగ్రస్థూల మౌక్తిక బాష్పాంబు బిందువులు గలుగునట్లు గా రోదనంబు గావించినట్లుండె మఱియు నొక్క ముగ్ధాంగన పగటియందు నిజవయస్యలచేత విదితంబైన రాత్రికాలస్వచేష్టితం బంతయు మదమూఢనైన యేను ప్రియుని మ్రోల ననేకప్రకారంబుల నొడివితిఁ ప్రౌఢకాంతవలెఁ బ్రియుని ప్రియవచనంబుల నాలించితి నెంత వెఱ్ఱి నైతి నని లజ్జానమ్రవదనయై యుండె నప్పుడు ॥ (చ) అనుపమరక్తపంకజధ, శావళిముగ్ధకరాగ్రపాదయై । ఘనతరచంచరీకచయ, కజ్జలపూర్ణనవోత్పలాక్షియై । వినుతపతత్త్రిరావముల, వేమొఱవెట్టుచుఁ బూర్వసంధ్యచ । య్యానటు రాత్రి వెంటఁ జనె, నప్పుడు బాలకుమారి చాడ్పునన్ ॥ ౩౨ ॥ (వ) మఱియు నాహితాగ్నుల ప్రతిగృహంబులందు నక్షత్రజ్యోతిర్మయైన యాహవనీయంబు శాస్త్రోక్త ప్రకారంబున యథాయోగంబుగాఁ బఠితస్వరంబులుగల యధ్వర్యుప్రభృతి ఋత్విగ్వరులచేతఁ బ్రవోవాజాద్యగ్నిసమింధనీ ఋక్కులను బఠించి కృతగురుదురితౌఘ విధ్వంసనం బగునట్లు దేవతోద్దేశంబునఁ ద్యక్తంబైన హవిశ్శేషం బాస్వాదితం బయ్యె మఱియుఁ బ్రక్రాంతజపకర్ములైన తపస్విజనంబుల యోష్ఠప్రభవంబులైన యుపధ్మానీయవర్ణంబులచేత నావృతంబై పదంపడి నిరోష్ఠ్యవర్ణంబులచేత దర్శనీయంబగుటం జేసి యుద్గతాంశురదనంబైన ముఖంబు ప్రతిక్షణంబునందును ఘటిత విఘటితంబైన సుందరముక్తాఫలకోశసామ్యంబు నధిగమించె మఱియును ॥ (గీ) వజ్రిదిశయందు నవహేమ, వర్ణభాను । దీప్తిపుంజంబు జలధి భే, దించి వచ్చు । కృతజగద్దాహసంరంభ, వితతమైన । బాడబానలశిఖ భంగిఁ, జూడనయ్యె ॥ ౩౩ ॥ (సీ) ఘనరజ్జుసంకాశ, కరములఁ గుంభంబు మా

డీకృసమాకృష్య, మాణుఁడగుచుఁ । గృతచంచలవిహంగ, వితతశబ్ద
ములైన యాశలచేఁజల, రాశి నడుమ । నుండిదివాకరుం, డుత్తారితుం
డయ్యె రమణీయముగఁదోయ, రాశిలోన । నిశ యంతమగ్నుఁడై, నిలి
చియుండుటఁజేసి యౌర్వాగ్నికీలల, నధికతప్తుఁ॥ (గీ) డయ్యెఁ గాఁ
బోలుఁ గాకున్న, నంబువులను । వెడలి చనుదెంచి నప్పుడు, వితతవ
హ్ని । కలితఖదిరకాష్ఠాంగార, గౌరగాత్ర । మెత్తెఱంగునఁ గలిగె
ది, నేశ్వరునకు॥ ౩౪ ॥ (గీ) తృణముపయి నున్నరవినవ, కరచయము
లఁ । బ్రాక్కుధర మొక్కటియె కాదు, బంధుజీవ । కుసుమకృతశే
ఖరముఁ దాల్చి, యెసఁగుటరయఁ । దరణి రుచిచేత నట్లయ్యె, ధరము
లెల్ల॥ ౩౫ ॥ (చ) అలయక బాలసూర్యుఁ డుదయాద్రిశిఖాంగణ
మందునాడుచున్ । జెలువుగఁ జారుపద్మినుల, చే ససరోరుహవక్త్ర
హాసమున్ । గలుగఁగ వీక్షితుండగుచుఁ, గ్రమఖగధ్వనిఁ జేరఁ బిల్చి
న । ట్లలరు నభోంకమందునిహ, తాగ్రకరుండయి యొప్పెలీలతోన్॥
౩౬ ॥ (చ) పరువడి భానురాజుదయ, పర్వతపీఠము నందొకింత సే ।
పరుదుగనుండి భూతలము, నందటుపాదము లుంచి సజ్జనో । త్క
రరచితప్రణామములు, గైకొని వారిబహూకరించి చె । చ్చెర భువ
నంబుఁజూచుటకుఁ, జెల్వుగనుత్థితుఁడయ్యె నయ్యెడన్॥ ౩౭ ॥ (వ)
మఱియునదులు బాలాతపచ్ఛురితంబులగుటంజేసి పరిపక్వసురాభంబై
యుభయతీర నిరుద్ధంబైన సలిలంబును సూర్యకిరణసాయకదళితఘనతి
మిరదిశాగజఘటాశోణితంబునుం బోలెవహించిప్రకాశించె గవాక్షవి
వరంబుల గృహాభ్యంతరంబులు ప్రవేశించిన తరుణ తరణికిరణంబులు
ప్రాతఃకాలంబునఁగాంతల బరిత్యజించి యిండ్లకుంబోవఁ దలంచినపు
రుషులయందుఁ గుపితుండైమన్మథుండు ప్రయోగించిన వహ్నిసంతప్త
నారాచంబులుం బోలెవెలుంగుచుండె మఱియు రాత్రియందు యువ



తులచేతఁ బీతమై రేయరిక్తంబైన కాంచనపాత్రంబు ప్రాతఃకాలంబు
న గోరోచనారుణంబైన భానుతేజంబున సంక్రాంతాభ్యంతరం బగు
చునిప్పటికినిదొల్లింటి చందంబున మద్యపూర్ణంబైన దానిపోలికఁ బ్రకా
శించె మఱియును॥ (చ) నలువుగ రాత్రియందు శయ, నంబున నించిన
శుభ్రకాంతిసం । కలితప్రియోత్తరీయ మది, కంజసఖోస్రవిమిశ్రమౌ
టచేఁ । బలుమరు రక్తవర్ణమయి, భాసిలుచుండఁగ నాత్మచేలమం ।
చెలమిభ్రమించి కైకొనిన, యింతినిగన్గొనినవ్వి రంగనల్॥ ౩౮॥ (చ)
వరరజతాద్రిభంగిఁ జెలు, వంబగుసౌధము రాత్రిచంద్రికా । స్ఫురిత
మునై లసత్స్ఫటిక, సుందరరోచుల నొప్పియుండి సు । స్థిరమృదుభా
స్కరాంశువుల, చే నరుణీకృతమై దినంబు నం । దఱుచుగఁ జాజుఁ
బూసినవి, ధంబునఁ జూడఁగనయ్యె హృద్యమై॥ ౩౯ ॥ (సీ) నాయ
కుండొక్కఁడు, నలినాక్షి సరసనఖక్షతాంతరలగ్న, కచవిమోచ । న
ముసేయుచుండఁగ్రఁ, స్నానసీత్కృతులచేత నావిష్కృతములైన, య
చ్ఛదంత । ములయందు నటుప్రతి, ఫలితంబులైన నూతనభానుకరము
లు, వినుతభంగి । ఘనపద్మరాగాను, కారంబు గావించె రమణాంగ
సంగసం, క్రామితంబు॥ (గీ) కోకనదకాంతిమైన కుం, కుమముచేత ।
గనకనికషోపలస్థరే, ఖయును బోలెఁ । గడు లలితమైన యువతుల,
గాత్రమెండ । యందు లబ్ధవర్ణోత్కర్ష, మై వెలింగె ॥ ౪౦ ॥ (గీ)
జలజవనకాంతమాలోక, శక్తిబీజ । మైన కరలోచనసహస్ర, మధిగ
మించె । పరఁగ నభ్రాంతవృత్తియౌ, హరిహరి క్రియ । నఖిలబా
ధకవృత్రసం, హారి యయ్యె॥ ౪౧ ॥ (చ) ఇరులనడంపఁ బూనియు
ద, యించినసూర్యుని చేత దర్శనీ । యరుచిరతారకానికర, మంతయు
వేగనపాస్తమయ్యెఁ బో । యరివధకాంక్షియౌ జనున, కర్థిఁ దదా
శ్రయణాత్తలక్ష్మిలై । పరలెడు వార లందఱు వి, పక్షులుగారెతలం

చిమాడఁగన్॥ ౪౨ ॥ (గీ) ఉష్ణకరుఁడు ప్రోల, నున్నచంద్రాంశు
క । గౌరరజతభిత్తి, కటకమందు । సంక్రమింపుచుండ, శైలగుహాం
తర । తమము నెల్ల నణఁచెఁ, దత్క్షణంబ॥ ౪౩ ॥ (గీ) భానురుచు
లునిండ్ల, బయల నుండి యుసద । నాంతరస్థ తిమిర, మణఁచివైచె ।
నదిజిగీషురుచి క, నల్ప తేజముని । సర్గమఖిలరిపులఁ, జంపుటరయ॥
౪౪ ॥ (వ) మఱియు నొకండుతొలుతఁ బదభ్రష్టుండై పదంపడి లబ్ధ
పదుండై పూర్వబద్ధులైన స్వబంధువులఁ దా నెకారాగారకవాటం బు
ద్ఘాటించి విడిపించు కైవడి సూర్యుండు తన యభివృద్ధికొఱకు స్వకీయం
బైన ధామంబునొంది యతిమాత్రరసలౌల్యంబువలనఁ గమలంబునందుఁ
జిరబంధనంబు ప్రాపించిన షట్పదంబులకు సత్వరుండై దళకవాటదళ
నంబుఁ జేసి బంధమోక్షంబు గావించె మఱియును ॥ (సీ) సప్తాశ్వుఁ
డప్పుడు, సమకాలమునఁదుల్యసంఖ్యాంశువులచేత, సరిసహస్ర । సం
ఖ్యాతదళముల, సమ్మదంబున భేదమొనరించి షట్పద, ధ్వనులచేత । స
త్కృతయగుదాని, జలరుహగర్భగృహంబున వసియించి, యలరుదా
ని । లక్ష్మి నాదరమున, లక్షించినట్లుండెఁ బ్రత్యూషమునరాగ, వంతు
డగుచు॥ (గీ) భానుఁడు కరాగ్రముల సీత, భాను నదయుఁ । డగు
చుఁబీడించి ఘననిస్సృతాంబుశుభ్ర । కాంతినిర్యాస మంబుజా, భ్యం
తరముల । నిలిపినట్లుండె స్నేహంబు, వలన నపుడు॥ ౪౫ (గీ) విశ
దితాశేషలోకుండు, దశశతోస్ర । గాత్రుఁడగు హేళి రెండవ, కన్ను
పోలె । వికసనం బొందుచుండ ద్యో, వీధివిగళి । తాంశుసితకరత
నువుచే, వ్యంగితైక । నయనమైనట్లు చూపట్టెనయనములకు॥ ౪౬ ॥
(చ) కుముద వనంబు మోడ్చె నవ, కోమలమయ్యె సరోజషండము॥
భ్రమదము వీడెఁ గౌశకము, గ్రాలెముదంబునఁ జక్ర మబ్జినీ । రమణుఁ
డుమీఱెఁ జంద్రుఁ డుని, రమ్యతరద్యుతి జాఱె నుష్టవై । వమునివిధ ప్ర



కారములఁ, బ్రాణులకిచ్చెఁ దదౌచ్చ్యనైచ్యముల్॥ ౪౭ ॥ (ఉ) చం
డకరుండు దిక్పతిని, సామియుఁబోలె క్షణంబు ప్రోష్యుఁడై । యుండి
యుఁ బూర్వమార్గమున, నొయ్యననింటికి రాఁగఁ జూచి యం । దుం
డఁగలేక భీతిగొని, యొప్పఱి జారుఁడువోలెఁ జంద్రుఁడుం । గండుదొ
ఱంగి పాఱెనటు, గ్రుక్కునఁ బశ్చిమమార్గగామియై॥ ౪౮ ॥ (వ) మ
ఱియు నఖిల తారాలోకంబు విలయంబు నొందించి సర్వాతిశాయిమ
హిముండును ధృతసానురాగలక్ష్మియు నైన సూర్యుండు విష్ణుండునుం
బోలె రాత్రికల్పావసానంబున గగనమహార్ణవంబు నధిష్ఠించి యుండె
మఱియుఁ గృతాఖిలలోకప్రబోధుండు నవధూతాంధకారోదయుండు
నైన సూర్యుండు మహాగుణగరిష్ఠుండయ్యును వినాశితకుముద తారకా
లక్ష్మియుఁ గృతకామివియోగుండు నయ్యును బహుతర గుణదర్శనం
బువలన లోకాంగీకృతస్వల్పదోషుం డగుటం జేసి కృతార్థుఁడైనీకు
సుప్రభాతుం డగుం గాక యని యాశీర్వదించిరి ॥ (చ) ఇనుఁ డుద
యించు నంతట మ, హేభరథాశ్వనిషాది మేదినీం । ద్రనికర మచ్యు
తాలయము, ద్వారము మ్రోలఁ బ్రయాణకాలయో । గ్యనిరుపమా
నవేషరచ, నార్థుఁ మొకించుక సేవజాగొన । చిన హరిరాక గో
రుచు వి, శేషమతిన్ గనుపట్టె నంతలోన్॥ ౪౯ ॥ (వ) సర్వాలం
కారభూషితుండై కృష్ణుండు॥ (గీ) కాంచనోజ్జ్వలరుచియు స్వ, త్వ
ము సుపత్ర । మధికజవజితనాగంబు, నైన తార్క్ష్యుఁ । మెక్కి మింట
నుబోలె మ, హీతలంబు । నందనుత్పాతసుఖమాగఁ, మందుఁ జనియె॥
౫౦ ॥ (సీ) శ్రీశ్రితవత్సు లం, చితకరస్థితచక్రకలితులు ద్విజరాజ, కాం
తు లరయ । సత్యానురక్తులు, సాంద్రనరకజిష్ణులగు భూపతులు వి
న, యాదిసుగుణ । ములచేత హరిఁ గూడి, పోలుపొంద నరిగిరి రమణీ
యశుచిసతా, రములు ముకుళి । తములగు పటమంట, పములచేఁ దు

లకుముదాకరంబుల నేత, నంచితముగఁ ॥ (గీ) బరఁగ నుపలక్షితంబ
యి, విరహవేద । నాతిపరితప్తనారీక, మై కుముద్వ । తుల ప్రభా
తంబు యదుసైన్య, ముల ఘనప్ర । యాణమన్యోన్యసదృశమై, యల
రె నపుడు॥ ౫౧ ॥ (ఉ) ఉన్నమితాంగమూట రభ, సోద్ధతి మింటికి
నుద్గమించున । ట్లున్న మహామహీధరము, నొప్పున నొప్పగు సామజం
బుబల్ । మన్నన స్వానమత్పదస, మర్పిత పాదుని యంత్రవగ్యునిన్ ।
బన్నుగ నాత్మమస్తకము, పైఁ దగఁ జేచుఱకొనె నప్రియంబునన్॥ ౫౨॥
(వ) మఱియుఁ బాణితలాంగసంఘట్టనపరిత్యాజితోద్వేగం బగుటం
జేసి ప్రకాశమానశరీరంబులగు జాత్యశ్వంబుల నాశ్వికులు సందర్శ
నలాఘవోత్పతనకముఱలై పల్యాణకోట్యవలగ్నముఖరజ్జు సహితైక
హస్తు లగుచు నారోహించి రుపరిభాగస్థితుండైన నిషాది దూరపథం
బు వోవుటకు శీఘ్రింబున నెంతలోన దూరమార్గగమనాపయికం
బైన యాసనవిశేషంబు రచింపకుండె నంతలోనఁ దీవ్రింబున లేచి
దుస్సహవేగంబు లగుచుఁ గరభంబులు విశృంఖలత్వంబునం బరువెత్తె
సుఖగమనాకాంక్షియు సుసారథియునైన యొక్క రథి గండోజ్జ్వల
యు నుజ్జ్వలనాభిచక్రప్రత్యగ్రోదర శ్రీవిరాజితయు నవిధురయునై
న శకటిని యువతిం బోలె సన్నద్ధంబు గావించె శీఘ్రింబున లేచి
పోవం గమకించు నట్టి రవణంబు పురోభాగంబున బలాత్కారంబు
గా నిగృహీతంబై భారయుక్తయంత్రకంబు నిక్షిప్యమాణం బగు
చుండ నత్యంతభారంబున నధోర్గ్దారిస్వజగ్ధపిచుమందాద్రిగ్రాసంబు
న విషమస్వరం బగుచు నిజనామంబు సార్థకంబు గావించె॥ (మ)
అను వొంద న్మృగుదాట్టిచేతను ధృతం, బయ్యు న్విషాణద్వయిన్ ।
దనుఁ గంపింపఁగఁ జేయుచు న్వెస సశూ, త్కారానుకంపత్రికంబు
ను మోప్రియం గడు దుర్బలోక్షము జనం, బుల్పృష్ఠభాగంబు మీఁ।



దనిడన్ గోణి భరింప దమ్యోఁ గడుఁ జిత్రస్ఫూర్తిన్ శోభిల్లఁగన్॥
౫౩ ॥ (మ) వివిధావిష్కృతసామజస్వరసమ, ద్వేలంబు సాహస్రి
మా । గర్వరిష్ఠంబు మహాదురధ్యయనముల్, గాంధర్వ భూయిష్ఠ
తా । తివిలోక్యం బతులప్రభావ మగుచున్, డెల్పొందు సేనామ
హా । ర్ణవ మొప్పెన్ బటుసామవేదసమతం, బ్రాపించె దుష్పార
మై॥ ౫౪ ॥ (మ) ప్రతినాగేంద్రముతోడ యుద్ధ మొనరిం, పం బో
వు నాగేంద్రము । ద్గతకుంతాంకుశముల్ద్యజించి నిశితా, గ్రింబైన
యన్యాంకుశం । బతివేగంబునఁ దాల్చు యంత్రవరుచే, నాధావ
ము ల్మీఱఁగా । నతికష్టంబుగ నిల్చెఁ గంపితశిరం, బై యూర్ధ్వదం
తాగ్రమై॥ ౫౫ ॥ (మ) జలజాతాత్మపరియాణవేళ విలస, త్సమ్మూ
ర్ఛదుచ్ఛృంఖలో । జ్జ్వలశంఖాదికనాదమైన పటహ, స్వానంబుగం
భీరమై । దళితాశాతలమై మహీభృదురుస, త్వశ్రేణులన్ బల్విడిన్ ।
జలితస్వాంతులఁ జేసె సర్వజలధు, ల్సంక్షోభముం బొందఁగన్॥౫౬॥
(చ) గురుతరదిక్ప్రయంబునకుఁ, గుంకుమచూర్ణవిలేపనద్యుతిన్ । బ
రువడినిచ్చుచున్ స్ఫురిత, భాస్కరశోభయుఁ గల్గి ముద్గభు । గ్వర
ఖురఘాతరైవతక, పర్వతప్రాంతసువర్ణభూములన్ । వరుస జనించి
నట్టిపృథు, పాంసుచయం బెగసెన్ ఖవీధికిన్॥ ౫౭ ॥ (గీ) లలితగం
భీరరథమండ, లస్వనములఁ । దాదృశంబైన కరిబృంహి, తముదిరస్క
రింపఁబడియె నారెంటిని, గ్రిందుపఱచె । నశ్వతారహేషాధ్వను, ల
ధిక మగుచు॥ ౫౮ ॥ (గీ) పరఁగనంతికాగతమ్మైన, కరణిఁగూడఁ ।
జనఁదలఁచె ఘూతసృణియయి, సస్పృణితిర్య । గురుశిరము దాల్చిచటు
లాగ్రి, కరము సాఁచి । కదియనేగె స్థూలోచ్ఛ్రయ, గతుల గజము ॥
౫౯ ॥ (గీ) అవనినంటి యంటకయుండ, నడుగు లిడుచుఁ । జారు
చామరయుతములై, సైన్యవాజు । లిప్పటికి సపక్షంబులై, యెసఁగు

చున్న । వనుచు నీక్షింపఁ బడుచుండె, నద్భుతముగ॥ ౬౦ ॥ (వ) మఱియు సముత్క్షిప్తబంధురకంధరంబులును జంచలకర్ణచామరంబులును సమాకులఘుర్ఘురస్వరంబులును నైన యుష్ట్రంబులు విశాలంబైన మార్గంబునుద్రుతచరణనిక్షేపంబు గలుగునట్లు తత్క్షణంబ చూర్ణీకృతంబుగాఁ జేయుచుండెనియె మార్గంబునందు సారథిచేతఁ ద్రిసార్థంబు కృతతారనాదంబుగలుగునట్లు శీఘ్రంబునఁబ్రచోదితంబై వేసరయుక్తంబైన శకటంబునిజచక్రధారోత్థితసాంద్రమహీపరాగచయాక్రాంతభయంబునతిరయంబునం బోవుచుండెఁ గంచుకి భయంబున నగ్రభాగంబునం బోవుచున్నవారగుటవలనఁ బరావర్తితముఖులైన సకలచమూచరపురుషులచేతక్షణంబు సమీక్షితముఖసరోజలైన యంతఃపురకాంతలుతురంగాధిరూఢలై తురంగవల్గనంబువలన సుల్లలితబృహత్తరకుచప్రచలకూర్పాసకంబు గలుగునట్లురయంబునం జనిరి ॥ (మ) అరయన్స్యందరఁ జక్రనేమిదళితం,బై వెంబడిన్ భూరికుం । జరపాదాక్రమితోన్నతస్థలము నై, సంచారభగ్నోన్నతాం । తరశూన్యం బగునట్లుపూరితమహా,ద్యన్నిమ్నభాగంబునై । ధర యొప్పెన్ హలభృత్సమీకృతమహీ,స్థానంబుచందంబునన్॥ ౬౧ ॥ (చ) చెలఁగి యశిక్షితంబగుట,చేఁ బయికెక్కఁగయంగ దానిపై । నిలువఁగ లేక సాదియవ, నిండఁబల్యయనంబు జాఱిభా । రలఘుతనొందిచెచ్చెర ను,రంబునవ్రేలఁగఁబాఱు గుఱ్ఱముల్ । వలనుగఁజూచియచ్చటి జ,నంబిహిహీయనినవ్విరత్తఱిన్॥ ౬౨ ॥ (సీ) సకలమహీభృద, స్ఖలితోరుయమునాదితటినుల స్వమహిమో,త్కటముచేతఁ । గప్పుచుమూఁడు మా,ర్గంబులఁ నేగెఁ దద్వాహిని బహువిధ, ధ్వనులు సెలఁగ । దంతావళోరుశూ,త్కారభీతములైన కరభంబులు నియంత, కడురయమున ॥ (గీ) వ్యగ్రులైచేతి పగ్గంబు, వదలమీఁద । నుండఁ జాలక యవరోధ,



యువతులుర్విఁ । బడిన లఘుగతి భువిదాఁటి, పటురయమునఁ బఱచి శకటసమూహంబు, విఱుఁగఁదన్నె॥ ౬౩ ॥ (గీ) అరయస్రస్తాంగసంధిగ,తాక్షపాట । వంబగు రథంబుశకలీకృ,తంబు గాఁగఁ । దక్షవైద్యులచేతను, దత్క్షణంబ । గఱపె లంఘనపూర్వక,క్రమము దెలియ॥ ౬౪ ॥ (గీ) స్థాణు సంసక్తశకటంబు, సాంద్రభార । భంగసంక్షోభహారిత,భాండకలిత । మద్యవిప్లావితోన్నత,మార్గమగుచు। నుండశోకించె సార్థవాహుండు చూచి॥ ౬౫ ॥ (చ) నిరుపమభేరికారవవి,నిందితభూరిగుహాముఖంబు భూ । ధరనిభదంతిరాజవిజి,తస్ఫురితోపలముల్ ధ్వజాంకుశో । త్కరపరివర్జితోచ్ఛలిత,కందళికాన్వితమైన శైలముల్ । గుఱుతుగసైన్యముల్వెనుక,కుంబనిచెం గడుదూరమాటచేన్॥ ౬౬ ॥ (చ) ఘనవనదంతిరాజమద, గంధవహాధికదుర్ధరంబులై । యనుపమరోషభంజితమ, హాతరుశాఖములై మదోత్కటం । బునఁ జరియించు దుష్టగజ, పుంజములన్ గడునేర్పుతోనిషా । దినిచయమధ్వముందొలఁగఁ, దీసివడిన్నడిపించె నుద్ధతిన్॥ ౬౭ ॥ (సీ) ఘనవైజయంతికా,వనరాజి రమ్యముల్ శైలప్రతిచ్ఛంద,సామజములు । సతతవిసర్పిత,జనతా తరంగిణీశతములు నగు చమూ,తతులచేత । బహుభూమితలములు ప్రచ్ఛాదితము లయ్యెఁ జారుమృగీవిలో,చనసమాన । లలనావిలోక నం,బులఁజూచి కృష్ణసారంబులుఘటికాద్వ,యంబు నచట॥ (గీ) వీఁకమృగనేత్రశంకచేఁ, బోకనిలిచి । యుండిపదపడి నానావి,ధోన్నతోరు । విభ్రమ వికారములు నిరూ,పించి తెలిసి । సంభ్రమంబునఁ గడువడిఁ,జనియెనపుడు॥ ౬౮ ॥ (గీ) హరులుసాదులచే దృఢ,కర గృహీత । కశములయి మెల్లమెల్లనఁ,గష్టతరము । గాఁగ నిమ్నభూములుడిగ్గి, వేగమడర । నుత్తరించెఖురధ్వను, లుప్పతిల్ల॥ ౬౯ ॥ (శా) ఆరూఢుండయి వెన్కవచ్చు జన

ముల్, వ్యాప్తిం బ్రతీక్షించు దో । స్సారోదంచిత సాదిచేత మిగు
లన్, సంస్థాపితంబయ్యెఁదా । సేరంబుల్ బిచుమందపత్త్రములు భ
క్షించెన్వాడం బోయి స । చ్చారిత్రంబును చాతుర్యముల్ జగతిలో,స
ద్యఃఫలంబేకదా॥ ౨౦ ॥ (మ) హరిసైన్యంబు ప్రతాపదీపితములై,
ప్రాప్త ప్రమోదంబులై । యిరుపార్శ్వంబులఁ గూడినప్రమతనులై, హే
లాగతిన్వచ్చు ని । ర్ఝరనానా వని రాట్సమూహములచే, బహ్వాతప
త్త్రాఢ్యమై । కరమర్థింగనన య్యెఁ జూడ్కులకు నేకచ్ఛత్త్ర మైనట్లు
గాన్॥ ౨౧ ॥ (గీ) వెంటవచ్చుకరటి, ఘంటాధ్వనులు విని । య
దరుచేత వ్యాకులాంగనులగు । సైన్యచరులు భార, సంచయంబుల
తోడఁ । ద్రోవవిడిచి యొండు, త్రోవఁజనిరి॥ ౨౨ ॥ (వ) అప్పుడు
స్తుతి పాఠకులు తేజస్వి వర్ణోజ్జ్వల వృత్తశాలియు సుప్రసాదియు న
త్యక్తగోత్రసంవిదుండునగు మురారిగుణంబుల నధికరించి పద్యంబులఁ
జదువుచుఁ బురోభాగంబునం జనుచుండిరి మఱియుఁ గల్పాంతక్షుభి
తంబైనసముద్రంబు సలిలంబుచేత నిమజ్జితాశేష భూగోళంబై వేలాలం
ఘనరూపమర్యాద నతిక్రమించెమాధవుండు ప్రచలితుండయ్యెనపరిమి
తసైన్యంబులచేత నిశ్శేషంబుగా నాక్రాంతమహీతలుం డయ్యెనుగ్రా
మాదికంబులుబరిత్యజింపుచు మర్యాదాపాలనంబుగావించె మఱియుఁ
బటోలీపుష్పగుచ్ఛసచ్ఛాయ ముఖోప లక్షితలును వికసితవిపులబాణపు
ష్పసమానలోచనలగు గ్రామ్యకాంతలు వల్లికాతిరోహిత గాత్రలగు
టం జేసిచమూచరులచేత నలక్షితలై కృష్ణుండుగ్రామం బతిక్రమించునం
దాఁకఁగంటకశాఖావరణో పరితనావకాశంబునందు విలోకింపుచుం
డిరిమఱియుఁగోష్ఠ ప్రదేశంబులందు గోష్ఠీకృత మండలాకారోపవేశను
లై క్ష్వేళాట్టహాసనినాద సహితంబగునట్లుగా శీఘ్రంబున లేచికాపిశా
యనపానేచ్ఛులైనిజనామ సంకీర్తనప్రవర్తితచిత్తులైన ఘోషజనుల వి



లోకింపుచుం జనియె నంత॥ (సీ) అరయ నేకాంత మార్గ్యంబున న
జ్ఞానవిభ్రమంబులు నతివిస్మృతములు । సులలితాలస పక్ష్మములును
సకృద్దర్శనంబున నతికృతార్థంబు లయ్యె । నతులచేఁ గృష్ణుసటు
సారెసారెకు వీక్షింపుచునువల్లవీజనంబు । తనివి నొందకయుండెఁ,
దమవామపాద సంసక్తవత్సములవాత్సల్య గరిమ ॥ (గీ) జిహ్వతో
మూరుకొనుగోవిశేషములను । జారుదోహన పాత్రను,జానుయు
గ్మ । మధ్యమందిడిక్షీర సంపాతరవము । నెలఁగఁ బతికెడు జను
లవీక్షించెవిభుఁడు ॥ ౨౩ ॥ (చ) పరఁగనిదాన హస్తుఁడయి,పా
ల్పితుకంజను దెంచుదోగ్ధముం । దరవెస చాలు ద్రావుటకుఁ, దప్పక
వచ్చెడులేఁతదూడ న । త్తఱిఁగని హుంకరింపుచు ము,దంబున నా
వులలోననుండి సు । స్థిరముగ దూడపాలికరు, దెంచుపసింగనెఁగృ
ష్ణుఁడయ్యెడన్॥ ౨౪ ॥ (చ) చిలుకలు వ్రాలఁదోలుటకుఁ, జెచ్చెర
నేగెడు నంతలో మృగం । బులునొకవంక సస్యముల, మోసులుమే
యఁగవానిఁ దోలుచున్ । బలుమఱు నక్కడిక్కడికి,వచ్చుచుఁ బోవు
చుఁ గూఁకలేయుచున్ । గలయఁగ జుట్టునుం దిరుగు, కాంతలఁ గ
న్గొనె శౌరినవ్వుచున్॥ ౨౫ ॥ (చ) చిరగతిశాలిరక్షణము, సేయు
మృగాక్షులగీతనాదము । ల్సరసత నాలకించి ఘన,సమ్మద పూరిత
చేతనంబులై । పరువడి నిల్చిమేఁతలకుఁ,బాసి నిమీలితలోచనంబులై ।
కరమరుదారఁ జొక్కెడుమృగంబులఁ జూచె రమేశుఁ డయ్యెడన్ ॥
౨౬ ॥ (మ) అతులానూప సమీపమందు ఘనహేలాంచ చ్ఛలద్వ్యోషి
తాం । చితపాదారుణ పంకజస్ఖలితమంజీరాతిమాధుర్యనా । దతి
రస్కారి మరాళికామధుకరీ, ధ్వానంబుశ్రీనాథుఁడా । శ్రితమందా
రునిమానసంబునుహరించెన్ గణ్యమార్గంబులన్ ॥ ౨౭ ॥ (గీ)
హరియుదప్పులఁ జనుచుండ, నప్పుడుచ్చ । గతమునస్ఖలితంబును, గా

రవంబు । నైన సేనాపరాగంబు, నవనిభృత్తు । లటుశిరంబులఁ దాల్చిరి, యాజ్ఞయట్లు ॥ ౭౮ ॥ (గీ) జనముకుబ్జనగంబుల, సమపథమున । నెక్కుహరిసేనయు మహామ, హీధ్రములను । సుగమపథముల యట్లబ, ల్సుఖతరముగఁ । బెక్కుతోవల నెక్కె న, భీతమగుచు ॥ ౭౯ ॥ (సీ) గంధగజము లున్న, ఖంబులై దంతాగ్ర ఘట్టితాభ్రంబులు, గలుగు నట్లు । కలితతిరశ్చీన, కటతట ప్లావితమదజలపరిపూర్య, మాణకణఁ । బిలములు గలుగున, ట్లెలమి మహామహీ ధరములారోహించె, మఱియు గండ । గళదంబుకళికమై, ఘనతుల్యకాంతియై యలరు నాగంబుచే, నఖిల జనులు ॥ (గీ) పథమునందు నిరోధింపఁ, బడిరిగాని । యధిక తరమైన యగముచే, నడ్డగింపఁ । బడక యుండిరి గావునఁ, బథము నందు । నగము కన్నను నాగమ, త్యధిక మయ్యె ॥ ౮౦ ॥ (మ) కరులాత్మీయ కరప్రభగ్న బహుళ, త్క్ష్మాజంబులౌ దిక్కులన్ । గరమొప్ప న్నిజపృష్ఠ కేతన వనా, క్రాంతంబులౌ నట్లుగాఁ । జరణక్షేపణ పిండితాద్రివర పృష్ఠక్ష్మాప్రదేశంబులన్ । స్థిరకాయా చల దుర్గమంబులుగఁ జే, సె న్భూరి సత్వంబునన్ ॥ ౮౧ ॥ (క) హరిగిరులనధిష్ఠించిన । కరులనుపత్యకలనుండి, ఘన ప్రతికూల । స్ఫురద నిలాఘాతంబునఁ । బఱువడిఁ బైకెగయు శిలల, భంగిన్ గాంచెన్ ॥ ౮౨ ॥ (మ) అను వొందన్ గుధరాధిరోహణ సదా, భ్యాసంబుచే నుద్ధుర । స్తనశైలయామలకీ వనాంతరముల, స్సంచారము ల్సల్పునా । తనహేలాంచిత విభ్రమాతులుఁ గిరా, తస్త్రీల వీక్షించెన । వ్వనజాక్షుండు తదీయ విభ్రమములన్, వాక్రుచ్చి వర్ణింపుచున్ ॥ ౮౩ ॥ (గీ) గణుతిసేయక నేత్రము, ల్క్షణమువిచ్చి । మరలనిద్రింపఁదలచు కే, సరిసమీప । సరణిఁజనుసైన్యములఁజూచి, వెఱవకవని । సార్థకముఁజేసె మృగరాజుశబ్దమపుడు ॥ ౮౪ ॥ (గీ) హస్తిచూర్ణితోపలమార్గ, యదుబలంబు । ధ్వజసముచ్ఛేద నిర్ఘాత, తరులుఁజనస । మూహరుద్ధనదీవేగ, ములును నగుచు । దారికెదురైన గిరులన్ని, దాఁటి చనియె ॥

౮౫ ॥ (గీ) కరికట విఘట్టనంబునఁ, దరువులూఁగ । గడ్డములభంగిఁగొమ్మలఁ, గ్రాలు పెరల । సిరవుకొనియున్న సరఘల, నెగయఁజోఁప । నవియుఁ ఝుమ్మని మ్రోయుచు, నరిగె నపుడు ॥ ౮౬ ॥ (గీ) ఉపచితనగంబు తొల్లింటి, యొడలిభంగి । సామజాంతకు చేతనా, శంబునొంద । నొందు తనువును బోలె వే, ఱొందు తఱువు । క్షణము లోఁగపులాత్మల, కరణిఁజేరె ॥ ౮౭ ॥ (గీ) హరిబలము లొక్కచోటఁ, బ్రహ్వంబు లొకట । నద్ధతములు ప్రకాశంబు, లొకటగహ్వ । రంబులొకటనపేత సా, మ్యంబులొకట । గురువులైనను లంఘించె, గిరులనపుడు ॥ ౮౮ ॥ (వ) మఱియు నమ్ముకుందుం డపథంబులైన నుసమంతతవ్యాప్త సర్వపథీనంబైననిజసైన్యంబు చేతసలిలంబు చేతయుగపదఖిలసేనా ప్రవేశంబు వలనఁ బర్యాక్రాంతాత్యున్నతతీరంబులైన నదుల న్ప్రతీపనామంబు గలవానిఁగాఁ జేసెమఱియు ॥ (గీ) దంతులుజలంబులోఁ జొచ్చు, నంతలోన । వాజులు ఖురోత్థితోరుదు, ర్వారవాత । రయవికీర్ణ నీరంధ్ర భూ, రజము చేత । మంచిసలిలంబు బురద గా, వించెనపుడు ॥ ౮౯ ॥ (చ) అరయఁగఁ గ్రీడసేయుటకు, నైక్షత భూరిసితంబభూముల్లై । యరుదుగ నాత్తసమ్మదము, లైకరతోలిత భూరి శైవలాం । బరములునై మహేభములు, మానుగవార్ధిని జేరఁ బోవుని । ర్ఝరజలరాశి పత్నులకుఁ, బంకముగల్గఁగఁ జేసెనత్తఱిన్ ॥ ౯౦ ॥ (మ) గుములైభూరి విషాణకోటులఁదరు, ల్గోరాడి తన్మృత్తుచేఁ । దమితోఁబల్విడిఁ బూర్వవాహినులునిం, డం బూడ్చితద్ధాత్రితో । సమముంజేసిగజంబులు న్నిజకట, క్ష్మాభృద్గళద్దాన నీ । రములన్ నూత్నను దుల్సృజించి భువిఁబా, లంజేసెఁ జిత్రంబుగన్ ॥ ౯౧ ॥ (గీ) కా

మినీముఖరుచిజిత, కమలములుమ । హేతపత్ర ప్రభాజిత, హంసము
లగు । నదులతీత శిలాసామ్య,నాగబలక । దంబములచేత దూరీకృ,
తంబులయ్యె ॥ ౯౨ ॥ (గీ) అనుపమానాంజనసవర్ణ, తనువులున్న
తములగు గజేంద్రములుసుధా,ధవళితోరు । విపులసౌధపురంబుల, వి
ప్రకృష్ట । దేశమును బొందె దీపిత,దిశములగుచు॥ ౯౩ ॥ (ఉ)ద్వా
రకఁ బాసివచ్చునెడఁ, దద్విరహంబు సహింపలేక సొం । పారఁగ
నప్పురీరమర,యంబునఁ గృష్ణుని ముంగలన్మదం । బారఁగవచ్చినట్లల
రెనమ్మురవైరి నివాసముల్రహి । న్వారకసౌధశోభగల, భవ్యవనో
జ్జ్వ పటాంబరంబులన్ ॥ ౯౪ ॥ (గీ) కరిఘటా ఘర్షణోద్భూత,
గంధదాన । సలిల సంసిక్తఘనతరు, స్కంధ వాసి । మధుపములు
సైన్య దంతి వ, ర్ష్మ ప్రమాణ । మనువుఁ జెప్పెస్వారవముల,
వనచరులకు ॥ ౯౫ ॥ (వ) మఱియునాయత కరిఘటా తిరస్కృ
తాట్టాలకంబైన యాచమూసందోహంబుమహోన్నత పటమంటప
జితోదగ్ర గృహంబులైన పట్టణంబుల నతిక్రమించి చనియెఁ జమూ
కదంబంబుచేత నూర్ధ్వక్షిప్తం బగుటం జేసి సూర్య కిరణంబులచే
తఁ బ్రతప్తంబైన దాని కరణి సమాశ్లోదక సౌగంధిక మారుత
కంపిత యమునాజలంబునందు మహీపరాగంబు పురోభాగంబునం
బడియె ॥ (గీ) ఖరకరునివృత్తి యయ్యును, గాలు చెలియ । ల
య్యును వినీల యయ్యు శీ,తాఖిలజన । జీవనామల జలముల, చేత
యమున । సకలపాపంబులు హరింప, శక్తయయ్యె॥ ౯౬॥ (సీ) మి
హికాఘనసంకాశ, మేఘంబు లార్ద్రమహానీలతటుల చం,దానఁగృష్ణ ।
వర్ణకాళిందీప్ర,వాహ జలముద్రావితన్నీల జలరంజి,తంబులగుచు । నా
క్షణంబునవిభి,న్నాంజన వర్ణత నధిగమించినభంగి,నలరెమఱియు। స
రగనిర్వంకలఁ, జలదరిత్రములచేఁబదములచేఁ బోలె,బంధురముగ॥(గీ)



నడుచుసువిశాలనౌ సాధ,నములచేత । రయభవ భ్రాంతి చేతనే,త్ర
ములుమూయు । నంగనలచేత నాలింగి, తాంగు లగుచు । జనముల
య్యేఱుదాఁటిరి, సంభ్రమమున॥ ౯౭ ॥ (వ) మఱియు గంగానదిసా
గరంబునుంబూరించెనని వేదప్రమాణంబెకాని ప్రత్యక్షంబుగాదు య
మునానదియె నిజజలంబుచేతసముద్రంబునుంబూరించె నట్లుగాదేనిగం
గాసలిలంబుపగిది సముద్రోదకంబు శుద్ధస్ఫటిక సంకాశంబై యుండు
నట్లుండకజలధిజలంబు గంగాసంబంధి జలప్రవాహతర్జితశంఖకంఠస
మానవర్ణంబై యుండుటవలన యమునచేతఁ బూరింపం బడెననుటకు
సందియంబులేదు ॥ (గీ) మదగజేంద్రబులంస్రవ, మాణసలిల । మని
మొదలడిగ్గినిజమద, వనముచేత । నంతకంతకు మిక్కుటం,బైన యా
ము । నాంబువులనుత్తరించె న,త్యద్భుతముగ॥ ౯౮ ॥ (చ) అతుల
తమాలనీలసలి,లాయత భూరికళిందకన్యయు । ద్యతబహు సాధనో
ర్మ్ములర,యంబునమేదిని నాక్రమింపనా । యితపడి వచ్చుతద్బలన,దీశ
రయోద్ధతినడ్డగించె ను । ద్ధతినటువేలనూడ్కి-విత, తంబుగనవ్వలనిచ్చె
మార్గముల్॥ ౯౯ ॥ (గీ) అధికదుస్తరమైన ప,ద్మాప్తసుతను । ఘన
ప్రతిజ్ఞనుబోలెవే,గమున దాఁటి । యుక్షములు శృంగ లేఖితా,త్యురు
తటములు । గలుగునటుమోర తెత్తిరం,కెలునిగుడ్చె ॥ ౧౦౦ ॥ (వ)
మఱియు స్పష్టధ్వానంబుగలుగునట్లు చలన్నోణోపలక్షితోర్ధ్వముఖంబు
లునునున్నమిత కర్ణంబులు గలుగునట్లూర్ధ్వ ప్రసారితనిశ్చల కంధరంబు
లైనహయంబులు పురోభాగంబునఁ దటదత్త లోచనంబులై ప్రసారిత
విక్షిప్తపవాధులుగలుగునట్లు నమ్మహానదిను త్తరించె నుత్తరించు యాదవ
భూపాలసైన్యంబులచేత సీమంతీ క్రియమాణ మహిష విషాణ మేచక
ప్రభయసిందూరిత గజశేఖరాన్వితయునైన యమ్మహానది ధరిత్రికా
యతవేణియుంబోలెఁ బ్రకాశించె మఱియుఁ గొందఱుజనంబులు నా

వ్యంబైనజలంబునప్రతిహత శీఘ్రగమనంబులుననుజ్ఝితధైర్యంబులున
పాకృతమహోన్నత గురుతరతరంగంబులగుటంజేసియపర తరంగం
బులుంబోలెనుపస్థితంబులైన బాహువులచేతను త్తరించిరి మఱియుఁబ్రి
యవల్లభుండగుకృష్ణుని వరూథినిమహోక్ష శృంగాఘాత విదళితమహా
కూలయునుద్ధూత మదవిషాణి గురుచరణా కృష్టజలగ్రాహయు బృ
హద్రథవ్యాకులిత పుష్కరయునైన యమునానది నప్పుడు త్తరించి సు
ఖంబుగాఁజనియెఁ దదనంతరంబ ॥ (సీ) కడువేడ్కఁ ద్వారక, విడిచిన
దాదిగాహరినిజసైన్య స,మన్వితముగ । నిచ్చోట విడిసెనేఁ,డిచ్చోటు
వెలువడెననిదినదిన వా ర్త,లరయుచున్న । వాఁడు గావున మహీ,వ
రుఁడు ధర్మసుతుండు కమలలోచనుఁ డట్లు, యమున దాఁటి । వచ్చుచు
న్నాఁడను,భవ్యవా ర్తను వినిసంలబ్ధసాంద్రహ, ర్షంబువలన॥ (గీ) వర్ధి
త శరీరుఁడైతన, వారినెల్ల । నాక్షణమె పిల్వనంపించి, యనిలనంద ।
నార్జునాదిసహోదరు లనుగమింప । నెదురుగా వచ్చెమంత్రులు,హి
తులుగొలువ॥ ౧౧౧ ॥ (వ) మఱియుఁగృష్ణాగమనసంతోషప్రవృత్త
కౌరవసేనాతూర్య ఘోషబధిరీకృత కర్ణేంద్రియంబైన శ్రోతృ జనంబు
నకుఁ గథకులచేత స్పష్టాలాపముల యందుఁ బ్రకాశింతాభిధేయ శే
షం బుపరతవాద్యఘోషంబైన యనంతరంబ హ స్తసంకేతంబుచేత
సంపాదితం బయ్యె శీఘ్రపరివర్తిత కనకచక్రనేములగుటంజేసి వే
గవన్మారుతాకంపితపరస్పరోపమమహీరేణుకేతనవసనంబులైనరాజ
సంబంధి రథంబు లంతటఁ బాదమాత్రంబైన యవకాశంబులేకుండనిం
డె॥ (చ) హరిఖురఘట్టితావనులు, దంచిత పాణితలాభిఘాతభా ।
స్వరపణవాఖ్య వాద్యముల,భంగిదురితంబుగ మోసె వెంబడిఁ। గర
మురువారివాహ పటు, గర్జితవారణ నాదహృష్ట వి । స్ఫురిత కలా
పబర్హులటు, ముంగల నృత్యముఁ జేసె న త్తఱిఁ ॥ ౧౧౨ ॥ (చ)



వనరుహనేత్రు సైన్యములు , పాండవసైన్యములు న్పరస్పరం । బను
పమమిత్రభావమున , నైక్యమునొంది చరింపుచుండఁగాఁ । బనిఁబడి
గుంపులై యుభయ, పక్షగజంబులొకింతసేపుచ । య్యానఁ గలహం
బొనర్చెను మ, దాంధులకుం గలవే వివేకముల్॥ ౧౧౩ ॥ (ఉ) అ
ప్పలధర్మపుత్రుఁడు మ, హారథమెక్కి మనోజ్ఞమూర్తియై । దవ్వుల
వచ్చు కృష్ణుఁగని , తానురథంబటు డిగ్గునంతలో । నవ్వుచు నమ్మహా
త్ముఁడు ఘ, నంబుగ రాజనుగౌరవంబు లో । నివ్వటిలంగఁదానెక
డు, నేపునఁ డిగ్గెరథంబు మున్నుగఁ॥ ౧౧౪ ॥ (తరల) అపుడుశౌ
రిపురాణ పూరుషుఁ, డగ్రవంద్యుఁడు సర్వవి । ష్టపనమస్కృతుఁ డ
య్యుగౌరవ, సంభృతాత్మకుఁడైరహ । స్నృపులకుం బడిమేనయ త్తకు,
బిడ్డఁడౌయమ సూతికి । న్నృపుల హారము భూమిసోఁకఁగ , వేడ్క
మ్రొక్కె రయంబునఁ॥ ౧౧౫ ॥ (గీ) మహితమకుటాంశు రంజిత,
క్ష్మాతలంబు । హరిశిరము సోఁకి నంతలో, యమసుతుండు । క్రమ
మపేక్షింప కటువంగి, కడురయమునఁ । బ్రీతిభుజపంజరమునఁ బ ,
రిగ్రహించె॥ ౧౧౬ ॥ (గీ) గురుకవాట విస్తీర్ణమౌ, హరియురం
బు । యమసుత తనూరమండప, ర్యాప్త మయ్యె । నైనదీర్ఘదో
ర్యుగమున, నంచితముగ । గాఢతరముగ రయమునఁ, గౌఁగిలించె॥
౧౧౭ ॥ (గీ) నాభికమలంబు విడిచి క్ర, స్ననురంబు । నందు ని
త్యంబు వసియించు, నట్టిలక్ష్మి । పృథివిపతినిర్దయాశ్లేష, పీడనము
న । నచటనుండక హరిముఖ, మాశ్రయించె॥ ౧౧౮ ॥ (చ) బలి
నటుగట్టువేళ ఛల , వామనుఁడై ప్రతిప త్తిసేయుచో । వలనుగన త్త
ఱి న్వినయ, వామనుఁడైన హరిన్యుధిష్ఠిరుం । డలయక బాహువీర్యవి
జి, తామరభూజ సుమంబుచేతను । జ్వలతరకీర్తిచే బలె సు,వాసి
తశీర్షమునందు మూర్కొనెఁ॥ ౧౧౯ ॥ (సీ) వృష్ణివల్లభుఁడు

పా్రి, గ్విశ్లేషితుండైన వాఁడైన నాశ్లేష, భవసుఖాను । భవసంతతో ద్గత, పటులోమ కూపమై యలరు కౌంతేయుని, యంగ లతిక । వికసత్కదంబక , నికురుంబ చారుత్వమును బాయదయ్యె స , మ్మోద మెసఁగ । ఘనవీర్యనిర్జిత , దనుజ సమూహుండు నతిహృష్టమాన సుం, డఖిలలోక॥ (గీ) సంస్తవోచితుఁ డగుశౌరి, సమ్మద ప్ర । ఫుల్ల నేత్రుల వినయన, మ్రములసమీర । ణాత్మజాదుల ధర్మజు, ననుజులను య । థోచితంబుగ నానంద, యుతులఁజేసె॥ ౧౧౦ ॥ (వ) అప్పుడు సమాన తేజస్కులును శిలాకఠినులును విశాలవక్షుదీర్ఘ తర బాహులునగు మహీపతులను మహీపతు లేకకాలంబునం గూడుకొని కులిశక్షతంబుకంటె ముందున్నమహీధరంబులు మహీధరంబులంబోలెఁ బరస్పరాలింగనంబులు గావించిరి మఱియును॥ (గీ) కరటికుంభసదృశ, కఠినేతరేతర । స్తన భరాతిదూర, దారితోద । రలును ఫుల్లగండ , ఫలకలునగు కౌర । వులును గుకురసతులు , గలసికొనిరి ॥ ౧౧౧ ॥ (క) కరిణి హయరథ పదాతులు । పరువడి నొండొరులు గలసి, బంధుర భంగి । స్వర మోత్సవమునఁ జని ర । క్కరీంద్రములు చనియెవారిఁ , గలయక యొంటిన్ ॥ ౧౧౨ ॥ ( గీ ) అరద మెక్కఁడనుచు , నలధర్మజుఁడు వల్క । హరికిరీట దత్త, హస్తుఁడగుచు । నరద మెక్కెధనద , హస్తావలంబినై । యింద్రుఁ డంబు దంబు, నెక్కినట్లు ॥ ౧౧౩ ॥ (వ) అప్పుడింద్ర ప్రస్థాభిముఖుండైచనుశ్రీకృష్ణునకు లోకేశ్వరుండగు ధర్మరాజు కరగృహీత ప్రతోదుండై తొల్లి త్రిపురాభిముఖుండై రథంబెక్కి చనుశంకరునకు బ్రహ్మయుంబోలె సారథ్యంబు గావించెమఱియును॥ (చ) హరితనుజాల రంధ్రికలితాబ్జలసత్కిరణోత్కరాకృతి । న్వఱలు ప్రకీర్ణకం బవుడు, వారిధిగంధవహుండు ఘూరిఫే । నరుచిర పుంజముంబలె ఘు, నంబుగమా



రుతనందనుండు నా । సరసిజ నేత్రుపార్శ్వమున, సమ్మద మొప్పఁగవీచె నత్తఱిన్॥ ౧౧౪ ॥ (చ) అలఘుతరోడు పాండురుచి,యాటఁ గళింద సుతాహ్రదోపరి । స్థలగత హంసమండలము, చాడ్పున నొప్పెడునాతపత్రము । న్బలరిపు నందనుండపుడు, పట్టెఁ దమాలసుమాభవర్ణుఁడై । యలరు యదుప్రవీరునకు, నంచితభంగిముదం బెలర్పఁగన్॥ ౧౧౫ ॥ (ఉ) మారుత పుత్రశక్రసుత, మధ్యమునం జెలువారు చక్రిసొం । పారఁగ భాస్కరేతర గ్ర, హాంతరవాస సమార్జితంబునై । హారిరుచిస్ఫురద్బురు ధు, రాభిధ మొందివెలుంగు పూర్ణకం । జారివిధంబున న్వెలసె, నత్తులకుం గడువిందొనర్చుచున్॥ ౧౧౬ ॥ (చ) యమనియమంబులున్ యతి న,యంబునయంబు జనాధినాథునిన్ । గ్రమమునఁ బద్మబాంధవుఁడు, గంధవహుండు జిగీషనింబలె । న్బ్రిమద మెలపర్మాధవుని, పార్శ్వములందును బృష్ఠభాగమం । దమలిన భక్తిమైఁ జనిరి , యశ్విసుతుల్రచితానుసారులై ॥ ౧౧౭ ॥ (చ) అకపట సంభ్రమ ప్రకటి, తాధికభక్తులుభూరిసమ్మదా । త్మకులవినీత శిక్షకుల, మానుషచర్యులు పాండురాజ పుత్రకులసురారిపైనవిత, థంబగు భక్తినొనర్చి రప్పుడా । ద్దికపడిశిష్యవర్యులు ప , దేష్టపయింబలె నంచితంబుగన్॥ ౧౧౮ ॥ (వ) ఇట్లుభయసైన్యంబులు గంగా యమునా ప్రవాహంబులుంబోలె నొండొంటింగూడుకొని యన్యోన్య మైత్రిం బ్రకటింపుచు నేకగ్రీవంబు గాఁజనియెనప్పుడు ప్రతినాదితాంబర విమానంబులు గలుగునట్లుగా మంగళదుందుభులు మ్రోసెనంత దనుజాంతకుండు యుధిష్ఠిరముఖావలోకనకౌతుకాతిరేకంబున సర్వదేశంబులనుండిచనుదెంచిన మహీపతులసైన్యంబులచేతఁబురబాహ్యదేశంబులయందు నిర్మితంబులైనని కేతనంబులచేతను వైరిసేనావరుధ్యమానంబై వైరిసేనావేష్ట్యమానంబైన దానిపోలికనొ

ప్పుడున్నయింద్రప్రస్థపురంబు నవలోకించె మఱియుఁ బ్రతిశబ్ద పూరిత దిగంతరాళంబైన సేనాసముద్రంబు తుషారాచలగుహాముఖోన్ముఖసుర నదీప్రవాహంబు కరణిఁ బురద్వారంబుగఁ దియనడిచె లోక సంరక్షణార్థంబునసకృద్గృహీతశరీరసంభవంబుగల యప్పురుషుండు ప్రవిభక్త ప్రత్యగ్రగోపురద్వారంబులు గల యప్పురంబు పంచేంద్రియ సమానులైన ధర్మనందనాదిపంచపాండవులతోఁ గూడఁ బ్రవేశించె మఱియును॥ (చ) హరనయనాగ్నిఁ గ్రాఁగనిసు,మాస్త్రసమద్యుతిరూపసంపద । న్వఱలెడు పూరుషుల్మఱియు,వారకమున్నటు రాజయక్ష్మరో। గరహితపూర్ణచంద్రనిభ, కాంతియుతోజ్జ్వలవక్త్రసంపద । న్పరగెడు కాముసుల్గలిగి,భాసిలునప్పురిఁ జొచ్చిరందఱున్ ॥ ౧౧౯ ॥ (చ) హరిపటహాదివాద్యనిన, దార్భటుల న్విహితోపహూతలై । పురితరుణీమణుల్కుతుక,ము న్దొరసేయఁగసద్మకృత్యము । ల్మఱచి మురారిఁజూచుటకు,మక్కువతోనటు వీధివీధికి । న్గరమరు దారవచ్చిరిము,ఖద్యుతివెన్నెలగాయుచుండఁగన్॥ ౧౨౦ ॥ (చ) మలయుచు వేడ్కన ర్ధకృత,మండనులై కరరుద్ధనీవులై । గళితమనోజ్ఞచేలలయి,క్రాలువెలందులఁ జూచిసౌధప।ఙ్క్తులుపటహప్రతిధ్వనులఁ,దోరముగాఁ బ్రకటాట్టహాసము। న్సలిపినకైవడిందనరెఁ,జారుతరంబుగసర్వవీధులన్॥౧౨౧॥ (చ) తత్తరపాటుతోరశన,తప్పకవక్షమునందుమంజుభా । స్వత్తరకర్ణపూరములు,వారకకేశములందుఁ గంచుకం । బుత్తలపాటుతో న డుమ,నొప్పమెయి న్మొలచీరచన్నులం । దత్తఱిఁ గుండలంబు లటు,హస్తములం ధరియించి రంగనల్॥ ౧౨౨ ॥ (చ) వెలదియొకర్తుకర్ణకృష్ణముఖ,వీక్షణరాగవశంబునంబడం । బులనటుయావకద్రవముఁ,బూయుచు నొక్కటిఁ బూయకంతలోఁ । బొలుపుగశంకరార్ధ తను, బొందినగౌరియుఁబోలెమార్గము । న్జెలువుగ యావకైకపద,చిత్రి



తధాత్రిని జేసెనత్తఱిన్॥ ౧౨౩ ॥ (చ) లలితవిశాలమధ్యశిఖ, రస్ఖలితధ్వనితోరుమేఖలా । కులలగుపౌరకామినులు,గొబ్బునఁగాంచనతుంగసంక్రమం । బులనిరువంకల న్సఖులు,పొల్పెసఁగంగయిదండ లీయఁగాఁ । గలయఁగ నెక్కిరంఘ్రికట, కస్వనముల్సరవిం జెలంగఁగన్॥ ౧౨౪॥ (మ) హరిసందర్శన జాతకౌతుకమునన్, హైమోజ్జ్వలచ్చిత్రమం । దిరకుడ్యస్థగవాక్షమధ్యవిలస,న్నీరేజపత్రాక్షిసుం । దరవక్త్రాంబురుహంబుచూడఁబడియెం,దత్పూర్వభూభృద్గుహాం । తరరంధ్రోదరమధ్యగైందవసము,ద్యత్పూర్ణబింబాకృతిన్॥ ౧౨౫ ॥ (ఉ) కాంచనసౌధవీధిపయిఁ,గ్రాలుచు గంధవహావధూతచే । లాంచలమైనయొక్కనగ,రాంగనచేహరివచ్చుచుండన। భ్యంచితలీలనన్నగర,మాయతకేతుకృతోరుశోభమై । మించినమాడ్కిశోభిలెస,మృద్ధపటీరజలావసిక్తమై॥ ౧౨౬ ॥ (చ) అరుదుగనప్పురీరమణు,లప్పుడు మేడలమీఁద నుండిసు । స్థిరకరపంకజాంజలుల,చేఁగుసుమోపచితాచ్ఛ లాజము । ల్స్ఫురదురుశుక్తిసంపుటవి,ముక్తమనోహరచారుమౌక్తికో । త్కరములు వోలెశౌరిపయిఁ,దప్పకచల్లిరిసంభ్రమంబునన్॥ ౧౨౭ ॥ (చ) లలితహిమప్రముక్తశశి, రమ్యతరుండుసపద్మయుఁడు న్ద్విజా । వళికధికప్రియుండునువి,వర్ధితమన్మథుఁడున్ప్రసాదితో । జ్జ్వలసురుఁడైనయవ్విధుఁడు,సంభ్రమత న్ప్రమదాజనాలికిన్ । జెలువుగ సంతతోత్సవముఁ,జేసెమహత్తరులుత్సహింపగన్॥ ౧౨౮ ॥(గీ) మఱిస్వదాహకుఁడగు శూలి,గిరిసుతాభ । యమునఁ బౌరాంగనలఁ జూడఁ,డనుచు నమ్మి । యభయమునఁబంచశరునిచే, నాక్రమింపఁ । బడిన సుదతులఁ జూచెశ్రీ,పతిక్షణంబు॥ ౧౨౯ ॥ (గీ) పరఁగఁ గల్పాంత మందునె, వ్వాఁడుకుక్షి । చేతభువనంబులన్నిగ,గ్రసించెనట్టి । హరినిబురకాంత మదవిహ్వ,లైకలోచ। నాంచలంబునగ్రసియించె,నప్పడహహ॥౧౩౦॥

(గీ)శౌరిమ్రోలనొక్క,సతియధికోన్నత।కఠినకుచయుగనీల, కంఠమధుర।
వలయనాదయగుచుఁ,జలదంగుళులచేత।ఘట్టనంబుఁ జేసెఁ, గర్ణబిలము॥
౧౩౧॥(సీ)పరిపాటలాంభోజ,సురుచిరంబుననసకృచ్చంచలాంగుళీ, వి
సలయంబు।నగుపాణిచేనొక్క,యబ్జాక్షిఘనశిరఃకంపంబు సేయుచుఁ ,
గంజనేత్రు।ననుదీర్ణవర్ణంబు,నవిదితార్థంబుగా నాహ్వానమొనరిం
చె,నంచితముగ।వరనలినాంతికో,పహితపల్లవకాంతికలదైక పాణిచేఁ ,
గమ్రముఖులు॥(గీ)గప్పుకొనియొక్క సుందరి,క్రమతరక।రాంగుళీరంధ్రవి
స్రుతవ్యాప్త,ధవళ । దంతకాంతులుగలుగుస,ట్లంతికస్థుఁ। డైన శౌరిని
జూచెన,త్యాదరమున॥ ౧౩౨ ॥ (చ) హరిముఖవీక్షణంబునస, మాద
రవిస్మయ సంభ్రమంబునన్ । స్థిరతరనేత్రమైనయొక, చెల్వసుఖంబు
నవిస్మృతాంగయై । పరిగళదుజ్జ్వలాంశుకము,భాసురనీలనిబద్ధకంకణ।
ప్రరుచిరరోమరాజియగు, పాణితలంబునఁ గప్పె సిగ్గునన్॥ ౧౩౩ ॥
(చ) ఘననిజసారభభ్రమణ,కారితబంభరపక్షతిప్రభం । జనరయనా
శితశ్రమజ,సాంద్రజలంబనిమేషదృష్టియా । ననుపమసుందరాంగమున
నంగనయోత్తరదరస్మితాస్యయై । తనరుపురాధిదేవతవి,ధంబునఁజూ
చెహరిస్మదంబునన్॥ ౧౩౪ ॥ (సీ) అకటకృష్ణుఁడుమన, యక్షులుతృ
ప్తినొందకమున్నెదృష్టిప,థంబు దాఁటి । పోవుచున్నాఁడని,పురకాంత
లెంతయువగనొందిరనిశంబు, పాయకహరి । నీక్షించువారికే,తృప్తిలే
దనియెటుంగరువారికేలాగుఁ,గలుగుతృప్తి । హరిదూరమునసేగ, న
మ్మహామహుమీఁదఁ బ్రాలినచూడ్కులు , క్రమ్మఱించి॥ (గీ) రంతెగాని
యత్యాశతో,నరుగుమాన । సంబుమఱలింపఁ జాలక,సద్మకృత్య। ము
లుమఱచి చిత్రనిమిత్త,లలితరత్న । పుత్రికలుపోలెనుండిరి,చిత్రభంగి॥
౧౩౫॥ (చ) అలఘుతరప్రసారితద్రు,గంజలిపీతమనోజ్ఞమాధవో।జ్జ్వ
లరసపూరనిర్ఝరల,సన్మదమందశరీర యుక్తలై । తొలఁగి చనంగఁ



బాదములు,తొట్రుపడంగనతిప్రయత్నతన్ । మెలఁకువఁ జేసియంగన
లు,మెల్లననిండ్లకుఁ బోయిరంతటన్॥ ౧౩౬ ॥ (వ) ప్రత్యగ్ర గంధ
వాసితోదకవిరజీకృతంబులును సాంద్రాగరు ధూపధూమకృత రేణువి
భ్రమంబులును సముచ్ఛ్రితోన్నతధ్వజస్తంభవిలంబిపటపతాకంబులు
నగుపురవీధులతిక్రమించి తొల్లి ఖాండవదాహంబునందుధనంజయునిచే
తమోచితుండైన మయుండుప్రత్యుపకారార్థంబు తనచేతనె బిందు
సరోవరంబునందు నిక్షిప్తంబైన వృషపర్వగృహనిర్మాణావశిష్ట మణి
శిలాకలాపంబుచేతఁ దిరస్కృతేంద్రసద్మసంపదం బగునట్లుగానిర్మిం
చి ధర్మరాజునకొసంగిన సభాసదనంబుఁడాయం జనియె॥ (గీ)పరఁ
గనేసభయందున,భ్రాంకపాచ్ఛ । రాజతస్ఫాటికాగార,రమ్యరుచులు।
చేరిచంద్రుండు క్రమ్మఱ,క్షీరవార్ధి। గర్భవాసంబుఁ జేసిన, కరణిన
లరె॥ ౧౩౭ ॥ (గీ) అరయనేసభాసదనంబు,లందునీల । మణివిభా
హరితీకృత,మధ్యపద్మ । రాగరచితావనులుభృగు, రామపితృస। మూ
హతృప్తికృజ్జలములఁ, బోలెఁదాల్చె॥ ౧౩౮ ॥ (గీ) ఎచటస్ఫటికాశ్మ
సంఘాత,రచితములయి । నిశలఁ జంద్రికైకతనొంది, నెగడుకతన। మ
ఱియునిరులందునుగరావ,మర్శగమ్య । గృహములు జనంబు చేతలం,
ఘింపఁబడియె॥ ౧౩౯ ॥ (గీ) మ్రోలవిశదాశ్మగృహములఁ,బోలఁజూ
చి । కౌముదీభ్రాంతినవలికిఁ,గడచిపోయి । వెనుకహస్తావమర్శనం
బుననెఱింగి । జనములతికష్టముగఁ బొచ్చి,చనుచునుండ్రు॥౧౪౦॥ (సీ)
ఏసభాగృహములం,దేపారనిశయందుఁ బద్మినీభామినీ,పరిభవస్ఫు। టా
పరాధములైన,యబ్జాంశువులనంగ సన్నింద్రనీలాశ్మ, సంచయములు ।
పటుగౌరవమునను, పాంశుతాడనమాచరించెనేసభయందు, నంచిత
ముగ । నభినవసంగంబు, లౌటసాంద్రత్రపాభరపరాఙ్ముఖులయ్యు ,
భాసురముగ॥ ( గీ ) సదనరత్నభిత్తికలందు, సంక్రమించి । నట్టి

ప్రతిబింబములయందు, నగ్రభాగ । మందునెదురుగాఁ జనుదెంచు, నతివలపుడు । సుఖులకుముదంబొసంగిరి, సురుచిరముగ॥ ౧౪౧ ॥ (చ) అరుదుగ నెందునూత్నహరి, తాశ్మవినిర్మితవేశ్మపఙ్క్తుల । న్స్ఫురిత తృణంబులంచునమి, తాస్యములై రసనాగ్రలగ్నభా । సుర కిరణాంకురంబులగు, చున్నబళంబు గ్రసింపుచున్నవై । ఖురిఁగనుపట్టు పెంచిన మృ, గంబులఁ జూచెజనంబు సొంపుగన్॥ ౧౪౨ ॥ (గీ) అరయ నెద్దానిచెంగట, నాలవాల । భృతజలాదర్శ బింబిత, పృథుత రాత్మ । తనువుచే సపలాశసం, తతిసమూల । సంతతిని జూచిన ట్లుండె, క్ష్మారుహములు॥ ౧౪౩ ॥ (గీ) మఱియుసురగేంద్రమూర్ధజ, మఱిసమీప । మందుముహురున్నతాంభోధ, రారవముల । చేతఁ దత్ప్రాంగణోర్వులు, ప్ఫాతవాల । వాయజమణిస్థలాంకుర, చ్ఛాయనలరె॥ ౧౪౪ ॥ (చ) అలవుగనెందు గూఢసలి, లాశయముం గని ధార్తరాష్ట్రుఁడు । స్థ్సలమను భ్రాంతిచేతడిగి, తత్సలిలార్ద్ర శరీరుఁడైననిం । పలరఁగ వాయునందనుఁడు, హాసముఁ జేసినఁదద్రవంబున । న్గలఁగిరిరాజులెల్ల లయ, కాలమువచ్చెనటంచు భీతులై॥ ౧౪౫ ॥ (గీ) మఱియు నెచటనిశిత, కరవాలకోమల । స్ఫురితశక్రనీల, భూములందుఁ । దెలుపువారులేక, జలమను భ్రాంతిచే । మొలపటంబుజనులు, మడిచికొనిరి॥ ౧౪౬ ॥ (చ) అపుడమలాంశుపుంజరుచి, రాంగులునేత్రసుఖప్రదుల్రమా । ధిపయమజుల్రథంబుల న,తిప్రియులై సభకున్ముఖంబుగా । విపులరుచుల్శశాంకుఁడు క, విప్రవరుండుదయాద్రినుండిమింటిపయికి నుద్గమించుటకు, డిగ్గినకైవడి డిగ్గిరింపుగన్॥ ౧౪౭॥ (వ) ఇట్లురథావతరణంబుఁజేసిమాధవుండుధర్మనందనుండుమార్గంబుఁ జూపుచునగ్రభాగంబునం బోవుచుండఁ బ్రభాపటలవ్యాప్తిచేత నదృశ్యరత్నమయకుడ్యంబై బహురత్నప్రభాపుంజం



బుచేతనవిభావితద్వారంబై యొప్పుతత్సభాసదనంబు మెల్లనం బ్రవేశించియేమందిరం బభ్రంకషరత్నప్రభాసమూహంబుచేత దేవతామందిరంబులనెల్లఁ బరిహసింపు చున్నదాని యట్లనలరునట్టి నూతనహిరణ్మయమయేష్టకారచితంబైన యమ్మహాసదనంబు విలోకించి యుదయశిఖరిశిఖరయుగపత్ప్రకాశమాన దివాకర పూర్ణచంద్రుల యభూతపూర్వశోభనధిగమించి ధర్మనందనకృష్ణులు సముజ్జ్వలదీప్తి విపులసింహాసనంబులమీఁదసుఖాసీనులై రనన్తరంబ రాజకులంబునకు సకలదుఃఖాపకారియగు యదునందనుండగు కృష్ణునిచేత నిదాఘసంతప్తంబైన యంగంబువాయువుచేతంబోలె సాగరజలంబు శశిచేతంబోలె నిక్కిలిసుఖంబుచేతనానందింపం బడియెవిలాసయుక్తలాసిక విలాసినీజనం బనవద్యవంశాదివాద్యగీత సమకాలత్వద్రుత విలంబితాది వాద్య మానానువర్తియునవగీతం బయ్యునవగీతత్వంబు ధరించినదై స్ఫుటసాత్వికాంగికవాచికంబును మధురంబునైన నృత్యంబుగావించె మఱియు నాధర్మనందనుండుశ్రీకృష్ణుండు సభాప్రవేశనంబుగావింపుచు నుండ నమ్మహానగరంబునందుఁ బ్రసిద్ధవసంతాద్యతిరిక్తకాలంబునందును మహోత్సవంబునాజ్ఞాపించెఁ గృష్ణాగమన సముత్కటానందుండైన ధర్మనందనునినగరంబు సంతతోత్సవంబై శీఘ్రంబున విస్మృతంబయ్యె నప్పుడు సకలనామప్రపంచాభిజ్ఞుండైన కృష్ణుండుబాలకులు మొదలుగ బంధుజనారోగ్యంబును బ్రాహ్మణులఁగుశలంబును రాజుల నామయంబునడిగెమహాసంపద నధిగమించియు నిరహంకారుండగు సుజనుండొకానొకప్పుడైనను గర్తవ్యకార్యంబు మఱువఁడు గదాయిట్లు సర్వజనంబుల కుశలంబరసిన కృష్ణుండునుయుధిష్ఠిరుండును బరస్పరంబు మనుష్యలోకంబునందు దుర్లభంబైనరసోత్కర్షంబు నొందిరతిస్నిగ్ధత్వంబున ననుక్షణంబుప్రతివాక్యం బపూర్వత్వంబును ధరించెబహుళ శిశుపాలజరా

సంధానివధకార్య చింతారూపామృతంబు నాస్వాదింపుచుండిరి॥(ఉ) అప్పుడుసాధువాది నృపుఁ, డధ్వరకర్మము నందుమానసం । బొప్ప గఁజేర్చిసాంద్రసుఖ, యోగకృతాస్య ప్రసాదదృష్టిచేఁ । గప్పిన స్నేహభావముదగన్ బ్రకటంబుగఁ జేయుచు నచ్యుతున్ । దప్పక వాగ్విశారదునిఁ, దామరసేక్షణుఁజూచి యిట్లనున్ ॥ ౧౪౮ ॥ (సీ) అనఘాత్మనీకంటె, నన్యుఁడేపురుషుండు వ్రీడనొందక యుండు, వినుతుఁడగుచు । వినుతించువాఁడును, వ్రీడితుండగుచుండు మనకిర్వు రకునట్టి, మాటలేదు । ఈవనంత గుణుండ, వేనాత్మ బంధుండస్తుత్యుఁడ వీవేను,స్తుతికరుండ । నవనిలో భవదన్యుఁడగువాఁడ సత్యస్తవంబులచేఁ జాలఁ, బ్రమద మొందు ॥ (గీ) నట్టియనృత స్తవంబులు, ప్రాణులకును । సులభము లనంతకల్యాణ, లలిత గుణుఁడ । వైననీయందు సత్యంబు,లగుచునుండు । నెఱిఁగి వినుతింప నెవ్వారి, తరమధీశ॥౧౪౯॥ (గీ) పరఁగ సర్వాప గుణజాల,వర్జితుండ । వైననీయందు నిఖిలకల్యాణసుగుణ । సంపదలు చేరియున్నవి, సతతమునినుఁ । బొగడువాఁడుమిథ్యావాది, యగునెకృష్ణ॥ ౧౫౦ ॥ (మ) అనఘా భారత ఖండమంతయును మ,త్స్వాధీనమై యుండుటల్ । ఘనతన్సర్వ సుపర్వసంపదలు వి,ఖ్యాతోరుసౌభాగ్యముల్ । విను నైశ్వర్యముఁజిత్వరాసుజులుభూ, విఖ్యాతియుం గల్గుటల్ । దనరం దావక సత్కృపాకలనఁగా,దాపద్మ పత్రేక్షణా॥ ౧౫౧ ॥ (చ) నలువుగ ధర్మరాజనెడు,నామముగల్గుట నాకుమీకృపా । బలమునఁగాదె మూలతను,బ్రాపుగమీరిపు డొందనేనుసొం । పెలయఁగధర్మ వృత్తవ, హించెద నేను మఖంబు సేయఁగాఁ । దలఁచితి నీవుతద్భరము, దాల్చి కృపామతినుద్ధరింపవే ॥ ౧౫౨ ॥ (శా) సంభారంబులు గూర్చియాజకులనో,జన్ బిల్వనంపించియా । రంభంబొప్ప మఖంబు సేయుటకుమీ,రా



కంబ్రతీక్షింపుచి । ట్లంభోజేక్షణ యున్న వాఁడనిటు ధా,న్యఁబర్థిఁ దూర్పెత్తసం । రంభంబొప్పఁగఁ గర్షకుండనిలుఁజే,రం గోరుచందంబునన్॥ ౧౫౩ ॥ (మ) ప్రమదంబొప్పఁగ నీవుసంగతుఁడవై, పాలింపుచుండన్మదీ । యమఖం బించుకవిఘ్నదోషములు లే,కంతంబుఁబ్రాపించుదు । ర్దమసూర్యుం డుదయించి భాసిలుచునుం,డన్ వాసరశ్రీని నీ । తమనెవ్వాఁడు హరింప శక్తుఁడగు నో,కంజాత పత్రేక్షణా ॥ ౧౫౪ ॥ (సీ) మహిలోనరాజు ధ,ర్మంబు దప్పక యుండఁ జెలఁగి విత్తంబునా,ర్జింప వలయు । నార్జితవిత్తంబు, నధిక యత్నంబున రక్షింపవలయును, రక్షితార్థ । మెలమితోఁ బాత్రభూ,తులయందువినియోగమొనరింప వలయు ని,ట్లునికిలెస్స । యజ్ఞంబనంగ న,న్యం బొందుగలదె యజ్ఞస్వరూపివినీవె, కావెయధిప ॥ (గీ) యగ్నిముఖమునహవ్యంబు, నవనిదేవ । తాస్యముల నన్నము భుజించి, యజ్ఞఫలము । కృపదలిర్పంగఁ గర్తకు,నిచ్చుదాత । వీవెగావె మహాత్మని,న్నెన్నఁదరమె॥ ౧౫౫ ॥ (గీ) అనఘనీవుమున్నుఁ, యాగంబుగావించి । యవభృథోక్షితుండ, వైన వెనుక । నీదుశాసనమున, నెమ్మితో రాజసూ । యాధ్వరం బొనర్తు,నంచితముగ॥ ౧౫౬ ॥ (వ) అనియిట్లుయుధిష్ఠిరుండు విన్నవించినవిని యమ్ముకుందుండుసర్వ మహీపతులువినుచుండ దశనాంశువ్యాజహారంబుచేత శబలాకార శరీరంబుధరించియతనికిట్లనియె ॥ (సీ) జననాథనీదు తే,జంబదినిజనీతి మహిమచేసకలభూ,మండలాది । పతులను సాధించి,వశ్యులఁగాఁ జేసెనింకనెవ్వనిచేత,నేమిగుణము । తగఁబథ్యవృత్తిచే,తనెరోగమునశింపనెలమివైద్యునిచేత, నేమిగుణము। అరిజయ భూరక్ష, ణాదిగుణముల శుద్ధక్షత్రియుండవై, తనరునీదు॥ (గీ) మోలనెవ్వాఁడు రాజార్హ,ముఖ్య సవన । మర్థిఁగావింపఁగా శక్తుఁ,డవనినుద్ధ । రింపవిష్ణు వారాహ

మూ,ర్తికినిదక్క । నన్యునకు శక్యమగునె రా,జన్యవర్య ॥ ౧౫౭ ॥
(వ) రాజేంద్రా యేనతిదుష్కరంబైన భవదీయ నియోగంబునందు
వ్యవస్థితుండఁగావున నెద్దిపంచినఁ జేయంగల వాఁడవలసిన కార్యంబు
లందునన్నునియోగింపుము ధనంజయుండునీకెట్టి వాఁడగు నేనట్టివాఁడ
నగుదునరనారాయణ స్వరూపులమగుటంజేసి యేమిరువుర మేకరూపం
బెగానిభిన్నంబుగాదు భవదీయ యాగంబు నిర్విఘ్నంబుగా సమాప్తి
నొందించెదమమిత్రుం డెవ్వండైన విరోధించెనేని వానిశిరంబుమదీయ
చక్రాయుధంబున ఖండించెద నీవునిస్సంశయంబుగా యాగదీక్షవహిం
పుమనిపలికినమ్మధుసూదనుని వాక్యం బాలకించి ధర్మాత్మజుండు దే
వానీవుక్షేమంకరుండ వగుచుండఁ గొఱంతయేది నాకు సర్వసంపదలు
సుస్థిరంబులయ్యె భవత్సహాయ సంపత్తిచేత సంతుష్టుండనైతిఁగ్రతు
కర్మంబుగావించుట కుద్యుక్తుండనైతిననిపలికెనంత ॥ (గీ) ధవళకర
శోభితాస్యుఁడై, దర్శనమున । తృషితకామ విగ్రహుఁడయి, సలిలవి
ప్లు । తాంగుఁడై ధర్మనందనుం,డష్టమూ,ర్తి । మూ,ర్తివిధమున రా
జిల్లెఁ,బొలుపుమీఱ ॥ ౧౫౮ ॥ అప్పుడు॥ (సీ) చెలువొప్పఁ గ్రియ
లు తాఁ,జేయక సాంఖ్యశాస్త్రోక్తాత్మసామ్యంబు, నొందినట్టి । యవ
నీశ్వరునియంత, రంగంబు నందటుబుద్ధియందునుబోలెఁ, బొసఁగయా
జ । కుఁడువృత్తిభాజియై, యడరఁదదుప లంభకలనచేఁ గర్తృత్వ,
గరిమఁగాంచె । సకలమీమాంసాది శాస్త్ర విశారదుల్సవనయాజకు
లప,శబ్దములును॥ (గీ) స్ఖలనదోషంబు లెవ్వియుఁ,గలుగకుండ । మం
త్రవర్ణబలాహూయ, మానవాస । వాదిసురుల నుద్దేశించి, యగ్ని
యందు । వేల్చిరాజ్య పురోడాశ,విసరములను॥ ౧౫౯ ॥ (గీ) ఘ
టితదర్భవికార యో,క్త్రియగుధర్మ । పత్నివీక్షిత హవ్యంబు, ప్రణ
యనాద । సత్కృతంబైన శిఖియందు, శాస్త్రఘణితి । హోమ



మొనరించిరపుడు క,ల్పోక్తభంగి॥ ౧౬౦॥ (వ) మఱియు నమ్మహా
యజ్ఞకర్మంబు నందూహాకుశలురగు ప్రయోక్తలు వేదంబునందుఁబ్ర
థమాదిసకలసుబంత విభక్తులచేతను దిజంతవిభక్తులచేతను లింగంబుల
చేతనుశీఘ్రనిగదితంబుగానికర్మాంత వేదవాక్యంబును బలుకుచుసందే
హోత్పాదనంబు కొఱకు సాదృశ్యంబు ధరించినవియుఁ బ్రకృతికర్మ
త్వంబునుద్దేశించి యత్యంతవిలక్షణ ఫలప్రదంబులునగు సమాసంబులు
ప్రసక్తంబులగుచుండ శబ్దశాస్త్రవిదులగు ఋత్విజులుతత్సమాసవి
హితస్వరవశంబుచేత నీస్వరంబునీసమాసంబు నీవిగ్రహంబని యన్యత
రపక్షావధారణంబు గావించిరి ప్రకాశమానంబైన లోలజ్వాలారస
నాశతప్రభామండలంబుచేత హసింపుచున్నవానియట్లున్న పావకుండు
వషట్కారంబుచేత వ్యక్తంబైనపరిశుద్ధప్రభూతాజ్యంబు పెక్కుమా
ఱ్లునాస్వాదించె॥ (సీ) మఱియు నుత్పవనాది,మంత్రపూతహవిస్సుభు
జియించు శిఖికతి, స్ఫురితరూప । వృద్ధినొందినతను, వేమహాజిష్ఠ
త్వమొందినయదియుఁ గా,దొప్పుమీఱఁ । బరఁగ సువ్యక్తార్థ,వర్ణసం
పదఁదాల్చియవనిలోన హవిర్భు,గాఖ్యగలిగె । స్వాభావికోష్ణ సం,
స్పర్శంబుదాల్చిన యనలుఁడాజ్యాదికం,బునుదహించె ॥ (గీ) ననుట
చిత్రంబుగాదు హ,వ్య ప్రభూత । సౌరభంబు నాఘ్రాణించు,సర్వ
జనుల । మూ,ర్తిమంతంబు గానట్టి,పూర్వపాప। సంచయంబుల నెల్ల
భ,స్మంబుసేయ॥ ౧౬౧ ॥ (చ) అనలునికేతనంబు రయ,మారఁగ
నప్పుడధఃకృతాభ్రమై । యనువుగ ధూమ్రపఙ్క్తి నిఖి, లాశలుగప్పఁగ
సాంద్రభంగిన । జ్జనపతి యజ్ఞవైభవము,సన్నుతిసేయుచు భాగము
ల్గొనక । మునుకొని వేల్పులంబిలువఁ, బోవుతెఱంగునఁ బోయెమిం
టికిక్॥ ౧౬౨ ॥ (మ) జితపాథోనిధి దేవదానవవర, క్షిప్తోరునా
నౌషధీ । లతికానిస్రుత సారమానమృతమా,లస్యంబు గాకుండన ।

ప్రతిమామోదముతో భుజించి యమరు, ల్తద్వ్య పీయూషమే । సత
తంబున్మదిఁగోరుచుందు రతితృష్ణన్ రాజసూయంబునన్॥ ౧౬౩
(మ) అరయం దత్క్రతు వందు యాజకులచే, నాహూతులై బర్హి
డిన్ । బురుహూతాదిక నిర్జరేంద్రులనిశం,బున్వచ్చు చుండంగఁద ।
త్తరుణుల్ప్రేషిత నాథలౌట సురమం, దారస్రగా బద్ధసుం । దరధ
మ్మిల్లలుగాకయుండిరి రహిన్,దద్యాగకాలంబునన్॥ ౧౬౪ ॥ (గీ)
అమ్మఖమునందు సురలుహ,వ్యంబునర్థిఁ । బ్రాశనముఁజేసి దీర్ఘామ,
రత్వమొంది । రధిక దుర్జయులైనపూ,ర్వామరులను । సంగరము
నందువధియింప, శక్తులైరి ॥ ౧౬౫ ॥ (చ) అలయక నమ్మహాక్ర
తువు,నందునొకింత క్రియాపచారమున్ । గలుగదు సర్వసాధనని,
కాయసమృద్ధియుఁ గల్గియుండుసాం । పలరఁగ రాజసంపదలు,యా
జకవర్యులబుద్ధి సంపదల్ । మెలఁకువతోఁబరస్పరము, మించిచెలంగె
సమగ్రవైఖరిన్॥ ౧౬౬ ॥ (ఉ) దక్షుఁడు ధర్మపుత్రుఁడు వ,దాన్య
శిరోమణి యధ్వరక్రియా। ధ్యక్షులఁబ ఙ్క్తి పావనుల, యాజకులన్మఖ
దక్షిణార్హులన్ । బక్షిపరాశ్వనాజ్ఞఁగొని, పఙ్క్తులు దీర్ఘసమగ్రభ
క్తితో । దక్షిణలిచ్చె శాస్త్రగది, తంబగుభంగియథాక్రమంబునన్॥
౧౬౭ ॥ (గీ) చెలఁగి సత్క్రియాలబ్ధ సం,సిద్ధులైన । యఖిలబ్రా
హ్మణక్షేత్రంబు, లందుభావి । వివిధఫలదంబులగుధన,బీజములను ।
సలిలపూర్వకముగ, జల్లె, జనవిభుండు॥ ౧౬౮ ॥ (గీ) నృపుఁడువే
దికయందు మ,హీసురులకు। దక్షిణలొసంగి పూతుఁడై, తనరుటదివి।
చిత్రమాదక్షిణలుగొనిఁ క్షితిదివిజులు । దళితపాపులై రదివిచి,త్రంబు
గాక॥ ౧౬౯ ॥ (చ) బలరిపుతుల్యశాసనుఁడు, పార్థివశేఖరుఁడ
ప్పుడాత్మహ । స్తలిఖితనామలక్ష్మయుత, శాసనపత్రములన్ లిఖిం
చిసాం । పలరఁగ యాగకాలమున,నావిభు భాస్కరతారకంబుగా।



వెలయభుజింపు డంచుద్విజ, వృద్ధులకిచ్చె ననేకభూములన్॥ ౧౭౦॥
(వ) మఱియు నాధర్మనందనుండుశుద్ధంబును శ్రుతివిరోధ రహితశా
స్త్రధారణంబును బ్రహ్మతేజంబున దేదీప్యమానంబును సారెసారెకు
వాచ్యమానంబునగు బ్రాహ్మణసమూహంబును విభక్తిపరిణామంబు
చేతనకలంకంబులును దివ్యాక్షర రూపంబులు సశాస్త్రధారణంబు
లునుబట్టసూత్రాదికంబుచేత శోభమానంబులును ద్విజగణంబుచేత
వ్యాఖ్యాయమానంబు నసంకీర్ణాక్షరంబులునైన పుస్తకస్థశాస్త్రంబుల
తోఁగూడఁదద్దాన కాలంబుననాకర్ణింపుచు ॥ (చ) అనిశమ వారితా
ధియును, నాశ్రమధర్మ విధిజ్ఞుఁడైనయ । జ్జనపతి తన్మహోత్సవము,
సమ్మతిఁజూడఁగవచ్చియాగద । ర్శనజనితప్రమోదమునఁ, గ్రాలుద్వి
జన్ములకశ్రమంబునన్ । ధనమణి భూషణాంబర వి,తానము లిచ్చె
యథోచితంబుగన్॥ ౧౭౧ ॥ (గీ) మఱియు భూరిసారమువృగ్యు
మాణమెద్ది । దుర్లభంబెద్ది యట్టివ,స్తువు నుపాయ। నమునుగొనిరాజు
లుతదంగ,ణంబునందు । గాచికొని యుందురవసరా, కాంక్షులగుచు॥
౧౭౨ ॥ (చ) పనిఁబడి యొక్కభూవరుఁడు, పాయనమిచ్చిన య
ర్థజాతమే । యనువుగ భూరిదక్షిణకు,యాజకదక్షిణ కర్థికోటికిన్ ॥
దనియఁగఁజాలె ధర్మజుఁడు,త్యాగవిశారదుఁడౌచునుండస ।ర్వనృప
వితీర్ణభూరిధన,రాసులుసంక్షయమయ్యెనయ్యెడన్॥ ౧౭౩ ॥ (చ)
నరవిభుఁ డయ్యుపాయనధ,నంబదియర్థులకిచ్చిమోదియై । వఱలె
నృపాలకుల్దమయు,పాయనవిత్తములర్థిసాత్కృతి । స్ఫురణమునొం
ది నందునఁ బ్రి,మోదము తక్కినయర్థమిండ్లలోఁ । బరఁగనసార్థ
కంబగుటఁ, బాటిలు దుఃఖము నొందిరత్తఱిన్ ॥ ౧౭౪ ॥ (సీ) అ
ల్పీకృతారాతి, యగుధర్మతనయుండు శిష్యభూతుండైన,క్షితితలేం
దు్రి । హవపశురక్షణా, ద్యల్పకార్యములందు నియమింపఁ దక్కిన,

నృపతులతని । వీక్షించి యితఁడెంత, నృపతికార్యం డయ్యె సవనక
ర్మంబుల, జాడలెఱిఁగి । యతికృతార్థుం డయ్యె,నని గౌరవించిరి
యాదికాలోద్ధృత,మైహిరణ్య ॥ (గీ) యాక్షముఖ దైత్య కంపిత,
మైనధరణి । తనదువాక్కున నిడికొన్న, ధర్మజుండు । కలన ని
ర్జితు లైనరా,జులకువారి । వారిభూములుగ్రమ్మర,వారికొసఁగె॥
౧౬౫ ॥ (చ) కనదురుసత్వసంపదవి,కారి మనస్కుడు ధర్మరాజ
నం । దనుఁడు మహాహవంబునను,దగ్రతనిశ్చయబుద్ధితోడఁజ । య్యి
నఁ జనుదెంచి నట్టి బహు,యాచక శత్రులవల్ల నెప్పుడున్ । ఘన
మతి మైపరాఙ్ముఖుఁడు గాక వెలింగె సమగ్రశక్తిచేన్ ॥ ౧౬౬॥ (సీ)
ధనకాంక్షి మైయర్థిఁ, జనుదేరఁగని వానినాదరింపక పంపు, టరయ
లేదు । ఇంతకుమున్ననీ,కిచ్చితిఁ గ్రమ్మరనేలవచ్చితివన్న, జోలిలేదు।
ఎంతసేపిచ్చిన, నిచ్చుటోపిక గాని యిసుమంత మైనను,విసుకులేదు। వేఁ
డినదానికి, ద్విగుణమిచ్చుటె గాని కొంచెమిచ్చుటలేదొ, కించు కైన ॥
(గీ) జగతిసద్యోదదాతీతి,చతురయనెడు । న్యాయమది దప్పకుండం
గ,నడిగి నపుడె । యాపనముసేయకర్థుల, కర్థమిచ్చె । ధర్మ
జునివంటిదాత యి,ద్ధరణిఁ గలఁడె ॥ ౧౬౭ ॥ (గీ) దానశౌంతుఁ
డైన,ధర్మజుండర్థివి । ద్యావిహీనుఁ డైన,నతని విడువ । కర్థ
మొసఁగె మేఘుఁ,డంతటవర్షించి । ధరణినూషరమునఁ, గురియకు
న్నె ॥ ౧౬౮ ॥ (చ) అనఘుఁడురాజు సద్గుణము,లందుఁ బ్రియత్వ
ము లేనివాఁడుగాఁ । డనిశము తద్గుణాంతరము, నాత్మ నెఱుంగని
వాఁడు గాఁడుత్యా । గనిరతుఁడౌట వీఁడు గుణ, గణ్యుఁడు వీఁడగు
ణుండటంచు నె । మ్మనమున నెంచకర్థులకు, మానుగనిచ్చె ధనంబ
శేషమున్ ॥ ౧౬౯ ॥ (చ) పసిఁబడి యవ్వనీపతులు, ప్రార్థనలేక
యచూచినప్పుడే । ధనముమణుల్యథేష్టముగఁ, దప్పక కైకొనిరప్పు



దీయతా । మనువచనంబుదాతముఖ, మందున యాచక వక్త్రమందుఁ
దా । వినఁబడదయ్యెనవ్విభుని,విత్తవిసర్జనమందునెంతయున్ ॥ ౧౭౦॥
(సీ) వందిమాగధసూత,వైణికవాంశికవాదులకర్హసం, భావనంబు।
బధిరాంధమూకుల,కధికధనంబును భోజనార్థులకిష్ట,భోజనంబు। నా
మయాతురులకుది,వ్యరసాయనంబును బ్రసవించుసతులకుఁ , బథ్యముల
ను । బీదసాదులకును,బెంపుగావిత్తంబుగణికాదులకునుబు , ష్కలధ
నంబు॥ (గీ) నడిగియడగకమున్నెతా,నరసియరసి।చాలనిప్పించియంద
ఱ, సత్కరించె । నాగతజనంబులందొక్కఁ, డైనఁగాని । కష్టప
డకుండనందఱు,తుష్టులైరి॥ ౧౭౧ ॥ (సీ) బహువిధసంస్కృత, ప్రాకృ
తంబులఁ గృతపాత్రసంకరములు, భావసిద్ధి । సహితంబులైనభో, జ
నములచేనాటకములచేఁ బోలెన, ఖండరసము । ననుభవించిజనంబు,
ననుపమానందంబు భరియించె నిబ్భంగిఁ , బార్థివుండు । నమ్మహా
రాజసూ, యాధ్వరమందు దుష్టాత్ముల శిక్షించు, నట్టిహరిని॥ (గీ) ర
క్షకునిఁ జేసిసంతత, మక్షతంబు । లైనదానంబు హోమంబు, యజ
నములును । గడమపడకుండ దోషంబు, స్ఖలనములును । గలుగకుండ
నిర్వర్తించెఁ, గౌతుకమున॥ ౧౭౨ ॥ (గీ) జగతి యాజులకెల్ల నీ,
శౌరియొకఁడె । సత్సఖుండని తెలిపెడు, సరణిదేవ । యజనభూమి
చషాలతు, ల్యాంగుళీయ । యూపమంగుళిఁ బోలెసొం, పొందనెత్తె॥
౧౭౩ ॥ (గీ) ధర్మతనయుఁ డిట్లు, తత్క్రతువంతయు । సాంగ
ముగనొనర్చి, యర్ఘ్యదాన । మెవరికిత్తుననుచు, నింపుతోనడిగిన ।
సభవినంగఁ బలికె , శాంతనవుఁడు॥ ౧౭౪ ॥ (వ) నరేంద్రా గుణ
దోషకోవిదుండవైన నీవుకర్తవ్య కార్యంబులందుఁ బరోపదేశాపేక్ష
లేకయె నీయంతనీవె యెఱుంగుదు వైననుగురుని యనుమతి వడసికాని
కార్యంబు సేయకుండుటది సదాచార పరిపాటిగావున నన్నడుగుటక

దికారణంబునా యెఱింగినంతఁ జెప్పెద స్నాతకుండును గురువునిష్టబంధుండును యాజకుండునుజామాత్రాది సంబంధిజనంబును ధార్మికుండైన భూపతియు నీయాఱ్వురు పూజార్హులగుదురని పెద్దలగువారు పలుకుదు రిప్పుడీయాఱ్వు రిచ్చట నెకూడియున్నవారు ప్రతాపవంతులును మంత్రశక్తివిని వారితాప దులును బరలోక శత్రుజన జయశీలురునై బ్రహ్మముఖంబునఁబుట్టిన బ్రాహ్మణులును రాజులును నీయజ్ఞంబు నలంకరింపు చున్నవారు గుణాఢ్యులైన పూర్వోక్తస్నాతకాదులు వేత్త్వాఱ సకృత్రిమంబైనసత్కారంబు నధిగమించుటకు యోగ్యులైననున తిగుణవంతుఁడైన వాఁడియ్యాఱ్వురలో నగ్రపూజార్హుండగుటదివిధి సమ్మతంబట్టివాఁ డియ్యాఱ్వురలోన నెవ్వండని యడిగితివేని చెప్పెద సర్వగుణబంధుండును సర్వపూర్వదేవ వినాశకరుండునగు శ్రీకృష్ణుండు ప్రథమపూజకార్హుండని నామనంబునకుఁదోఁచుచున్నదది యెట్లనిన వినుము॥ (సీ) అవనీశప్రహ్వా కృ, తాఖిలదైత్యదానవుఁడైన యీయదు, నందనుండు । మనుజమాత్రుండని, మదివిచారించితె సర్వాంత రాత్ముండు, సర్వభూత । విభుఁడుసర్వాతీతుఁ, డభవుఁడవ్యయుఁడు సర్వేశ్వరుం డితఁడని, యెఱుగుమీవు । సనకాదియోగులీ, ఘనున ద్వితీయుండు పరమాత్ముఁడజుఁడని, ప్రస్తుతింతు॥ (గీ) రరయ ధ్యేయుఁ డయ్యునుబుద్ధి, కందఁ డనుచు । స్తుత్యుఁడయ్యునువాగతీ, తుండటంచుఁ । బరఁగ సేవ్యుఁడయ్యును దూర, వర్తియనుచు । పల్కువేదంబులును సురవరులుమునులు॥ ౧౮౫ ॥ (చ) వితతరజోగుణంబు గొని, వేధయునై జగముల్సృజించు స । మ్మతినటుసత్వముంగొని స, మస్తజగంబులఁ బ్రోచువిష్ణువై । యతులతమోగుణంబునల, యం బొనరించు గిరీశరూపుఁడై । తతత్రిగుణావలంబమునఁ, దైవిధము నొందు నితండుభూవరా॥ ౧౮౬॥ (వ) మఱియు నిమ్మహాత్ముని సర్వజ్ఞు



నిఁగానినాదినిధనుం డయ్యును బ్రాణుల ననుగ్రహీతు కాముండైభూభారనివారణార్థంబు మానుష విగ్రహంబు ధరించిన వానిఁగాఁ గ్లేశకర్మఫలభోగ వివర్జితుండైన పరమపురుషునిఁగాఁ బెద్దలు చెప్పుదురుభక్తవత్సలుండైన యీకృష్ణు నందనురాగవంతులైన జనంబులునిరంతరధ్యాన క్షీణపాపులగుచు ననుధూయమానంబైన సంసార క్లేశనాటకాభినయవిధి నిహారణంబు బ్రాపింతు రమూఢులగువారు గ్రామ్యభావంబు విడిచి మోక్షార్థులై పునరావృత్త్యభావంబు కొఱకు దుష్ప్రాపుండు నద్వితీయుండు స్వతంత్రుండునగు నీకృష్ణుని ధ్యానమార్గనిష్ఠంబైన మనంబుచేత ధ్యానంబుసేయు చుందురు॥ (చ) పొలుపుగఁ బ్రాణికోటులకుఁ, బుట్టువుచావును గల్గఁజేయుచు । న్నలువుగఁ దానుపుట్టువును, నాశములేక యపాయమొందక । ట్లలరునధోజగంబు కమ, లాకృతిచేతఁ ద్రివిక్రమాకృతి । న్నలువజగంబు నిండినయ, నంతునకేను నమస్కరించెదన్॥ ౧౮౭ ॥ (వ) మఱియు సృజతిసంహృశాస్తులను ధాతువు లీ భగవంతుని విషయంబు నందనన్యయోగవ్యవచ్ఛిన్నంబు లగునట్లుగాఁగర్తృకారకవాచకంబులైన ప్రత్యయంబులను ధరింపుచున్నవి యొకా నొకప్పుడైనఁ గర్మార్థవిహితంబులైన ప్రత్యయంబుల ధరింప వింకనేమనినస్తౌతి యనుధాతువువిపరీతకారకంబై కర్మప్రత్యయాంతంబె యగుచున్నదిగాని కర్తృప్రత్యయాంతంబుగా నేరదు॥ (సీ) మొదలనీ భగవంతుఁ, డుదకంబుల సృజించియందునాత్మీయ వీ, ర్యంబునునిచె । నదిహిరణ్మయమైన, యండమై విలసిల్లెనందుఁ జతుర్ముఖుం, డవతరించి । సకలజగంబుల సమ్మతి సృజియించె నింతటికిని మూల, మివ్విభుండె । క్షీరవారాశిలో, శేషాహిశయ్యపై యోగనిద్రారతి, నున్నవానిఁ॥ (గీ) దొడరిమధుకైటభాఖ్యులు, దుష్టచిత్తు । లాదిరాక్షసు లిద్దర, త్యాగ్రహముననై

ద్రసుఖభంగమొనరింప, రౌద్రభంగి। సమయఁజేసెనుదల్పకీ, టములఁబోలె॥ ౧౮౮॥ (గీ) శ్రవణసుఖగానకోవిద, బ్రహ్మభృంగ। గర్భమై యేవిభునినాభి, కమలమార। మానసేందు నికటమందు, నలరెనమ్మ। హాత్ముఁడీతండె సుమ్మధ, రాధినాథ॥ ౧౮౯ ॥ (చ) జగదతివృద్ధుఁ డయ్యునుబ్ర, సన్నతబాలకుఁడైయకృత్రిమో। పగతచరిత్రుఁ డయ్యు నతి, బంధురమాయికుఁడైయజుండనా। నెగడియు రామకృష్ణముఖ, నిర్జల జన్మగుఁడై వినీతభ। వ్యగరిమఁదాల్చియుండియున, నాదియునైయితఁ డొప్పుభూవరా ॥ ౧౯౦ ॥ (చ) పొలుపుగస్థూలనాసికవ, పుర్ధరుఁడీహరిస్కంధధూననో। చ్చలితసటావకీర్ణఘన, సాగరవార్ప్లుతమైనమేదిని, న్వేలయననావృతత్వమున, వేగజలోద్ధృతమైన దానియ। ట్లలవడఁ జూచెనొక్కక్షణ, మద్భుతవైఖరినంచితంబుగన్॥ ౧౯౧॥ (చ) అతిబలశాలిమైన యితఁ, డద్భుతవైఖరి దివ్యభూరిసిం। హతనువుఁదాల్చి వజ్రముఖ, రాయుధకోటికభేద్యమైనసము। ద్ధతరణకండువైయలరు, దైత్యవరేణ్యునిఘోరవక్షము। గ్రకవిదళించెఁగోమలన, ఖంబుల నీకథవింటివేకదా॥ ౧౯౨ ॥ (మ) వినుమెవ్వానికరాగ్రఘట్టితహరి, ద్విశ్రాంతదంతావళా। స్యనృసింహాకృతి సన్నఖంబులునదీ, శాభంగరంగత్తరం। గనటచ్ఛుక్తులు పోలె భూరితరది, గ్గంధేభకుంభస్థనూ। తనముక్తాఫలరాజిగర్భతనుమో, దంబొప్పఁ దాల్చెన్రిహిన్॥ ౧౯౩ ॥ (సీ) అనఘస్వయంజాతుఁ, డవరజాఖిలలోకుఁడైన యీహరిసము, దగ్రదీప్తి। జితవిరోచనుఁడయి, చెలఁగు విరోచనపుత్రునివలననీ, భువనములను। బ్రాపింపఁ దలఁచిన, పాకశాసనునకునవరజుండై పుట్టె, నంచితముగ। నీవామనుఁడు ధాత్రి, నెంతగైకొనఁజాలునని దానవులు నవ్వ, నంతలోన॥ (గీ) నంఘ్రివిక్షేపమునదివ, మాక్రమించి। పొసఁగ శశిసూర్యమండల, ములనుదాఁటి। మూఁడు పద



ములఁ ద్రుటిలోన, ముజ్జగంబు। లాక్రమించెనీమహనీయుఁ, డద్భుతముగ॥ ౧౯౪ ॥(సీ) గగనంబులంఘించి, నగముభంగిగరీయమైన మహాచ్ఛదివ్యాంఘ్రిచేతఁ। గ్రాంతకంధరుఁడైన, గతిదుర్బలుండైనబలివాసవునకును, బద్ధుఁడయ్యె। నింద్రనీలచ్ఛాయ, నెసఁగుతదూరువు కడుదీర్ఘమైదూర, గతమునగుచు। వ్యోమంబుదాఁటిత, దూర్ధ్వముఖంబుగాఁ జనుచుండస్వర్ణదీ, స్పర్ధచేత॥ (గీ) దానిపయికుద్గమించియం, దముగఁబాఱు। భానుతనయాప్రవాహంబు, భాతిసురలు। గాంచియచ్చెరువందిరి, కరుణిదేవ। హితముఁజేసినధన్యాత్ముఁ, డితఁడెసుమ్మి॥ ౧౯౫ ॥ (వ) మఱియు నమృతవిభాగకాలంబున శిరశ్ఛేదంబుచేత బద్ధవైరుండైన సైంహికేయుండీహరికపకృతిసేయ సమర్థుండుగాకయతిరమ్యంబైన తదీయవదనంబుతో సాదృశ్యంబునొందిన శశాంకునిప్పటికి బాధింపుచున్నాఁడు అనపాయస్వరూపకుండగుటంజేసి యప్రతిహతస్మరణశక్తిగల యీకృష్ణుండుపదేశపరంపరాపగమంబువలన నధ్యయన విచ్ఛేదంబునొందిన వేదంబులను బ్రమ్మరఁబ్రవర్తింపం జేయుటకు నత్రిగోత్రంబునందుదత్తాత్రేయనామకుండై జన్మించెమఱియు నితండు పరశురామావతారంబునొంది యర్జునకాంతారంబునువినాశితప్రచురపత్రసంపత్తిగలుగునట్లుగావిలూనభూరిబాహుశాఖంబుగా సముజ్ఝితచ్ఛాయంబుగానొనరించె మఱియునివ్వాసుదేవుండురామనామంబున దశరథునకుఁ బుత్రుండై జన్మించివిధ్వంసితదృప్త దశాననంబైన లంకను దేజంబుచేత నధికవిభీషణంబుగా నొనరించె నిప్పుడింద్రశత్రులైన రాక్షసుల సంహరించుటకు విరించిచేతఁ బ్రార్థితుండై వసుదేవనామకుండైన కశ్యపునకుఁగృష్ణాభిధానంబున నవతరించె నిమ్మహాత్మునిచరిత్రంబులు లోకపవిత్రంబులు భవలతాలవిత్రంబులైయుండు నిమ్మహానుభావుని ప్రభావంబు గొంత యెఱింగించెద

వినుము॥ (చ) అనిమిష లోకవల్లభుఁడ, నంత జగత్పతియైన యీ
నవా । బ్జనిభ విలోచనుండు సుర, పఙ్క్తులచేతను వల్లవాళిచే ।
తనుదధి ద్రచ్చనిన్విడచి, తాతయి కేముసహింపఁ జాలమం । చనిశము
ప్రీతిచే గదితుఁ, డైనవిభుండు నృపాలశేఖరా॥ ౧౯౬ ॥ (గీ) కడిమి
రిపులచే ననవాప్త, గంధమగుచు । ఛాయచేవిజితామర, శ్రమము
నగుచు । వెలయు పారిజాతంబు ని, ర్విభుఁడు దేవ । విభుని దర్పం
బుతోఁగూడఁ, బెల్లగించె॥ ౧౯౭ ॥ (గీ) విమలఫాలంబుచే శంభు,
విభ్రమంబు । గన్న చైద్యునిమూఁడవ, కన్నుచండ । మారుతస్పర్శ
మున దీప, మాఱినక్రియ। నీహారిస్పర్శనంబున, హీనమయ్యె॥ ౧౯౮॥
(గీ) వరుసఁగోలత్వమును వల్ల, వత్వమొంచి । యనఘుఁ డీశౌరిదం
ష్ట్రాభు, జాగ్రమెత్తి । యంబుసంకట నిమగ్న, మైనదానిఁ । బ్రే
మ గోమండలము నుద్ధ, రించె నధిప॥ ౧౯౯ ॥ (వ) ఇట్టియనంతమ
హిమోన్నతుండైన యీకృష్ణుండు పరోక్షంబున యాగశీలురచేతఁ
బూజింపం బడుచుండు నీ పురోభాగంబునఁ బ్రత్యక్షంబుగా సుఖాసీ
నుండై యున్నవాఁడు గావుననీవతిధన్యుండవై తివిమ్మహాత్మున కర్ఘ్యం
బొసంగి యెంతకాలంబు నీవంశంబుండు నంతకాలంబు వనంబులందు
సాధువాదంబు నొందుమని పలికిన భీష్ముని వచనంబువిని సామ్రాజ్యశ్రీ
ధురంధరుండైన యుధిష్ఠిరుండు సమస్తరాజ సమక్షంబున శ్రీకృష్ణునక
ర్ఘ్యదానంబు గావించిన నమ్మహాత్ముండనర్ఘ్యుం డయ్యెనంత॥ (క)
నరనాథవిరచితంబగు । హరిపూజనుబూచి చైద్యుఁ, డసహిష్ణుండై ।
నెఱిఁగనలెను బరశుభమ । త్సరిగాదొకో మానిమాన, సంబుధరిత్రిన్॥
౨౦౦ ॥ (గీ) శౌరియందుమొదల, సక్రోధుఁడగు చేది । నాథుఁ
గృష్ణపూజ, నమునఁగినుక । తీవ్రమగుచుఁ గ్రమ్మె, దేహినిసమదోష।
కాలమైనజ్వరము, గ్రమ్మినట్లు॥ ౨౦౧ ॥ (ఉ) తెంపుననందుఁగల్గు



నర, దేవవరేణ్యగణంబు నెల్లఁ దార్జింపుచున్నవానివలె, శీఘ్రమునన్భు
వనత్రయంబుగం । పింపఁగఁ జేయునట్టియతి భీషణక్రోధరసోల్ల సచ్ఛి
రః। కంపముఁ జేసెమౌళిగత, కాంచనరత్నరుచుల్చలింపఁగన్॥ ౨౦౨॥
(చ) ఘనతర కోపవేగమునఁ, గన్నులనశ్రుకణంబు లొల్కఁగ్రో ।
ధనిబిడసోష్మవార్గలదు, దగ్రకపోలతలుండు స్వేదతో । యనికర
బిందుదంతురక, రాగ్రుఁడునై శిశుపాలుఁడత్తఱి । న్దనరె సభాంత
రంబునఁద్రి, ధాపరిభిన్నగజంబు చాడ్పునన్ ॥ ౨౦౩ ॥ (మ)
పరిభూతాఖిలరాజలోకుఁ డగుచు, న్భాసిల్లుచైద్యుండుదు । స్తరక్రో
ధోత్థితఘర్మవాలిప్తతనువుం, దత్సద్మమధ్యంబున । న్శరబిందుచ్యుతిగల్గు
నట్లుగవడిన్, జాడించె సంరంభియై । గురుపాథోధిసముత్థితాదిమమ
హాక్రోడంబు చందంబునన్॥ ౨౦౪ ॥ (వ) మఱియును సంహాత ప
ర్వతశిఖరసంకాశకరినాంసమండలుండైన యాశిశుపాలుండు క్రోధా
తిశయంబుననవిగాహితకంపంబగు స్తంభంబును స్వనకంపిత సభాసద
నంబుగలుగునట్లుగా నాశ్లేషణంబుగావించె నపుడు కమనీయకేయూర
ద్యుతిపిశంగితంబైన చైద్యుని బాహుమండలంబు క్రోధవహ్ని జ్వాలా
జాలపరీతంబైన దాని యట్లప్రకాశించెనప్పుడుగురుతరకుటిలభ్రూభం
గభీషణీకృతలలాటంబైన చైద్యునివదనంబు గ్రమ్మరమూఁడవ నేత్రంబు
చేతఁ గృతసంసర్గంబైన దానిపగిది నతిభయంకరంబై చూపట్టెమఱి
యుఁ జైద్యునిలోచనంబతిరక్తభావంబునొంది సాహసంబునందుఁ గృత
నిశ్చయంబై యగణితభయంబై సమీపంబునందున్న ఖడ్గలతనుబ్రియస
ఖింబోలెనవలంబించె మఱియు మహోన్నతశైల శిలా కర్కశంబైన
స్వకీయసక్థిప్రదేశంబునఁ బ్రసారితాంగుళి పాణితలంబుచేతనతిభీతచప
ల పలాయమానజనాకర్ణిత భయంకరనాదంబు గలుగునట్లు తారం
బుగాఁ బ్రహరించెనిట్లు చైద్యునిచేత మిక్కిలిఁ గ్రోధంబు గావింపం బడి

యెవికారగుప్తిగలదయ్యును జిత్తంబువిశేషంబుగా విప్రియంబునుబ్రా పించివికారంబునొందుటది యేమిచిత్రం బివ్విధంబుననాచైద్యుండుమొదలఁ బూర్వోక్తశిరః ప్రకంపనాది గాత్రారంభవికారకృతముకుళబంధంబును భావికలహ ఫలయోగంబునైన కోపప్రసవంబు వక్ష్యమాణవాక్యంబుచేత వికాసంబునొందింపుచు నిర్భీకుండై సజలజలదగర్జితగంభీరస్వరుండైయాసభాస్థానంబునందుఁ బ్రతిధ్వనులు సెలంగనత్యంతరోషవశంబున నతిపరుషస్ఫుటతరాక్షరంబుఁగలవాక్యంబున నిట్లనియె॥ ౨౦౫॥ (చ)నరవర పార్థ నీవు నర,నాధులచేతనపూజ్య మానుఁడౌ। మురపరిపంథికర్ఘ్యమతి,ముఖ్యమటంచు నొసంగి తక్కటా । స్థిరమతిజుట్టమంచునిటు,చేసితివంతియెకాని పాత్రమం । చెఱిఁగి యొనర్పలేవయితి,వీతఁడు యోగ్యుఁడెయగ్రపూజకున్॥ ౨౦౬ ॥ (గీ) రాజగుణములేని, రామానుజుండురా । జార్హపూజగొనఁగ,నర్హుఁ డగునె । రాజశిఖులుచుట్టు, రాజిల్లుచుండహ। వ్యంబుగొనఁగఁ గుక్క, కర్హమగునె॥ ౨౦౭ ॥ (గీ) అనృతవాక్యమాడ,వనినీవుపటహావా। ద్యములఁ బ్రోయఁ బడితి,వవనినింద్యుఁ । డైనశౌరికిప్పు,డర్ఘమిచ్చుటఁజేసి । యదియుఁ గార్యకలన,ననృతమయ్యె॥ ౨౦౮ ॥ (చ) నృపతియధర్మరాజవగు,నీకెటు ధారుణిధర్మరాజనాఁ । గపటపుపేరుగల్గెనటు,గల్గుటయుక్తమదెట్టులన్నఁగ్రూ । రపుకుజవాసరం బునకు, గ్రక్కునమంగళవారనామము । న్నిపుణతఁ గల్గ లేదెమఱి,నీకునునట్టులఁ గల్గెనామమున్॥ ౨౦౯ ॥ (శా) కుంతీనందనులారయీ హరియె మీ,కుంబూజ్యుఁడౌనేనిబ । ల్సంతోషంబు మఖచ్ఛలంబునఁదిర, స్కారార్థమాహూతమై । పంతం బొప్పఁగ వచ్చినట్టినృపతి, వ్రాతంబు సిగ్గేదిమీ । పొంతన్నిల్వఁగ నేమికార్య మిచటం , బోవచ్చువారిండ్లకున్॥ ౨౧౦ ॥ (గీ) బాలిశులుగానమీరుగో, పాలకునకు । నగ్ర



పూజయొనర్చితి,రన్నిదెలిసి।తలయుమూతియునరిసిశం,తనుతనూజుఁ। డిట్టిగుణహీన దుర్బోధ మెట్లుచేసె॥ ౨౧౧ ॥ (వ) అనియిట్లు భీష్ముని దిక్కుమొగంబై॥ (గీ) అరయనగ్రపూజకు యోగ్య, లాఋ్విరనుచుఁ । బలికితీవందుఁగృష్ణుఁడె,వ్వాఁడు చెప్పు । మితనివైతాళికుని భంగి,నుతి యొనర్చి । నందువలన నింద్యుండ వీ,వాపగాజ॥ ౨౧౨ ॥ (గీ) అతిజరుండవు చపలుండ, వైననీవు । విప్రుతోర్వీ భృదధికుల, విడిచినీచు । నందు నిటునిత్యనిరతుండ,వగుటఁజేసి । నిమ్నగానందనుఁడవాట,నిక్కమయ్యె॥ ౨౧౩॥ (వ)ఇట్లుభీష్ముని నిందించి పదంపడికృష్ణునుద్దేశించి॥ (చ) అగునగు రాజయోగ్యమగు,నర్హణ మీవుపరిగ్రహింపఁగాఁ । దగదదియేను చెప్పవలె, నాభువిరాజునొకానొనేనఁటం । చాఁగిభవదీయచిత్తమున, యోజనసేయుముచేయవేని నీ । కగుబహురాజగర్హణమ,నర్థము వాటిలునిక్కమచ్యుతా॥ ౨౧౪ ॥ (చ) ప్రథితముగానరణ్యమున, బాలురుతోడుగఁదేనె యీగలన్ । శిథిలముచేసియమ్మధువు,చెచ్చెర సారెకుఁ ద్రావినందునన్ । మధురిపు నామముంగలిగె,మానక నీకిపు డంతెగాకయ । య్యధమ మధున్వధిందు నిమి,నందునఁగాదటు పేరుగల్గుటల్॥ ౨౧౫ ॥ (గీ) అల్ప బలుఁడవు ముచుకుంద,తల్పరక్షు । ణుఁడవు మాగధక్షీణ వీ,ర్యుఁడవునైన । నీకుబలదేవ సాహాయ్య, నియతిగాదె । సబలతాసిద్ధి గలుగుట,జాల్మవర్య॥ ౨౧౬ ॥ (గీ) శత్రుసైన్యభీతి, సంభ్రాంత నిజసైన్య । మాజిఁబ్రోవఁజాల,నట్టి నీవు । చక్రధరుఁడటంచు,జనులు పేర్కొననీర। థాంగమిటులఁదాల్చి, తౌరనీవు॥ ౨౧౭ ॥ (గీ) మునుయయాతిశాప,మునరాజ్యలక్ష్మికిఁ । బతివి గావునీవు, బంధునిహిత । నామపదనువార్ధి,నందినిఁగైకొంటి । శ్రీపతిత్వ సంజ్ఞ,చెల్లెనీకు॥ ౨౧౮ ॥ (గీ) విమతునెదిరించిరణము గా,వింప శక్తి । లేక యుండియు మింటన,

స్తోకపదముఁ । జాఁపి నందునవిక్రమ, శాలివనుచుఁ । బ్రస్తుతికి నె
క్కితిదియొక్క, పౌరుషంబె॥ ౨౧౯ ॥ (గీ) మున్ను మేదిని నెత్తితి, వ
న్నమాట । నిజమొకల్లయొ నేరము,నిశ్చయింపఁ । బ్రస్తుతంబు ప్ర
త్యక్షకార్యంబు గాదు । భూమిధరుఁడను పేరెట్లు,పొందితీవు॥ ౨౨౦॥
(వ) మఱియునీవు సర్వమహీపతులచేత నవధూతుండ వయ్యును క్ష
ణకాలంబు శ్రాంత కరతల ధృతస్వల్ప శైలుండవగుచు మహీతలంబు
నందుఁదులితమహీధరుండని పలుకం బడితివిదియు ధన్యత్వం బింతియె
కానిమాయట్టి బలవదరాతితోలనంబు వలనఁ గలిగినది కాదు పాపాచా
రపరుండవగుటంజేసి దుర్బుద్ధివైననీవు ఫలకాలంబునందు దారుణంబై
ననరకంబును జయింపంజాలక నరకవిజయియను ప్రసిద్ధికొఱకు భూ
పుత్రుండైన నరకునిజయించితి విదిలోకప్రతారణ మాత్రపరంబెగాని
పరలోకశుద్ధిగాదు నీవుగుణహీనుఁడవు సకలదోషరాశివైన యీనీ
శరీరంబు సకలశౌర్యాదిగుణవర్జితం బగుచునుండ సత్త్వాదిగుణ త్రయ
పరిత్యాగప్రయాసంబును వ్యర్థంబుగా నేలయధిగమించెదవునీ వసమీ
క్ష్యకారివి నిరస్తగుణుండవైన నీయందుఁ బరిహాసకరంబైన యీపూ
జనంబపగతకేశంబయిన శిరంబునందుఁ గంకతికయుంబోలె మిక్కిలిన
సంగతంబైయున్న దనికృష్ణుని నిందించి పదంపడి యచ్చటనున్నరాజుల
నందఱం జూచి వారలకు రోషోత్పాదనంబు సేయుచు నిట్లనియె ॥
౨౨౧ ॥ (ఉ) ఓయవనీంద్రులార వినుఁ, డుగ్ర మృగంబులఁ బోలు
మిమ్ముఁగొం । తేయుల నాదరించి కడు,తెంపునఁ గుక్కకుఁ బోలె
శౌరికిన్ । బాయక పూజఁజేసిరిది, పార్థివముఖ్యులకుంబరాభవం ।
బీయతినింద్యపూజను స,హింతురె మానముగల్గుభూపతుల్ ॥ ౨౨౨ ॥
(క) హతపుణ్యుండగుకృష్ణుఁడు । హతవృషభుం డగుటగోఘ్నుఁ,డ
శుచితనువుస । మ్మతినంట రాదురాజో । చిత మానము గొనఁగ



నెట్లు,చెల్లునితనికిన్॥ ౨౨౩ ॥ (క) చనుఁ బాలిచ్చినభామిని । జ
ననీసమయంద్రుబుధులు, స్తన్యము గొనిపూ।తనఁ జంపె నిర్దయుండై।
యనయము శ్రీమాతృహంత, యగునితఁడుర్విన్॥ ౨౨౪ ॥ (వ) మ
ఱియుఁ జపలుండగు కృష్ణుండు శకటమర్దనంబును యమళార్జున
భంజనంబును గోవర్ధనధారణంబును వాత్యాసురవిదారణంబు మొద
లగునేమేకమర్మంబులఁ జేసె నాయాకర్మంబులచేత ధీరచిత్తులగు వా
రికి విస్మయంబేల కలుగకయుండు నదియునుంగాక యుగ్రసేన తన
యుండైన కంసుని పసులంగాచుచు నసుకరంబైన స్వామివధంబాపా
దించె నది పరమాద్భుతం బితండు నరపశువగుటకు సందియం బేమ
ని యిట్లుశాంతవైరి బలభరుండు నసహిష్ణుండు నగు శిశుపాలుండు
నిష్ఠురంబగునట్లుగా దుర్వాక్యంబులు పలికి యప్పుడు నరకపుత్రుని
తోఁగూడ దత్తంబైన పరస్పరకరతాడనంబు గలుగునట్లు తారంబు
గాఁ గృష్ణదోషోద్ఘాటన సమ్మోదంబున నట్టహాసంబు గావించె॥(సీ)
పరుషంబులగు శిశు,పాలుని మాటలువినివాసుదేవుండు, తనప్రతిజ్ఞ ।
కటుహాని గల్గునో, యను భయంబునఁగుపితుఁడు గాఁడు సత్యసం,ధు
నిమనంబు । చలియింపఁజేయనే, జనులకు శక్యంబుయాదవ వీరుల,
త్యాగ్రహంబు । గలిగియు విభుచిత్త,గతి విచారించి చైద్యుని మీఁదఁ
గవియక, యూరకుండి॥ (గీ) రపుడు శౌరియలంఘ్యాత్మ, లపితపా
శ । బద్ధుఁడైవానితొల్లింటి, పాపవాక్య । శతముసటు ద్రోచివుచ్చి
త,త్సమయనింద । నోర్తులన్నియు లెక్కింపు,చుండె నపుడు॥ ౨౨౫॥
(క) కృపణుఁడగు చైద్యుతొల్లిటి । యపరాధ ములనుదలంపఁ, డ
య్యేరమేశుం । డుపకార ములనె తలపుదు । రప కారములను ద
లంప, రార్యులు ధాత్రిన్ ॥ ౨౨౬ ॥ (క) మందాకినితన యుండు
స్వ । నిందన మెన్నకరమేశు,నిందనమునకున్ । డెందమునఁ గనలి.

వాత । స్పందనజలరాశి రవము,చాడ్పునఁ బలికెఁ॥ ౨౭౭ ॥ (చ)
గుఱుతుగ సర్వలోకముల,కుఁ విభుఁడుఁ గడుపూజ్యుఁడైన యు।మ్ము
రపరిపంథి యీసభను, బూజ్యుఁడు గాఁడని యెవ్వఁడుద్ధతిఁ । వెఱ
వక పల్కె-నట్టి యవి,వేకిశిరంబు పయిన్సభా సదుల్ । వరుసనుతింప
నా యెడమ, పాదముఁ బెట్టెద నేఁడు చూడుఁడీ॥ ౨౭౮॥ (చ)
అనియిటుజాహ్నవీ తనయుఁ, డాడిన తద్వచ నార్థమప్పుడే । యను
భవమైన యట్లుకలు,పాకుల మానసులై యితండుతా । మనలగణిం
పకిట్లు దుర,హంకృతి నింతటిమాటఁ బల్కె-నే । యనిపటురోషసం
క్షుభితు,లైరలచేదిప పక్ష భూపతుల్ ॥ ౨౭౯ ॥ (సీ) అతులకో
పారుణీ,కృతమాటచే నీలతారకానుమితోరు, తామ్రనయన । మైన
బాణాసురు,నాననంబుసశంకువగుసూర్యబింబంబు, పగిదిలోక । భీక
రంబగుచు దీ,పించెవికాసిత రక్తతరోగ్ర,నేత్ర ప్రసూన । దీప్రుఁడై
నిజకాంతి, దీప్యమానుండయి యర్యమారుణ దేహుఁ, డగుచుఁజాల॥
(గీ) వెలుఁగు దుమ్రుఁడను నామంబు,గలుగురాజు । రెండవవిషద్రు
మంబుపో,లిక నలరుచు । జనులు భీతిల్లఁ దత్సభా,సదనమందుఁ। జూ
డఁ బడుచుఁ జరించెఁ బ్రస్ఫురణలీల ॥ ౨౩౦ ॥ (గీ) తగననిర్వాణ
వైరాగ్ని, యగుట మిగుల । నంతరాద్రీత విడిచి కో,పా నిలము
న । విహతమై పొగలొందిన, వేణుధారి । చేజ్వలితమయ్యెవృక్షం
బు,చేతఁ బోలె॥ ౨౩౧ ॥ (గీ) ఉత్తరముఁ జెప్ప నోరెత్త,నుత్తమా
జు । రాహువదన కరాళమై, క్రాలు ముఖము । లక్షితాజ్ఞన దం
తమై, యాక్షణంబ । గ్రస్తశశధరమైనట్లు, గానవచ్చె ॥ ౨౩౨ ॥
(వ) మఱియు స్వభావకోపనుం డగుటం జేసి ముఖరాగాది చిహ్నం
బులచేత నిరంతరంబు కుపితుండైన వానిరూపంబు పగిదిఁ జూపట్టు
రూపంబుచేతఁ బరిపంథిలోచన భీషణుండైన దంతవక్త్రుని యట్టు



హాట్టహాసంబు వజ్రాహత శైలతటధ్వని భంగిఁ గుద్ధుండైన వానిఁ
గా సూచింపంజేసె నతిరౌద్రంబైన క్రోధం బాకస్మికంబుగారయం
బునం జనుదెంచి రాజమండలం బాశ్రయించె మఱియు రుక్మియను
వాని హృదయంబునందురుక్మిణీహరణ కాలంబునం జనియించిన సం
తాపవహ్నిభీష్మ వాక్యశ్రవణంబున నభివృద్ధినొంది యధికంబుగాఁ బ్ర
జ్వలించె సుబలుండను రాజుశిథిలీకృతమహామహీధరబంధనయుఁ దీరం
బునందు భూకంపంబువలనఁ జలితజలరాశిసలిలయు నత్యంత భారం
బువలన నమ్రీకృతఫణిఫణామండలయునైన భూమినిగోపావేశంబునఁ
జరణతాడనంబుఁ గావించెఁ జక్రపాణిపూజనంబుచేత రాజులు కుపి
తులగుచుండ నాహుకియనురాజు యుద్ధలాభంబు గలిగెఁగదా యని
మనంబున మిక్కిలి సంతోషంబు నొందెఁ గాలయవనునివదనంబు జగం
బుమ్రింగ నప్పళించినట్లు వివృతం బగుటవలన నతివికృతంబై యతికో
పంబునఁ బ్రతిబద్ధవచనంబైయతిరౌద్రంబై యొప్పె సమస్త రాజుల వ
ధించుటకుఁ బ్రసారితంబైన దీర్ఘబాహువుపరిఘంబుచేత సత్వరంబు
గాఁ బదచలనంబుగావించు వసునామ రాజుచేత నుత్థానవేగంబు వల
న దుర్నిమిత్త సూచకంబుగా స్వకీయాంబరంబు స్ఖలితంబయ్యె॥ (సీ)
అప్పు డిప్పగిది ఘో,రాకార రాజ మండలము కందర్ప సైన్యంబు
పగిది । నవికృతచిత్తుఁడౌ, హరిబోధిసత్వుని యగ్ర భాగంబున, నతి
భయంక । రత్వంబుఁ బ్రాపించె, రమణ ననభ్యస్త సాధ్వసు లగుట
చే,సంగరార్థు । లైన సభాస్థిత, మానవనాథులు శిశుపాలు నకుఁ
బ్రీతి,సేయఁబూని॥ ( గీ ) కనకమయచారు కోటీర, ఘటితరమ్య ।
సాంద్రమణిరత్న కిరణ సం,చలితభిత్తి। కలత నూతన స్ఫటికోరుకాం
తులగుచు । నొండొరులఁ బిల్చికొని లేచి, రుద్రులగుచు ॥ ౨౩౩ ॥
(గీ) స్ఫురితలోచన సుమచలా, ధరదళములు । కంపిత భుజాగ్రశా

ఖలు, గలుగునట్లు । చలిత రోచులచేతఁ ద,త్సదన మవుడు । మా
రుతోద్ధూత వనవిభ్ర,మంబునొందె॥ ౨౩౪ ॥ (గీ) భూరిగర్వావ
ధీరిత, భువనులైన । చైద్యపక్షావనీంద్రులు, శౌరిఁదృణము । గాఁ
గనెంచిరి ధర్మజు,గణనసేయ । వైరివీడిరి భీష్మభ,యంబు మదిని ॥
౨౩౫ ॥ (గీ) అంతఁజేదిపుఁ డహిభంగి, నధికఫూత్కృ । తంబు
సేయుచులోక సం,తాప సహిత । గాత్రుఁడై కీర్ణదంతాగ్ని, కణ
ములురులఁ । బటువిషప్రాయ వాక్యంబుఁ,బలికె నపుడు॥ ౨౩౬ ॥(గీ)
కుంతినందను లేవురు, కుండకులును । వృద్ధరాజ కన్యకయాస,రిత్సు
తుండు । పసులగాపరి శౌరియు, పంద లిపుడు । భూరమణులారవ
ధ్యులు,గారెమనకు ॥ ౨౩౭ ॥ (క) బవరంబున నాయొక్కని । సవి
ధంబుననిల్వలేఁడు స్వల్పపు కార్యం । బవధీరిత సురులగుమీ । రవనిం
దోడ్పడినవెంత, హాలియనమనకుఁ॥ ౨౩౮ ॥ (గీ) భీష్మపార్థులీసభ
యందుఁ, బెద్దఁజేసి । పలికిరీ కృష్ణుని తనితో,బంధురగతి । సమరమొన
రించిచూతము, సాధ్వసాధు । భావమది తెల్లమగువేయు, పలుకులే
ల ॥ ౨౩౯ ॥ (క) తడయక నాతోననికిం । గడఁగిన కృష్ణునిశరీర,
గతరక్తము బ । ల్విడి మదిషపీతశేషము । నుడుగక ధరగ్రోలు విహ
గ,యుతముగఁ గాంక్షుఁ॥ ౨౪౦ ॥ (క) అనియిటు చైద్యుఁడు పరు
షవ । చనముఁబలికి పాండుసుతులు, సాంత్వోక్తులనెం । తనివారిం
చిననిలువక । చనియెన్నిజ శిబిరమునకు, సరభసమలరఁ ॥ ౨౪౧ ॥
(వ) అప్పుడు స్వభావదాక్షిణ్య సంపన్నులును క్షమచేతమహిత మా
నసులునగు పాండునందనులు మహాసంఖ్యాపకారి యగుటంజేసి సద్యో
వధ్యుండైనను క్షమచేతను దాక్షిణ్యంబుచేతను మాతృబంధుత్వంబుచే
తనుయాగార్థ మాగతుండగుట చేతను కృపచేతను శిశుపాలుని యం
దుఁగోపింప కుండిరంతఁ చైద్యనిర్యాణా నంతరంబ చైద్యపక్ష రాజకు



మారులందఱు యుధిష్ఠిరదేవ యజనంబున నుండి యప్రతిహత మనోర
థుండై చనుచున్న దమఘోషజుని వెనుకొని యశ్వమేధీయాశ్వంబు వె
నుకొని చనుతద్రక్షక రాజపుత్రులుం బోలెనతిరయంబునం జనిరి॥ (క)
జవనాశ్వంబులచేఁ జై । ద్యవిభుఁడు రథ్యాంతరముల, నటుదాఁటిచ
నఁ । దవిలి కనుంగొనవచ్చిన । యువతులకోరికలు సఫల,మొందక
యుండెఁ ॥ ౨౪౨ ॥ (గీ) జన సమూహంబు గుమిగూడి, సరణియం
దుఁ । గలసి గుసగుసలాడుచుఁ, గాంచు చుండఁ । జేదిపతివేగ శిబి
రంబుఁ, జేరఁబోయి । బలము సన్నద్ధముగఁ జేసె,బవరమునకు॥ ౨౪౩॥
(గీ) అపుడు శాంఖికసస్య దా,స్యానిలప్ర । పూరితంబయి గిరితట,
మూర్ఛిత ప్ర । తిస్వనంబయి తద్వ్యోథ, తీవ్ర శంఖ । నిస్వనంబదివి
ననమ్యో, నిబిడముగను ॥ ౨౪౪ ॥ (వ) మఱియుఁ గల్పాంతకాల ప
వనప్రేరిత సంవర్తకాది మహాజలధర దారుణ నినాదంబును గం
భీర నిజ రవాంతర్గత గుగు ప్రతి శబ్దాంతరం బగు చైద్యుని
సాంగ్రామిక దుందుభిధ్వని చెలంగె దుందుభితాడ నానంతరంబునస
సంభ్రమ విలోల సకల జన సమూహ సమాకులంబై పరితశ్చంచల
జ్యోతిశ్చక్రంబైన నభస్స్థలంబునకు సాదృశ్యంబు నొందె॥ (గీ) దృఢ
తనుత్రాణధీరులై, తేజరిల్లు । నృపవరులు ధూమ పటలప,రీత మగు
ట । నతిభయంకరమైన మ,హాద్రిసామ్య । మొంది చూపట్టిరప్పుడు,
యుద్ధవాంఛ॥ ౨౪౫ ॥ (గీ) మఱియొకనృపుండు పరిమూఢ,పరిజనం
బు । చేతనాలస్య ముగ సమా, నీతమైన । వర్మమువిలంబ రోషం
బు,వలనఁగరయు । గమున నప్పుడుచూర్ణంబు, గానొనర్చె॥ ౨౪౬॥
(గీ) సమరలాభజనిత, సంభ్రమ సైన్యకో । లాహలాకులిత మ,హా
హవోరు । హస్తియందు యంత్ర,లతి ప్రయాసముగఁబ । ల్యాణమె
త్తిపెట్టి,రతిభరముగ॥ ౨౪౭ ॥ (గీ) ధౌతముఖగత హేమమం, డన

ములందు । విలసదిన మండలములతోట, వెలికిఁబర్వి । నట్టి దర్పంబుగ
లవాన్వియట్లనలరు । నతను దేహాశ్వములు ధాత్రినావరించె॥ ౪౮॥
(గీ) చక్రమండలోత్థ, చటులపరాగాభ్రి । వలయ మధ్యవర్తి, వర
రథములు । సాంద్ర ఘోషభీత, జంతువు ల్గలుగున । ట్లశనుల క్రియఁ
బఱచె, నతిరయమున॥ ౪౯ ॥ (గీ) సంభృతోరశ్ఛదం బౌట,శశక
లాంఛి । తేందు రుచియగు దేహంబు, నొందినట్టి । రాజులుయథా
ర్థసంసిద్ధి, రహిత మధువుఁ । ద్రావి రుత్సాహ వర్ధనా, ర్థముసనతు
లై॥ ౫౦ ॥ (మ) కమలాక్షీమణి భర్తకాసవ మొసం,గన్ సాసవం
బైన కాం । స్యమయాం చచ్ఛషకంబు నెత్తిపసమిం, చన్వాసనార్థంబు
సం । భ్రిమతన్నించిన పద్మగ్రంధము గ్రహిం,పన్వాలు భృంగౌఘ
భా । రమునన్ గ్రక్కున నేల వైచెఁ గరము, ల్గంపంబు నొందన్ర
హా॥ ౫౧ ॥ (చ) అసదృశశోకబాష్పమలినాంబకమై యొక కో
మలాంగిత్య । క్తసరకయయ్యె శీఘ్రిమునఁ,దద్గుణమైనశరీర సాదమ ।
ట్లసకలవాక్యవైభవము, నచ్ఛకపోలము లందు దట్టమై । యొసఁగినర
క్తిమంబును వ,హించె విభుండనికిం గడంగినన్ ॥ ౫౨ ॥ (చ) అని
యొనరింపఁగాఁ జనెద,మంచు యువుల్పలుకన్ దదంగనల్ । ఘనతర
శోకవార్పిహిత, కంఠనిరుద్ధ సమగ్రభాషలై । చనుఁడను వాక్యముల్ప
లుకఁ,జాలక సాంద్ర శుగశ్రుపూర్ణలో । చనములచేత నుత్తర మొ,
సంగిరి భావ్యశుభంబుఁ దెల్పుచున్ ॥ ౫౩ ॥ (చ) కలనికిఁబోవు
చోఁబతులు, గాఢవిశాల మహీధరోల్లస । త్ఫలకసమానవక్షముల,
బంధురపీనపయోధరావృతో। జ్జ్వలతరవారవాణములు, బ్రద్దలువారఁ
గనాత్మపత్నులన్। వలనుగఁ గౌఁగిటం గదియఁ,బట్టిరి కన్నుల నీరునిం
పఁగన్॥ ౫౪ ॥ (చ)విలసనశీలమైనయొక,పీనపయోధర శోక మూ
ర్ఛలోఁ। గలిగియు యాన వేళ నిజ,కాంతజమై షిణిగానఁగన్నులన్ ।



వెలువడు బాష్పతోయములు నించకయుండెనుగాని పోరమే । ల్దలఁ
గఁగ జాఱికంకణ మి, లంబడు టాత్మనెఱుంగ దెంతయున్॥ ౫౫॥
(చ) పొసఁగ నవోఢయోతుఱపతి, పోరికి నేగెదనంచుఁ బల్కిన। న్వ
సమఱిపోయి రమ్మనుచుఁ, బల్కఁగ నేరకయూరకుండి బ ల్వ్యసనము
చేత వల్లభుని , పాదముపై నిగళంబుఁబోలె ను । ల్లసితవినీలపంకజ
ద, శ్చవినేత్రమునించెన త్తఱిన్॥ ౫౬॥(చ)అవశకునాతిభీతిమెయి,నం
బిక పల్కినతఱ నోర్త్తుం। దవిలి వివృద్ధమన్యుఁడయి,తప్పక బాలకుఁ
డెందుఁ బోయెదీ।వవిరళ భంగిఁ దాతయని,యాడఁదదస్ఫుటవాక్య మెం
తయు।న్దవశిఖిమాడ్కి నజ్జనకు,ధైర్యము నీఱుగఁ జేసెన త్తఱిన్॥ ౫౭॥
(సీ)మఱియొకసతిశత,సురలోక గతకామినులసురత సుఖంబుఁ,దలఁచితి
ప్ప । డయ్యప్సరస్సురతా, నంద మదినేఁడె యబ్బినట్లుగ నవ్వె, ద
నుచునీర్ష్య । చేఁబల్కె మఱియొక్క, చేడియప్రాణేశుఁడనికిఁ బో
వుచునుండ, నశ్రుజలము । ధవునకుఁగీడని, ధార్యమాణంబయ్యె నెగ
డుదుఃఖంబున, నిలుపలేక ॥ (గీ) మోచనముఁ జేసెనకపట, బుద్ధులై
న । కాంతలకు సంవరణమెయు, క్తంబు వెలఁది । చెక్కులనుడిగ్గ
నంజన , సిక్తబాష్ప । ధారశోకాగ్ని పదవిచం , దానన్పొ ॥
౫౮ ॥ (చ) బిఱబిఱఁగొన్ని పాదములు, వెట్టిప్రియుండతిశోకసా
దమౌ । తరుణివిలంబిహస్తమునఁ, దప్పక క్రాలెడుకంకణంబులుం ।
దఱుచుగఁ దత్ప్రకోష్ఠములు , దాఁకఁగ జాఱినతన్నినాదము । ల్గర
మదిఁ దుమ్మటంచుతఱిం, గాలముపోవక నిల్చెన త్తఱిన్॥ ౫౯ ॥ (సీ)
వల్లభతముఁడైన, వానిముంగల గాత్రసాదంబు వలన వి, స్రస్తనిర్మ।
లాయతాంశుకయయి , యవనినభంబుననతిరభసంబు గా, నరుగునొ
క్క । రమణిమహిళాల్కతో, సమముగాఁ జూపట్టె జననాథ నికరం
బు, జన్యమునకు । నరుగంగఁ దత్సహ,మరణోద్యతైకమానసయయి

మిగులద్రై, న్యంబునొంది॥ (గీ) యున్నపరిజన స్రవితబాష్పోద మ
య్యు । నోజనిశ్చల స్వాంత భ, టీజనంబు । చిత్తమునఁగాతరత్వం
బుఁ, జెందకుండె । నవనిమతుల కాములకు భ, యంబుగలదె॥ ౮౦॥
(వ) మఱియు నొక్కయువతి పతిదర్శనంబు మఱలం గలుగుట యతి
దుర్లభం బనియెఱింగి యత్యార్తచిత్తయగుచు రణంబునకుం జను వి
భుండు దృష్టిపథంబతిక్రమించు నందాఁక విలోకింపుచుండెమఱియొక్క
యంగన యిప్పుడె యక్షతుండవై సంగ్రామంబుననుండి చనుదెమ్మని
స్నేహయుక్తంబుగా భర్తనుద్దేశించి చేసిన యాశీర్వాదంబప్పుడెవి
గళద్బాష్పమైన యవ్వనితయశ్రుపూర్ణ నేత్రద్వయంబుచేతఁబ్రత్యా
ఖ్యాతం బయ్యెనొక్కవనిత రజఃకీర్ణమై భిన్నవక్త్రేందులక్ష్మియై
దివంబు ననుకరించె మఱికొందఱు యువతులు దిశలుంబోలె వీతశోభ
లై యుద్భ్రాంతసత్త్వలై యంతర్దాహంబు ధరించిరి మఱియుఁ
గొందఱంగనలు వాతసమూహంబులుంబోలెఁ బ్రతిదిశయందుఁ బరిభ్ర
మించిరి మఱియుఁ గొందఱు వరాంగనలు భూమియుంబోలెఁ గంపం
బునొంది రిట్లు మహీపతుల సంగ్రామ ప్రయాణంబునందుఁ గాంతలు
భావికాలాశుభంబు పూర్వంబుననె సూచింపం జేసిరి॥ (మ) క్షితిక
న్యాగిరిజాశచీ సదృశల, క్ష్మీనర్సమాంబాసము । న్నతగర్భోజలశుక్తి
మౌక్తికమణీ, నానావనీపాల సం । స్తుతచారిత్ర మహాప్రబంధకథి
కా, స్తోకప్రభా వోదయా । శతమన్యు ప్రతిమానశౌర్యవిలస, త్సౌం
దర్యపంచాంబకా ॥ ౮౧ ॥ (క) బలవైరిగర్వ భంజన । లలనా
జనచిత్తచోర, లక్ష్మీరమణా । జలజాతపత్రలోచన। కలియుగగో



పాలకృష్ణ, కంసవిదారీ ॥ ౮౨ ॥ (వంశస్థవృత్తము) సదానతా
రాతిప్ర, సాదదాయకా । సదానతోయార్ద్రిల, సచ్ఛయాంబుజా
విదగ్ధకాంతాజన, వీక్షణ స్పృహా । ప్రదాంగసౌందర్యవి, భావనో
హరా॥ ౮౩ ॥

(గద్య)

ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్ష లబ్ధవిద్యాసాంద్ర గోపీనా
థ వేంకటకవీంద్ర ప్రణీతంబైన శిశుపాలవధ మహాకావ్యంబు
నందు సూర్యోదయవర్ణనంబును దత్కాలోచిత నానావిధ
వినోద వర్ణనంబును రైవతకపర్వతంబుననుండి యింద్రప్రస్థ
పురంబునకుం బునఃప్రయాణవర్ణనంబును రథగజహయపదా
తుల గమనవిశేష వర్ణనంబును మాధవుండు సర్వసైన్య సమే
తంబుగా ననేకనదులు పర్వతంబు లుత్తరించు మార్గస్థిత
గ్రామంబు లన్నియు విలోకింపుచు యమునానది డాయం జను
టయు యమునానదీవర్ణనంబు నమ్మహానది నుత్తరించుటయు
హరిరాక విని ధర్మనందనుండు తమ్ములుం దానును సర్వసై
న్యసమేతంబుగాఁ జనుదెంచికృష్ణు నెదుర్కొని రథారూఢునిం
జేసి మహావైభవంబున నింద్ర ప్రస్థంబునకుం దోడ్కొని పో
వుటయుఁ బురస్త్రీవర్ణనంబును సభావర్ణనంబును హరిసభా
సదనంబుప్రవేశించుటయు ధర్మరాజు రాజసూయయాగారం

భంబును యజ్ఞ వైభవంబును ధర్మజుని మహాదార్యంబు
ను రత్నసువర్ణాభరణప్రభృతిదానంబుల బ్రాహ్మణులను ద
క్షిణ వర్ణంబుల వారిని సంతుష్టులం జేయుటయు యుధి
ష్ఠిరుండు భీష్మవచన ప్రకారంబున శ్రీకృష్ణున కర్ఘ్యం
బొసంగుటయు దానిం జూచిసహింపకశిశుపాలుం
డు కోపంబున భీష్మధర్మరాజకృష్ణులనిందించిస
హచరరాజులంగూడిశిబిరంబులకుంజనియు
ద్ధసన్నద్ధుండగుటయుననుకథలంగల
తృతీయాశ్వాసము
సంపూర్ణము.

---

శ్రీరస్తు.

# శిశుపాలవధమహాకావ్యము.

## చతుర్థాశ్వాసము.

(క) శ్రీరుక్మిణీశ చరణాం । భోరుహపూజావిధేయ,భూరి
గుణాలం। కారరసకావ్యనాటక।సారవిశారదసమస్త,జననుతచరితా॥
౧॥ (వ) అవధరింపుమవ్వలికథయెట్లనిన నిత్తెఱంగున వసుమతీపరివృ
ఢులందఱుసేనాసన్నాహంబు గావించిన యనంతరంబ దమఘోషనం
దనుండైన శిశుపాలునిచేతఁ బ్రస్థాపితుండై సమయసముచితోత్తర స్ఫు
రణశక్తిమంతుండైన యొక్కదూతసభాసదనంబున నాసీనుండైన హరి
యొద్దకుం జనుదెంచి ప్రియాప్రియరూపార్థాభిధాయకంబైనవాక్యం
బున నిట్లనియె॥(చ) అరుదుగ మున్నునీవచట,నర్ఘపరిగ్రహణంబుసే
యన । త్తఱిశిశుపాలుఁడెంతయును,దాదృశవిప్రియ ముల్లచించి క్ర।
మ్మరననుతాపముంగలిగి,మానుగఁ దానరుదెంచిరోషసం । భరితుని
నిన్నభీకుఁడయి,మాననసేయఁదలంచె నెమ్మదిన్॥ ౨ ॥ (చ) స్థిరమ
తినున్నసఖ్యుఁడగు,చేదిమహీశుఁడు సత్వరంబుగా । నఱమఱఁబోవఁ
బెట్టిప్రచు,రాధిగతాంగసుఖుండవై ననిన్ । జిరవిపులోరువిగ్రహము,
చేఁదగనిర్దయపీడనంబుదా । నురువడిఁ జేసిసమ్మదము , నొందును
గాకనితాంత మచ్యుతా॥ ౩ ॥ (చ) వలనుగఁ జేరిభూపతిభ, వత్ప

రవంతుఁడు గాననిప్పుడే । తలఁగక సర్వభూపతియు,తంబుగవచ్చిశి
రంబు చేతసాం । పలరఁబ్రణామము న్సలిపి,యచ్చుగఁ దావక శాస
నంబుచాఁ । దలధరియించి చేయునిది,తథ్యమువేఱవిచార మేటికిన్॥
౪॥ (సీ) సన్నియతస్వాంత,శక్తకముఁడవధిశుక్రపతంగతే, జుఁడవు
సర్వ । రాజవిధేయవ,తర్ణనుఁడవు నగునీకుఁబార్థివు లెవ్వరు,ప్రణతి
సేయ । రధికసాధ్వసరహి,తాత్ముండవగుచుఁ బరాభి భూతజనత,
నంచితముగ । నవలంబనముఁజేసి, నందుననరులతోనట్ల సమానుండ,
వైననీదు॥ (గీ) ఘనగుణంబులగణ్యాత్వ,మునుధరింపు । చున్నయవికృ
ష్ణయనుచుని,ట్లొప్పిదములు । గానియప్రియగర్భంబు,లైనప్రియవ।చ
నములువచించి మరలని,ట్లనుచుఁబలికె॥ ౫ ॥ (వ) యదువరాసాధ్వ
సుండవనపత్రపుండవు నతిమాత్రోజ్ఝితభయుండవు ననాస్తికుండవునవి
స్మయుండవుగావునఁ ద్వత్సదృశమహాగుణవంతుం డెక్కడలేఁడు కృత
గోపవధూరతివి వృషఘ్నుండవు విగతపాపుండవునగునీదు భయంకరన
రకప్రతిపత్తియుప్పుడుజనంబుచేత మిక్కిలిఁ బ్రకటింపంబడియె సానుచ
రుండవు గామహీభృద్విహితాపచితివియుబలంబులచేత ద్విషత్సమాహి
తసాధ్వసుండవునయిమహామహీభృదుపరిప్రదేశంబుననున్నమునీ నగరం
బునందలివీథులు ఘనజాలనిభవనజమ్బుగాదినాగ కదంబకంబులచేతఁ బ
రికీర్ణంబులైదురాసదంబులుగాఁ గలవు నీశత్రుండు సకలాపిహితనిజ
పౌరుషుండునునియత వ్యాపద వర్ధితోదయుండును సతత వ్యాధియు
ననీతియునగుంగాక రభసంబువలననుపాగతుండైన చైద్యుని సబలుండ
వుసగదుండవునైన నీవు సమితియందుసంభావించుట కర్హుండవగుదు
వు రణంబులయందు శత్రునిషూదనుండైన శిశుపాలునితోడంగూడి చిర
కాలంబు సహాసర్వసాత్వతుండవై విశ్వస్తవిలాసినీ జనుండవు గమ్ము
ఈశిశుపాలుండు విజితక్రోధుండవు నసకృజ్జిత సంయతుండవు సప్రమ



దుండవైన నిన్నుఁ బురోభాగంబున ముదితుండై విలోకించుగాక యని
యివ్విధంబునంబలికి యూరకున్నశిశుపాలుని దూతనవలోకించి చక్ర
పాణిచేత భ్రూసంజ్ఞాప్రేరితుండై కృష్ణానుజుండగు సాత్యకి యిట్లని
యె॥ (సీ) ప్రణిధిశేఖరనీవు,బహుచతురుండవప్రియగర్భమైనట్టి, ప్రి
యముమధుర । మగునట్లుపలికితి,వదియెమాకిప్పుడు ప్రియగర్భమైన
య,ప్రియమునయ్యె । నరయబాహ్యంబున,కతికోమలంబును నంతరం
గంబున,కాదర్పపద్మ । వృత్తకర్కశమయి,వెలయునీవచనంబు శాక
పలాశదే,శ్యతవహించె॥ (గీ) వీనులకునతిమృదులమై,మానసమున। క
ధికపరుషసూచకమయి,యలరునీదు । వచనమదిపింగళాదిక,పక్షిరుత
ము । కరణిసన్మార్గగతులక, గ్రాహ్యమయ్యె॥ ౬ ॥ (గీ) భూవి
భుఁడు కృష్ణునకునగ్ర,పూజఁజేసె । నందుమత్సరమేలనీ, యధివిభున
కు । మస్తకముననసౌరభ,మహితవృక్ష । సుమమునర్పింప నెవ్వఁ
డు,సూయసేయు॥ ౭ ॥ (సీ) అల్పులమానసం,బతితుచ్ఛమైయుండు
రయమునఁ దగ్గతా,ప్రియమునుచ్చ । రింతురంతర్గతా, ప్రియమును
లోపలనిడుకొని యధికులు,వెడలనీరు । సతతంబు సుజనుండు,సర్వజ
నోపకారపరుండునై యుండు,విపులనతని । యున్నతిఖలురకు,నురుత
రహృద్రోగకారిణియగువిచ, క్షణుఁడు పరుల॥ (గీ) సంపదకసూయ
పడఁడెందు,సంతసించు । మధ్యముఁడు పరజనులసం, పదకసూయ।క
ల్గియును నోటఁ బుచ్చఁడు,కపటి యగుచు । నధముఁ డప్పుడె వెలిఁ
బుచ్చు,నాఁగలేక॥ ౮ ॥ (క) ఫలహీననసతిసుమనః । కులపరివర్జి
తనవార్య,గురుసంతాపక్ । ఖలతనుఖలతనువలెమతి । గల బుధుఁడ
వలంబనంబు,గావించునొకో॥ ౯ ॥(గీ)పరుషములువల్కుచేదిభూ,ప
తికిశౌరి । యించుకేనియును త్తరం,బీయకుండె । వనదనాదంబునకుఁ
బ్రతి,ధ్వని యొనర్చుఁ । గాకహరినక్కయుఖుపులఁ, గలఁక పడునె॥

౧౦॥ (క) మతిమంతులుజితరోషులు । మతిహీనులు రోషజితులు,మ
తివారలకు । స్సతతముసఖ్యమువైరము । క్షితిలో నెన్నఁటికినైనఁ,
జెల్లునెతలఁపన్ ॥ ౧౧ ॥ (క) తరమెఱుఁగకఖలుఁడార్యులఁ । బ
రుషోక్తులువలుకగౌర,వంబది చెడునే । ధరణిరజముపైసోఁకిన। గురు
రత్నంబునకు విలువ,కొంచెంబగునే॥ ౧౨ ॥ (గీ) పరులకత్యంతమో
దసం,పాదిగాని । గుణము గలవాఁడు తుచ్ఛుండు,కోర్కెమీఱ। నన్య
జనులనిందింపుచు,నాత్మజనుల । కెలమిసంతోషమొనఁ గూర్పఁ,దలఁ
చుఁ గాదె॥ ౧౩ ॥ (చ) ఖలురుస్వకీయదోషమధి, కంబయినన్సహ
జాంధలోచనుల్ । తొలఁగక సూక్ష్మమైనపర,దోషమునందునుదీర్ఘ
లోచను । ల్పలుమరునాత్మసంస్తవప,రత్వమునందు గభీరభాషణుల్।
నలువుగ నన్యసంస్తవమొ,నర్చెడు నప్పుడు మౌనులెన్నఁగన్॥ ౧౪ ॥
(గీ) ఆత్మసుగుణంబులను బోలె,ననవరతము । పరులదోషంబులెవ్వి
యుఁ,బలుకరార్యు । లాత్మయందెసంగోపన,మాచరింతు । రల్పబు
ద్ధులువిపరీతు,లగుదురెందు॥ ౧౫ ॥ (ఉ) విక్రమవంతుఁడైనపృథి, వీ
పతిక్రూరవిషాహిభంగిని। ర్వక్రతవైరిమీఁదఁ దఱి,వచ్చినయప్పుడుచూ
పుశౌర్యమున్ । విక్రమహీనుఁడెప్పుడును, వెంబరవిత్తునుబోలి కార్య
హీ । నాక్రమవాక్యముల్సభల, యందఱచుంబటహంబుచాడ్పునన్ ॥
౧౬ ॥ (గీ) అఖిలలోకైక విఖ్యాత , మగుటచేతఁ । దనగుణంబును
దాఁజెప్పి, కొనఁడుసాధు । వర్యులెవ్వారెఱుంగని,దగుటఁ జేసి। తన
గుణంబునుదాఁ జెప్పు,కొనుఖలుండు॥ ౧౭ ॥ (చ) సరసతసంధి సే
యుటకొ,జన్యమొనర్చుట కోయదూత్తమున్ । బరువడిఁజూడఁ గో
రెశిశు,పాలుఁడటంచు వచించితీవు సు । స్థిరముగదాని కవ్విధము,సే
యుటయుత్తర మింకజాగువ । ల్దరుగుము వచ్చినంబిదపఁ,దార్థిత
కార్యము చక్కనయ్యెడిన్॥ ౧౮ ॥ (చ) చతురతమీవిభుండు దగ,



సంధి యొనర్చుట సిక్కమేని సం । భృతమతి యుద్ధసన్నహన, మే
టికిఁ జేసె మహాత్మశౌరి ను । ద్ధతి వెఱపింపఁ జేసె నొకొ, తన్మహి
మంబెఱుఁగండె వ్యర్థమీ । యతులప్రయాసమంతయు భ,యంపడు
నేహరి యింతమాత్రకున్ ॥ ౧౯ ॥ (ఉ) పండితమానియైన శిశు,
పాలుఁడు శౌరిసమక్షమందుఁదా । మెండుగ దుష్టవాక్యములు,మిన్న
కపల్కి శతాపరాధము । ల్నిండిన దాఁకఁబైఁ దెగుట,నీతియుఁ గా
దనియోర్చె నన్నియున్ । నిండెఁ గొఱంత లేదిఁకన, నిన్వధియింపఁగ
లాఁడు చైద్యునిన్ ॥ ౨౦ ॥ (గీ) వినుమగణ్య గోపురా, ననుఁడ
వీవు । పలికిన దురుక్తిసమయంబు, గలయవచ్చు । నంతవాఁక రో
షానలు, నడ్డగించె । నింకఁ బలికిన దండ్యుండ, వీవు నీచ ॥ ౨౧ ॥
(గీ) శినిమనుమఁడిట్లు పలుక నా,చేదినాథ । వాక్యహరుఁ డతి దుష్ట
త,ద్వచనము విని । త్యక్తసాధ్వసుఁడైనేర్పు, దనర మరల । నిట్టు
లనిపల్కె వినయంబు, నెసకమెసఁగ ॥ ౨౨ ॥ బుద్ధిశూన్యుఁడైన,
పురుషుండు పరులచేఁ । జెప్పఁ బడిన యంత, చేయఁజాలఁ । డూ
హచేసి కొన్ని, యుక్తులు గల్పించి । చెప్పె ననుట చాలఁ, జిత్రమ
రయ ॥ ౨౩ ॥ (గీ) అరయ సువివేకి యాగామ్య, నర్థములనె।
ఱుంగుఁ దనయంతఁ దానె ప,రుండు చెప్పఁ । దెలిసి కొని విశ్వ
సించుఁ దాఁ, దెలియ లేఁడు । పరుఁడు చెప్పిన వినలేఁడు,బాలిశుం
డు ॥ ౨౪ ॥ (వ) యదువరా యేనిప్పుడు సంధియగుణంబని యు
విగ్రహంబనర్థంబనియు నెయ్యది పలికితినవ్వచనంబు నీకునుగుశలంబగు
సుజనులుప్రబల విరోధంబువలన స్వవినాశహేతుభూత కార్యకరణా
ద్యుక్తులైనపగతు రయందును హితోపదేశతత్పరులగుదురు నాచేతస
ముదీరితంబులైన యీరెండు పక్షంబుల లోన నీకునెయ్యది శుభోద
ర్కంబగుదాని విభజించి కావింపుము సుజన స్వాభావ్యంబువలన సు

భాషితంబైన హితోపదేశవచనంబు దురాగ్రహగ్రస్త చిత్తులగు వారి
యందు సూర్యానురక్తంబులగు పద్మాకరంబులయందుఁ జంద్రకిరణ
జాలంబులుంబోలె నిరర్థకంబగు మఱియు॥ (సీ) పార్థివోత్తమ శిశు,
పాలునివర్జించి భీమాగ్రజుఁడునిన్నుఁ, బెద్దఁజేసి । పూజించెఁ గావు
నఁ,బుడమిలో గుణదోషములు విమర్శింపక, మూర్ఖ జనుఁడు । తన
యిచ్చకొలఁదిఁ గ్ర,న్ననజేయు నను మాటకిదియె ప్రమాణమై,యొసఁ
గుఁగృష్ణ । తలఁప నీపైభక్తి, గలయమసుతునిచేఁ జేదీశ్వరుండుపూ,
జింపఁబడక॥ (గీ) యున్ననేమి యన్న, రోత్తముండె గురుండు ।
పరఁగమాంస లుబ్ధ,హరివిసృష్ట । మత్తకరి శిరస్థ, మౌక్తిక రత్నం
బు । లోకపూజితంబు, గాకయున్నె॥ ౨౫ ॥ (గీ) అమలుఁ డమ
లురచేఁ బూజ్యుఁ,డై వెలుంగు । మలినులగు వారిచేనధః, కలితుఁడ
గును । శివుఁడు శిరమున ధరియించె, దివిజనదిని । హరిపదంబునఁ
దాల్చెఁబ్ర,త్యక్షమిదియ॥ ౨౬ ॥ (గీ) అజ్ఞపార్థ కృతార్ఘ్యప్ర,హ
ర్షితుఁడ । వైననీకెట్లు గలుగుయో,గ్యత సహామునఁ। బ్లవగసేవిత
కాకఫ,లంబులుష్ణ । తనువహింప వెన్నటికైన, వనజనేత్ర॥ ౨౭ ॥
(వ) యాదవేంద్రా నీవుశిశుపాల కృతాపరాధశతంబు సహించియు
న్నవాఁడవని శినివరుండుపలికెనది యొక్కఘనంబుగాదు రుక్మిణీహర
ణంబునందుఁ జైద్యుండు సమర్థుం డయ్యునసేక శతాపరాధ తుల్యం
బై వభవత్కృత మహాపరాధంబు సహించి యున్నవాఁడు రాజులకు
రాక్షస వివాహంబు ధర్మంబగుచుండ నది యపరాధం బెట్లయ్యెనని
యంటివేని॥ (శ్లోకము) హత్వాచ్ఛిత్వాచ భిత్వాచ,క్రోశంతీం రుద
తీంతథా । ప్రసహ్య కన్యా హరణం, రాక్షసో విధి రుచ్యతే ॥
యను న్యాయంబునఁ గన్యాహరణంబు గావించిన నదిరాక్షస వివా
హంబనంబడుఁ బితృమాతృ భ్రాతాదులచేత దత్తయగుటంజేసి స్వ



జనబంధుండైన శిశుపాలునకుఁ బత్నియైనరుక్మిణి నపహరించుట వల
నఁబరిత్యక్త ధర్మార్థుండవై కేవల కామమాత్రనిష్ఠుండవు పరదారాప
హారకుండవు బంధుద్రోహివి రాజ ద్రోహివైతి విదిపరమ సాహసి
కత్వంబు నీవజ్ఞాత రూప విశేషుండవు సర్వ గతుండవు పరభృతపక్ష
కాంతివట్టినీకుఁ దిమిరంబునకుం బోలెఁ జైద్యుండు సూర్యుండునుంబో
లెవినాశకరుండగు నట్లుగాకుండ నేనైన సాంత్వవాక్యంబుల మహాక్షు
భితుండైన శిశుపాలునకుఁ గోపోపశమనంబుఁ జేసినీయం దనుగ్రహం
బుగలుగునట్లు చేసెదనంటి నేని వేలనతిక్రమించి వెల్లివిరిసి వచ్చుసము
ద్ర ప్రవాహంబును జగత్కృత జల నిర్గమమార్గంబేమి సేయంగలదు
యుద్ధంబు కొఱకు యాదవ సహితంబుగా నిన్నాహ్వానంబు సేయుట
కేను చైద్యునిచేఁ బ్రేషితుండనై వచ్చినవాఁడ మహావీర్యులగు మహీప
తులు పరులయందుఁ జాటచ్చరుల కరణిఁ గపటంబుచేత నపకారంబు
గావింపరమ్మహీపతిరణార్థియై మహానదీప్రవాహంబు భంగివచ్చుచున్న
వాఁడునీవుతీరగత వృక్షవృత్తి నాశ్రయింపక వేతస వృత్తినాశ్రయించి
నిన్నురక్షించికొనుము॥ (చ)పరువడిఁ జేదిభర్త శిశు,పాలుఁ డతండు
మఱుంగుసొచ్చినన్ । దరుణులఁ బ్రోచునేయని మ,నంబునఁ జూడకు
మమ్మహీసుధా । కరుఁడు దయాసముద్రుఁడటు, గావునఁ దన్శరణం
బునొందినన్ । దరుణుల నైనఁబ్రోచునతి, ధార్మికుఁడాతని కెవ్వరీడి
లన్॥ ౨౮ ॥ (చ) చతురత స్వార్థలిప్సులగు, శాత్రవులెక్కుడు వా
నికిన్నము । ల్చితగతి విప్రియంబుదగఁ, జేయక యుండరు శంకచేత
న । ప్రతిమగుణాకరుండు శిశు,పాలుఁ డుదారుఁడు గానసీవునం ।
చితమతిభక్తితోఁ బ్రణతిఁ,జేసిన మాత్రనె ప్రోచు సత్కృపన్॥ ౨౯ ॥
(చ) వినునవు డప్రియంబులయి, వీనులుసోఁకిన పల్కులవ్వలన్ । మ
నసుఖమిచ్చుఁ దావినెదు, కాలము నందు నతిప్రియంబులై । తనరిన

పల్కులావెనుకఁ, దద్దయుదుఃఖ మొసంగునాదు వా । క్యనిచయమ
ట్టిదైయెసఁగుఁ, గైకొనిచేయుము సంధి రాజుతోన్ ॥ ౩౦ ॥ (గీ)
అనృతవచనంబు ప్రియకర, మైతనర్చు । సత్యవచన మప్రియ మయి,
చాలఁదోఁచుఁ । గడఁగి యీ రెండుపరిణామ, కాలమందు । గరళ
పీయూషసమములై, కానుపించు ॥ ౩౧ ॥ (సీ) అచ్యుత నీవనే,కా
రాతిహంతవైనను జైద్యుఁడాజిలో, నినువధించు । నిక్కవంబిది స
ర్వ,నిబిడతమో ధ్వంసియైన సూర్యునిరాహు, వనెడుతమము । మ్రిం
గెనోలేదో చ,ర్చింపుము జితమీనకేతనుండును రాజ,శేశ మణియు ।
వృష్ణిభోజకనమ, స్కృతుఁడు సర్వజ్ఞుండు నాహవతల నిర్జి, తాంధ
కుండు॥ (గీ) నాత్త రాజర్ష భుండుదు,ర్గాధి పతియు । మేరుసార
శరాసుండ, మేయ విష్ణు । సాయకుండయి కాలాగ్ని, శంభులీలఁ ।
దనరుచైద్యునిఁ గెలువనీ,తరమె కృష్ణ॥ ౩౨ ॥ (వ) మఱియుఁజేది
విభుండు నిహత దుర్మదకుంజరుండును గ్రమ సంపాదిత భూరియ
శుండునగుహరివలన భయంబునొందఁ డట్టిచైద్యునకు వృష్ణు లెంతవా
రలురణంబులందు శత్రువులు భయంబుననతని వదనంబు వీక్షింపం జా
లరనుటయెంత యాశ్చర్యంబతండు భయంబునఁ బలాయమానులగుప
గతురశరీరపశ్చాద్భాగంబు విలోకించుంగాని యొకానొకప్పుడైనవద
నంబువిలోకింపఁడు శరదృతునధిగమించి ఖండితేంద్ర చాపంబులై య
త్యల్పస్ఫురితకాంతులైన మేఘంబులు శరవృష్టి శూన్యంబులగుటం జేసి
యాశిశుపాలుని శత్రువులతోడ సామ్యంబునొందు మిక్కిలిఁ గర్కశం
బునుసమరార్థంబా కృష్టంబునగుచు క్షణకాలంబా శంకిత భంగంబైన
యెవ్వానిశత్రుకులంబు కార్ముకంబుతోఁ గూడనమ్రత్వంబు నొందుమ
ఱియునవేకవారంబులు సంగ్రామ రేణువులచేత మలినంబగుటం జేసి
పరిపంథిజనాంగనా బాష్పంబులచేత క్షాళితంబై యనంతరంబెవ్వ



నిచరణయుగళంబునకు నమస్కారంబు గావించునట్టి రాజుల కిరీటగత
మణికాంతివర్ణకంబులచేత విలేపనంబు గావింపంబడు మఱియుఁగు
శలురైన యింద్రజాలికులచేత సంజనిత దృష్టివిపర్యయులై యొక్క
టియైన రజ్వాదికంబును గొందఱు పుష్పమాలికనుగాఁ గొందఱు స
ర్పంబునుగా నెట్లుగనుఁ గొందురట్ల నాచైద్యుని సుహృజ్జనంబులు ప
రమాహ్లాదకత్వంబునఁ దుహినాంశునిఁగాఁ గొందఱువిరోధులు తా
పకరత్వంబువలనఁ దపనునిఁగాఁ దలంతురు మఱియును॥ (గీ) తొడరి
యెవ్వాని పగతురు, దుర్లభత్వ । యంబుఁ బ్రాపించి మఱియునే,
కాంతరతము । నగు నమానుషాంగము దాల్చి, యవనినడుగుఁ। బె
ట్టకసురాభులైయుండ్రు, పెంపుతోడ॥ ౩౩ ॥ (సీ) పరఁగ నత్యై
శ్వర్య, కరపౌరుషుండైన చైద్యున కెవ్వాఁడు, జగతివైరి । నృపుఁడు
లేఁడత్యక్త, నీతిమార్గుండైన యతఁడెన్నఁ డరులచే,నాహవమునఁ।
గడుపరాభవ మెఱుం,గనిశత్రురాజుల నాశంబు నొందించె, నయమె
లర్పఁ । బ్రచలితోర్ధ్వగతోరు, బహు కబంధంబులు జ్వల మకర
వ్యూహ, సన్నిరుద్ధ ॥ (గీ) పదవులైనట్టి విలసద,పార ఘోర । భూ
రిసంగ్రామ సాగరం,బులు తరించె । భీషణోదగ్ర నిజభుజ,వీర్యగా
థ । తరణిచేఁ బెక్కుమారులా,ధరణి విభుఁడు॥ ౩౪ ॥ (చ) కర
మరుదారనే నృపతి, గర్వితుఁడై తనయుత్త మాంగమా । నరపతి
పాదపీఠమున, నమ్రితఁ జేర్పక యున్న సత్కృపా । పరుఁడటుగా
న నేరమును,భావమునం దలపోయ కత్తఱిం । బరువడి నాత్మపాదని
ఘ, వాని శిరంబున గర్వహీనుఁడై॥ ౩౫ ॥ (గీ) పరఁగఁ జైద్యుండు
చతురంగ, బలము విడిచి । యురుభుజద్వయకేవలా, యుధుఁడునయి
పు । రందరుని దంతితోఁ జతు,ర్దంత యుద్ధ । మర్థిఁ గావించె
నతనికీ,డగుదె నీవు ॥ ౩౬ ॥ (సీ) పొసఁగ విచారిత, భూరి చక్ర

త్వంబు చెలువొప్ప శ్రీసమా,శ్లేషణంబు । చైద్యునకునునీకు, సరియ
గు నీ రెండు నైనభేదం బించు, కంత కలదు । ఇంద్రి శత్రుఁ డతం
డు, నింద్రానుజుండవీ విదియ భేదంబు మీ,కిరువు రకును । జేదీశు
తో సాటిఁ, జెప్ప నెట్లగు నిన్ను భవు నైన సాటి, జెప్పంగ రా
దు ॥ (గీ) భూతి ధరుఁడును సదహీన, భోగ యుతుఁడు । నే
కరిపు పుర విధ్వంసుఁ, డీశుఁ డితఁడు । నైన శశికళ గోరున,య్యీ
భవుఁ డితఁడు । పూర్ణ చంద్రుఁడై పొల్చుఁ, బుడమియందు॥
౩౭ ॥ (సీ) మఱియునా చేది భూ,వరుఁడు వర్షాకాల తటిని పూర
ము తట, తరులతోడఁ । బోలె నమ్రములుగాని, భూమీశ్వరులతోడఁ గే
ళిసల్పుచునుండు, లీలతోడ । మధ్య రంధ్రముసొచ్చి, మండలభేదంబు
గావించి దళములు,గాసి పఱిచి । మూలంబు లెల్లను,న్మూలించిభూ
ప్రసారిత భుజశాఖలు, వ్రేలునట్లు॥ (గీ) బలముచేఁ దలక్రిందు గాఁ,
బడఁగఁద్రోచి । వేగనమ్రత నొందిన,వేతసాది । కములవృద్ధి నొం
దించుచుఁ, గ్రమతనిట్లు । క్రీడగావించు సతతంబు,ప్రీతితోడ॥ ౩౮ ॥
(వ) మఱియు శిశుపాలుని పక్షావరోధస్త్రీలధిరూఢ నితంబభూము
లునుగురూపల పఙ్క్తిశాలినులును నిరుద్ధ నిరంతరాంబరలును సంత్య
క్తమేఖలలును నవముక్తాఫల భూషణచారు భుజోప లక్షిత కటకలు
ను విశాలగండతల చిత్రక నియతాభి యోగ ధారిణులునునై తొల్లి
గృహంబులందుం బోలె నాపత్కాలంబులందును బర్వతో పరిభాగం
బులందుసమస్తంబు నిప్పటికి ననుభవింపుచున్నవారు॥ (గీ) ఘనతమీ
అంగఁగుకురాంఘ, కద్రుమముల । నెగడు దవశిఖిచందాన, నీఱుఁజే
సి । యునుమహీనాథ వర్యుఁడీ, యుర్వినిపుడ । కృష్ణుఁగావింపఁద
లకొనె, నిచ్చనహహ ॥ ౩౯ ॥ (గీ) అరయఁ బ్రమితాక్షరయు న
య్యు,నఖిలవిషయ । మధిగమించి ప్రతిష్ఠిత,మగుచు గరిమఁ । బా



లిచితదాక్ష్య పరిభాష, లీలనొందు । మిగులబాధింప బడకుండు,జగ
తియందు॥ ౪౦ ॥ (వ) తొల్లిపురాణ పురుషుండు ధృతవరాహశరీ
రుండై హిరణ్యాక్షాది రాక్షస దంష్ట్రాక్షతమైన యీధరిత్రిని ము
హూర్తమాత్రంబు ధరించెనిప్పుడు సంహృతసకల విపక్షుండైనయీ
రాజుచేత ననుపద్రుతమైన యీధరిత్రిని జిరకాలంబుననుండి ధరిం
చి యున్నవాఁడీ యిరువురలోన నధికుం డెవ్వండో విచారింపుము
మఱియు నమ్మహారాజ గుణతరంగంబులును సముద్ర తరంగంబులును
రెండు ననంతంబులై మిక్కిలిఁ దుంగత్వంబుధరించి యుండు నైనను
సముద్రమహోర్ములు తీరంబు ప్రాపించి నశించునారాజ గుణమ
హోర్ములు పారంబు నొందియు నశింపకుండు నట్లగుటంజేసి స
ముద్ర మహోర్ముల కంటె నారాజగుణమహోర్ము లాధిక్యంబు
నొంది యుండు ॥ (సీ) యాదవనాథలో,కాలోకరుద్ధ విహార మా
టనదృష్ట,మైన దుస్స । హార్కతేజంబు లో,కాగ్ర మందుచ్చా వనీ
భృత్తులను దాఁట, నేరదయ్యెఁ । జేదీశు తేజో వి,శేషంబు పశ్యజ
నాగ్రి మందతి ధృష్ట,మైసమస్త । భూభృత్తులందు సం,పూర్ణమై
వ్యాపించె హరికన్న నతఁ డెక్కు, డగునో కాఁడో ॥ (గీ) యతని
పరిపంథి యువతులు, గతపటీర । యావకాంజన మేఖలా,హారత
నువ । రాధగాక్షి నితంబకు, చాఢ్య లగుట । వలన నిత్య విభూ
షలై, యలరు చుండ్రు ॥ ౪౧ ॥ (చ) అతులిత శౌర్యశాలి య
గు, నాశిశు పాలుఁడు పోరిలోననిక్ । జతురతఁ జంపిరోదనము,
నచుఁ భవత్పతి బాల పుత్రిలక్ । సతతము వైరము న్విడిచి,
సత్కృపఁ బాలన మర్థిఁ జేయుచుక్ । క్షితి తల మందు సార్థ
ముగఁ, జేయును బో శిశుపాల నామముక్ ॥ ౪౨ ॥ (చ) అల
యక నిట్లు వాగ్మియగు, నా శిశుపాలుని దూత దిట్టమై । బల

సి యుగక్షయ క్షుభిత, వాతమహత్తర మైన వాక్యముల్ । బలికి
నఁ దత్సదంబు తద, పాంనిధి సన్నిభమై రహిల్ మహా । ప్రళయ
సముద్యతంబగుచు, బంధురకోపముఁ బూనెన త్తఱిల్॥ ౪౩ ॥ (ఉ)
అనుపమ రాగయుక్తయు స్రుతాంచిత ఘర్మయుసత్కరాహతి। స్వ
నితపృథూరుపీఠయును, సంతత దంత విదంశి తోష్ఠమై । తనరెడు
సాంద్రరుడ్వనిత, తప్పక నప్పుడు సర్వరాజుల । స్మనుకొని యావ
రించెఁగడు, మోదమునం బ్రియురాలివై ఖరిల్॥ ౪౪ ॥ (ఉ) సా
రకరోదరప్రహత, సాంద్రమహాభుజుఁ డౌటభగ్నకే । యూరుఁడు
నైనకృష్ణుని స, హోదరుఁడౌగదు నందు నుత్పత । చ్చారుతరాబ్జ
రాగవిల, సచ్ఛకలంబుల చేతఁ జూడ్కికిం । పారఁగఁ దోఁచెఁ గో
పశిఖ, యగ్ని కణాన్విత మైనచాడ్పునల్॥ ౪౫ ॥ (మ) బలరాముం
డుసముల్లసద్దశన శుం, భద్దీధితుల్పర్వఁగాఁ। బొలుపారంగ నవజ్ఞ చే
తహాసనం, బుంజేసి తత్కాంతిచే । వలనొప్ప న్ఘనకోపరక్తతనువు,
న్బాగొప్పఁగా వెండియు । జ్వలతల్ శుభ్రము సేయుచుం దనరెఁద
త్సౌధంబుగంపింపఁగల్॥ ౪౬ ॥ (వ) మఱియు నుల్ముకుండను రాజు
సముత్పతత్పృథుతర ముక్తాకలాపంబుగల్గునట్లుగా గిఱుక్కున దూత
కభిముఖంబుగాఁ దిరిగినఁదద్వివర్తనంబువలనజగం బంతయు బహుళశి
లాతలకఠినస్కంధఘట్టనంబువలన భ్రమితం బైనదాని యట్లఁ జూడం
బడియె నత్యంత కుపితుం డైన యుధాజిత్తను నృపతి వదన సరో
జంబు నిశ్వాసమారుతాహతుల చేతఁ బ్రకటోష్ఠ్యం బైన సూక్ష్మప
టాంచలమారుతంబులచేత నతిశీఘ్రవీజ్య మానంబయ్యెను వెండియు
మిక్కిలిస్వేదోదకంబు స్రవింపుచుండె మఱియుశత్రువధార్థంబుసము
ద్యతుం డైనవాఁ డగుటంజేసియత్యంత క్రోధుండును నప్రతీకారుండు
నైననిషదాఖ్యుండగు మహీపతినిదక్షాధ్వరధ్వంసనార్థం బావిర్భూతం



బైన యనౌషధతీవ్రరుద్ర సంబంధి వీరభద్రరూప మహాజ్వరంబునుం
బోలె జనంబువిలోకింపుచుండె మఱియు సుధన్వుండను రాజత్యంత
కోపంబునఁ బరస్పర పీడితకరద్వయుం డై పరిపిష్టకాంగుళీయకసువర్ణ
చూర్ణంబుచేతఁబంకిలంబైనదానియట్లకరద్వయజన్యనిరంతరవిస్రావస్వే
దోదకంబులచేతక్షాళితంబయ్యెమఱియునాహుకియనురాజుప్రసారితా
గ్ని జ్వాలోజ్వలనఖప్రభలచేతఁ గృతపరిధిశోభ యగుటంజేసి పరిభ్ర
మత్పావకాలాత సంస్థానమైన తర్జనిని జగంబంతయు దహించుట
కుంబోలెఁ బరిభ్రమణంబు నొందించె మఱియుఁ బ్రద్యుమ్నావతారుం
డైన కాముండు దురంత కోపరసదునిరీక్ష్యుం డగుటంజేసిహరుండు
ను బూర్వజన్మంబు నందభ్యస్తదహన సాహసంబైన తృతీయ నేత్రం
బున నప్పుడాప్రద్యుమ్నుని విలోకింప శక్తుండు గాఁడయ్యెమఱియును॥
(సీ) పృథుఁ డనుభూపతి , ప్రథనంబు కాంక్షించు వాఁడౌట నదిడా
యు, వచ్చెననుచుఁ । గడుసంతసంబునఁ, గఠినకర్కశసతీ స్తనతలప్రో
ముషిత, చందనంబు । గలనిజవక్షంబు, కరతలతాడనం బొనరించె న
క్రూరుఁ, డనఘుఁ డయ్యె । నతితీక్ష్ణమైన దూ, తాలాపములు వినిర
హీనతిక్రాంత మ, ర్యాదుఁ డయ్యె॥ (గీ) నప్పుడచటి జనము, లక్రూర
విక్రియా । వీక్షణమునవిలయ, వేళభూరి । వాతచలితఘోర , వసు
ధాధరోన్నత । శిఖరమనుచు విశ్వ, సించిరపుడు॥ ౪౭ ॥ (చ) మ
దకలుషీకృతాక్షులను , మాటికిఁ ద్రిప్పుచు స్థూలదీర్ఘబాహ । స్తదళి
తమేదినీకృత వి , శాలపటుస్వనుఁడై రహిన్గృతా । స్పదపటుకోప
లోహిత వి, భాప్రవిభాసిత దేహుఁడై ప్రమో । దదుఁడు ప్రసేనజి
త్తలరె, ధాతువిభూషిత భూధరాకృతిల్॥ ౪౮ ॥ (చ) గుఱుతుగ
సాంద్ర రక్త నవ, కుంకుమలిప్తశరీరుఁ డౌటచేఁ । బరిణత దాడిమీ కు
సుమ, భాసురలోహితకోప సాత్త్విక । స్థిరతరవారి బిందువుల, చేఘ

నవైరవిభిన్నగాత్రజ । స్ఫురదురు రక్తసిక్తుఁడగు, పోలికనొప్పెఁగ వే
షణుఁడొగిన్॥ ౪౯ ॥ (చ) చటులతరాధికోపవిల, సచ్ఛిని పాదత
లాభితాడన । స్ఫుటితభవన్మహీ వివర, పుంజ వితీర్ణబిలంబులై జ
నో । త్కటకరముగ్రసాతలము, తప్పక చొచ్చి యొకింత తాపసం ।
కటమునెఱుంగ నట్టియుర, గంబులకుం గలిగించెఁ దాపమున్॥ ౫౦ ॥
(ఉ) మానుగ సారణోర్వీపతి, మాటికిఁ గోపవశంబున న్శిరో। ధూ
నన మాచరింపశిఖి, తుల్యతదగ్రసువర్ణ సత్కిరీ । టానుగతోరు ర
త్నరుచు, లాజికి సేగెడు రాజరాజికిన్ । జానుగ భవ్యదీపము లొ,
సంగినభంగిఁ జెలంగె నయ్యెడన్॥ ౫౧ ॥ (చ) వితత బృహద్భుజా
లతుఁడు, వీరవరుండు విదూరథాఖ్యభూ । పతియొకమాటఁ జెప్ప
టకు, వారక విచ్చినపాటఁ జంచలో । న్నతరసనాగ్రమైనలప, నస్ఫు
టకందర మొప్పె భోగిసం । యుతవన వృక్షకోటరము, నొప్పున న
ప్పుడుభీకరాకృతిన్॥ ౫౨ ॥ (గీ) శాత్రవోక్తులనిట్లుత, త్సదనమపు
డు । క్షోభమొందుచునుండము, కుందమాన । సంబుగలఁగదువారి
ద, జలముచేతఁ । గంధిజలమించుకైనను, గలఁగ నట్లు॥ ౫౩ ॥ (గీ)
పరుల నిందించుటయుఁ దన్నుఁ, బ్రస్తుతించు । కొనుటఖలురకు భువి
నైజ,మని తలంచి।యుద్ధవుఁడు కోపమూనక యుండెనతని।ముఖముస్మి
తయుక్తమైచంద్రుఁ, బోలియుండె॥ (వ) ఇట్లుప్రకటిత ప్రకోపులైన
యాదవులచేత శిశుపాలప్రేషిత వచోహారకుండు నిరాదృతుండై వె
ళ్లనంజనిన యనంతరంబ దుస్సహ స్వనభయానకంబులైన యాన
కంబులు గలహారిబలంబు తత్క్షణంబ యుద్ధసన్నద్ధంబయ్యె యదునరేం
ద్రులు కవచధారణంబు న్యాయంబని యనేకవారంబులుభగ్న ప్రతిప
క్షాయుధంబులును బరాక్రమానురూప ప్రకర్షవంతంబులు నద్రికట
కనిర్భరంబులు నసంత్యక్త శౌర్యదంశనంబులునగు శరీరంబులయందుఁ



గవచ ధారణంబుగావించి రయ్యవసరంబున నైశ్వర్య వంతులైన రా
జులసంగ్రామ శ్రవణంబువలన రయంబుననుపచయంబునొందిన శరీరం
బునం దన్యులచేత క్షణమాత్రంబైన దుర్భరసంతోషంబులంతరంగంబు
ను నెట్లువిడువవయ్యెనట్లు బహిఃకంచుకంబులు విడువవయ్యె నప్పుడు
క్షుథాదిసన్నాహసహితంబైన దురంతదంతావళగణంబును రథగుప్తి
సహితంబులైన రథంబులును బల్యయనాదిసన్నాహ యుక్తంబులైన
హయంబులును దమయంతంచామ త్వరాయుక్తంబులైనను మహీభృ
త్తులు హస్త్యాదినియుక్త పురుషులను సారెసారెకుఁ ద్వరసేయుచుండి
రంత స్వభావసుందరమూర్తియుసంగ్రామంబులయందు భీమదర్శనుం
డు నగుమధుసూదనుని ప్రకృతిమనోహరంబులును రణంబులయందుభ
యప్రదంబులు నధిదేవతాయుక్తంబులునపాయులునైనశార్ఙ్గచక్రా
ద్యాయుధంబులుపృథగవస్థిత స్వశరీరంబులుంబోలె సేవించెనప్పుడు మ
ధుసూదనుండు ద్వివిధంబునై మహీభృత్కటకాంతరంబులం దనేకవా
రంబులురణంబులందు రాక్షసశోణి తాప్లుతనేమియైన రథంబప్రతిహ
తంబగునట్లుసన్నిహితంబైన దానినారోహించె నంతలోన నిజప్రభాక
పిశీకృత హరిన్ముఖుండగు గరుడుండు ధ్వనద్గురుపక్షమారుతంబు గలు
గునట్లు దివంబుననుండి వచ్చి ధ్వజదండాగ్రంబునఁ బదంబుంచె నంత॥
(చ) శరదగభీరతావిజిత, చారుమృదంగనినాదయున్నత । స్ఫుర
దరిహంసహర్ష యగు, శ్రోత్రమనోహర నాదసంపద । న్వరుసఁబ్ర
తిధ్వనుల్సలుపు, బర్హవిభూషితబర్హిపఙ్క్తికి । న్సురుచిరసంతసం
బొసఁగు, చుంజనెఁ దద్రథమంచితంబుగన్॥ ౫౫ ॥ (సీ) సాంద్రని
రంతర, స్థగితదిగంతరంబైన తమ్పూరిసై, న్యమునుజూచి । జనము
ప్రక్రాంతవి, స్తారమహాపూరసంచలితాంభోధి, సలిలమందు । విగ
తకౌతుకమయ్యె, నగణితమత్తేభ బృంహితంబులువాజి, హేషితము

లు । నేకమైసర్వము, సీూధ్రగుహాద్వారములు నిండిమిన్నుబ్రబ, ద్దలుగఁ
జేసె॥ (గీ) ఘూరిరణజయదుందుభు, ల్మోృయుచుండ । నిబిడప్రతి
నాదములుభయ, నిర్గతహరు । లగు గుహాముఖంబులచేత, నద్రిప
తులు । ప్రమదమును బొంది నవ్విన, భంగినుండె॥ ౫౬ ॥ (చ) అ
తిబధిరీకృతోన్నతగు, హాగత నిర్జర కర్ణమార్గమౌ । సతత చ
మూరవంబు సుర, శైలగుహల్వెసనిండిపర్వఁ గా । నతులవిదగ్ధకాం
తల స, మగ్రరతాంతర కూజితంబుసం । గతిశ్రవణాధ్వగోచరము,
గాక నిరర్థకమయ్యె నయ్యెడన్॥ ౫౭ ॥ (చ) శ్రుతరణతూర్య
ఘోషలయి, సొంపుగ నిర్జరవారకామిను । ల్చతురత నింక ఘోర
మగు, జన్యముగాఁ గలదందుఁ జచ్చిభూ । పతులుచిరాభి కాంక్షితు
లు, వత్తురు వారలపొందుగల్గునం । చతులిత సంభ్రమంబుచెలు,వా
ర వెసంగయిచేసి రందఱుక్॥ ౫౮ ॥ (వ) మఱియునభ్యస్తసాదికృ
త్యులగుటంజేసి విదితయయాతాఖ్య పాదాంకుశకర్మలగు నిషాదు
లచేతఁ బ్రేరితంబులై గజంబులేకవారంబు కరతల లోలాంతర్నాడికా
హతంబు లయ్యును ముహుర్ముహు ధ్వనిత ఘంటలు గలుగునట్లు
గాఁ జనుదెంచె మఱియుఁ బాదవిన్యాస విశేషగమనచల చ్చామరం
బులచేత ఖురోద్ధ తమహీరజంబీవ లావలం దట్టుచున్నవానివలె ధృతా
భి నవభాండంబులైన తురంగమంబులవలనదృష్టులు ప్రసరింపకుండెస్ఫు
టతరకృత కర్ణతాళంబైన గజఘటలచేతఁ జలాంగుళికి సలయంబుగ
లుగునట్లుగా సముత్థిత హస్తంబులచేత నృత్యంబుగావించుటయుమదజ
లాద్రీగండస్థల సంసక్త భ్రమరగణంబులచేత మధుర స్వనంబుగా
గానంబుసేయుటయు ద్రుతాభి నవపూర్ణకుంభంబులగు దంతిఘటల
చేతఁ బ్రశమితరజో జాలంబులగు మదజలంబులచేత మహీతలంబు సే
చింపం బడుటయు ముఖంబులచేత శ్రవణసుఖకరంబై సమున్నమత్ప



యోధరగర్జిత గంభీరంబైన తూర్యంబు వాయించుటయుఁబవనావ
ధూతపటంబులునభ్రంకషంబులునగు ధ్వజంబులీవలావల నుత్థిస్తంబులె
గుటయు నిట్లుదంతిఘటలచేతశత్రువున కభిముఖంబుగావచ్చు కృష్ణునిపు
రోభాగంబునఁ దనయంతమంగళంబు గావింపంబడియె నప్పుడు॥ (గీ)
విడిచిపోయినసేనాని, వేశభూమి । శూన్యతను బొందదయ్యెనీ,క్షోణి
తలము । మిగులఘనరసంప్లవం,బగుచునుండ । మానుగఁ బయోధి
సలిలవి,హీనమగునె॥ ౫౯ ॥ (సీ) హరిరవితోఁగూడ,నరుగనిష్ప్రముగ
లదానినంతటఁ గ్రమ్ము,దానిశత్రు । బలరేణుమలినమై, పరగెపుదాని
దు స్తరజరన్మహిషవి,శాలశృంగ । ధూసరంబై గ్రమోలఁ,దోఁచు దిక్కు
సుధూమితంబైన దానిచం,దానజనము । వీక్షించె నప్పుడిం,పెసఁగర
ణోద్యతవైరులసైన్యాన,కారవంబు॥ (గీ) పూనియెట్లుమనస్వుల, మా
నసముహా।రించెనారీతిసముదితో,దంచితోరు।ప్రతిసినదమైన యాత్మీయ,
పటుమృదంగ।సాంద్రనాదంబుహరియింపఁ,జాలదయ్యె॥౬౦॥(గీ)హరివ
రుని గ్రమోల గ్రమోయుస,మగ్రపటహ।రవములంతంతకుసమీప,మవుచునుం
డ।శత్రుసేనావధూమణి,సంభ్రమమున।గాత్రముప్పొంగడగ్గఱఁ, గదియ
వచ్చె॥౬౧॥(చ) మిగులసమీరణభ్రమిత, మేదినిరేణుకణాభిరూషితం।బ
గుటనిరంతరోగ్రవిల,యప్రవిభావితకాళికాకృతిన్ । దగుప్రతిపక్ష సై
న్యసము,దగ్రసమున్నతకేతనాళిమె । ప్పుగఁగననయ్యెనభ్రమున,భూ
రిచలత్పటునిస్వనంబునన్॥ ౬౨ ॥ (సీ) ప్రతిముఖతిగ్మాంశు,ప్రతిఫలి
తోగ్రదీధితులచేనధికప్ర,దీప్తమండ । లాగ్రపజ్క్తులచేత,నతిదుఃఖకర
దర్శనంబయ్యెఁ జైద్యుసై,న్యంబుశౌరి । సైనికులకుభీతి, సంపాదకం
బయ్యెనంతలోనమనోజ్ఞ,మగుచుఁదోఁచె । సమవిషమప్రదే, శములం
దుఁదుల్యసంచారంబుగలభూరి , సైన్యజలధి॥ (గీ) గగనమార్గంబు
నందుశీ,ఘ్రమునఁ దిరుగు । సాంద్రతరమేఘమండల,చ్ఛాయపగిది।క్షణ

ములోనవసుంధరా,చక్రమెల్ల । నిండెఁగలకలనాదంబు,మెండుకొనఁ
గ॥ ౬౩ ॥ (వ) అప్పుడుక్షణమాత్రం బగ్రభాగంబున విలోకింపుచు
న్నతనుకుక్షిస్థితభువనత్రయుండైన మధుసూదనునివిశాల నితాంతాయ
తనేత్రంబునందుఁ దద్విపక్షమహాబలంబపర్యాప్తంబయ్యె మహీనాథసే
నావధూగణంబులు రణారంభంబునందు సురతారంభంబునందుం బో
లెఁబ్రస్విన్నగాత్రంబులును బులకవికాసితంబులును వీరశృంగారరసాధి
కంబైన చిత్తంబునందభినివిష్టసాహసంబులునుససంభ్రమంబులునై చూ
పట్టె మఱియు శిశుపాలపక్షరాజు లనుకూలమారుతప్రసారితకేతనప
టంబులచేతఁ బలాత్కారంబుగాఁ గతాహ్వానులైన చందంబున ద్రుత
తరంబుగా సముద్యతశస్త్రాస్త్రులగుచుఁ గోపంబుననత్యంతసంరంభం
బునొందిరి ధీరులగువారు రణార్థులై చనుదెంచిన వారింజూచి కా
ల విలంబనంబు సహింపరు గావున నప్పుడు హరిసైనికులుశత్రువాహి
నిమీఁద నతిరయంబున నడరిరంత॥ (చ) జరఠకపోతకంఠగత, సాంద్ర
తనూరుహజాలచారుధూ । సరరుచి యైనసైనికుల, సచ్చరణాహత
భూరిధూళియం । బరపథమంటఁ బై కెగసి,బంధురమేఘచయంబుగ్రి
మ్మెచె । చ్చెరదెసలావరించియతి,శీఘ్రతఁజేసె ఘనాంధకారముల్॥
౬౪॥ (సీ) మఱియుఁ జలాచల,ఖురములచేఁ బ్రతిపదమాహతము ల
య్యు,బహుళసాంద్ర । ముగనిషంగులచేత,మిగులమిథస్సమా శ్లిష్టకా
యంబుల,చేతనుపరి । రుద్ధంబులైనప్ర,సిద్ధపాంసుచ్ఛటలాకచోటమీఁ
దికి,నుద్గమింపఁ ।జాలకక్రిందనే,సంచరింపుచునుండెమఱియు మహో
గ్రసం,గరము మీఁదఁ॥ (గీ) గలుగునప్పుడు సాయక,క్షతజరక్త। జల
ముచేఁ బంకిలత్వంబు,గలుగుమనకు । నిపుడెయాకసమునకేగు, టుచి
తమనుచుఁ । బవనకేతుసమూహము,భ్రమున కెగసె॥ ౬౫ ॥ (గీ)ప్ర
చురముఖుఁడుగరీయుండు,రాగియైన । జలజగర్భుని వ్యవహిత,సత్య



రజము । లోకసృష్టినిమిత్తను , ద్రేకమొందె । లోకనాశార్థమ
య్యెన,నీకరజము॥ ౬౬ ॥ (చ) ఒకయెడనూత్నమేఘనిచ,యోజ్జ్వల
కర్బురవర్ణతుల్యమై । యొకయెడఁదప్తకాంచనక, ణోపమపింజర
మైనిరంతరం । బొకయెడశారదాంబుదచ, యోన్నతపాండురమైఖుర
క్షత । ప్రకటవసుంధరోత్థఘన,పాంసుచయంబెగసె న్భవీధికిన్ ॥౬౭॥
(చ)ఘనతరసైనికోద్ధతవి,కాసిపరాగము దిఙ్మదావళా। ననములయుం
డుఁ బర్వఁగక్షణంబు పికాంగమలీమసంబులై । తనరినదాన మేఘర
స,ధారలుదీర్ణములై విసారిత । స్మనుకొని తాల్చెఁజూపఱకు,మో
దమువిస్మయమంకురింపఁగాన్॥ ౬౮ ॥ (సీ) మధుపకదంబకో, మల
కేశములచేతఁదగనుపలక్షితు,లగుటఁజేసి । పరఁగనీజనులుయా, వన
యుక్తులగుచుసంగ్రామరంగమునవ్య,థముగఁజావ । కుందురు గాక
ని,యోజించిసేనారజంబు గ్రక్కునశిరో,జములనపుడు । ధవళిమనొం
దించె,దప్పకనణువులయ్యును మహీరేణువు,లినునితనువు॥ (గీ) నాక్ర
మింపనుదానెంత,యధికతేజుఁ । డైననన్యుండు సంగతు, లైచెలంగు।
నట్టిపెక్కండ్రుపరులచే,నవనిలోఁది । రస్కృతుఁడు గాఁడెనిజమీ,ప
రాభవంబు॥ ౬౯ ॥ (క) ధృతరథచరణప్రధీక్షిత। కుతలోద్ధతబహు
రజోప,కుంఠితజగముల్ । వితతయుగాంతంబునని।ష్ప్రతిబంధపయో
ధినీటఁ,బడినట్లుండెన్॥ ౭౦ ॥ (చ) అరయననుల్లసద్దినక,రాననదీధి
తులుగ్రజస్వల । ల్పరిమలినాంబరాంతల,నలంకృతలౌటనవీక్షణీయలు।
న్వరుసదిశానితంబినులు,వారకప్రాణులకట్లుదవ్వులన్ । బరిహరణీయ
లైరొకక్షణంబశుచిత్వము నొందినందునన్॥ ౭౧ ॥ (క) అనిమిష
లురణముఁజూడఁగఁ । జనుదెంచి నభమునవిలిచి,సాంద్రతరపరాగని
చితనయనోత్పలులై । జనితవ్యథులగుచుమరలఁ, జనిరి భయమునన్॥
౭౨॥ (గీ) పాదహతధూళిపటలము,భ్రమునకెగసి । ముదిరగత నీర

ములనెల్ల, బురదఁ జేయ । విగతచపలాగణంబులై, వృష్టిమాని। భూరి
భరమున మెల్లనఁ, బోవుచుండె॥ ౭౩ ॥ (సీ) అమరనదీసలి, లావగా
హనధౌతగాత్రంబులైనది, గ్గజములభ్రి । మునునుండి మున్నెన్నఁ, డన
నుభూతములైన సంచలద్ఘనచమూ, సంస్థితాశ్వ । పటుఖురాహతస
ము, త్పతదుర్వరారజోవర్షాభిషేకసం, భవసుఖంబు । లనుభవించె
నుమతి, యసమానశైలసంకాశగాత్రములచేఁ, గ్రాలుకతనఁ॥ (గీ) కరి
ఘటలపాదవిన్యాస, గౌరవమున । నవనితలమురసాతల, మంటఁ గ్రుంగె
గె । నాకసంబురజోవ్యాప్త, మయ్యెనట్లు । గానభూతలమయ్యెజ,
గత్త్రియంబు॥ ౭౪ ॥ (క) మిగులసమీకృతవివరం । బగురజము
నఁ బూరితంబు, లగుగిరిగుహలొం । టిగయువతీక్రీడారతు । లగుని
ర్ఝరవరులకొసఁగె, నవకాశంబుల్॥ ౭౫ ॥ (గీ) ఉరుముఖచ్ఛదపట
సామ్య, మొందుచున్న । ఘనరజముదృక్పథంబులఁ, గప్పుచున్న । దైన
మధుచూతగంధిమ, దానిలమున । గుఱుతుగొని యేగెఁ గరులన్య, కరు
లపైకి॥ ౭౬ ॥ (గీ) మఱియు సుపరిస్థితపరాగ, మండలములు। క్రింద
సప్తప్రకారవి, కీర్ణనిబిడ । దానజలశాంతపాంసువు, లైనకరులు।
భూరిపటమంటపంబులు, బోలియొప్పె॥ ౭౭ ॥ (వ) అత్యున్నతంబు
లతిమాత్రవిపులంబులగుటం జేసి మహామహీధరశోభనధిగమించియాభ
రణగతసువర్ణరేఖలచేత విద్యుల్లతలతోడసాదృశ్యంబునొందిసముల్లస
త్సిందూరాదిమండన సురచాపంబులును గాళీయ నాగకాయకృష్ణ దే
హంబులునగు గజమేఘంబులు యోగ్య కాలంబునందు మదజలవృష్టి
గురియుచు మహీరేణువుల శాంతి నొందించెఁ దదనంతరంబ యు
ద్ధానివర్తులును గంభీరఘోషంబులు నగు సేనాసముద్రంబులుశక్రుండు
దంభోళిధారచేత ఱెక్కలు దెగవ్రేయకమున్నేకస్థానంబున వసించుట
కు వాంఛించుచున్న సహ్యవింధ్య మహీధరంబులుం బోలె మిళితంబు



లయ్యెనంత॥ (గీ) అరదమరదంబునుహయంబు, హయమునిభము।
కరిని గాల్వురు గాల్వురు, గాగనిట్లు । సేనయాత్మాంగమునఁ బ్రతి,
సేనతనువు । రాగమున నంటెఁ బ్రియుశరీ, రమును బోలె ॥ ౭౮ ॥
(మ) హరిహేష ల్గజ బృంహితంబులు రథాం, గారావము ల్స్ఫా
రితూ । ర్యరవంబు ల్సపదాతి నాదములు నైక్యం బొంది తన్నా
దమే । ల్పఱుపం గూడక మిన్ను ముట్టి సకల, వ్యాపీశ్వరో పాధి
భృ । త్పరమాత్మాకృతి నుండె నప్పుడనభి, వ్యక్తంబు నైసాంద్ర
మై ॥ ౭౯ ॥ (గీ) తొడరి దూరోద్యత స్థూల, దోర్ధ్వజంబు ।
లగుచు రోషాతిశయమున, నరుల మీఁది । కరుగు పత్తుల తిర్య
గా, యత నిశాత । ఖడ్గలతలు పతాకల, కరణి నొప్పె॥ ౮౦ ॥
(వ) మఱియు ధౌరితకాఖ్యగతి విశేషంబున బఱచు హయస
మూహంబులగమన విశేషంబువలన మీఁదికెగయుపల్యాణ బంధనవర
త్రాబద్ధసువర్ణ బుద్బుదాకార మండలంబులు సర్వాంగీణమూర్తిభూ
తదర్పవిశేషంబుల భంగిఁ బ్రకాశించె సాంద్రచర్మంబులును బృష్ఠవం
శాశ్లిష్టమధ్యబంధన వరత్రంబులైన యిభంబులును నూట యిరువ
దేనువర్షంబు లాయుష్యంబుగల గజంబులకు ద్వాశావస్థలుగలుగుటం
జేసియందుఁ జతుర్థావస్థయైన శారీరశోభ నధిగమించి ప్రళయానిల
ప్రేరితస్థూలోపలంబులకైవడి నతితీవ్రంబు గాఁజలించె వేగవంతంబు
లైన శతాంగరథాంగ చక్రాధార కాష్ఠభారంబు పరస్పర సంఘర్ష
ణంబున నాదంబు గావింపుచు రాగంబు వలనసముద్యత ప్రతోదోత్సా
హితతురంగుండును సముత్థిత పూర్వ కాయుండునగు సారథికి సము
త్సాహవర్ధనార్థంబు హాహాకారంబు గావించి నట్లుండెసమున్నత కేత
నస్తంభంబుల వైజయంతులు సాంపరాయాంత రాయంబు గావించు
మహీరేణువులఁ బ్రమార్జనంబు సేయుటకు నంతకునిచే సముద్ధూయ

మానంబులగు సమ్మార్జనులుం బోలెం జూపట్టె మఱియును॥ (క) బిఱ
బిఱుఁద్రిప్పుచు ధన్వులు । గుఱుతుగఁ బాటవము దెలియఁ, గొఱకుగు
ణంబు । ల్పఱువడి మ్రోయించిరి కరి । శిరములు వాస్ఫాలనంబుఁ,
జేసిరియంతన్॥ ౮౧ ॥ (గీ) భూరిడిండిమ ధ్వనులు ఘం,టారవము
లు । విపులగ్రైవేయ నాదము, ల్బృంహితములు । కరుల కుత్సా
హపరివృద్ధి, కొఱకు యంత్ర । వాక్యమున కనుకూలతా, వసరమొ
సఁగె॥ ౮౨ ॥ (మ) సతతం బాయుధజీవులోకమొగి శిక్షాశ,
క్తులంజూపుచున్ । జతురాస్త్రాదివిభేద యుక్తములు భా,స్వత్సౌష్ఠ
వాతిస్వదా । ప్రతి బంధంబులునైన యస్త్రములశ,స్త్ర శ్రేణులంబ
ల్విడి । న్వితతారాతుల నేసిరప్పుడు బలో, ద్వేలంబు దీపింపఁగన్॥
౮౩ ॥ (సీ) ఉరువడి నిద్దఱు,యోధు లన్యోన్యంబు నెదురుగాఁ బరు
వెత్తి,కదియవచ్చి । మొనసి రోషావేశ,మున హేతులటు పాఱవైచి
హస్తంబులఁ, బట్టిమల్ల । ముఖ్యులగతి దృఢ,ముష్టి ఘాతంబుల ఘట్టిం
చి బాహుయు,ద్ధంబు సలిపి । రంతనిర్విషము ల,త్యంత వేగంబులు న
ప్రతిఘాతంబు, లశనిసమము॥ (గీ) లంబకంబులు దూరము, క్తంబుల
గుచు । గరుద నిలజాత రేణువు, ల్గ్రమ్మకొనఁగ । శత్రుసైన్యంబు
సొచ్చివి,చిత్రవాజి । తానురూప కర్మముఁ జేసె, సేనయందు॥ ౮౪॥
(మ) రవణం బొప్పఁగ మానవంతులుసుసం,గ్రామాగ్రిమ స్కంధ
ము । రువులం బ్రాఁకి యనంతరంబ శిరమా, రోహించి సోత్కంఠు
లై । యవిశంకాప్తి సమానుషా ధ్వమునొగిం, బ్రాపించి ద్యోవీధిసం ।
స్తవమొప్పందగు భంగి నెక్కిరి మహో, త్సాహంబు సంధిల్లఁగన్॥
౮౫ ॥ (గీ) గుఱుతుగ రణాపణముఁ జేరి, కొంద ఱధిక । వీరులం
గాంతరమున, మాపితములైన । యస్థిరము లగు ప్రాణము,ల్యముల
చేత । నవనిలో సుస్థిరంబైన, యశము గొనిరి॥ ౮౬ ॥ (వ) మఱి



యు సంగ్రామ రంగంబున విక్రమాహంకారంబులచేత శ్లాఘ్యంబైన మ
హాద్భుత రణకర్మంబు గావించి స్వనామంబుఁ జెప్పికొనుటకు లజ్జితు
లైయున్నవారిని శత్రువులచేత నజ్ఞాతనామధేయులైన శూరుల శౌర్య
శ్రీయుక్తనామ ధేయంబును వందిజను లుచ్చైర్నాదంబున నితండతండ
ని తెలియంబలికిరి క్రోధాంధులైన వీరభటులు నభిముఖంబుగాఁ బఱతెం
చుచు నన్యులచేత సమ్ముఖంబుగా ధరియింపం బడిన నిశితకౌక్షేయక
ముఖంబులను వక్షఃపీఠంబులచేత ముష్టిపర్యంతంబు పరప్రయత్నంబు
లేక నేతమయంతం బామెప్రవేశించి రమ్మహాయుద్ధంబునందు సైన్యద్వ
యంబును మిశ్రీభూతం బగుచుండ నగ్రభాగంబు నందు నెవ్వరు పరా
ఙ్ముఖులైరి వారలు శత్రువులైన నవధ్యులనియు నెవ్వఁడు మ్రోలన వ్యా
వృత్తుండై యభిముఖుం డయ్యెవాఁడు స్వకీయుండైనను వధ్యుండనియు
నీధర్మంబు వ్యక్తంబయ్యె మఱియును॥ ౮౭ ॥ (సీ) అరయ సద్వంశ
త్వ,మగుటచే నంగసంబంధంబు నొంది మ,మత్వగరిమ । గడుబద్ధమై
న యొ,క్కనిచేత యసిలత చెలఁగి వేఱొకఁడు వం,చించికొనినఁ । ద
ద్వశంగతయయి, తప్పక ద్రోహంబు గావించె సజల మే,ఘంబు భంగి ।
నణి మేచకంబైన, యన్యునికవచంబు ధౌతోరునిజఖడ్గ, ధారచేత॥ (గీ)
దారితంబగుచుండఁ ద,ద్వర్మమందు । సాంద్రశోణిత రేఖమై, జా
లుగొన్న । మండలాగ్ర మార్గంబు శం, పా ప్రదీప్త । మగుచు శో
భిల్లెఁ జూపఱు, కద్భుతముగ ॥ ౮౮ ॥ (గీ) అన్యభట బాహువాక
క్షు,మాయతశిత । శరపరి ప్రోతమగుచుండె, జాల బాధ । గలిగి
యును ధైర్య మెడలియుఁ, బలుకవిడఁడు । భూరితర మందు కశ్లిష్ట
ముష్టివలన॥ ౮౯ ॥ (వ) మఱియు గృధ్రపక్షబాణ విశేషంబున నా
సికను ఛేదించి వక్షంబున ప్రహతంబైన నవారూఢాశ్వంబు శిక్షార్థంబు
దృఢపాశంబున బద్ధంబైన దాని యట్లయశిక్షిత ముఖంబయ్యును ముఖం

బునపాకరించుటకు శక్తంబుగాదయ్యె మఱియుఁగులీనాశ్వంబుహయా
రోహకునిచేత నున్నతంబైనకుంతంబునఁ బ్రహరించుట కభిప్రేతంబై
నగజంబువలన భయంబునొందదయ్యెఁ గులీనులు యశంబుకొఱకు మ
హాపౌరుషంబు గావింప నుద్యుక్తులైన నిజభర్తలను లజ్జితులుగాఁ జే
యుదురుగదా మఱియు నధోదేశంబున జనంబును విలోకింపుచు విక్షి
ప్తసాయక హస్తంబులును భయరహితంబులునగు జయశీల గజంబుల
నారోహించి జంగమంబులగు గిరిదుర్గంబులు నాశ్రయించిన వారియ
ట్లుశత్రుసైన్యంబులచేత జయించుట కశక్యులై యుండిరి యొక్కవీరుం
డుసర్వవ్యాపకంబులగు సైన్యతరంగంబుల నీవలావలందట్టుచు సమ
రమధ్యంబున దూరంబునం బోవునిష్టబంధువును విలోకింప నిశ్చయిం
చిన వాఁడగుచు నొకచోట దూరంబున మగ్నంబైన మహీమండలం
బు నవలోకించుటకాదివరాహంబు సముద్రంబు నందుం బోలె రణ
రంగంబునం బరిభ్రమించె గజోత్థాపనార్థం బుద్దీపన కర్మంబు
గావింపం దలంచు నంతకు మున్నె సేనాకోలాహల శ్రవణంబు వలన
స్థూలంబులైన గజంబుల మహాదానప్రవాహంబులు తమయంతఁదా
మె ప్రవహించె దూరంబున నన్యగజ మదగంధాఘ్రాణంబువలనఁ
గ్రోధావేశంబై దాని హింసించుట కొక గజంబువిధూత మస్తకం
బై యాధోరణునిం దిరస్కరించి దారుణాక్రందనధ్వని కృతాశేష
దిగంతంబైన స్వకీయ వింశతి వార్షికంబైన గజడింభంబునందుఁ ది
ర్యగ్దంత ప్రహారంబు గావించె మఱియు నొక్క ప్రతిపక్షవారణం
బు ప్రత్యాసన్నంబగుచుండ గజారోహకునిచేత సంప్రాప్త ముఖ
చ్ఛదంబయ్యునుఁ గ్రోధాతిశయంబునఁ గ్రూర నిర్ఘారితాక్షం బ
య్యును మదాంధ గంధ సింధురంబొక్కించుకైనఁ బురోగత ప్రతి
పక్షగజంబును విలోకింపదయ్యె॥ (చ) పరఁగ నిషాది యొక్కఁడు



స్వ,వారణ లోచన వారణాంశుకం । బురువడి నెంతలోఁ గడుర,
యోద్ధతి మీఁదికి లాగునంతలో । నరయఁగ శత్రుపక్షగజ, యంతస
ముద్ధతినేకపాత దు । ర్ధరతర కార్ముక చ్యుత శ,రంబులఁ గ్రు
చ్చెఁ బటంబు కన్నులన్ ॥ ౯౦ ॥ (చ) మఱియొకఁ డప్రమత్తుఁడ
యి, మాటికి శత్రుగజంబు మీఁదికిం । బరువడినేగు దంతి ముఖ,వ
స్త్రముపేఁ దొలఁగింప నంతలో । నిరుపమవక్త్రి లగ్నమగు, నిష్టు
రశంకు కలాప భారమున్ । గరమరుదార శీఘ్రమునఁ, గన్నులుగ
ప్పె క్షణంబు లోపలన్ ॥ ౯౧ ॥ (వ) మఱియు నొక్క గజారో
హకుం డాలోచితంబైన మననంబున ననపాయ దేశంబు నందుండు
ట వలన నపాయంబులేదని నిశ్చయించి వంచకుల వలన నతిప్రయ
త్నంబున రక్షింపుచు సాధనాంతర నాశకాలయుక్త వినియోగం బ
గుట వలన నభీష్టంబైన గజంబు నొండుచోటికిఁ దొలంగందోలుకొ
నిపోయె మఱియు మదగంధ బంధుర సింధురంబులు పరస్పరకర్మ
వ్యతిహారంబు వలనఁ బరస్పరోచ్ఛేదంబులైన కరాదిమదస్థానంబుల
హస్తాగ్రంబులచేత స్పృశింపుచు నున్నతప్రహ్వీభూత వాలాగ్రంబు
లునున్నమిత మస్తకంబులు నగుచు సువ్యక్త దంతనాదంబులుగలుగు
నట్లు యుద్ధంబు గావింపుచుండె మఱియుఁ గొన్ని గజంబులు నతిదీ
ర్ఘంబులును బరస్పరసంఘట్టితంబులును సమాలంబిత స్థైర్యంబులు
ను నతిధవళంబులు నతి చారూదగ్రంబులు నతి నిశితంబులు నగు దం
తంబులచేత సమాహతంబులగుచు రణంబు గావింపుచుండ నప్పుడు
దంతంబులు భగ్నంబులైనను జలంబు డింపక తుండంబు లొండొం
టింబెనిచికొని యద్భుతంబుగా సంగ్రామంబు గావించె ॥ (సీ) గం
ధేభదంతసం,ఘట్టజాతంబును స్వర్ణభంగసవర్ణ, సంచలచ్ఛి। ఖా
గ్రంబు నగువహ్ని, యనుపమనూంజిష్ఠరక్తంబులగు చామ,రంబు లుం

దు । సరిక్రమించియు సైన్య, సమితిచే విభజింపఁ బడకుండె నుత్స
రో,త్పాతవాత । సంయుజ్యమానోరు, చారుదంత మహీజ సంఘ
షణోద్ధూత, సాంద్ర వహ్ని॥ (గీ) శిఖలచేతఁ గల్పాంతాగ్ని, శిఖ
లచేతఁ । బోలెదంతావళోన్నత, మూర్ధగగన । మందు నుజ్జ్వ
లనక్షత్ర,హార మపుడు । వితతముగ దగ్ధమయ్యెన,ద్భుతము గాఁగ॥
౯౨ ॥ (సీ) సాంద్రపయోదమే,చకదంతి బృందంబునందు నిబిడ శో
ణి,తారుణంబు । లైనదంతంబులు, ద్యచ్ఛ్వారినిధివారి యందు విద్రు
మలతి, కాంకురముల । యట్లఁ బొల్చెఁ బ్రకంపి, తాగ్రకేతువు
లచే భారంబు నొందిన, వారణములు । చెలఁగి గ్రీవా బద్ధ, శృం
ఖల భూషణాద్యఖిల నినాదంబు, లలరు నట్లు ॥ (గీ) ప్రతిగజం
బుల భూరి గా,త్రంబు లందు । నధిక గాఢ నిమగ్నంబు, లైనస్థూ
ల । దీర్ఘ దంతద్వయంబున,తి ప్రయాస । మలర నుత్ఖాత మొనరిం
చె,బలువుచేత॥ ౯౩ ॥ (వ) మఱియు లాంగలదండసంకాశ దంతంబు
లుగల యొక్కమహాగజంబు ప్రాణోత్క్రమణదుఃఖంబు వలనఁ జలిం
పుచున్న శాత్రవీయ కుంజరంబును దంతంబుల చేత మీఁదికెత్తి శిఖర
ప్రాంతప్రావృట్కాల జలధరంబైన మహీధర శృంగంబునకు సాదృ
శ్యంబునొందె మఱియు నొక్కవారణంబు క్రోధావేశంబున నిర్భీకం
బైరయంబునం బఱచి యతివిపులంబయ్యును లోకవ్యాప్తంబగుటంజేసి
మిక్కిలిదుఃఖలభ్యావసరణంబగు సేనామధ్యంబు సృష్ట్యర్థంబుసృష్టి
విలోకనార్థంబు బ్రహ్మయు మార్కండేయుండు భగవంతుని కు
క్షిం బోలెఁ బ్రవేశించి పరిభ్రమించి మఱియు నొక్కదంతావళ రా
జు మధువ్రత రాజీశ్యామనారాచ విద్ధనీరంధ్రదేహంబయ్యును నిర్భ
యంబుగా రణరంగంబునందు నవ్యాహతోత్సాహంబగుటంజేసి మో
దమానంబై హర్షపులకితంబైనదానియట్లసంచరించె॥ (క) కరటిను



టాకటనిసృత । సురుచిరమదధారరోష, శోణితమగుచున్ । గురుతర
బాణక్షతగళ । దురుశోణితధారపగిది, నొగిఁ బ్రవహించెన్ ॥ ౯౪ ॥
(చ) తఱుచుగరత్న చిత్రితకు,థాపరివేష్టిత దంతికాయముల్ । స్ఫురిత
పృషత్క జాలములు, సోఁకిపగిల్చిన తత్పృథుక్షతో । త్కర గళితాస
గుచ్ఛతర,ధారలు గాఱఁగ సాగెభూరిభూ । ధరములనుండి జాఱు వి
త,తస్ఫుట వాహిను లట్లసాంద్రమై॥ ౯౫ ॥ (సీ) శమనశయ్యాతివే,షా
దండములఁ బోలు సామజ దంతము, ల్సాహసిక్య । మునకెక్కి యు
న్నయందు, ఘనతర స్వర్గార్థ మార్గంబు నెక్కిన,మనుజుఁడనుచుఁ।
దక్షణంబునఁ జమూ,తతులచే మిగుల నుత్ప్రేక్షింపఁ బడియెన,హీన
భంగిఁ । గౌముదీబిందు సం,కాశ విశుద్ధఖడ్గాభూత దారిత హస్తి
రాజ॥ (గీ) భూరికుంభ సముచ్ఛల,చ్చారు మౌక్తి । కౌఘమా
కాశమునుదార, కాంకితముగఁ । జేయుచున్న విధంబునఁ, జిత్రభం
గిఁ । గాననయ్యెను సువిశాల, కాంతియగుచు॥ ౯౬ ॥ (వ) మఱి
యునొక్క మత్త కరీంద్రంబు దూరోత్క్షిప్త సత్వరచక్ర నికృత్తంబై
పుడమింబడి లోలమానంబైన భయంకరస్వకీయ హస్తంబును రోషస
హితంబగుచుఁ బంకీభూత శోణితంబైన తనపాదంబుచేతనే మర్దించె
మఱియునొక్క గజంబువిలూన జంఘంబగుటంజేసి యధోముఖంబై
యనాధారంబుగాఁ బుడమింబడుచుండ దానికతిదీర్ఘస్వకీయ దంతద్వ
యంబెయాధారత్వంబు నొందెమఱియు నొక్కభటుండు దంతంబు
లూఁతగాఁ బుడమికి మ్రొగ్గతిలంబడిన మహేభదంత మధ్యంబునం జి
క్కియొక్కింత యుపాయబలంబునఁ గరకలిత నిశాత మండలాగ్రం
బునదాని హస్తంబు దెగవ్రేసి దంతంబులు చూర్ణంబుఁ జేసితా నక్ష
తుండై నిర్గమించె ॥ (గీ) మొనసి దుష్టదంతి, మ్రోల నిర్భీకుఁడై ।
యున్నభటునినెత్తి, వ్యోమవీధి । కెగరవైచియందుఁ, దగవరణార్థం

బు । గోరుదివిజసతులఁ, గూడననిచె ॥ ౯౭ ॥ (గీ) సామజం బొం
డుదూరప్రసారితంబు । ప్రాస సంస్యూత మంతర, వ్రణమునైన ।
నిజకరాగ్రంబు వేమోల, నిలిచియున్న । సైనికుఁ బరి గ్రహింపంగఁ,
జాలదయ్యె॥ ౯౮ ॥ (గీ) పరఁగఁ గంసునిచేవ్రేటు, వడిననంద । క
న్యకాంగోష్ఠ యగుచండి, కయునుబోలెఁ । గరి విదారితవీరు నం,గ
మునను౦డి । దివికెసగిపోయె నపుడొక్క, దివ్యమూర్తి॥ ౯౯॥ (గీ)
దుష్టగజమంఘ్రిచేఁ బిక్కఁ,ద్రొక్కి పట్టి । కరముచే నొండు పిక్క
ను,గదియఁదిగిచి । సాస్థిరవ యుక్తముగ శౌర్య, శాలినొకనిఁ । జి
త్రగతిఁగాష్ఠమును బోలెఁ,జీల్చివైచె॥ ౧౦౦ ॥ (వ) మఱియునొక్క
సేనావల్లభుండు తనముంగల మృతులైనవారివిలోకించి తద్వల్లభసం
బంధిప్రేమచేతదుఃఖించి యంతస్తాపంబు నొందె॥ (సీ) అతిరోషప
రవశుం,డై దంతదష్టోష్ఠుఁడై సాహసంబున, నతిరయమున । నసిహ
స్తుఁడై యొక్కఁ,డరివీరుపైకి వీరావేశమున వచ్చు,నంత లోన । నా
రాచశాతబా,ణమునఁ గంఠముదెగిబంతి కైవడిఁదల,పైకి నెగసి । మ
రలనెప్పటిచోట, మానకనిల్చినఁ దత్కళేబరమట్లు, తత్క్షణంబ॥ (గీ)
వ్యోమవీధికి నెగసియ, నుత్తమాంగ । మయ్యును సహోత్తమాం
గమై, నట్లునిగుల । సైన్య సందోహములకెల్ల, సాధ్వసంబు । గలు
గఁజేయుచునృత్యంబు, సలిపెనపుడు॥ ౧౦౧ ॥ (మ) ఉరుసంపాదిత
విస్ఫురత్కరపుటా, ద్యుత్తాల తాళంబులై । పరతూర్య స్వనముల్మ
హాసుషిరభృ, ద్వాద్యధ్వనుల్మ్రోయఁగా । సారదిక్ ఘోర కబంధ
మొక్కయెడఁ జ,తుశ్శ్వాన్య హస్తప్రయో । గరతిన్ నృత్యము సే
యప్రోసెను రణ, తక్షంబు ప్రవేశంబాగిన్॥ ౧౦౨ ॥ (శా) భా
వింపందనసేన భంగపడినం, బల్కొన్కతో వేగఁ బ్ర। త్యావృత్తుండగు
శూరుకంఠమున ఘో,రారాతి కోదండము । క్షావా ర్యామితహేమ



పుంఖపటు బా,ణౌఘంబు లొక్కుమ్మడిన్ । దేవస్త్రీకరముక్తమా
ల్యములతోఁ, దెల్వొంద వ్రాలెన్ రహిన్ ॥ ౧౦౩ ॥ (వ) మఱియు
సాయకోత్క్షిప్త సాదిశూన్యాసనంబులగుటంజేసి పరసైనికులచేత గ్ర
హించుటకు సమారబ్ధంబులై రణభూమియందుఁ బరిభ్రామ్యమాణం
బులైన మత్తేభబృందంబులచేత బంధసంస్థానంబుస్మరింపం బడియె,
సంగ్రామ రంగంబునందుఁ బునః పునరావృత్తివలన రక్తగంధాఘ్రా
ణనంబుచేత మత్తంబైన మహాగజంబు కోపంబువలన జనమర్దనంబు
సేయుచుఁ బాదలగ్నంబైన పాశబంధనసంకాశ దీర్ఘాంత్రమాలనా
కర్షించె మఱియునొక్క వీరుండు గాఢప్రహారంబువలన మూర్ఛా
క్రాంతుండై మదవారణ శీతలపుష్కరతుషారసిక్తుండగుటం జేసిమూ
ర్ఛఁదేరియుండ వాని వరించుటకుఁ జనుదెంచిన దేవాంగన సజీవుండై
యుండుటయెఱింగి విఫలమనోరథయగుచు మూర్ఛనొందె , మఱి
యునొక్క వీరునిశిరంబుసాయకలూనంబై మింటికెగసిన వానింబూ
చివరణార్థంబు చనుదెంచినదేవకామినులు స్వభర్తనుండనిశంకించిభ
యంబున సుందరాకారులైన ముఖచంద్రులఁ బ్రత్యఙ్ముఖులఁ గావించి
రి॥ (చ) పటుగతినాత్మభర్తపర, బాణహతుండయి నేలఁ గూలినం।
దటుకునఁజూచితద్యువతి, తద్విరహంబు సహింపలేకతా । నటుప్రబ
లాగ్నిలోనుఱుకు, నంతటిలోనొక దేవకాంతము । చ్చటపడి వానిఁ
గొంచు సుర, శైలమహాగుహఁ జేరెగ్రక్కునన్ ॥ ౧౦౪ ॥ (క) అ
నిఁగెడసిన భర్తనుద । ద్వనితకరటి నెక్కిచూచి, తద్దయుమోహం।
బునఁ దనువువిడిచి గ్రక్కున । ఘనదేవత్వంబునొంది, కౌఁగిటఁ జే
ర్చెన్॥ ౧౦౫ ॥ (సీ) మఱియొక్క వీరుండు , చిరకాలమును నాక
వాసంబు గావించి, ప్రత్యహంబు । నతిశయప్రేమచే , నభినవత్వము
నొందినరులకు నభినవా , నందమొసఁగి । నట్టిమనోజ్ఞ ది, వ్యాంగన

చేఁ బరలోకంబునందిహ, లోకమందు । యశముచేవిఖ్యాతిఁ,బ్రాపిం
చె మూర్ఛనొందినవారి జీవంబు, దివిజలోక ॥ (గీ) మునకుఁజని య
చ్చట విలాస, ములను జూచి । మఱలఁ జనుదెంచి వారివ, ర్ష్మంబు
సొచ్చె । నంతలోలేచి తత్సౌఖ్య , మందఁ గోరి । భండన మొ
నర్చిరప్పుడు, చండభంగి॥ ౧౦౬ ॥ (గీ) కాండనిహతిమూర్ఛి,తుం
డైనయొకవీరుఁ । దొడరిమిత్రుఁడనికిఁ, దొలఁగఁదీయ । నంతలోనఁ
దెలిసి, యతఁడెంతవలదన్న । వినకరణముఁజేసి, విడిచెఁదనువు॥౧౦౭॥
(గీ) పగతుచేతనాకర్షణంపఁ,బడినవీరు । లిరువురేకాస్త్ర నిర్భిన్న,
హృదయులగుచు । సరిపరస్పరావష్టంభ , శక్తియోగ । కలననేగిరి
నాకలో, కమునకపుడు॥ ౧౦౮ ॥ (సీ) ఖండితదండమై, కడువడిధర
ణిస్రవాలిన పూర్ణచం, ద్రప్రభాభి । రామాతపత్రంబు, శ్రాద్ధదేవు
ని రాజ్యభోజన పాత్రంబు,పోల్కినొప్పె । మృతులైననృపతుల, మెడ
నుండిపడినసకాశ్మీరహారము,ల్కామసహిత।మగుమిత్తిరక్తమ,ద్యముద్రా
వినవ్విన వెలికుబ్బురదముల,విధముదోఁచె॥ (గీ)శస్త్రహతిమూర్ఛనొంది
న,సత్త్వులజుల।సమరధర్మంబెఱింగిన, శౌర్యనిధులు। గెడపఁగడఁగినఁదన
వారి , నుడిపిజీవ । యుక్తముగఁ బట్టుకొనిపోయి , రుత్సుకమున ॥
౧౦౯ ॥ (గీ) మెండుగానిమ్న భూములు , నిండినట్టి । సాయకక్ష
తరుధిరంబు , శమనయువతి । రమ్యసంవ్యాన ములకను, రంజనార్థ ।
ముడినకౌసుంభరసముకై, వడిఁజెలంగె ॥ ౧౧౦ ॥ (చ) క్రమమునఁ
బెక్కుసూఱులుధ, రాపతుల న్వధియించిపెద్దగా । లమునకు జామ
దగ్న్యుఁడుచ , లంబునఁదద్రుధిరంబుపంచస్రో । తముఁలుగఁ జేసె
నాసమర, ధారుణియందుతక్షణంబు లోననే । కములగురక్తవాహిను
ల, ఖండముగాఁబ్రవహించెన త్తఱిన్ ॥ ౧౧౧ ॥ (వ) అప్పుడమ్మ
హారుధిరప్రవాహంబులందుఁ దరంగ ప్లవమాన పద్మాకారయోధవద



నంబులు పద్మంబులును మహేభకర్ణపరిభ్రష్టచామర హంసంబులును
వికర్ణాంత్ర శైవలంబులును బాహుమీనంబులు నస్థి శర్కరంబులుం
గలిగియొప్పె మఱియునామిషంబు భుజించుటకు మృతకళేబరంబులయు
పరిభాగంబున నాకాశంబునందుఁ బరిభ్రమించుచున్న కాకకంకఘూక
గృధ్రాదిపత్త్ర వాహంబులు ఘోరశస్త్రంబులచేత శరీరంబులు విడిచి
యిప్పుడుపూర్వా భిమానంబున దేహప్రవేశాపేక్షచేత మూర్తిమం
తంబులైనప్రాణంబులభంగి జూపట్టెమఱియు దిశాముఖంబులందుఁ బ
క్షాంతఘోషంబు విస్తరింపం జేయుచు నచేతనంబులైన బాణవ్రాతం
బులు నిశితముఖాగ్రంబులచేత సైనికుల రక్తంబు పానంబుఁ జేసెఁ బ
దంపడి సచేతనంబులైన పక్షిసంఘంబులు చంచుపుటంబులచేతఁ బా
నంబుగావించె॥ (సీ) ఉద్దీప్తరసనమై, నొకజంబుకము నిబిడౌజస్వ
లగుమృత, యోధవపుల । గాత్రంబుతోఁ గూడఁ, గాంక్షతోనేతిగ్మ
తేజంబుభక్షించెఁ, దెగువమీఱఁ । దత్తేజమునువెండి, దారుణోల్కా
చ్ఛలంబునఁ గ్రక్కుచు భయంబు, పుట్టనఱచె । వేగనైరంతర్య , వి
చ్ఛిన్నబంధుర గాత్రాంతరాళంబు, గలుగునట్లు॥ (గీ) బాణసంస్యూ
త మగుటదు, ర్భక్ష్యమైన । యోధమాంసంబు జ్వాలిక , లోలుకురు
తము । చేతఁ బరిపాకమొనరించి, చెలఁగినూత్న । రుచిగలుగఁ జే
సి భక్షించెఁ, గ్రోష్టృచయము॥ ౧౧౨ ॥ (వ) మఱియు నిష్ప్రా
ణులచేతసప్రాణుల యవయవంబులచేత నంతటఁ బరికీర్ణంబైన త
త్సంగ్రామభూమి యర్ధసృష్టంబులైన రూపంబులచేతఁ బరికీర్ణమై
నచతుర్ముఖుని సృష్టికర్మాంత శాలయుంబోలెఁ జూపట్టెనిట్లుక్తప్ర
కారంబున నవిచ్ఛిన్నవేగంబుగలుగునట్లు పరువెత్తుచున్నమహోద్ధత్య
రాజసైన్యంబులకు హరిసైన్యంబులతోడ నద్భుతప్రకారంబున ననిశ్చిత
జయాపరాజయంబగుసంగ్రామంబుచెల్లె నప్పుడు మహానదీప్రవాహం

బులు మహార్ణవంబు సంగలయునప్పటి మహాభీషణనిర్ఘోషణంబునుం
బోలె సైన్యకోలాహల శబ్దంబు భయంకరంబుగా ఘనాభోగాంతరాళం
బునిండి చెలంగెనంత సంగ్రామకాంతారంబునందుఁ బరిపంథి వేణుదారి
యగు వేణుదారియనునామంబుగల బాణనందనుండునరేంద్ర పాదప
సమూహ సంఘర్షణంబువలన నగ్నియుంబోలె వెలుంగుచుఁదలమిగిలిప
ఱతెంచుచుండ నతిదూరంబుననుండియంగీకృత పరాక్రముండై బలభ
ద్రుండు సింగంబుమాతంగంబునుం బోలెనవలోకించి రయంబున వా
నికెదురుగాఁదన యరదంబుఁ బఱపించిన॥ (క) ప్రిధిరవముఘంటికా
ధ్వను । లధికంబుగ మ్రోయఁ గడుభ, యంకరభంగిన్ । పృథివియ
ద్రువఁ దాలాంకుని । రథముత్పాతంబురీతి, రయమునఁ నరిగెన్॥ ౧౧౩॥
(గీ) ప్రధనమహావిచక్షణుఁడైన, బలునిమీఁద। వేణుదారి ప్రయోగించె,
బాణచయము । సీరికోపించియతనిపై , శితపృషత్క । వృష్టిగురి
యించి గ్రక్కున , వెగడుపఱచె ॥ ౧౧౪ ॥ (గీ) హలిశరంబుల
మూర్ఛితుం, డగుటఁజేసి । యల్పతేజుఁడై పడియున్న, యతనియం
త । దక్షిణాశాగతుండైన , తపనుఁ బోలెఁ । దొడరిసమరాంబర
మునకుఁ, దొలఁగఁదోలె॥ ౧౧౫ ॥ (చ) అతులప్రభావయుక్తశిని,
యాదవరాజు బలంబుసాల్వభూ । పతిబలమున్ప్రతాపమునఁ, బా
ఱఁగఁదోలి జయంబు గాంచిత । ద్వితతజయప్రభూతమగు, ప్రీతివికా
సితవక్త్రపద్మమై । చతురతహస్త తాడనము , సల్పుచుఁగేలియొన
ర్చెనత్తఱిన్॥ ౧౧౬॥(గీ)దిశలయందునాత్మ, తేజంబు వెదచల్లు। నుల్మ
కాఖ్యయాద, వోత్తముండు। చైద్యసఖుని ద్రుమునిఁ, జయ్యననిష్ప్రభుఁ।
జేసి మూర్ఛపడఁగఁ, జేసెనపుడు॥ ౧౧౭॥(గీ)రుక్మిణీభ్రాతయగురుక్మి,
ద్రుమ్మిపృథుని। ధనువునేవాక్కనను గాఢ, మనుచునిందఁ। జేసెనావాకుచే
తనే, సిగ్గుమాలి । పాహిపాహియటంచును, బలవరించె॥ ౧౧౮॥(గీ)



పరఁగనొక్కపెట్ట, బలువడిఁజనుదెంచు । చైద్యపక్షరాజ, సైన్యముల
ను । వనధినిమ్నగాప్ర, వాహంబులనుబోలె । నడ్డగించెనొకఁడె, హ
రిసుతుండు॥ ౧౧౯ ॥ (వ) ఇట్లతిరభసంబుగాహరిణంబులమీఁదికిఁజ
నుసింగంబుభంగిఁ గవిసినప్రద్యుమ్నునిమీఁద విలసదయోమయ కవచుల
గుటంజేసి నీలమేఘసామ్యంబు నొందినతత్సైనికులు ప్రయోగించినసువ
ర్ణపుంఖసాయకంబులు శంపాలతలకై వడిఁ బ్రకాశించెనప్పుడాప్రద్యు
మ్నుండునఖకిరణమంజరీ వ్యాప్తయునధిరూఢశిలీముఖయునైనమహాకా
ర్ముకశాఖనుధరించిమహోన్నతవృక్షంబు పోలికఁ బ్రకాశింపుచురిపు
సమూహాంతకుండగుచు నతిభయంకర యుద్ధంబుగావింపుచు నమ్రులై
నవారియందు సౌజన్యంబుఁ జూపుచునుద్వృత్తులైనప్రతిపక్షుల బాణం
బులచేత విదారింపుచు మఱియుసర్వమహీపతులు విజయాశంసచేతన
గ్రభాగంబునఁ బ్రయుక్తానేకబాణంబుల బాణంబులచేత ఖండింపుచుఁ
గృతానేకమాయమై సారవంతంబై యున్నసేనాతతిని ధనుష్టంకార
మాత్రంబుననానాయాసంబుగా మూర్ఛనొందింపుచు సమరసన్నాహ
విజృంభితుండై విహరింపుచుండనప్పుడు॥ (గీ) ఉత్తమాజుండుదలపడ్డ,
నుగ్రుఁడగుచుఁ । గార్ష్ణితత్తేజమునుదూర, గతముఁజేసి । వానిపేరి
కసార్థక, త్వమునిజాభి । ధేయమునకును ముఖ్యార్థంబు , దెలియఁ
జేసె॥ ౧౨౦ ॥ (గీ) దూరముననుండిశౌరిపు, త్రుండుభల్ల । బాణ
ములుపరసేనలు, బడలుపడఁగఁ । జేయనవి మూర్ఛఁదేఱిస్వ, జీవితా
శ । మఱలరణభూమిద్రొక్కక, పఱచెనపుడు॥ ౧౨౧॥ (క) హరి
పుత్రునిచేశరములఁ । బరిపీడితులగుచువిడువఁ, బడినయరాతుల్। గర
ములవిలక్షతనొందిరి । వరశరములు నొందవయ్యె , వైలక్ష్యంబున్॥
౧౨౨॥ (క) అపుడాప్రద్యుమ్నునిరణ । నిపుణతవీక్షించి మింట, నిలి
చిసుపర్వు । ల్విపులపులకాంకతనులై । యపరిమితోక్తులనుతించి , రట

మునియుతులై॥ ౧౨౩ ॥ (గీ) గంధముదిగంతరంబులఁ,గ్రమ్ముకొనఁగ । నభ్రముననుండివిమలబృ,హత్సుమంబు । హరిసుతునిమీఁదఁ బడియెఁదు,ల్యప్రకాశ । విమలతత్కీర్తిగగనభా,గమునకెగసె ॥౧౨౪॥ (గీ) అపుడుకేశప్రచురలోక,మైనయట్టి । గాఢసంగ్రామశిరమువి,కాసికుసుమ । లక్షణునిచేతరమ్యమా, ల్యంబుచేతఁ । బోలెసుపరిష్కృతంబయ్యె,నాలమందు॥ ౧౨౫ ॥ (గీ) సాదరంబుగఁ బోరుచు,నతిరయమున । సమరరాగసమాకృష్ట, చైద్యసేన । మదనుచేతఁ దటస్థాన్య,మనుజసాద । రతనుబొందింపఁ బడియెసం, గ్రామమందు॥౧౨౬॥ (వ) ఇట్లువిజయలక్ష్మీసమాలింగితుండైన శిశుపాలుండుప్లవమానకలభప్రమాణమహోన్నతతురంగమయుసమాకృష్టకార్ముకమౌర్వీటంకారప్రభూతనిర్ఘోషతుల్యతూర్యనాదయుసయత్ననానావిధ రిపుసమూహగతిభేదవిగ్రహనాశకసాయకయురణరాగిణియుహయశ్రేష్ఠనాదకలహాయమానవాద్యయులోలాసికృష్ణసర్పవిశేషకులయు సముల్లసలోహకంచుకశ్యామయగుటంజేసియంతకునకు భ్రాతృస్నేహంబున సాహాయ్యంబుగావింపంగోరిసాక్షాత్కరించిన యమునానదీ తుల్యయుఁదారసింహనాదజనయు ననామయయునగుసేన మత్తధీరగజంబులు గలుగునట్లుయుద్ధయాత్రారంభంబునందవిచ్ఛిన్నరణరాగయునైనసైన్యంబుతోఁగూడ శత్రువులపైకురువణించెఁ దత్సమాగమసంభవ మహాకోలాహలంబుకల్పాంతకాలోద్వేలపారావారరవంబు ననుకరించె॥ (సీ) అప్పుడు భూపాల,కాగ్రేసరులు విచ్చుకత్తులతళతళ,ల్గ్రిచ్చు కొనఁగ। మ్రోలవసించిరా, వేలశౌర్యానురాగప్రౌఢనికషంబు,గాదెశస్త్ర। జీవులకాజిచేఁ,జెలఁగినిర్మలహృద్యసాంద్రసంపదగల,స్వర్గమునకుఁ। బోవఁ దలంచువాఁ,డేవాఁడు నసిలతధరియించియలసప,దంబుదాల్చు॥(గీ) బాహుదండంబులను ముష్టి,పాతనముల । నూరుసంఘట్టనంబుల, ను



భయబలము । సాహసంబున మత్తమై,స్వపరబలవి । వేకశూన్యమై రణముగా,వించెనపుడు॥ ౧౨౭ ॥ (వ) అనంతరంబ పరాహంకారహారియు బలవన్మత్తమహేభంబునగు నమ్మహాయుద్ధంబునందుఁబూర్ణోత్సాహజననిర్ఘోషంబుగలుగునట్లుసైనికుల యభంగుర ప్రతాపంబుశోభిల్లెభయంకరధ్వనియుక్తజవనమనోహర మత్తగజేంద్రయువిస్మృతమనుష్యజాతకలకలధ్వనియుమానిజనమహాహవయునగు నాసేనరసరాగంబువలన మోహంబునొందె మఱియునభంగుర వతుర్ణలాకారయుముష్టిగ్రాహ్యమధ్యయునగుధనుర్లతయాపనోద్ధతులచేతబలాత్కారంబు నాకర్షింపఁబడి యతిశయంబుగా ఘోషంబుగావించెఁగంఠబద్ధఘుంటికాసహస్రంబులు మ్రోయననేకదంతావళంబులు రణంబునకుం జనుదెంచితుండాగ్రగళచ్ఛీకరంబులచేత మహీరజంబడంచుచు ధృతప్రత్యగ్రశృంగార రసరాగంబులై సరోష సంభ్రమంబులై రణంబునందురౌద్రరసంబు వెల్లిగొల్పె॥ (సీ) జనవరప్రాప్తపూ , జాప్రతిపత్తులుసంగరైకనియతో, త్సాహయుతులు । నగుపదాతులహృద, యంబుననించుకమైన భీతిజనింప,దయ్యెనపుడు। శరపరిపూర్ణని, షంగకోటరములుప్రబలగోధాశ్లిష్ట,బాహువిటప । ములునగుధానుష్క,భూరుహంబులచేబలాటవికడుభీమ, మైతనచెఁ॥ (గీ) జిత్రరణమందుఁదేజంబు,చేతఁబరుల । కళుకుఁబుట్టించు జనసమూ,హాతిసాంద్రదృష్టనిరపాయమైనచే,దీశుసైన్య । మరిబలంబులమీఁదికి , నురువణించె॥ ౧౨౮॥(సీ) చక్రగోమూత్రికా,సర్వతోభద్రమురజముఖబహుబంధ, రమ్యపద్య । పఙ్క్తిచేశిశుపాల,వధమహాకావ్యంబుచాడ్పునశిశుపాల,సైన్యసమితి। చక్రగోమూత్రికా,సర్వతోభద్రమురజముఖ్యసువ్యూహ , రాజిచేత । దురవగాహంబయ్యెఁ,దొడరియెయ్యదిస్వభావమునరణోత్పన్న,ప్రతిభమయ్యె॥(గీ) నట్టితేజిష్ఠసైన్యమై,ఘలరుయదుసమూహ

ముద్వృత్తినత్యంత,సాహసమున। సింహనాదంబులు సెలంగఁ,జేదివి
భుని । మీఁదికిఁ జలించెరయమున, మేదురముగ॥ ౧౨౯ ॥(వ) మఱి
యును॥ (సీ) ద్రాఘీయసియుఁ జల,ద్దారుణజనసంకులయుఁ గరిగిరిగ
భీ,రయునుసార। నిర్భీకగణమహా,నినదయుఁ గృతవైరివధయుదుర్వా
రయుఁ, బ్రథితబలయు। నగుయదు సేనర,యంబున రాజమార్గంబు
ను సువిశాల,రథ్యకరణిఁ। బరిపంథిసేనపైఁ,బడియెనప్పుడు వికసత్పింఛ
హృద్యంబు,జవయుతంబు॥(గీ) బర్హికల్పంబువికసిత,బర్హచారు।వ
సుహరణశక్తమైనశ,ల్యాయుధప్ర । తానమదినాగములమీఁదఁ ,దక్ష
ణంబ । పడియెనధికవేగంబున, బంధురముగ ॥ ౧౩౦ ॥ (ఉ) ఆత
తజృంభమాణనిబి,డార్భటిజన్యము చెల్లుచుండఁగా । భీతియొకింత లే
క,యరిభీషణబృంహితముల్చెలంగవి। ఖ్యాతనగాభవారణచ,యంబుబృ
హత్కటిసీమనుండిచా । నాతులవర్షముంగురిసె,నద్రులొగిన్ సెల
యేఱులంబలెన్॥ ౧౩౧ ॥ (వ) మఱియునయ్యుద్ధంబుపునఃప్రవర్తి
తోచ్ఛలితలబ్ధశుద్ధిపదాతులచేగాంధర్వంబత్తురవిశేషంబులచేతం బోలెఁ
బ్రకాశించెనిజఖడ్గంబుచేత శత్రుమండలాగ్రంబుల ఖండింపుచున్న యొ
క్కవీరుండు కీర్తిప్లుతమహీమండలాగ్రంబైన యనింద్యత్వంబుప్రాపిం
చె మఱియొక్కవీరునిచేత సముద్యతంబైన ఖడ్గంబుచేత నపరిమితంబై
న శత్రుసైన్యంబు శీఘ్రంబుననతిమాత్రకలుషంబుగాఁగావింపం బడియె
సహస్రరక్షకుండు సహస్రహంతయునైన యొక్కభటుండుతన ఖడ్గం
బుచేత సహస్రంబును వధించి యందులోనొక్కకబంధంబు నృత్యంబు
జేసినంజూచి తనచేత సహస్రంబుహతంబయ్యెఁగదాయని సంతోషం
బునఁదానును సేనామధ్యంబునఁనృత్యంబుగావించెమఱియొక్కభటుండు
శస్త్రవణారూపశోభావదలంకరణభూషితుండైన రావణునిభంగిఁజూ
పట్టెఁబరిపంథిశస్త్రప్రహారంబుననిరస్తోరుయుగ్మండగుటంజేసిరక్తసిక్త



దేహుండై యుభయప్రకారంబులననూరుండునుంబోలె నరుణవర్ణ
విగ్రహుండై చూడం బడియె॥ (చ) శరధిసమాహవంబునవి,శాలసమే
ధితతేజుఁడైన దు। స్తరబల వీరుఁడొక్కఁడల,దక్షు మహాహవమందు దీ
ప్తదు । భరపృథుతేజుఁడైతనరు,రాజకిరీటునిభూరికోపమై। వఱలెడు
వీరభద్రు క్రియ,వారక పొల్చెనుదుర్నిరీక్ష్యుఁడై॥౧౩౨॥ (చ) పరభట
హస్తదీప్తకర,వాల విలూన నిజోరు ఖడ్గులై । వెఱపున నట్టె పోక
కడు,భీషణ భంగిఁ గరాళవక్త్రులై । పరఁగఁ బదాతులుం గినుక,ప
ర్వవడింజని బల్రదంబులన్ । బరువడిఁ బెందలల్గొఱికి,వైచిరి బెబ్బులు
లట్లబల్విడిన్॥ ౧౩౩ ॥ (గీ) అధిపుచేమున్ను సత్కృతు,లైనయోధు।
లతనిఋణ మీఁగుటకుఁ జచ్చి,రాజిలోనఁ । గడఁగి పతిచేతసత్కృతు,
గానివారు । కనలి కెడసిరివారల కన్నమున్నె॥ ౧౩౪ ॥ (వ) భా
గ్యవంతంబును దేజస్విత్వంబువలన దుర్నిరీక్ష్యంబును గుపితంబును ర
ణార్థియు నైన వీరలోకంబు నందుఁ బత్యనాదర నిమిత్తాపయశోని
వర్తకంబైన యుపాయంబు మరణంబున కంటె నెయ్యదిలేదని ని
శ్చయించి శాక్తికులచేత నైశిత్యంబు వలన నెందును బ్రతిహతంబు
నొందనిదియు నభ్యగ్రఫలశాలినియు నయోమయయునైన శక్తిపఙ
క్తురయందు విడువంబడియెం గాని శరీరంబు వలనంబుట్టినశక్తి విడు
వం బడదయ్యె రాజులు వ్యసనంబునందును నీతివిడువక పృతన చేతన
మానుషంబైన రణంబు గావించి రప్పుడయ్యుద్ధంబుఁ జూచి యంతరి
క్షవర్తి సిద్ధవిద్యాధరాదిజనసంఘంబు విస్మయంబు నొందె॥ (సీ) త్రి
ణతచాపంబులు, గణికల కైవడి బలుశరంబులఁగాముఁ,కులనుబోలె। ని
జగుణంబులచేత, నెఱిఫలప్రాప్తి పర్యంత మాకర్షించి,యవల విడి
చె। రయమున నేగుగు,ఱ్ఱంబులు పక్షవంతము లైన శరములే,కముగ
బెరసి । యారబ్ధ నవయుద్ధ,మైన శాత్రవ సైన్య మందుఁ బ్రవేశిచెం,

నద్భుతముగఁ॥ (గీ) గడిమి వీరుఁ డొకండు సం,గర సమాగ । తా రులందు శిలీముఖ,వ్యథము వలన । రహిజపాసూన సమరాగ, రక్త స్రుతిని । సాంద్రముగఁ గల్గఁ జేసెరో,షంబు వలన ॥ ౧౩౫ ॥ (గీ) రణముగావింపఁ గాంక్షించి, రయము మెఱయ । దూరమున నుండి వచ్చిన, వారణముల । రెంటి నడుమ గతాసువై,పృథివిఁ గూలి । నట్టి దంతివరండక, మట్ల యొప్పె॥ ౧౩౬ ॥ (గీ) భూరి భేరి రేఖా భ్రాభ, భారిభీర । ధార భూధార మత్తేభ,భూరిపఙ్క్తి । తోడఁ బ్రతినాగములుకొన్ని, గూడుకొనియె । నచ్చెరువుగాఁగ నమ్మహా,హవము నందు॥ ౧౩౭ ॥ (గీ) సమరగజములు భగ్నదం,తముల చేత । నురు మదము చెవిహస్తత, నొంది నట్లు । శాతకరవాలలూన హ,స్తముల చేతఁ । బొందు పడఁగ విహస్తత,నొందవయ్యె॥ ౧౩౮॥ (గీ) కరటిమదజలసిక్త సం,గరతలంబు । ఘనసరసిఁ బోలెఁ బృథుకరా,కర్షితోరు । విలసితసహస్ర పత్రము,ల్గలుగు నట్లు । క్షోభ మొనరించె నప్పుడు, గురుబలమున ॥ ౧౩౯ ॥ (సీ) సమరమందుగజంబు, సాయకక్షతమొట సవిషాద నిజయంతృ,సహితముగను । మృతినొందనప్పుడు,భృంగ సంఘంబులు రుతమిషంబునఁజాల, రోదనంబు । గావించి నట్లుండెఁ, గాలుని తల్పంబు గతినున్న సంగర, క్షితితలమునఁ। గరులు మత్కుణముల, కైవడిఁగనుపట్టెఁ దేజస్వియగునొక్క,ధీరవరుఁడు॥ (గీ) శత్రుతోమరముల స్రవ,ణంబగు దేహ । మథిఁ దాల్చిసంప్రహారమందు । నధికసాహసమున నాహవం,బొనరించి । విబుధ సామ్యమొందె,విక్రమమున ॥ ౧౪౦ ॥ (వ) మఱియు నిర్దయచిత్తంబును భీతానందనాశనంబునుదీప్యమానంబును విజయ సంలబ్ధ పూర్ణకామంబును మందోత్సాహవివర్జితంబు నైన యమ్మహారణంబు నందుభయాంకరాసురభావంబు ధరించిన వారయ్యనుబరిపంథుల చేత



నభిముఖావస్థితులై పంచత్వంబు నొందిన వీరులు దేవత్వంబుఁ బ్రాపించిరి నిపాతితసుహృత్స్వామిపితృవ్యభ్రాతృమాతులంబైనసమరాంగణంబు పాణినీయవ్యాకరణంబు పగిది దురవగాహంబై యుండెఁ దురంగఖుర రథనేమి సముద్ధూత మహీపరాగంబు మింటికెగసి యంధకార బంధురంబు గావించి దృష్టి ప్రసరణంబు లేకుండ నిరోధించుటయు నంతలో మదోత్కట కరటిఘటాకట విగళద్దాన సలిలాసారంబున నది యడంగుటయుఁ బదంపడి యోధాగ్రేసరులు వీరావేశంబునందలపడి సర్వాస్త్రశస్త్ర పాతంబులమహాసంగ్రామంబు గావించి రందువిదీర్యమాణ పుష్కరాకీర్ణంబులును బతచ్ఛంఖ సంఘాకులంబులును ప్లవమానపత్రరథంబులు నగు సంధ్యాకాలమేఘవర్ణసవర్ణరక్తవారిప్రవాహంబు లనేకంబులు ప్రవహించె భూత భేతాళపిశాచ గణంబులును గాక కంకగృధ్రాదిపక్షిసంఘంబులును మేదోమాంస మస్తిష్కంబులును భుజించి కడుపులునిండ రుధిరంబులు గ్రోలి కలకలారావంబులుగావింపుచు నృత్యంబు సేయుచుండె ॥ (క) గతమౌర్వి చాపముల చే । నతిచిత్రము బహుశతప్ర,దాన్వితమగుచున్ । వితతాయోధన మేదిని । సతతంబు వెలింగెవృష్టి,జలదముమాడ్కిన్ ॥ ౧౪౧॥ (క) బలమధ్యంబునఁ గెడసిన । బలవంతునిఁ జూచి యతని బంధులు దుఃఖా । కులురైరి నిహత కుంజర । ములమెడ ఘంటలునుమిగుల, మ్రోయకయుండెన్॥ ౧౪౨ ॥ (గీ) రణనిహత దంతిదంతగా,త్రప్రకీర్ణ । యగుచు రణ భూమిపిష్ట లో,కాసుమృత్యు । ముసల భాస్వదులూఖల,విసర కీర్ణ । మైనచందానఁ జూపట్టెనద్భుతముగ॥౧౪౩॥ (గీ) మానవంతుండు చైద్యుఁ డి,మ్మాడ్కి రణము । నర్చుచు విధూతచైద్యాన్య,నరుల నరులఁ । బరఁగ నభ్యవరోధంబు,వలనఁదూలఁ। దోలెఁబవనుండు ఘనములఁ,బోలెనపుడు॥ ౧౪౪ ॥ (క) ఈసరణి

నాత్మసేనల । గాసిల్లఁగఁ జేయు చైద్యుఁ,గని హరిసమరో । ల్లాస ము ముఖకమలమునకు । భాసురబాలాతపంబు, భంగిఁ జెలంగెన్ ॥ ౧౪౫ ॥ (సీ) సలలిత మణిహేమ,వలయ శోభితదీర్ఘధనువు మహేంద్రాయు,ధంబు గాఁగఁ। గటితటశోభిత, కాంచనాంబరరుచుల్వితత శతహ్రదా,ద్యుతులు గాఁగ । బుంజీకృతాయత,శింజినీనాదంబు దారుణస్వన గర్జితములు గాఁగఁ । గడువడిఁ బరఁగించు,బెడిదంపుటంపలతలుచైనపిడుగుల, చారుగాఁగ॥ (గీ) మణిమయ విచిత్రమండన,ఘృణిపరంప । రలుజనాత్ముల మిఱుమిట్లు,గొలుపఁగృష్ణ । మేచకాభ్రంబుశిశుపాల,మేదినీశ । సైన్యదావాగ్నిపైఁ గ్రమ్మె, సాంద్రభంగి ॥ ౧౪౬ ॥ (వ) మఱియు వక్షోగత కౌస్తుభ మణిచ్ఛాయాచ్ఛురిత పీతాంబరంబు గలుగుటం జేసి శక్రధనుస్సంగత సౌదామనీ సహిత నీలమేఘంబు భంగిఁ జెలంగునదియు ముఖసౌరభ లోభభ్రమద్భ్రమరసంయుతంబును లలనోప లాలనంబును క్రీడాలోలుప విలాసాలయంబున భూతపూర్వ సమాగమ యగుటం జేసి తత్కాల సమాగమంబున సాభిలాషయైన విజయశ్రీకటాక్ష విలోకితంబునగు భక్తానుగ్రహ విగ్రహంబుచేత దీప్యమానుండును ప్రభావ సంపన్నుండును మహైశ్వర్యవంతుండును నక్షత్ర ప్రభోజ్జ్వలుండును విశిష్టదీప్తి సంపాదకుండును బక్షివాహనుండును భయరహితుండును సర్వజంతు రక్షకుండును సంసారదుఃఖ నివర్తకుండును మహీభర్తయు నిజపారప్రాప్తి కాములును నిశ్చితులునగు దేహత్యాగ కృతోద్యోగ యోగులచేత సాక్షాత్కృతుండును నానందసాంద్రయు నక్షీణ కాంతియు సర్వోత్కర్ష గుణవ్యాప్తయు రమ్యకుచయు నిర్దోషయునగు లక్ష్మిచేత సత్వరంబుగా నాలింగితుండునైన శ్రీకృష్ణునవలోకించి శత్రువులయ్యును శిశుపాలాదులు నిష్పాపులైరరోచమానంబైనను దివ్యౌషధంబు స్వభావశక్తిచేత నేరో



గంబును హరించినట్లు మాధవుండు దర్శనమాత్రంబుచేతనే వారలపాపంబులన్నియు హరించె॥ (క) జితయుద్ధబలము నందొగిఁ । జతురతసమరంబు సేయఁ, జనుదెంచు హరిన్ । జితగదుని భువిఁబ్రసిద్ధుని। హితవీర్యునిఁ దాఁకిగెలువ, నెవ్వండోపున్॥ ౧౪౭ ॥ (గీ) అగ్రభాగమందు,నతి గరీయంబైన । కృత్యమందు నిర్ణ,యింపఁబడిన। యధిపుచేతమిగుల, నారోపితగుణోరు। కార్ముకంబు నమ్ర,గతివహించె॥ ౧౪౮ ॥ (గీ) అందుఁ బర్వతమ్ము, లగుట రమ్యములైన। యమ్ములపుడు సంహి,తంబు లయ్యె । వీనులంటలాగి, విడిచినఁ గార్ముక। ధ్వనిసుపరుషమయ్యెఁ, బరులకపుడు॥ ౧౪౯ ॥ (ఉ) చండభుజావలేపమున, శౌర్యధనుండగు శౌరిభూరికో । దండము నెక్కుఁబెట్టిగుణ, దారుణశబ్దము భూనభంబులున్ । నిండననేక కాండములు, నేర్పునఁ గూర్చి విపక్షసేనపై । మెండుగఁ బర్వఁజేసెనటు,మింటసుపర్వులు సన్నుతింపఁగన్ ॥ ౧౫౦ ॥ (గీ) పరఁగఁ బశ్చాత్కృతంబైన,పత్రులందు । నొనరనేపత్రి సుగుణసం,యుక్తమయ్యె । నట్టిపత్రిమాధవునిక,నాఁటంతమందుఁ । జేరె నాప్తుని చందానఁ,జెలువుమీఱ॥ ౧౫౧॥ (గీ) దిఙ్ముఖ వ్యాపకములతి, తీక్ష్ణములును । హరిదులును సంతతము మమర, భేదనములు । నైన శరములు శత్రుల,నచ్యుతుండు। విడిచెనేకకాలంబున, వేగ మడర॥ ౧౫౨ ॥ (సీ) అనిలోనమాధవు,ధనువాకృటియె గాదు మండలీ కృతమాట,చండకాండ । మథితమై రిపు సేన, మండలీకృతమయ్యె మఱియు లోకాలోకి, మధురభాషి। కలుష విదూరుండు, నళికులాలకుఁడు నిరంకుశుండకలంకుఁ,డనఘమూర్తి । ప్రళయ కాలమునవ,రాహలీల నటించు నద్భుత చరితుఁడు, నైనశౌరి॥ (గీ) వర్మధరులైన పరిపంథి,వరుల దృక్కు । లీనికలయందుఁ బ్రహరించె, నేర్పుమీఱఁ । గాముకము నందుసూక్ష్మల,క్ష్యత

మొగాని । వితరణుల యందుఁ బోలె స్థూలతయు లేదు॥ ౧౫౩ ॥ (క) తతముక్త బహువిశిఖ యదు । పతిచాపం బటు హరించెఁ, బర జీవితము । ల్చతురతఁ బరచాపసజీ । వతనుమది సహింపదయ్యెఁ, బవరము నందున్॥ ౧౫౪ ॥ (గీ) వరరుడవివరుండు వైరివిదారియు । వారి రౌరవుండు, వరుఁడు వీరుఁ । డుర్వరాగ తపను నొప్పున, నొప్పు ము । రారి విస్తరించె, వైర మపుడు ॥ ౧౫౫ ॥ (గీ) అరినిహంత యునైన శ్రీ,హరిశరములు । తవిలి పానార్థ రక్షార్థ, ధాతువులగు । చుండ వైరుల శోణితం, బొనరఁ గ్రోలె । భువనములను రక్షించెన, ద్భుతము గాఁగ ॥ ౧౫౬ ॥ (గీ) అవనిభారావతరణార్థ, మంచితముగ । నవతరించిన వాఁడయ్యు, నచ్యుతుండు । ప్రబల శాత్రవ పృథు శరీ,రముల చేత । భూమి వర్ధన మొనరించె నేమి చెప్ప॥ ౧౫౭ ॥ (క) హరియొక శరమున వ్రేల్మిడి । నరిగణ తరువులను గూల్చె, నటు తామునుసుం । దరరామరూపమునను । ర్వ్వరలోఁ గావించినట్టి,పనికి సమము గాన్ ॥ ౧౫౮ ॥ (క) శూరుఁడు లక్ష్మీ ప్రియుఁడగు । శౌరి దిశా వ్యాపకాతి, శాత శరములన్ । వారక నిలఁ బడ ద్రవేసెను । వైరి శిరంబులను దాళ, ఫలముల మాడ్కిన్॥ ౧౫౯ ॥ (గీ) అరి మనోహరంబు,లై శౌరి తూపులు। హృదయమందు నిలువ, కేగ నవలి । కందు వలన సారె, కరుల శత్రుత్వంబు । వ్యక్తమయ్యె హరికి, నాలమందు ॥ ౧౬౦ ॥ (వ) ఇట్లు మధుసూదనుండఖండ కోదండ పాండిత్యంబు మెఱయఁ దండోప తండంబులు గాఁ గాండ ప్రకాండంబులు పరఁగించిన నందు హరి నామాంకితంబులైన కొన్ని బాణంబులు శత్రు శరీరంబుల ప్రాణంబుల హరించెం గాని నామాక్షరంబులకు మాలిన్యంబు గలుగు నని తచ్ఛోణితంబు సంస్పృశింప వయ్యెఁ గొన్ని సాయకంబులు వీరవర్గప్రాణ



సర్వస్వంబును హరించి చోరులుం బోలె దూరంబున మహీతలంబునం దదృశ్యత్వంబు నొందెఁ గొన్ని బాణంబులు రిపుకంఠచ్ఛేదనంబు గావించి మాంసఖండ పరిచితంబులైన ముఖంబులు గలవియై పక్షులుం బోలె నాకాశంబున కెగసె నప్పుడు రిపుశరీర సంజాతశోణితంబు శత్రు నారీనేత్ర సంజాత బాష్పతోయంబులుం గలసి ప్రవాహరూపంబై ప్రవహించె హరిమాయా విశేషంబున శత్రుసైన్యంబు సందుఁ బరిపంథులేకద్విత్రి చతురాకారంబులు గలవానిఁగాఁ గృష్ణుని విలోకించి తత్క్షణంబ తాము పంచత్వంబు నొందిరి సదామద బలప్రాయుండును సముద్ధృతరసుండును బ్రతీత విక్రముండును శ్రీమంతుండు నగు హరి రెండవ హరియుం బోలెఁ బ్రకాశించె నిట్లు హరిశరంబులు శత్రువధాత్మకంబైన యిష్టార్థంబు గావించి యధోముఖంబులై మహీతలంబు ప్రవేశించె సర్వలక్షణ పరిపూర్ణ శరీరుండును నిరస్తశత్రుతేజుండును మహాత్ముండునునగు కృష్ణుండు దైవ సంపన్నవ పూరణంబులైన సంగ్రామంబులందు జయంబునొంది రణసముద్రంబంతయు నిస్తరించి తేజోవంతుండై ప్రకాశించె నిట్లు లబ్ధవిజయుండై కల్యాణమూర్తియు లబ్ధాఘక్షయ శుద్ధియు శ్రీవత్సలాంఛన విశేషభూషిత వక్షుండును నిర్భీకుండును శత్రుమృగ వ్యాధుండును నిత్యాభ్యుదయవంతుండును నగు కృష్ణుండు రణరాగంబు వలన నహంకారోద్ధురంబైన సత్త్వంబు నవలంబించి మహోత్సాహంబున సింహనాదంబు గావించె నంత॥ (మ) హరి వీర్యంబు సహింప కప్పుడు మహా,హంకార యుక్తుండు చే । దిరసాధీశ్వరుఁ డుల్లసత్త్రివళి సం,దీప్తంబు సద్గ్రంథిల । స్ఫురితభ్రూయుగ యుక్తమైనవదనం,బుం దాల్చి నిర్భీకుఁడై। వరుసం బోరికి రమ్మటంచు హరినా,హ్వానంబుఁ జేసెన్వడిన్॥ ౧౬౧ ॥ (ఉ) శౌరికరప్రముక్త శిత,చక్రనిపాతన సంప్రతీక్షము । న్నారయ

నంస సంస్థితమ్ము నైన దురాసద కాల మృత్యువుఁ । వారక తాల్చి నట్టిశిశు, పాలురథం బదిసూతరూప దు । ర్వారవిధి ప్రయత్నమున, గ్రక్కున నేగె మురారి డాయఁగన్ ॥ ౧౬౨ ॥ (మ) జలజాతాక్షు రథంబుసంఘటిత ధా, స్వచ్ఛక్ర సంక్షుణ్ణభూ । కరపీతాసు శరీర జంబులగుటన్, గాశ్మీర భూజాంగలా । శ్యరసా ప్రోద్భవ కుంకుమారుణములై, కన్పట్టు రక్తంబులున్ । స్థిరకుందట్టపు జాజుత్రావాయుచుఁ జనెన్, జేదీశుపై క్రుద్ధతన్ ॥ ౧౬౩ ॥ (మ) కలనిక్వాణ కరాళకింకిణియు, దీర్ఘ స్వర్ణ కేత్వంశుకాం । చలమాశౌరి రథంబు ముక్తశిఖుఁడై, చైద్యున్ రణ క్షోణిలో । పలఁబంచత్వము నొందఁజేయక శిఖా, బంధంబు గావింపనం । చలఘు ధ్యానము సేయు కాలుని క్రియన్, వ్యాపించె దుర్వారమై ॥ ౧౬౪ ॥ (మ) నవనీలాభ్రరవానుకారియు నితాం, తాపూరితా శాంతమున్ । శ్రవణానందదమైన కృష్ణునిరథా, రావంబు నాలించికే । కివితానంబులు నూర్ధ్వ కంధరములై, కేకాధ్వనుల్మీఱఁ జ । న్యవనిన్ సమ్మద తాండవంబుసలిపెన్, దాలాను కూలంబుగన్ ॥ ౧౬౫ ॥ (మ) ఘనగంధోజ్జ్వల రుక్మిణీకుచతటీ, కాశ్మీర జంబాలలాం । ఛనవిభ్రాజిత భార్గవీరమణ వ, క్షంబు న్విలోకించుమా । త్రనె చేదీశుని చిత్తమందుఁ జిర కా, లస్థాయి రోషాగ్నిచ । య్యనదీపింపనొకింత సేపు వివశుండై యుండి వాఁడంతలోన్ ॥ ౧౬౬ ॥ (సీ) తెలివొంది చంచలా, నిలచోద్య మానకల్పక్షయకాల, సంభవ మహోగ్ర । శిఖిశిఖా సంకాశ, శింజినీయుతమైన ధనువును సారించి, దారుణముగ । ఘనవజ్రరవ శంక, గలుగునట్లుగ గుణనాదంబు గావించె, మేదురముగ । సంధాన మోక్ష ల, క్ష్యముగాన రాకుండ శౌరిపై విశిఖ, వర్షంబు గురిసె ॥ (గీ) గవలమేచక రుచిమధ్య, కలితదీర్ఘ । ఘోర భుజదండనాసంబు, కుపితకాల । భ్రూయుగభయంకరంబయి పోలుచు



చైద్య । కార్ముకం బెల్లవారిచేఁ, గానఁబడియె ॥ ౧౬౭ ॥ (గీ) భూరితట దుజ్జ్వల స్వర్ణ, పుంఖము లన । యోషిత ముఖంబు లధికర, యంబులును మ । హాస్వనంబులునైనశా, తాంబకములు । గగన భాగంబు ఘనముల, కరణినొప్పె ॥ ౧౬౮ ॥ (సీ) ఘనకర్తరీ సాయ, కములు శాతఫలాగ్ర నిర్భిన్నఘనగళ, స్నీరప్రస్ఫుటాతివేదన లగు, నాశలనుండి తద్దయుఁ గాఱుబాష్పసం, తతియు బోలెఁ జక్రవాళంబు నాచ్ఛాదించె మఱియుఁ దత్కాండముల్గగన భా, గమున కెగసి । యినమండలంబుగ, ప్పినభూమిజనులకాకసముగన్పడకుండె, క్షణము సేపు ॥ (గీ) పరఁగ నబ్భంగి సాయకాం, తరిత కృష్ణ । యగుటఁ జేసి వసుంధర, యనిమిషులకు । నొకక్షణము చూడఁబడకుండె, యుద్ధమందుఁ । జిత్రమై తోఁచెఁ జేదీశు, చేతిబలువు ॥ ౧౬౯ ॥ (గీ) చైద్యుచే నప్పుడిబ్భంగి, సకలశౌరి । భీకరానీకమున కెండ, సోఁకకుండ । సాంద్రవిశిఖ జాలైకవి, శాల గృహము । ఘనతనత్యద్భుతంబుగాఁ, గట్టఁబడియె ॥ ౧౭౦ ॥ (వ) ఇవ్విధంబున నప్పుడమ్మధుసూదనుని సైన్యంబు శిశుపాలకృతశరపంజర మధ్యంబునఁ బక్షిసంఘంబు కరణిం జిక్కి చలింపకున్నం జూచి యసహాయశూరుండగు కృష్ణుండు పరిపంథి విగళితాపరిమిత శరవర్షంబును నిజబాణంబులచేత వాదిప్రయుక్తానుమాన ప్రమాణంబుల చేతఁ బ్రతివాదియుం బోలె నివారించె ॥ (శా) శ్రీకృష్ణుండు కపోణిసక్తికినుక, న్జైదీశు నీక్షించి వి । ల్లాకర్ణాంతముగా వడిందిగిచి ప్ర, త్యాలీఢపాదస్థుఁడై । లోకాలోక గుహాముఖంబులు బదు, లర్మ్రోయంగ

దిక్కుల్నభం । బాకంపింపఁగ మౌర్వినాదమటు బా,హాశక్తిఁ గావిం
పుచున్ ॥ ౧౭౧ ॥ (చ) అలఘుధనుష్ప్రభావము గు, ణాతి మహత్త్వ
ముముష్టిశక్తియో । యిలయు దిగంతముల్గగన,మీనుచునున్నవొ యే
మి చిత్రమో । తెలియఁగరాదుశౌరిసము, దీర్ణ శరంబులు చిత్తజ
ల్లుల । ట్లలవడ నొక్కరీతిఁ గురి,యం దొడఁగెన్ధ్వనిపూర్వకంబుగన్ ॥
౧౭౨ ॥ (ఉ) ఎక్కడఁ జూడఁ గృష్ణుని య,హీననిశాత పృషత్కకో
టిన। ల్దిక్కులనుండు వారిధుల,లీల సముద్ధతి మేరమీఱియే। దిక్కునుజూ
డ శత్రుబల , దీవులముంచెఁదదీయయోధులం । దొక్కరుఁడైన లేఁడు
శర, ముద్ధతి సోఁకనివాఁడు చూడఁగన్ ॥ ౧౭౩ ॥ ( వ ) ఇట్లు
దానవాంతకుండు సంరంభ విజృంభితుండై తనచేతి శరలాఘవకరలా
ఘవంబులబలువుఁ జూపిన శిశుపాలసైన్యంబునందు నిశితంబులైన య
ర్ధచంద్ర బాణంబుల శిరంబులు దెగి యోధులశిరంబులు కర్తన వేగం
బున మింటికింబఱచె గగనలక్ష్మి పట్టియాడు కలువపూబంతుల చందం
బునఁ జూపట్టెనందుఁ గొన్నిశిరస్సులు మింటినుండి మహావాతపతిత తా
ళఫలంబులుంబోలెఁబుడమింబడియెశరంబులపరస్పరఘట్టనంబునంబుట్టిన
పావకజ్వాలలు మింటికెగసి మేఘంబుల సంస్పృశించి సైన్యంబులమీఁ
దఁ్రవాలిన సైనికులుకపిలముని కోపవహ్నిజ్వాలల భస్మరాసులై పుడమిం
గూలిన సగరకుమారుల పగిది భస్మీభూతులై మహీతలంబునంబడి ర
ప్పుడు హరిశర పరంపరలచేత విపక్షశిలీముఖమేఘజాలంబువిభిన్నంబై
న వికసితవదన సరోజంబులైన యాదవసైన్యంబులు దిశలుంబోలె మి



క్కిలిఁ బ్రకాశించెసమాచ్ఛాదితసూర్యమండలంబులైన శరసమూహం
బులు గగనంబు నాచ్ఛాదించె నయ్యవసరంబున హరిచాప యష్టియం
దుబాణంబొక్కసారివిసృష్టమై పుంఖానుపుంఖత్వంబుచేతబాణసంధా
నమోక్షదుర్లక్ష్యత్వంబువలననసేకబాణంబులేకబాణంబుగాఁగనుపట్టె॥
(సీ)అతివేగరావంబు,లతులపత్రముల్కాంచనపింగళ , కాయకాంతు।ల
గుదానవారిసా,యకములు భయమూఢకాకోదరంబులు, గల్గినట్లు।ధ
రణిభేదించిపా,తాళ తలముసొచ్చెఁ జేదీశుచేమున్ను, చింతలేక । ప
రమమర్మభేదన, పరుషపృషత్కంబు లపరాధములభంగి,నచ్యుతునకు॥
(గీ) దుఃఖమొనరింపలేవయ్యెఁ, దోషతోడ। నధికమాయుఁడు లయ
కాల, మందుయోగ । నిద్రితుండగుశౌరికి, నిద్రగలుగఁ । జేయుటకు
స్వాపనాస్త్రంబు,చెలఁగి యేసె ॥ ౧౭౪ ॥ (వ) ఇట్లు శిశుపాలుం
డు స్వాపనాస్త్రంబు ప్రయోగించినభాస్కరుని నర్థశూన్యసంజ్ఞ గల
వానిఁగాఁజేయుచు నిద్రాఘూర్ణిత లోచనారవిందంబులుగలుగు నట్లు
గానమ్మహాస్త్రప్రభవాంధకారంబుహరిసైన్యంబునాచ్ఛాదించె॥(చ)అ
పుడు మహీపతుల్నిజ శ,రాసనమందు నిషణ్ణమూర్తులై । విపులత
నిద్రనొందిరది, వింతయె మేల్కొని యుండువేళల । న్విపులవిపద్వినాశ
కర,విశ్రుతచాపముపైనిషణ్ణులై ।నిపుణత నెప్డు నేమరక, నిద్దురవోయెదు
శూరకోటికిన్॥ ౧౭౫ (గీ) శ్లథతనొందివహాన, శక్తిలేనివిపక్షు । వ
రులచేతి ధనువు,వదలిపడియె। మొనసి యభ్యసించి,యును బ్రమాదం
బున । గళితమైన విద్య,కరణినపుడు॥ ౧౭౬ ॥ (ఉ) సీరధిమధ్యనుం

దుమును,నిద్దురవోయెడు ప్రోడయయ్యెనిం। పారస్వసైన్య వార్ధిఁగ
త్తుఁ,ద్రైభువనత్రయ రక్షణంబున। న్వారకజాగరూకుఁడయి, భాసిలు
నాదిమపూరుషుండుల । శ్రీరమణుండు జన్యజయ,శీలుఁడు మేల్కొ
నియుండెన త్తతిన్॥ ౧౭౭॥ (చ) అనువుగ నేమహాత్ముని సుమంచిత
నామము నుచ్చరించినం । తనెచిరకాల భుక్తభవ,దారుణ పాపత
మంబడంగున । వ్వనరుహపత్రలోచనుని , స్వాపనబాణ తమంబుగ్రే
మ్మునే। దినకరునాక్రమించుటకుఁ, దీవ్రనిశోత్థతమంబుచాలునే॥౧౭౮॥
(సీ) అప్పుడుహరిచాత్కు, పాద్భుత తేజంబు తపన తేజము భంగి,విపుల
కౌస్తు । భాదర్శమందు నో,య్యనసంక్రమించిన నందు దుర్వారస,
ర్వాంధకార। నిరసనక్షమమైన,నిరుపమ ధామంబుపొడమె నాలోక,వి
భుండుభాస్కర।రాబ్జ నేత్రుఁడుగదా,యమ్మహామణిధామనిచయంబువి
కసిత,నేత్రసైన్య॥ (గీ)సమితివలననవావిల,చారుదర్శ।నంబునట్లనెజ్ఞానం
బు,నపుడొసంగె। భవ్యమతులప్రసాదంబు,భక్తులందుఁ।బోలెదిశలందు
వ్యాపించుఁ,బొలుపుమీఱ॥ ౧౭౯॥(క)దిననాథుండుదయించిన।జనములు
తెలివొందినట్లు,స్వాపనశరసం । జనితతమమువిడిచినఁజ । య్యనహ
రిసైన్యంబులేచి, యనికిఁగడంగెన్॥ ౧౮౦॥ (వ) ఇట్లుస్వాపనాస్త్రం
బున్యాయవాదంబునందు మిథ్యాభిశంసనంబునుంబలెఁ గౌస్తుభమణి తే
జంబుననిష్ఫలంబైన నాగాస్త్రంబుప్రయోగించెనంతనయ్యస్త్ర ప్రభా
వంబునఁ గరాళవక్త్రంబులై దీర్ఘపృష్ఠంబులైకోఱల వలన నస్రాం
తంబువిషంబు గ్రక్కుచుఁజంచలరసనాద్వయాస్వాదితోభయపార్శ్వ



ప్రాంతదేశంబులు గలుగు నట్లనేకంబులేక కాలంబున నావిర్భవిం
చికార్ష్ణ్యంబువలన విహితకేశానుకరణంబులై కపటంబున జయంబు
గోరుచుఁ దొల్లిసముద్రసంజనితోచ్చైశ్శ్రవోశ్వవాలంబునుంబోలె నం
తరిక్షంబును క్షణమాత్రంబులోన నైల్యంబుగావించె ముఖంబునందు వి
స్తృతంబులైయనుక్రమంబుగా శరీరంబునందు గోపుచ్ఛంబువలె నుత్త
రోత్తరంబణుత్వంబుధరించి భరతశాస్త్రవిశారద కవిప్రణీతకావ్యగుం
ఫితాంకంబులైన నాటకవిస్తారంబులుం బోలెఁ బ్రకాశించెనప్పుడుసూ
ర్యుండు రాహుగ్రస్తమండలుండైన వానియట్లవిషసహిత సముత్థితోరు
ధూమతిరోహిత నిష్ప్రభమరీచియగుటంజేసి తామ్రపిండ సచ్ఛాయం
బైన శరీరంబును ధరించె॥ (సీ) అప్పుడు కొన్నిమ,హాహులుశమనపా
శములకై వడి, శరీరములఁజుట్టి।కొనియెభోగులుకొన్ని,యినుపశృంఖల
ములకరణిసైన్యంబుల, కాళ్లఁబెనఁగె। విసపు కోఱలుకొన్ని,భిదురంబు
లవిధాననంగముల్గఱచిగా,యములుచేసె । వితతముఖంబుల, వెడలు
నిశ్వాసముల్కాయంబు మిక్కిలిఁ,గమలఁజేసె॥ (గీ) నాలుకలుసాఁచు
చుఁబ్రచండ,లీల ఫణులు । మెడలు బంధించె నూపిరి, వెడలకుండ। స
పక్షమయమయిపాతాళ,జగముభంగి । సమరమేదిని యొప్పెనా,సమ
యమందు॥ ౧౮౧ ॥ (వ) ఇట్లునాగాస్త్రపాశ బద్ధులై చిక్కుపడి
యున్న నిజసైన్యంబు నవలోకించి ముకుందుండు మందహాసంబుఁ జేసి
నిజధ్వజాగ్రంబున నంతకమున్నె నాగాస్త్రజనితఫణిమండలవిలోకనజా
తకోపుండైయున్న నాగాంతకుని విలోకించెనంతఁ దద్విలోకనమాత్రం

బున నవ్వైనతేయుండు విజృంభమాణశరీరుండై యనేకగరుత్మంతుల సృజించిననవి యసంఖ్యాతంబులై కృష్ణనామంబుచ్చరించుచు నాకాశంబున కెగసిసువర్ణవర్ణపర్ణరుచులు సూర్యకిరణంబులుంగలసి గగనంబంతయు స్వర్ణమయంబుఁ జేయుచు॥ (సీ) శతకోటిసంకాశ,శాతనఖంబులఁ దలలుచిందఱ పాఱఁ, దన్నితన్ని । శితచంచు పుటములఁ,జించిచెండాడిర క్తము గ్రోలిఖండలు, నమలినమలి । యాతతపక్షసం,జాతఝంఝానిల చాలనంబునఁ దూలఁ,దోలితోలి । పక్షవిక్షేప సం,భవ భూపరాగంబుచేత నంధులు గాఁగఁ,జేసిచేసి॥ (గీ) చైద్య ము క్తఘోర,సర్పాస్త్రసంభూత । వివిధదందశూక,విసరములను। హరి విముక్తగారు,డాస్త్రజగరుడసం । దోహమపుడుపట్టి,తునిమివైచె॥ ౧౮౨॥ (వ) ఇట్లువైనతేయ గణంబులచేత సర్పసంఘంబు హరిస్మరణాదిపుణ్యంబులచేత బ్రహ్మహత్యాది మహాపాతకంబులుంబోలె నశించె హతశేషంబులైన కొన్నిసర్పంబులుఖగేంద్ర పతత్రసమీరణ బలాత్కారోన్మూలిత శైలద త్తవివర మార్గంబున వివశంబులై స్వకీయ స్థానంబైన పాతాళంబు ప్రవేశించెనిట్లుతననాగాస్త్రంబు మోఘంబైన శిశుపాలుండు లజ్జితుండై పదంపడి రోషవిశేషంబున సమంత్రకంబుగానాగ్నేయాస్త్రంబు ప్రయోగించిన నదిపొగలేని మంటలుమియుచు విస్ఫులింగపటలీ సంచారఘోరంబుగావితతాయతజ్వాలాబాహుండైన బేతాళునిపగిది నాకాశంబున కెగసి చలితోన్నత ధూమకేతనుండును సరభసాంబరరోహారోహితవాహుండును శీఘ్రమారుత సారథియునైన పావకుండు కనకరథంబుపోలిక గగనంబుననొప్పి సముజ్జ్వలదాకాశకోటరాంతరాళంబును సాంద్రతరార్ద్రమేఘపత్రబద్ధధూమంబును బ్రజ్వలితదీర్ఘకాష్ఠంబునైన విశ్వంబును దరువునుంబోలెదహించెమఱియుం గాంతారంబు నావరించినదవానలంబుపగిది యాదవసైన్యంబుచుట్టుముట్టి యట్టహాసంబున ఛటచ్ఛటశబ్దంబు లెగయధూమపటలంబు గగనంబున కంబుదత్వంబుసంపాదింపఁ జెలరేఁగియాదవసైన్యంబుల నీఱుసేయందొడంగిన విశ్వంభరుండగు కృష్ణుండు విలోకించి యయ్యస్త్రంబునకంటె నినుమడిగాఁ గోపోద్దీపిత ముఖుండై వరుణ దేవతాకంబైన యస్త్రంబు ప్రయోగించిన నమ్మహనీయాస్త్రంబు॥(సీ) చతురబ్ధిగర్భవి,శాలకుక్షియుఁ దనూసంధిలీలాఖిల,సింధు జాలుఁడంబుస్వరూపకుం,డగుటఁద్రిధాముఁడైకొమరొందుహరి శిరో,జములవలన । జలద పరంపర,ల్జనియించి భూరిగర్జారవంబులెసంగ, నఖిలదిశలు । నావరించిది నేశ్వ,రాభిఖ్యలనుమాపి యాకసంబునకునై ,ల్యంబొసంగెఁ॥ (గీ) గనకనికష రేఖాగౌర,ఘనసమృద్ధి । తోరుచపలాట్టహాసమ,వారితాను । బద్ధఘనగర్జితాటోప,బంధురంబు । నగుచుఁ గడుచిత్రమైయొప్పె,గగన మపుడు॥ ౧౮౩ ॥ (గీ) ఖరకరమరీచి పరిభావు,కంబుల చిర । విరచితాభ్యంగగజదేహ,విపులకాంతు। లున్నతములైన మేఘంబు,లొప్పమీఱ । ననలునకు ధూమకేతుత్వ,మొనరఁ జేసె॥ ౧౮౪ ॥ (గీ) ఆకసమునంటిమండుఘో,రాగ్నినార్పఁ । బెఱుగు విలయమహాపూర,విధము దోఁపఁ। జేయుచు వృషంబు భంగి,

గజీంపుచునుఘ । నంబువర్షించెనదులుపూర్ణంబుగాఁగ॥౧౮౫॥
(వ) ఇత్తెఱంగున నప్పవమానసఖుండు ప్రియంబులైననువివాదవాక్యం
బులచేతఁ బ్రణయప్రయుక్త కోపంబుభంగి ననుద్దీపకమేఘోద్భవ సలి
లంబులచేత మొదలవైపరీత్యంబునమిక్కిలిఁబ్రజ్వలించిపదంపడిక్రమంబు
గాశాంతుండయ్యెనంత॥(గీ)నీరసేకంబుచేబలా, త్కారమునసమగ్రము
గనీయమానుఁడై,యాశ్రయాశుఁడపుడుపబ్రలమేఘంబుల,యందుసాం
ద్రచంచలావ్యాజమునఁ బ్రవే,శంబొనర్చె॥౧౮౬॥(సీ)ప్రశమంబునొంది
న, పావకసంబంధిసంత్యక్తమూలవి,శాలహేతిహారిహాయముక్త, వ
జ్రాభిఘాతంబున విచ్ఛిన్నమగుపక్షి,విభునియేకపక్షంబుగతిఁజూడఁ, బ
డియెనొక్కట ఘనాఘన సమూహంబు ల,గ్నిని శమింపఁ । జేసి శీ
ఘ్రింబునఁ,జెలఁగి దిశాముఖంబులనుండి జాతౌసం,చలత నొంది॥ (గీ)
యరయనది యుక్తమేకదా,యధికు లెందుఁ । బగుల కుపకారమొన
రించి,ప్రాభవమున । నొనర నుపరోధమొనరింప, రుర్విలోన। నిది
స్వభావమైయుండు మ,హాత్మకులకు॥౧౮౭॥ (గీ) కృష్ణవర్త్మశిఖలఁ,
గృతతాపమైనవ । జీవనమున మిగుల, సిక్తమగుచు। నప గతాభ్రి
దోష, మగుమిన్ను తాపిత। పాయితాసి లతిక,భఁగి నొప్పె ॥౧౮౮॥
(వ) ఇట్లుపావకాస్త్రంబు వితథంబై నక్షిప్రకారియగు శిశుపాలుం
డుకుపితుండై రోగం బుపద్రవాంతరంబునుం బోలె నేమేయస్త్రంబు
ప్రయోగించెనవి యన్నియుఁ బరిపాటి వేదియైనకృష్ణుండు వైద్యుండు
నుంబోలె మహానర్థ ప్రతిపాదకంబును మహోపద్రవ నివర్తకంబును



గురుదోష చ్ఛేదియు నైనప్రత్యస్త్ర ప్రయోగంబుచేత శీఘ్రింబున న
య్యెయస్త్రంబుల ఖండించె నంత శిశుపాలుండు సేయునదిలేక కృ
ష్ణుండజయ్యుండని నిశ్చయించి మర్మాతిగంబులు నవక్రంబులు నపవి
త్రంబులునగు వాక్సాయకంబుల నొప్పించిన నమ్మాధవుండెద్దానిచేత
గాఢాలింగన వ్యాపార ముఖ్య లోలుపంబులైన రాహుపత్నీ కుచం
బులకాఠిన్యశోభను వ్యర్థంబుగావించె నట్టియనలజ్వాలా భీలంబైన చ
క్రాయుధంబుచేత శపమానుండైన శిశుపాలుని శరీరంబును శిరోవిక
లంబుగావించె నప్పుడు శ్రీదేవీ సేవితంబును దుందుభిఘోష దివ్యపు
ష్పవర్ష సమన్వితంబును ఋషిగణస్తూయ మానంబును దినకర సంకాశ
తేజంబునునగు నొక్కవెలుంగు శిశుపాలుని దేహంబుననుండి నిర్గమిం
చిసమస్తరాజలోకంబు విలోకింపుచుండ హరిదేహంబు నందుఁ బ్రవే
శించె॥ (మ) ఖలుఁడౌచైద్యుని తోడఘోరతర సంగ్రామంబు గావిం
చుచోఁ । దలకింపం బడబాగ్నికీల పగిదిన్,దీపించు కృష్ణాననం । బ
లవిద్విణ్ణి ధనాంత మందుఁబరి పూర్ణా ఙ్గారి చందంబునన్ । బొలు
పొందంగననయ్యె యాదవబలాం, భోరాశి మధ్యంబునన్॥౧౮౯॥(మ)
ఘనుఁడామాధవుఁ డిట్లుచేదివిభులో,క ద్రోహినిం జంపి మిం । చిన
సమ్మోదమెలర్ప సాంద్రజయల,క్ష్మీ శోభితాస్యాబ్జుఁడై । యనిమేషు
ల్వినుతింపఘోర తరజ,న్యక్షోణి వృత్రాఖ్యునిం । దనుజుం జంపినపా
కశాసనుని చం,దానన్వెలింగె న్రహిన్ ॥ ౧౯౦ ॥ ( వ ) ఇట్లుశిశు
పాలవధంబాపాదించి ॥ (సీ) కరిబృంహితంబులు, హరిహేషలును

జయడిండిమస్వనము లొం,డొంత బెరయ । నంభోధి సంకాశ,యాద
వసేనలజయజయ ధ్వనులు ది,క్చయమునిండఁ । బ్రద్యుమ్న సాత్యకి, బ
బలభద్ర ముఖ్యులు రథములనెక్కి పా,ర్శ్వముల రాఁగఁ । బరికింప
రాజగో,పాల కృష్ణాపరా కనివందిజనంబు లం,దందఁ బొగడ॥ (గీ)
సమరజయజాత మందహా,సంబు వదన । చంద్ర చంద్రికా విస్ఫూర్తి,
సంతరింప । క్షితిసురులు ప్రీతితోడ నా,శీర్వదింపఁ । గమల నేత్రుం
డుధర్మజుఁ గానవచ్చె॥ ౧౯౧ ॥ (క) చనుదెంచిన హరిఁగనిగ్ర ।
ద్దనధర్మసుతుండు తాను,తమ్ము లెదురుగాఁ । జనితోడి తెచ్చికనకా।
సనమునఁ గూర్చుండఁబెట్టె,సంభ్రమమలరన్ ॥ ౧౯౨ ॥ (వ) ఇట్లు
నంతవైభవాభి రంజితుండైన యదుకుంజరుండు సుఖాసీనుండై యుధి
ష్ఠిరాదిపాండవులును దక్కిన పరివారంబును సేవింపనొక్కింత సేపు
సమరవిజయ ప్రకారంబు తెల్లంబుగా వివరింపుచు నందఱనానందరసా
బ్ధివీచికా సందోహంబుల నోలలాడింపుచు నొక్కింత సేపు కొలువుం
డెనయ్యుధిష్ఠిరుండు కృష్ణానుమతంబున రాజసూయయాగంబొక్కిం
తగొఱంతపడకుండ సర్వంబుసాంగంబుగా నిర్వర్తించి యవభృథ సలి
లోక్షితమస్తకుండై హరికరుణా విశేషంబునఁ గృతకృత్యుండై ప్రకా
శించెనంత॥ (సీ) వసుదేవ తనయుండు,ద్వారకా గమనంబు దెలిపిన
వినియయ్యు,ధిష్ఠిరుండు । విడువఁ జాలకయేడు, గడయ మీరలుగాక
యికనెవ్వరున్నారు, హితులుచుట్ట । లసువులు చన్న నిం,ద్రియముల క్రి
యగాదెమీరు పోయిన వెనక, మేముకృష్ణ। నీసహాయతఁ గాదె,నేనీమ



ఖముఁజేసిమిగులఁ గృతార్థుండ, నగుటయెల్ల॥ (గీ) ననుచు నిబ్బంగిఁ
గడువిన,యమున వేఁడి । యనుబురీ గమనంబున, నుడువులేక । యె
ట్టకేలకుఁజిత్తంబు, గట్టిపఱిచి। తమ్ములునుదాను యోజించి, సమ్మద
మున॥ ౧౯౩ ॥ (సీ) వెలలేని మానికం,బులు మగఱాలుపచ్చలుదా
పినట్టి సొ,మ్ముల నొసంగి । వహ్నిశుద్ధాంశుక,వసనంబులర్పించిపె
క్కు సామజములు,పెక్కు హరులు । పెక్కురథంబులు, ప్రేమ మీ
ఱఁగ నిచ్చి యతి భక్తి జాలఁ బ్రి,యంబు నెఱపి । ప్రద్యుమ్న బల
భద్ర, వసుదేవ సాత్యకి ప్రముఖ యాదవ వంశ,వరుల కెల్ల ॥ (గీ)
మణిమయ విచిత్ర భూషణాం,బరము లిచ్చి । మించి వేత్స్వేర నంద
ఱ,నంచితముగఁ । బ్రీత చేతస్కులను జేసి,సూతమాగ । ధాదు
లనుబ్రీతు లను జేసె, నహర్భంగి ॥ ౧౯౪ ॥ అంత ॥ (సీ) కడు
వేడ్కఁ గృష్ణుండు, కాంచన స్యందన మెక్కి సారథ్యంబు, నింద్ర సు
తుఁడు । గావింపఁ బ్రీతితోఁ, బావని పూర్ణ చంద్రనిభోన్న తాత
ప,త్రంబుఁబట్టఁ । గవ లిరు వంకలఁ,గౌముదీ సంకాశరమణీయ సిత
చామ,రములు వీవఁ । బణవ మర్దళ శంఖ,పటహ కాహళభూరి
భేరీ ధ్వనులు మింట, భోరు కొనఁగ ॥ (గీ) రమ్య లావణ్య నిర్జి
త, రంభలైన । వార కాంతలు లాస్య వై,భవముఁ జూప । భా
స్కరుని భంగి దిక్కులఁ,బ్రభలు నిగుడఁ । బొలుపు మీఱ నింద్ర
ప్రస్థ, పురము వెడలె ॥ ౧౯౫ ॥ (వ) ఇట్లనంత వైభవంబునఁ బు
రంబు నిర్గమించి సముచితంబుగా ధర్మనందన భీమ నకుల సహ
దేవులను నిలువ నియమించి పురుహూత పుత్రుం దోడ్కొనిబలభద్ర

ప్రద్యుమ్నాదులు వెంటనంటిరా యాదవ వాహినీ సమేతుండై కదలి కతి పయ ప్రయాణంబులం జనిచనినిజ శోభాధరీకృత పురందర పురంబైనద్వారకా పురంబుఁబ్రవేశించి బ్రాహ్మణు లెదుర్కొని యాశీర్వదింపఁబురపురంధ్రీ జనంబునులాజ పుష్పంబులు సేసలుచల్లనిజకరుణారసాప్లుతవీక్షణంబులు పౌరజనంబుల మీఁద వెదచల్లుచు రాజమార్గంబునంజనినిజ మందిరంబు ప్రవేశించి రుక్మిణీసత్య భామాదులంగూడిదివ్యాంతఃపురంబున సుఖింపుచుండె॥ (చ) క్షితియు దివంబువారిధుల, శేషకులాద్రులు చంద్రసూర్యులం । చితగతి నుందు రెందనుకఁ, జెల్వు వహింపుచు నంతదాఁకనీ । కృతియుఁ గృతీంద్రు వంశమును, గీర్తిరమామణి ధాత్రిలోఁ జిర । స్థితిని వహించి యొప్పెసఁగు, శ్రీరమణీహృదయేశు సత్కృపన్ ॥ ౧౯౬ ॥ ✻

(పుష్పమాలికాబంధము)

వరధరధీరమానవధ, వప్రవగార్యమధామకామసుం । దరపరవారఖండనక,నత్కన కాంశుకలోకనాకపాఁహరికరి సీరిహీరహర, హారహసద్యశ శ్శ్మశ వంశశే । ఖరవర దార దూరకవి,కల్పక భూతలపాలఖేలనా ॥ ౧౯౭ ॥ (క) విద్యాభోజ నృపేంద్రా । ప్రద్యుమ్నసమానరూప, లావణ్యప్రతా । పద్యుమణి ద్యోతరుచి । ప్రద్యోతితభృత్యలోక, వదనసరోజా॥ ౧౯౮ ॥ ✻

(ఉపేంద్రవజ్రము)

రమాధిపానుగ్రహ లబ్ధరాజ్య । రమాసదా లంకృత రమ్యగాత్రా । యుమాకుమారాభ, మహోగ్ర శక్తి । ప్రమర్దితారివ్రజ క్రౌంచశైలా॥ ౧౯౯ ॥ ✻



( గద్య )

ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్ష లబ్ధ విద్యాసాంద్ర గోపినాథ వేంకట కవీంద్ర ప్రణీతంబైన శిశుపాలవధ మహాకావ్యంబు నందు శిశుపాలుండు దూతనొక్కని సంగ్రామంబు కొఱకుఁ బిలిచి రమ్మని శ్రీకృష్ణుని పాలికిఁ బనుచుటయుఁ దదీయ దురాలాపంబులును బలభద్ర సాత్యకి ప్రద్యుమ్నాది యాదవుల కోపంబును సర్వసైన్య సమేతంబుగాఁ గృష్ణుండు యుద్ధార్థంబు శిశుపాలుని మీఁదికిం జనుటయు శిశుపాల సహచర రాజుల కవశకునంబులగుటయు యుద్ధప్రారంభంబును సంకులయుద్ధంబును ద్వంద్వయుద్ధంబు నుభయ సైన్యంబు లందుఁ గలరథికాశ్వికగజారోహకుల పరస్పర యుద్ధంబును బలరాముని పరాక్రమంబును బ్రద్యుమ్నుని విక్రమ విశేషంబును శిశుపాల సైన్య హరణంబును గృష్ణశిశుపాలుర ద్వంద్వ యుద్ధంబును దివ్యాస్త్ర ప్రయోగంబును హరిచక్రధారాఖండిత కంఠుండై శిశుపాలుండు మృతుం డగుటయుఁ గృష్ణుండు

విజయ లక్ష్మీవిరాజమానుండై యజ్ఞాంతంబున ధర్మ
రాజుచేతఁ బూజితుండై యనుమతివడసి నిజ
సైన్య సమేతంబుగా ద్వారకాపురంబు
ప్రవేశించి సుఖంబుండుటయు నను
కథలుంగల చతుర్థాశ్వాసము.

శిశుపాలవధ మహాకావ్య మాంధ్రము
సంపూర్ణము.
శ్రీకృష్ణార్పణమస్తు.

# రథబంధము.



